ఓం శ్రీ గణేశాయ నమః

ఓం శ్రీకృష్ణ పరమాత్మనే నమః ఓం శ్రీ శారదాంబాయై నమః

# శ్రీమద్భాగవత మహాపురాణము

## ప్రథమ ద్వితీయ తృతీయ స్కంధాలు



This Book is Published with the Financial Assistance of Tirumala Tirupathi Devasthanam's Under Their Scheme "Aid to Publish Religious Books"


అనువాదకుడు, ప్రకాశకుడు :

## పురాణపండ రాధాకృష్ణమూర్తి

భాగవతమందిరం - రాజమండ్రి - 4.



మద్రాస్ : వెంకటరమణా ఫుడ్ స్పెషాలిటీస్ ప్రొప్రయిటర్ :

శ్రీ E. అహోబలరావు గారి సౌజన్య సహకారాలతో.

# శ్రీమద్భాగవత మహాపురాణము

1, 2, 3 స్కంధాలు గల ప్రథమ సంపుటము.



ప్రథమ ప్రచురణ :

ది 23—2—1990

మహాశివరాత్రి



వెల :

రు. 25-00



ముద్రణా నిర్వహణ :

భరద్వాజా బైండింగ్ వర్క్స్,

రాజమండ్రి - 4.



వి. పి. పద్ధతి లేదు.



ప్రతులకు :

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

జయశ్రీటాకీస్ కుడివైపు సందులో,

భాగవతమందిరం - రాజమండ్రి - 4.



రాజమండ్రి భాగవత మందిర సంస్థాపకులు,

రాజరాజేశ్వరీ సహిత మారుతీ సీతారామ ధ్యానమందిర వ్యవస్థాపకులు:

## బ్రహ్మశ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి గారు

కాకినాడ శ్రీయుత కె. వి. ఆర్. చౌదరి, రాజమండ్రి-డా॥ శ్రీ ఆరుమిల్లి ప్రసాద చౌదరి, మద్రాస్ శ్రీ ఇ. అహోబలరావు గార్ల

—* సౌజన్య సంపూర్ణ సహకారంతో *—

సుజనస్య మరణం ధర్మః - ధర్మో రక్షతి రక్షితః.

ది 6—1—1990 శనివారం మధ్యాహ్నం గం॥ 1.30 ని॥లకు ధనుర్మాసం - పుష్య శుద్ధ ఏకాదశి ఘడియలలో స్వర్గస్థురాలైన: దానశీలిగా, ధర్మపత్నిగా గుణశీలిగా విశాల హృదయురాలిగా అనేక ప్రజానీకంచే ప్రశంసలందుకున్న ధన్యజీవురాలు.

**శ్రీమతి పల్లా వీరాయమ్మ గారు.**

"జాతస్య హి మృత్యుర్ధ్రువం"

తమ ధర్మపత్ని సంస్మరణార్థం - ఆమెకు ఉత్తమగతులు కలగాలని శాంతి.స్తూ

రాజమండ్రి - ఛైర్మన్ ఇన్-ఛార్జి మున్సిపల్ కౌన్సిల్

**శ్రీయుత పల్లా అప్పారావు గారు**

పురాణ తిలకమైన ఈ భాగవత మహాపురాణ ప్రచురణ ప్రచారాలకు గాను 1116-00 లు అందజేసినారు. వీరి ధర్మఫలం వల్ల వీరి సతీమణికి ఉత్తమగతులు కలగాలని కరుణా సముద్రుడైన భగవంతుణ్ణి ప్రార్థిస్తూన్నాను.

**21-2-1990** పురాణపండ రాధాకృష్ణమూర్తి

చిరంజీవులు పల్లా శంకరరావు, వీరభద్రరావు, శ్రీనివాసరావు, వాసుదేవరావు గార్ల సౌజన్య సంపూర్ణ సలహా సహకారాలతో.

శ్రీకృష్ణః శరణం మమ.

ఈ మహాపురాణ రచనకు
ఆధారంగా తీసుకున్న గ్రంధరత్నాలు :

(1) వేదవ్యాసమహర్షి ప్రణీత శ్రీమద్భాగవత మహాపురాణము.
బమ్మెర పోతనామాత్య ప్రణీత భాగవత మహాపురాణము.

(2) శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారీజీ మహరాజ్ విరచిత
శ్రీమద్భాగవతకథా (హిందీ)

(3) శ్రీమద్భాగవత మహాపురాణము.
శ్రీశ్రీశ్రీ అఖండానంద సరస్వతీ మహరాజ్ (హిందీ)

(4) ఉపన్యాస సార్వభౌమ అస్మత్పితృపాదులు
స్వర్గీయ బ్రహ్మశ్రీ పురాణపండ రామమూర్తిశాస్త్రి విరచిత
శ్రీమద్భాగవత మహాపురాణము (మూలము-ఆంధ్రానువాదంతో)

(5) ఆచార్య శ్రీశ్రీశ్రీ కేశవ రామచంద్ర డోంగరేజీ మహరాజ్ విరచిత
శ్రీ మద్భాగవత రహస్య - (గుజరాతీ నుండి హిందీ)

(6) కళ్యాణ్ - హిందీ మాసపత్రికలలో శ్రీమద్భాగవత మహాపురాణంపై
ప్రకటించబడిన వ్యాసరత్నాలు.

♦ ఈ ప్రచురణకు సంపూర్ణంగా సహకరిస్తున్న ధన్యాత్ములు : ♦

**శ్రీ శ్రీ శ్రీ ఓం నారాయణ్ మహరాజ్ వారు**

ప్రెసిడెంట్ : శ్రీ శివానంద చారిటబుల్ ట్రస్ట్,

మద్రాస్.

# సత్ఫలదాయకమైన
# శ్రీ రామరక్షా పూజా యంత్రరాజము



తమ గోత్రనామాలపై రు. 400-00లు అందజేయువారి పేర యంత్రం చెక్కించి 28 రోజులు పూజచేసి వివరాలతో అందజేయగలము. — వి. పి. పద్ధతి లేదు.

వివరాలకు : **పురాణపండ రాధాకృష్ణమూర్తి** - రాజమండ్రి - 4.

యంత్రరాజాయ విద్మహే వరప్రదాయ ధీమహి తన్నో యంత్రః ప్రచోదయాత్
యంత్రగాయత్రి.

# శ్రీ మహాలక్ష్మి యంత్ర రాజము

నిరంతర వ్యాపారాభివృద్ధికి మహాలక్ష్మీ యంత్రాన్ని ఆరాధించుకో దలచిన వారు తమ గోత్రనామాలపై రు. 400-00 లు పంపవలెను. పూర్తిగా వెండిపై చెక్కించుకో దలచినవారు రు. 1600-00 లు పంపవలెను.

వి. పి. పద్ధతి లేదు.




వివరాలకు:

**పురాణపండ రాధాకృష్ణమూర్తి - రాజమండ్రి-4.**

# శ్రీమద్భాగవత మహాపురాణము

## ప్రథమ సంపుటము

## విషయానుక్రమణిక



## ప్రథమ స్కంధము.

## ద్వితీయ స్కంధం



## తీయ స్కంధం

ఓం శ్రీ గణేశాయ నమః । శ్రీ సరస్వత్యై నమః । శ్రీ గురుభ్యో నమః.
ఓం నమో భగవతే వాసుదేవాయ - శ్రీ కృష్ణః శరణం మమ.

# * శ్రీమద్భాగవతోద్దేశ్య - మాహాత్మ్యాలు *

శ్లో॥ సచ్చిదానందరూపాయ విశ్వోత్పత్త్యాది హేతవే
తాపత్రయ వినాశాయ శ్రీ కృష్ణాయ వయం నుమః.

ఈ ప్రపంచం యొక్క ఉత్పత్తి స్థితి లయాలకు కారణభూతుడు, తాపత్రయాలను నాశనం చేసేవాడు సచ్చిదానంద స్వరూపుడు అయిన శ్రీకృష్ణ పరమాత్మకు మన మందరం వందనం చేస్తున్నాము.

సత్ చిత్ ఆనంద స్వరూపుడని పరమాత్మను శాస్త్రాలు వర్ణించాయి. సత్ ప్రకటరూపేణా సర్వత్రా ఉన్నది. చిత్ మౌనంగా ఉంటే ఆనందం అప్రకటంగా ఉంది. జడపదార్థాలలో సత్ చిత్తులున్నాయి. కాని ఆనందం మాత్రం లేదు. జీవునిలో సత్‌చిత్తులు యి. కానీ ఆనందం మాత్రం అప్రకటంగానే ఉంటూన్నది. అంటే అవ్యక్త రూపంలో భాసిల్లుతూంటుంది. అటువంటి ఆనందం జీవునిలోనే ఉన్నది. అయినా మనుష్య మాత్రుడు ఆనందాన్ని బాహ్యప్రపంచంలోనే అన్వేషిస్తూంటాడు స్త్రీ యొక్క అంగాలలోను, ధన సంపదలలోను ఆనందాన్వేషణ చేస్తూంటాడు.

వాస్తవానికి ఆనంద స్వరూపుడవైన నీలోనే ఆనందం ఉన్నది. ఆనందాన్ని యీ జీవితంలో ఎలా పొందగలుగుతామన్న విషయాన్ని మనకు భాగవత శాస్త్రం సుగమంగా బోధపరుస్తున్నది.

పాలల్లో ప్రత్యణువులోనూ వ్యాప్తమై వున్న వెన్న మనకు కనిపించదు. కాని పాలను కాచి పెరుగు తయారుచేసి దానిని చిలికితే వెన్న వచ్చి తీరుతుంది. అట్లే మానవుడు తన మనస్సును మథించ గలిగిననాడు ఆనందాన్ని పొందగల్గుతాడు. పాలవైపు చూస్తూ కూర్చుంటే వెన్నకనిపించనట్లే సర్వేసర్వత్రా ఉన్న పరమాత్మ కూడ మానవునికి కనిపించడు.

పరమాత్మనుండియే ఈజీవుడు విడివడివచ్చాడు. అయినా ఆ పరమాత్మను గుర్తించడానికి అర్హతగల మానవుడు ఆ ప్రయత్నం ఎంత మాత్రం చెయ్యడం లేదు. కనుకనే వానికి ఆనందం కలగడం లేదు. జీవుడెట్టి వాడయినా పరమాత్మను చేరి తీరవలసిందే నాస్తికుడు కూడ చిట్టచివరకు అలసి సొలసి అంతిమావస్థలో అపజయం చెంది శాంతికై అన్వేషిస్తాడు.

ఆనందాన్ని గురించి తైత్తిరీయోపనిషత్తులో అనేక విధాలుగా వర్ణించబడి ఉంది. కాని ఈ ప్రసంగంలో ప్రధానమయిన రెండు ఆనందాలను గురించి మాత్రమే చర్చించుకుందాము. సాధన జన్యానందము, స్వయం సిద్ధానందము.

సాధన జన్యానందం అంటే విషయ జన్యానందము. సాధన లేదా విషయ వినాశనానంతరం అది ఉండదు. యోగులదగ్గర ఏ విధమయిన సాధనలూ ఉండవు. అయినా వారు ఆనందంగా ఉండటానికి కారణం? అంటే వారు సదా సర్వదా ఆనందంలోనే సంలగ్నులయి ఉంటారు. దీనిని బట్టి చూస్తే ఆనందమన్నది మనలోనే ఉందని తేలుతూన్నది.

సత్ చిత్ ఆనందాలు మూడూ పరమాత్మలో పరిపూర్ణంగా ఉన్నాయి. పరమాత్మ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపుడు.

పరిపూర్ణానంద స్వరూపుడయిన శ్రీకృష్ణ పరమాత్మలేని విశ్వమంతా అసంపూర్ణమయినదే. భగవదంశా స్వరూపుడయిన జీవుడు అసంపూర్ణుడే. జీవునిలో చిదంశ ఉన్నా అతడు మాత్రం అసంపూర్ణుడే. మనుష్యునికి జ్ఞానం కలుగుతుంది. కాని అది స్థిరంగా మాత్రం ఉండదు కాని కృష్ణ పరమాత్మ పూర్ణ జ్ఞాని కావడంవల్ల అతనికి పదహారువేలమంది రాణులతో సంభాషించే సమయంలో ఎట్టి జ్ఞానం ఉన్నదో అట్టి జ్ఞానమే ద్వారకా నగరాదులన్నీ నాశనమయి పోయే వేళకూడా ఉంది. శ్రీకృష్ణుని జ్ఞానం ద్వారకలో కానీ రాణులలో కానీ లేదు. అందరూ నశించిపోయినా శ్రీకృష్ణుని జ్ఞానం మాత్రం నశించదు కారణం? అతడు జ్ఞాన స్వరూపుడు కనుక సత్ నిత్యమయినది. చిచ్ఛక్తి జ్ఞానమయమయినది. మానవుడు స్వస్వరూపస్థితుడు కానంతవరకూ ఆనందాన్ని పొందలేడు. అతడు బయట ప్రపంచంలో సావధానుడై వ్యవహరించేటట్లు స్వగృహంలో సంచరించలేడు. ఏకాంతంలో ఉన్ననాడే అతడు స్వస్వరూపస్థితుడు కాగలుగుతాడు భగవల్లీలయిన సృష్టి స్థితి లయాలు మూడూ దైవ లీలలే! భగవంతుడు యీ మూడింటియందూ ఆనందానుభూతినే పొందుతూంటాడు. స్వస్వరూపస్థితుడై భాసిల్లుతూంటాడు.

నిత్య జ్ఞానం కలవానికే ఆనందం లభిస్తుంది. మానవుడు ఆనంద స్వరూపుడు కావలె ననుకుంటే సచ్చిదానందుని ఆశ్రయించి తీరవలసినదే. పరిపూర్ణుడు కానంత వరకూ అతడు శాంతిని పొందలేడు. విశ్వంలోని ప్రత్యేక పదార్థమూ పరిణామంలో నాశనమయ్యేది కావడం వల్ల పరిపూర్ణమయినది కాదు పరివర్తన చెందనివాడు శ్రీమన్నారాయణ దేవుడు మాత్రమే. శ్రీమన్నారాయణ దేవుని గుర్తించగలవాడు అతనియందు మనస్సును లగ్నం చెయ్యగలవాడు తద్రూపుడు కాగలడు. అట్టివాని చిత్తం అవశ్యం నారాయణాయత్త మవుతుంది. అట్టి జీవాత్మయే నారాయణ రూపాన్ని పొంది పరిపూర్ణ మవుతుంది. నాడే వ్యక్తి జీవితం సఫలమవుతుంది. జీవుడు పరమాత్మను కలిసి అపరోక్ష సాక్షాత్కారం పొందిన క్షణంలో పరిపూర్ణు డవుతాడు. ఈ దేహం శ్రీకృష్ణ సాక్షాత్కారం కోసమే లభించింది. భగవద్దర్శనాధికారం మానవునికి మాత్రమే ఉంది. స్వస్వరూప జ్ఞానమే లేని పశువులు పరమాత్మ దర్శనాన్ని ఎలా పొందుతాయి? భగవద్దర్శనాన్ని ఎలా పొందుతాయి? భగవద్దర్శన రహితంగా జీవితం సఫలం కాదు. ఈ జీవుడనేక జన్మల నుండి భోగాలను అనుభవిస్తున్నా శాంతిని పొందలేక పోతున్నాడు. భగవద్దర్శన రహితంగా మానవునికి పరిపూర్ణ శాంతి లభ్యం కాదు.

శాస్త్రంలో భగవద్దర్శనానికి మూడు విధానాలు చెప్పబడ్డాయి;

1. స్వప్నంలో ప్రభు ప్రభ గోచరమవుతుంది. ఇది సాధారణ దర్శనము.

2. దేవాలయంలో కానీ, విగ్రహంలో కానీ పరమాత్మ దర్శన మయితే మధ్యమ దర్శన మవుతుంది.

3. భగవంతుని అపరోక్ష దర్శనమే మహోత్తమ దర్శనము.

భగవంతుని అపరోక్ష సాక్షాత్కారం కలిగిన నాడే మానవ జన్మ సఫలమవుతుంది. పరోక్ష-అపరోక్ష సాక్షాత్కారాలని వేదాంత శాస్త్రంలో సాక్షాత్కారం రెండు విధాలుగా వర్ణింపబడింది.

"నేను బ్రహ్మను" అహం బ్రహ్మాస్మి, అన్న జ్ఞానం కలగడంతో అట్టివానికి అపరోక్ష సాక్షాత్కారం

కలుగుతుంది. దైవాన్ని సందర్శిస్తూనే మానవుడు భగన్మయుడవుతాడు. ఆ స్థితిలోనే వానికి అపరోక్ష సాక్షాత్కారం కలుగుతుంది. సర్వేసర్వత్రా భగవదనుభూతినిపొందగా మానవుడు భగవత్స్వరూపుడు కాగలుగుతాడు. భగవంతుని పరిపూర్ణ స్వరూపాన్ని గుర్తించగలుగుతాడు. దీనినే వేదాంతంలో అపరోక్ష సాక్షాత్కార మంటారు. ఈ విశ్వంలో పరమాత్మ ఓ స్థానంలో ఉంటాడన్న వాదం కూడ అసంపూర్ణ మయినదే. భగవంతుడు సర్వవ్యాపకుడు. అతడు కేవలం ఓ విగ్రహంలో కానీ, ఓ స్థానంలో కానీ, ఓ ఆలయంలో కానీ సీమితుడై లేడు. ఆలయంలో దర్శించిన భగవంతుణ్ణి బయటకు వచ్చిన తరువాత కూడ ప్రతి వ్యక్తిలోనూ దర్శించ గలగాలి. మనస్సు ఏయే స్థానాలలో పరిభ్రమిస్తోందో? ఆయా స్థానాలలో భగవద్రూపాన్ని అనుభవించగలగాలి. ఇదియే అసాధారణ దైవ దర్శనము తనలోవున్న పరమాత్మయే యావద్విశ్వంలో ఉన్నాడన్న భావాన్ని అనుభవించాలి. చరాచర జగత్తునంతనూ బ్రహ్మ స్వరూపంగా చూడగలవాడే జ్ఞాని. అందరియందూ భగవంతుణ్ణి సందర్శించగలవాడు క్రమంగా స్వస్వరూపంలో కూడ పరమాత్మానుభం పొందగలుగుతాడు. పరమాత్మయొక్క పరోక్ష దర్శనంవల్ల విశేషలాభం కలుగదు. కాని పరమాత్మయొక్క అపరోక్ష దర్శనం పొందగలుగు నాడే మానవుడు కృతార్థుడు కాగలడు జ్ఞానులు తమలోకూడ భగవంతుని సందర్శిస్తారు. ఇదియే అద్వైతము.శ్రీకృష్ణ లీలలను చింతన చేస్తూ గోపికలు తమలో పరమాత్మానుభవం పొందేవారు "లాలీ దేఖన్ మై గఈ, మైభీ హెూగయీ లాల్" గోపికలకు స్వస్వరూప విస్మరణ జరిగింది. కనుకనే వారు "నేనే కృష్ణుడను" అనుకుంటూ గోపికలు సర్వత్రా కృష్ణానుభవాన్ని పొందుతూ శ్రీకృష్ణమయ లయినారు. తమయందు పరమాత్మను దర్శించ గలవారు ఎన్నడూ పరమాత్మ నుండి దూరం కారు. వారు భగవంతునిలో లీనమై పోతారు. భాగవత పురాణ పఠన ఫల మిదియే.

జ్ఞానులు జ్ఞానంద్వారా భగవంతుని అపరోక్షానుభూతిని పొందగలుగుతున్నారు.

పరమాత్మ ఏ నాడు మానవునకి తనరూపాన్ని ప్రసాదిస్తాడో నాడే అతడు పరిపూర్ణుడు కాగలుగుతాడు. భగవంతుడు లేని జగత్తు అంతా అసంపూర్ణ మయినదే. అసంపూర్ణుడు కావడం వల్లనే జీవునికి శాంతి లభించడం లేదు. నారాయణు డొక్కడే పరిపూర్ణుడు. యదార్థమయిన శాంతి నారాయణునిలోనే ఉన్నది. అందులకే నరుడు నారాయణునిలో లీనం కావాలనుకుంటాడు. నరుడు నారాయణాంశ. నారాయణుని గుర్తింప జేసి అతనిలో లీనం చేయించ గల శాస్త్రమే భాగవతము.

జీవుడు నారాయణాంశ. నరుడు నారాయణునిలో కలియవలసిందే అందుకు శాస్త్రాలలో అనేక ఉపాయాలున్నాయి. కర్మ జ్ఞాన భక్తి మార్గాలు వీటిలో ప్రధాన మయినవి.

ఉపనిషత్తుల జ్ఞానం వల్ల అపరోక్ష సాక్షాత్కారం కలుగుతుంది. కాని సామాన్యులు వాటిని అధ్యయనం చేసి అర్థం చేసుకోజాలరు. అందుకే వ్యాసర్షి లోక కళ్యాణార్థం భాగవత మహాపురాణ రచన చేసాడు. దివ్యమయిన ఉపనిషత్ జ్ఞానానుభూతిని అత్యంత విలాసమయ జీవితాలను గడిపేవారు పొందలేరు. తీవ్రమయిన వైరాగ్య భావరహితంగా జ్ఞాన మార్గంలో సాఫల్యం కలుగదు. జ్ఞానానికి వైరాగ్యమే పునాది. అట్టి తీవ్ర వైరాగ్యాన్ని పొందడం కష్టతరము. అట్టి తీవ్ర వైరాగ్యాన్ని పొందిన శుకుడు జన్మిస్తూనే అరణ్యాల వైపు పయనం సాగించాడు. ఆ సమయంలో ఆతురుడై వెన్నంటి వచ్చే వ్యాసుని

చూసి "నువ్వు నాకు తండ్రివి కాదు, నేను నీకు కొడుకును కాదు" అంటాడు. వేదాలు త్యాగాన్ని గురించి ఉపదేశిస్తున్నాయి. సర్వాన్నీ విడిచి పెట్టుమని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అతి సామాన్యమయిన ఆకు వక్క సున్నాలనే విడిచిపెట్టలేనివారు బలీయమైన కామ క్రోధ లోభాలను ఎలా విడిచి పెట్టగలరు? కానీ వేదాంత శాస్త్రం సర్వస్వాన్నీ విడనాడి పరమాత్మను వెంబడించుమని బోధచేస్తున్నది నాడే భగవంతుని పొందగలుగుతావు. సర్వాన్నీ విడిచి పెట్టడమంటే సామాన్యునికి ఎన్నటికయినా సాధ్యమవుతుందా?

సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, భాష్య నామాలలో వేదాలు చతుర్విధాలుగా వర్ణింపబడ్డాయి. వేదాల అంతిమ భాగంలో ఉపనిషత్తులు తేజరిల్లుతున్నాయి. కనుకనే అవి "వేదాంతాలుగా" ఖ్యాతి వహించాయి. ఆరణ్యకాలలో ఉపనిషత్ భాగం వస్తుంది. ఋషులు చింతనచేసిన భాగాలకు ఆరణ్యకాలని పేరు. మేడలలో మిద్దెలలో భోగ విలాసాలలో జీవితాలను గడిపేవారికి ఉపనిషత్తులలో అధికారం లేదు. మనలా సంసార లంపటు లయినవారు ఉపనిషత్ జ్ఞానాన్ని జీర్ణించుకోజాలరు. ఈ విషయ సర్వస్వాన్నీ గమనించియే వేదవ్యాస భగవానుడు శ్రీమద్భాగవత శాస్త్ర రచన చేసాడు. ఉపనిషత్ మార్గం సామాన్యులకు సులభమయినది కాదు. ఉపనిషత్తుల తాత్పర్యం అంతా త్యాగం లోనే ఉన్నది.

ఆకు, వక్క, సున్నాలనే విడనాడలేని వారు సభలలో రెండు గంటలసేపు ముక్కుపొడి డబ్బాలను తెరవకుండ ఉండలేని వారు కామక్రోధాది వికారాలను ఎలా విడనాడ గలరు?

కామ సుఖాలను అనుభవించేవారు యోగాభ్యాసం చెయ్యలేరు. భోగి అయినవాడు యోగి కావాలనుకుంటే రోగిగా మిగిలి పోతాడు. జ్ఞానమార్గంలో పతనమయిన వాడు అసక్తుడవుతాడు. కలియుగ మానవులు యోగాభ్యాసం చెయ్యలేరు. ఈ భాగవత శాస్త్ర రచన కలియుగ మానవులను ఉద్ధరించడానికే జరిగింది.

ఈ గ్రంథరత్నంలో ఓ నవీన మార్గం గోచరమవుతున్నది. "మనం గృహ కుటుంబ వృత్త్యాదులను విడనాడలేము" అన్నవారికోసం భాగవతం చెప్పే విషయాన్ని నిరంతరం మననం చెయ్యండి. నిరాశ చెందకండి. అన్నీ విడిచిపెట్టి అడవులకు పోయినంత మాత్రంచే ఆనందం లభించదు. సమస్త ప్రవృత్తులను త్యజించి మానవుడు నివృత్తిలో కూర్చున్న సమయంలో కూడ ప్రవృత్తి భావాలు వచ్చి తీరుతూంటాయి.

భాగవత శాస్త్రాదర్శం దివ్యమయినది. గోపికలు తమ ఇండ్లను విడిచిపెట్ట లేదు. అరణ్యాలు పట్టిపోలేదు అయినా వారు కృష్ణపరమాత్మను పొందగలిగినారు. యోగుల సమాధివల్ల లభించే ఆనందంతో సమమైన ఆనందాన్ని మీరు మీమీ ఇళ్ళలో ఉండియే పొందగలుగుతారు. మీరు గృహాలలో నివసిస్తూనే భగవంతుణ్ణి ప్రసన్నుణ్ని చేసుకోవచ్చును. కాని ప్రత్యేక వ్యవహారం భక్తిమయమయినది. మన మెక్కడికి పోతూంటామో? అక్కడికే శ్రీకృష్ణుడు వస్తూంటాడు. వ్రజభూమిలో అట్టి గోపాంగనలను దర్శించిన ఉద్ధవుని జ్ఞానగర్వం దూరమై పోయినది. గోపికలలో లభించిన సత్సంగానంతరం;

శ్లో॥ వందే నంద వ్రజస్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః
తాసాం హరికథోద్గీతం పునాతి భువనత్రయమ్.

నందుని వ్రజభూమిలోని గోపాంగనల వ్రజ ధూళికి నేను మాటిమాటికీ ప్రణమిల్లుచున్నాను. ఈ ధూళిని శిరస్సుపై ధరిస్తున్నాను. ఈగోపికలు శ్రీకృష్ణ

భగవల్లీలా గాధల సంబంధంలో చేసిన గుణగానం జగత్రయాన్ని పవిత్రం చేస్తున్నది భవిష్యత్తులో చేస్తూంటుంది కూడ.

గోపికలు సర్వ్వలలోనూ పరమాత్మను సందర్శించారు వారు-ఈవృక్షంలో లతలో, పుష్పంలో, ఫలంలో మాకు మా ప్రభువు దర్శన మిస్తూన్నాడు. మాకృష్ణుడు మమ్మల్ని విడనాడి పోవడం లేదు." అన్నారు. గొపాంగనలకు భగవంతుడు స్వగృహాలలోనే సాక్షాత్కరించాడు. "మీరు యిళ్ళల్లో వున్నా వ్యవహారాలలో వున్నా పరమాత్మను పొందవచ్చును. ఇంట్లో ఉండడం పాపం కాదు. కాని యింటిని మనలో ఉంచుకోవడమే పాపము అందరూ సన్యాసులు కానక్కరలేదు. సర్వ్వలూ సన్యాసులయితే - సాధుసన్యాసులను ఆదరించేవారెవరు ? ఇదియే భాగవతశాస్త్రం మనకు బోధించే విషయము.

గోపికల ప్రేమలక్షణ - భక్తి విహ్వాలత్వాలు కారణంగా వారికి స్వగృహంలోనే పరమాత్మ లభించాడు. దానితో వారు శ్రీకృష్ణరూపు లయినారు. ఇలా భగవంతుని యందు మనస్సును సంలగ్నం చెయ్యగలవారందరూ శ్రీకృష్ణస్వరూపు లవుతారు. అట్టి అలౌకిక భక్తి మార్గాన్ని వ్యాసభగవానుడు యీభాగవతంలో సుబోధకం చేశాడు. ఈభక్తి ద్వారానే పరమాత్మ సాక్షాత్కరిస్తాడు. శ్రీ మద్భాగవతమే ప్రతి వ్యవహారాన్నీ, భక్తిమయం చేస్తుంది. వ్యవహార పరమార్ధాలను రెండింటినీ యిది సమన్వయం చేస్తుంది. యోగులు వనాలలో కూర్చుని పొందే ఆనందాన్ని మీరు మీ యిళ్ళలో కూర్చుని భాగవత శాస్త్రాధ్యయన-ఆచరణల ద్వారా పొందవచ్చును - అందుకే యీ పురాణ రచన జరిగింది. ప్రాపంచిక విషయ సుఖాల నుండి వైరాగ్యం కలిగి భగవంతునియందు ప్రేమను జాగృతం చెయ్యడమే యీ భాగవత కథాలీలల మహోద్దేశ్యము.

భాగవతం : అంటే భగవంతుని కలిపే, కలియజేసే మహోత్తమ సాధనము. సాధువులను ఆశ్రయించువాడు సత్పురుషుడవుతాడు. భాగవతాన్ని ఆశ్రయించువాడు భగవంతుడవుతాడు.

భక్తి అన్నది కేవలం ఆలయాలలో లేదు. అది ఎక్కడ కూర్చుంటే అక్కడ జరుగుతుంది. ఈ భక్తికి దేశకాలాలతో సంబంధం లేదు. ఇరవై నాలుగుగంటలూ భక్తితో వుండవచ్చును. ఫలానా సమయం భక్తికోసమనీ, ఫలానా సమయం భోగానుభవం కోసమనీ, భేదభావంతో మెలిగేవారు. భక్తిమయ జీవనాన్ని గడప లేరు. సదా సర్వదా భక్తి కలిగి మెలగండి. ఇరవై నాలుగుగంటలూ బ్రహ్మభావంతో ఉండండి. తద్వారా మాయ దూరమై పోతుంది.

కృష్ణపరమాత్మను-వసుదేవుడు శిరస్సుపై ఉంచుకోగానే అతనికి బ్రహ్మభావం కలిగింది. వెంటనే అతని కరచరణాలకు గల బేడీలు తమంత తాముగా విడిపోయాయి. కాని అతడు యోగమాయతో మరలివచ్చి కారాగారంలో ప్రవేశించగానే బంధన బంధితుడై పోయాడు; తనకు కలిగిన బ్రహ్మ సంబంధాన్ని వసుదేవుడు నిలుపుకోలేకపోయాడు. భక్తులు భగవంతునితో ఆడుకుంటూంటారు. మానవుడు తానుచేసే ప్రతీ పనీ భగవదంకితంగా చేయగలిగితే వాని ప్రతీ కార్యం భక్తిమయ మవుతుంది. ఈ భక్తి యొక్క విశేష సంబంధం మనస్సుతో ఉంటుంది మనసా భక్తితో మెలగజాలని వారు శారీరికంగా సేవచెయ్యాలి, మానసిక సేవ శ్రేష్ఠమయినది. సాధు - సజ్జనులు మానసిక సేవా తత్పరులయి ఉంటారు. అట్టి సేవా తన్మయుడు కాగలిగిన వాడు అవశ్యం కృతార్థుడవుతాడు. భక్తి మార్గానికి గోపికలు గురుత్వం వహించారు. వారి ఆదర్శ మార్గాన్ని మనస్సులోనూ, నయనాల ముందూ ఉంచుకోండి. జ్ఞాన యోగ మార్గాల ద్వారా

లభించే ఆనందానుభవం యీ భక్తివల్ల కూడ లభ్యమవుతుంది. జ్ఞానులయిన మహా యోగులకు లభించే బ్రహ్మానందం సామాన్యులకు లభించాలన్న మహోద్దేశ్యంతో భాగవత రచన జరిగింది. భగవత్ స్వరూప వర్ణన విశేషంగా కొనసాగింది. భగవంతు డెలా వుంటాడు ?

"తాపత్రయ వినాశాయ శ్రీకృష్ణాయ వయం నుమః."

భగవత్ స్వరూప వర్ణన ప్రసంగంలో – "తాపత్రయ వినాశాయ" అని వున్నది. దుఃఖం అన్నది మనోధర్మమే కాని ఆత్మ ధర్మం కాదు. మానవుడు దుఃఖంలోనే కష్టంలోనే భగవంతుణ్ణి స్మరిస్తాడు. తద్వారా అతనికి పరమాత్మతో సంబంధం ఏర్పడుతుంది. ఆ క్షణంలోనే వానికి వాస్తవానందం లభిస్తుంది. మానవస్వభావం సుందరమయినది. కాదు. భగవత్ స్వరూపం ఒకచోట సుందరంగానూ, వేరొకచో మరోలా వుంటుంది. కూర్మ వరాహావతారలు సుందరంగా వుండవు. కానీ, భగవంతుని స్వభావం అతిశయ సుందరమయినది. పరుల దుఃఖాలను దూరం చేయడమే భగవంతుని సహజ స్వభావము. అందుకే అతడు వందనీయుడవుతూన్నాడు.

ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధి దైవిక తాపత్రయములను నాశనం చేసే శ్రీకృష్ణపరమాత్మకు మనం నమస్కరిస్తున్నాము. నమస్కరించినంత మాత్రాన లాభం ఏమిటి? అని చాలామంది ప్రశ్నిస్తూంటారు. నమస్కరించినంత మాత్రాన పాపాలు నాశనమవుతాయి. నమస్కారం కేవలం శారీరికంగానే కాదు – మానసికంగా కూడా చెయ్యాలి. రాధా మాధవులను హృదయ కమలంలో విరాజిల్ల జేసి వారికి నమస్కరించండి. నమస్కారం పరమాత్మను బంధిస్తుంది. కష్టంలో సాయపడేవాడు తోడు వచ్చేవాడు భగవంతుడు మాత్రమే. సుఖంలో వెంటవచ్చేవారు యీ బంధుబాంధవులు కాదు. భగవంతుడు సదా సర్వదా దుఃఖాలలో వెంటవుంటాడు. కనుక భగవంతుడు వందనీయుడు.

అత డెప్పు డెప్పుడు ఎవ రెవరికి సహకరించినా దుఃఖాలలోనే సహకరించాడు. పాండవులు కష్టాలలో వున్నంతకాలమూ కృష్ణపరమాత్మ కూడా వున్నాడు, వారు రాజసింహాసనాన్ని అలంకరించగానే అతడు వెళ్ళిపోయాడు. భగవంతుడు ఎవరికి లభించినా దుఃఖాలలోనే లభించాడు. సుఖ సహచరి మానవుడు, దుఃఖసహచరి భగవంతుడు – అన్న విషయాన్ని నిరంతరం స్మరించండి. మానవమాత్రుడు ధనసంపాదనకోసంచేసేప్రయత్నంలో కొంత భాగమయినా పరమాత్మకోసం చేయగలిగితే అవశ్యం అతడు లభిస్తాడు. "నంద నందనుడు పిలవకుండానే గోపికల యిండ్లకు వెళ్ళాడు. కాని నా యింటికి ఎందుకు రావడం లేదు?" అన్న ఆలోచన ఎన్నడయినా వచ్చినదా ? ఆ గోపాలుడు నాయింటికి కూడా వచ్చేటట్టి సత్కార్యం నేనుకూడా చేస్తాను" అని దృఢంగా నిశ్చయించుకో. భగవంతునిముందు తలవంచడం చేతులు జోడించడం – అంటే అర్థమేమిటి ? చేతులు క్రియాశక్తికి ప్రతీక–చేతులు జోడించడానికి అర్థం – నేను చేతులతో సత్కర్మ లాచరిస్తాను. అని అర్థము శిరస్సు వంచడానికి అర్థం?–నేను నా బుద్ధిశక్తిని దేవా ! నీకు సమర్పిస్తాను. అని వందనం చెయ్యడానికి అర్థము, మీ బుద్ధి క్రియాశక్తులను భగవంతునికి అర్పించడమే. భగవంతునికి నమస్కరించడం వల్ల పాప తాపాలు నాశనమైపోతాయి. నిర్భయుడవు కావాలంటేభగవంతునికి ప్రేమతో నమస్కరించు. "నా దేవుడు దయా సముద్రుడు." అని భావించి కేవలం వాక్ శరీరాలలోనే కాకుండ హృదయమార వందనం చెయ్యి, అప్పుడే భగవంతునిలో బ్రహ్మ సంబంధం ఏర్పడుతుంది.

ఇంటినుండి ఎప్పుడు బయటకు వెళ్ళినా భగవంతునికి నమస్కరించండి. భగవంతుడు ప్రేమనే కోరుతాడు. ప్రేమనే అతడు ప్రసాదిస్తూంటాడు. వీడు నావాడు, నన్ను యాచిస్తూన్నాడని అతడు గ్రహిస్తాడు. వందన మాత్రంచే మనకు భగవంతుని సంబంధం ఏర్పడుతుంది. ఈ మానవ మాత్రుని స్వభావం ఏమిటో కానీ అతడు వందనంకూడా చెయ్యడు, చెయ్యడం లేదు. బయటకు వెళ్ళి యింట్లోకి వస్తూన్న అతడు భార్య ఇంట్లో లేకపోతే కొడుకును పిలచి—"మీ అమ్మ ఎక్కడికి వెళ్ళింది?" అని అడుగుతాడు. కాని ఆ ప్రశ్న ఎందుకు? ఆమె బయటకు వెడితే ఏమయింది? పని మీద బయటకు వెడితే తిరిగి రాదా? ఈలోగా నువ్వు యింట్లో కూర్చుని నిర్మల ప్రశాంత హృదయంతో భగవత్ స్మరణ చేస్తుకుంటూ వుండవచ్చు కదా! దారిలో నడిచేవేళ కూడ దైవాన్ని స్మరించండి! కార్యారంభంలో, మధ్యలో అంతంలో హరి స్మరణ చెయ్యడంవల్ల ఆ దయామయుని విశేషానుగ్రహం లభిస్తుంది. ఏమి చెయ్యగలిగినా చెయ్యలేకపోయినా మాటిమాటికి భగవంతునికి వందనం చెయ్యండి. వందనం చెయ్యదలిస్తే ఒక్కక్షణం నిర్మలమై శ్రద్ధా భక్తి వినయ భావ సంభరితమయిన హృదయంతో నమస్కరించడానికి తీవ్రతర ప్రయత్నం చెయ్యండి. పరమాత్మకు మా పై అపారమయిన కరుణ వున్నది. అతడు మాకీ జీవనంలో చేసిన ఉపకారాలు అనంతాలు. తినడానికి సహకరించే నాలుక నిచ్చాడు. ఈ అనంత మహా ప్రపంచాన్ని సందర్శించడానికి సుందర నేత్రాలనూ, సుమధుర సంగీత ధ్వనులను మధురగాధలను అలకించడానికి శ్రవణేంద్రియాలనూ, అలోచించే విచార శక్తులనూ ఆ దయామయుడే అనుగ్రహించాడు. భగవానుడు చేసిన ఉపకారసర్వస్వాన్నీ, అనుదినం, అనుక్షణం అవకాశం వచ్చినప్పుడల్లా స్మరించండి. ఓ దేవా! మేము నీకు ఋణపడి ఉన్నాము" అన్న ఉత్తమ భావంతో నమస్కరించండి, పరమేశ్వరా! నువ్వు మాపై దయదలచినావు. నీ దయ వలననే మేము సుఖిస్తున్నాము. మా పాపాలు అనంతంగా ఉన్నాయి. కాని దేవా! నీదయకూడా అనంతంగా అపారంగానే ఉంది.

పరమేశ్వరునికి సద్భావంతో చేసే నమస్కారం అవశ్యం సఫలమవుతుంది.

పరమాత్మ నీకు ప్రసాదించిన వస్తువుల నువ్వు అందుకోవడానికి నీకు అర్హత ఉన్నదా? లేదా? అన్న విషయాన్ని గురించి ఆలోచించుకో, దేవా! నేను యోగ్యుణ్ని కాను, పాపిని, అయినా నాకు నాదేవుడు కీర్తి సంపదలను ప్రసాదించాడు. నేను ఆ దేవదేవుని ఋణాన్ని తీర్చుకొనజాలను. నమస్కారం మాత్రం చెయ్యగలను. నమస్కార మాత్రంచే అభిమానభారం తగ్గుతూంటుంది పరమాత్మలో పొరపాటన్నదేదీ లేదు. కారణం? అతనిలో అభిమానం నామమాత్రానికి కూడ లేకపోవడమే. భాగవతారంభం కూడ వందనంతోనే జరిగింది. సమాప్తి కూడ వందనంతోనే అయింది.

## నమామి హరిః పరమ్.

కేవలం కృష్ణ పరమాత్మకు మాత్రమే వందనం చేసి ఊరుకోలేదు. "శ్రీకృష్ణాయ రాధా కృష్ణాయ వయం నమః" శ్రీ అంటే రాధ. రాధా సమేతుడయిన కృష్ణ పరమాత్మకు నమస్కరిస్తున్నాను. పరమాత్మకువందనం చేసిన తరువాత భాగవత వక్త అయిన శుకయోగీంద్రునికి వందనం చెయ్యడం జరిగింది. వందనం ద్వారా నీ క్రియా బుద్ధి శక్తులను భగవదంకితం చేసిన తరువాత అఘటిత కార్యాన్ని గురించి యోచించ రాదు.

యోచన, పఠనాదుల కన్న మిన్నగా అచరణయే సర్వ శ్రేష్ఠమయినది.

వేదాలకు అంతమన్నది లేదు. పురాణ వాఙ్మయం అపారంగా ఉంది. శాస్త్రాలు ఎన్నో వున్నాయి. పోనీ మానవ జీవితాన్ని గురించి చూద్దామా? అంటే అది అత్యల్పంగా ఉంది. కనుక పరమాత్మను ఒక్కణ్ణి తెలిసికోగలిగితే సర్వం తెలుసుకున్నట్లే. కలియుగ మానవుడు అల్పకాలంలోనే పరమాత్మను పొందగలుగుతాడు. అదియే భాగవతంలో చెప్పబడి ఉంది.

సూతుడు పలుకుతున్నాడు:— ఏడు రోజులలోనే పరీక్షిన్మహారాజు సద్గతిని పొందడం నేను కళ్లారా చూశాను. పరీక్షిత్తు ఉద్ధరింపబడ్డాడు. అలా అయిన నాడు మనమందరం కూడ ఎందుకు ఉద్ధరింపబడము? మనం పరీక్షిత్తువంటి శ్రోతలము కావాలి. శుకదేవుని వంటి మహాత్ముడయిన వక్త లభించిననాడు ఉద్ధరింపబడడం జరుగుతుంది? మన మందరం పరీక్షిత్తువంటి వారమే. ఈ జీవుడు గర్భంలో ప్రవేశించాడు. నన్ను రక్షించిన చతుర్భుజ రూపుడయిన దివ్య పురుషుడేడీ?"అని అన్వేషించే వాడే పరీక్షిత్తు, గర్భంలో ప్రవేశించి జీవుడు — గర్భస్థుడైన తనను రక్షించిన పరమాత్మను వెతుక్కుంటూ బయలుదేరిన జీవుడు పరీక్షిత్తు—పరీక్షిత్తు అంటే భగవద్దర్శనార్థం ఆతురుడయ్యే జీవుడు. పరీక్షిత్తు ఆతురతకు కారణం? అతనికి తన మృత్యువు ఏడు రోజులలో ఉన్నదని తెలుసును. తక్షకుడు తనను కాటువేస్తాడనీ తెలుసును. ప్రతి వ్యక్తినీ తక్షకుడు కాటు వేస్తాడు. తక్షకుడు కాలస్వరూపుడని భాగవత ఏకాదశస్కంధంలో స్పష్టంగా వుంది. వారానికి ఏడు రోజులు, ఏడు వారాలలో యేదో ఒక వారం మనందరకూ మరణం నిశ్చయింపబడియే ఉంటుంది. కనుక పరీక్షిత్తు వలె మీరు కూడ కాలాన్ని విస్మరించకండి. ఎలాంటి వ్యక్తికయినా ప్రాణికయినా మృత్యు భీతి తప్పదు. బ్రహ్మకు కూడా కాల భయం ఉండి తీరుతుంది.

భాగవతం మానవ మాత్రుణ్ణి నిర్భయుణ్ణి చేసి తీరుతుంది. ధ్రువుడు మృత్యు మస్తకంపై పాదం ఉంచి స్వర్గం చేరినట్లు వస్తుంది. "ఇక నాకు మృత్యుభయం లేదు." అంటాడు — పరీక్షిన్మహారాజు. భాగవత పఠన శ్రవణానంతరం భగవంతుని యందు భక్తి [illegible]లలో తీవ్రం కాగా కాలుని భయం ఉండదు. భాగ[illegible], ఆశ్రయించిన వారు నిర్భయంగా ఉంటారు.

ప్రజలు మృత్యువును అమంగళంగా భావిస్తూంటారు. కాని మృత్యువు అమంగళ మయినది మాత్రం కాదు. కాలుడు భగవత్ సేవకుడు కావడం వల్ల కూడ మంగళ మయుడే. "నా బిడ్డ యోగ్యుడయినాడు" అని భగవంతునికి స్ఫురించగానే భగవంతుడు"ఫలానా జీవుని తీసుకురా" అని కాలునికి ఆజ్ఞాపిస్తాడు. పాపం చేద్దామన్న ఆలోచన కూడ లేనివానికి మృత్యువు మంగళమవుతుంది. జీవితంలో మానవమాత్రునికి యదార్థమయిన మృత్యు భయం లేకపోవడం వల్లనే వాని జీవితం నాశన మవుతున్నది. మృత్యువు కూడ అమంగళ మవుతుంది. అవసాన కాలంలో మానవునికి ఎందుకు మహా భీతి కలుగుతున్నది? మరణం కోసం కాదు. తాను చేసిన పాప కర్మల స్మరణ కలగడం వలన. పాపాలు చేసేటప్పుడు మానవుడు భయపడడు. పాప ఫలాలను అనుభవించ వలసి వచ్చినప్పుడు భయపడిపోతాడు. వ్యావహారికంగా యజమానికి నౌకరూ, శేట్‌కు గుమాస్తా, అప్పు యిచ్చిన వానికి పుచ్చుకున్నవారు వీరు వారననేల? అందరికందరూ ఎవరికో ఒకరికి దేనికో దానికి భయపడుతూనే ఉన్నారు. కాని ఎవరూ భగవంతునికి మాత్రం భయపడడం లేదు. అందుకే దుఃఖాల పాలవుతున్నారు.

భాగవతం మానవుణ్ణి నిర్భయుణ్ణిగా ఉంచుతుంది. భాగవతాశ్రయం వల్ల నిర్భయత్వం ఏర్పడుతుంది.

"నేను నా దేవ దేవుడయిన కృష్ణపరమాత్మ యొక్క అంశామాత్రుడను. నేను దేవదేవుని వాడను" అని అను కోగలిగితే ఎంత ధైర్యం వస్తుంది? జేబులో కొన్ని డబ్బులున్నంత మాత్రాన మానవునికి ధైర్యం వస్తుంది. అయిన నాడు భగవంతుణ్ణి వెంటబెట్టుకొని వెళ్ళగలిగితే మీరు కూడా నిర్భయంగా ఉండవచ్చును. ఇందులో ఆశ్చర్యం ఏముంటుంది? భయరహితంగా భగవంతుని యందు ప్రీతి కలుగనే కలుగదు. కాలునికి అనుక్షణం భయపడుతూండండి. అలా చేయ గలిగిన నాడు మానవులు పాపాలు చెయ్యరు. నిర్భయంగా ఉండదలచారా? పాపాలను విడిచిపెట్టండి. భాగవత శాస్త్రం మనలను నిర్భయులనుగా ఉంచుతుంది. మానవులకు ఎవరి భయ మయినా లేకపోవచ్చునేమో? కానీ మరణభయం మాత్రం ఉంటుంది. కామాన్ని దూరం చేసుకుని భక్తి ప్రేమ మయ జీవితాన్ని గడపగల వారు కాలుని జయించ గలుగుతారు. కాలుని జయించగలిగిన వారు అతనిచేత దెబ్బ తినరు. కామాన్నీ కాలాన్నీ జయించాలనుకుంటే భగవత్ సంబంధం కలిగి మెలగండి. భగవత్ ప్రేమ రహితంగా యీ కామక్రోధాది వికారాలు దూరం కావు. పరమాత్మతో విశేష స్నేహం కలిగి ఉంటే కాలభయమే కలగదు. మృత్యు మస్తకంపై కాలు ఉంచి ధృవుడు వైకుంఠం చేరాడు. కాలుడే తక్షక నాగ స్వరూపుడు, కాల తక్షకుడు ఎవరినీ విడనాడడు ఎవరి మీదా యీ కాలునికి దయ కలుగదు. కనుక యీ జన్మలో యీ కాలుని జయించండి. జన్మిస్తూండగానే మృత్యుకాల కారణాలు రెండూ నిశ్చయింపబడి ఉంటాయి.

పాపాలు చెయ్యడంలో మానవుడు జాగరూకుడై ఉన్నట్లు పుణ్యాచరణలో ఉండడం లేదు. పాపాలు బయట పడితే లోకంలో అప్రతిష్ఠ పాలవుతా మనుకుంటూ మానవుడు అతి రహస్యంగా ఏకాగ్ర చిత్తంతో పాపాలు చేస్తారు. అందువల్లనే అంతకాలంలో వానికి పాపాలు జ్ఞాపకానికి వస్తాయి. అందుకే భయపడి పోతూంటారు. వానికి తన పాపాలు ప్రత్యక్షంగా కన్పిస్తుంటాయి. నేను చావుకు తగిన ఏర్పాట్లేవీ చేసుకోలేదే? ఇప్పుడు నా గతి ఏమి కాను? అని ఏడుస్తాడు. మానవుడు కార్య కలాపాలన్నిటికీ సిద్ధపడుతాడు. కానీ మరణానికి ఏర్పాట్లు చేసుకోడు. పెండ్లికి ఏర్పాట్లు చేసుకున్నట్లే ఆనందంగా క్రమ క్రమంగా మరణానికి కూడా ఏర్పాట్లు చేసుకోవాలి. మరణానికి సర్వదా సదా సిద్ధంగా వుండు. మృత్యువు అంటే పరమాత్మకు గతించిన మన రోజుల లెక్కల జాబితా చూపవలసిన పవిత్ర దినము. భగవంతుడు మన లను ప్రశ్నిస్తాడు.

"మానవుడా! నేను నీకు కళ్ళనూ, చెవులనూ, తను, మన, ధనాదులనూ యిచ్చాను. వాటిని నువ్వు ఏమి చేశావు?" అని భగవంతుడు ప్రశ్నిస్తాడు. దానితో మీరు పయపడిపోతారు. ఓ సామాన్యుడయిన ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసర్‌కు లెక్కలు చూపవలసి వస్తేనే తడబడి పోతూ హడలిపోతూంటే మానవులు-భగవంతునికి తమ యావజ్జీవితానికీ సంబంధించిన లెక్కలు చూపవలసి వస్తే ఎంత జాగ్రత్తగా వినయంగా ఉండాలో చెప్పండి.

మృత్యువును మహోజ్జ్వలంగా చేసుకోవాలనుకుంటే ప్రతీ క్షణాన్నీ సావధానంగా ఉంచుకో. కళ్ళను సద్వినియోగం చెయ్యి. వాక్కునూ, ధనాన్నీ సద్వినియోగం చేసుకోగలిగితే మృత్యువు మహోజ్జ్వలంగా వుంటుంది. ప్రతి క్షణం భగవత్ స్మరణలో వున్నవాని మరణం సఫలమవుతుంది. భాగవతం మృత్యువును సఫలం చేస్తుంది. రోజూ స్మశానాలలోనికి వెళ్ళనవసరం లేదు. కాని స్మశానాన్ని మాత్రం రోజూ స్మరించి తీరాలి. మహాదేవ భగవానుడు స్మశానంలో విరాజిల్లుతూంటాడు.

స్మశానం జ్ఞానభూమి. అక్కడ సమ భావాలు జాగృత మవుతూంటాయి. కనుక జ్ఞానం కలుగుతుంది. అందుకే అది జ్ఞాన భూమిగా ఖ్యాతిగాంచినది. సమ భావాలు జాగృతమయ్యే స్థాన నామమే శ్మశానము. సమ భావమే భగవద్భావము. మానవు లందరి యందూ సమ భావం కలిగి వ్యవహరించగలిగితే వాని మరణం సఫలమవుతుంది. సర్వులలోనూ భగవద్భావం జాగృత మయిన నాడు జీవునిలో దైన్య భావం ఉదయిస్తుంది. పరమాత్మను ప్రసన్నుని చేసికోవాలంటే దైన్యభావం విశేషంగా కావలసి ఉంది. మానవుడు అమరుడు కావలెననుకుంటే దివ్య భాగవత గాధను ఆశ్రయించాలి. నాడే వాడమరుడవుతాడు. పరీక్షిన్మహారాజూ శుకమహర్షి - ఇద్దరూ అమరులు. భాగవత గాధ మిమ్మల్ని అమరులను చేస్తుంది. భక్తి రసాన్ని ప్రసాదిస్తుంది. భక్తి వల్లనే మీరాబాయిద్వారాకాధీశునిలోను గౌరాంగప్రభువుజగదీశ్వరునిలోనూ, సశరీరంగా లీనమై పోయారు. తపో యోగ రహితంగా భగవంతుణ్ణి చేరాలంటే భాగవత శాస్త్రమే మహోత్తమ సాధనము.

భాగవతంలోని భగవంతుడు అందరితో మాట్లాడటానికి సంసిద్ధంగా ఉంటాడు. వాస్తవానికి భగవంతుడు అర్హునితో అధికారితో మాత్రమే భాషిస్తాడు. భాగవతం మానవుణ్ణి సందేహరహితుని చేస్తుంది. ఇందులో సర్వం వస్తాయి. బుద్ధి. జ్ఞాన, జీవనాలు - సంపూర్ణ పరిపక్వావస్థకు వచ్చిన మీదనే వ్యాసర్షి యీ గ్రంధ రచన చేసాడు. భగవన్నామాన్ని స్మరిస్తూ అత్యంత ప్రేమతో యీ గ్రంథ రత్నాన్ని చదివితే వింటే సందేహాలన్నవే ఉండవు,భాగవతం నారాయణ స్వరూపము. పరిపూర్ణము. దీని నాలకించడం వల్ల ఆస్తికులకు మార్గదర్శన మవుతుంది. నాస్తికుడాస్తికుడవుతాడు. ఆత్మారాము డయిన శుకదేవుని వంటి మహర్షియే సర్వస్వాన్నీ త్యాగంచేసిన వాడే దీనిని విడనాడ లేదు. ఆత్మారామకోటికి సంబంధించిన మహాత్ములయిన వారెందరో యీ శ్రీకృష్ణ గాధలో తన్మయులవుతూన్నారు. పిచ్చివారవుతూన్నారు. సిద్ధులకు ఆస్తికులకు నాస్తికులకు, పామరులకు, అందరికందరికీ యీ గాధ నవ్య జీవితాన్ని ప్రసాదిస్తుంది. వ్యవహార జ్ఞానం కూడ లభిస్తుంది. ఈ మహోత్తమ గ్రంధరత్నంలో జ్ఞాన కర్మ భక్తి యోగాలు స్త్రీ, సమాజ, అపద్ధర్మాలూ, రాజనీతి - అదిగా గల వన్నీ వర్ణించబడి ఉన్నాయి, దీని శ్రవణ మననాదుల వల్ల లభించే జ్ఞానోదయానంతరం చదువవలసిన గ్రంథం కానీ, తెలుసుకోవలసిన జ్ఞాన విషయమన్నది కానీ, ఏదీ ఉండదు. సాధకునకు సాధన మార్గంలో కలిగే సంశయాలన్నీ దూరమవుతాయి. ఈ భాగవతంలో లేని విషయాలు మరి ఏ గ్రంథంలోను లేవని వ్యాసర్షి అభిప్రాయము. భాగవతం పరిపూర్ణంగా నారాయణ స్వరూపము. అతిశయ దివ్యమయినది.

దేవతలకు అపరోక్షత్వమంటే అత్యంత ప్రియము. చిత్రకేతు చక్రవర్తికి కోటిమంది రాణులు. సాంసారిక విషయ సర్వస్వాన్నీ మనస్సులో ఉంచుకున్న వాడే చిత్రకేతువు. అట్టి మనస్సు విషయాలలో తన్మయమయిన నాడు కోటి మంది రాణులలో రమిస్తూంటుంది. చిత్రకేతువుకు కోటి మంది రాణులున్నారన్న దీని అంతరార్థ మిదియే. భాగవతంలో యిట్టి గాధ లెన్నో ఉన్నాయి. దీనిని చదివే వారూ, వినే వారూ స్థిర చిత్తంతో ఏకాగ్రభావంతో - వీటి లక్ష్యార్థం ఏమిటన్న విషయాన్ని గురించి యోచించండి. హిరణ్యాక్షుని కిరీటాగ్రభాగం స్వర్గాన్ని స్పృశిస్తూన్నదనీ, అతని విశాల దేహంతో దిశలన్నీ అచ్ఛాదితమయి ఉన్నాయనీ ఉంది. జాగ్రత్తగా యోచించండి. దీనిని బట్టి చూస్తూంటే లోభం అనుక్షణం

వర్ధిల్లుతూ ఉంటుందన్న తత్త్వాన్ని వ్యక్తీకరించడమే దీని లక్ష్యార్థము.

సత్కార్యానికి విఘ్నాలు విశేషంగా ఉంటాయి. కనుకనే సప్తాహదీక్ష ఏర్పాటు చేయబడింది. అన్యథా సూత శౌనక సంవాదానికి సహస్ర దివస పరిమితి ఏర్పడింది. విఘ్నాలు రాకూడదని వ్యాసర్షి "శ్రీ గణేశాయ నమః అని గణపతికి నమస్కరిస్తాడు తరువాత సరస్వతీ దేవికి వందనం చేస్తాడు. ఆ దేవి కృపవల్ల మానవునిలో వివేకం ఉదయిస్తుంది. తరువాత సద్గురువుకు వందనం చేసి ఆ తరువాత భాగవత గ్రంథ నాయకుడు, దేవత అయిన శ్రీకృష్ణపరమాత్మకు ప్రణామం చేస్తాడు. "నేను రచించిన యీ భాగవత గ్రంథ రత్నాన్ని ఎవరు ప్రచారం చేస్తారు?" అని వ్యాసర్షి ఆలోచించ సాగాడు.

వ్యాసర్షి ఈ గ్రంథరత్నాన్ని వార్థక్యావస్థలో రచించాడు. అందువల్లనే ఆయన దీనిని స్వయంగా ప్రచారం చెయ్యలేక పోయాడు. "దీనిని ఎవరికివ్వాలి? ఈ పురాణ రచనానంతరం నేను రచనను ఆపివేశాను. కేవలం యిది మానవ కళ్యాణార్థం వ్రాసాను. ఇంత వరకూ ఎన్నో వ్రాసాను, ఎంతో చెప్పాను. ఇక యీ శాస్త్రంతో అన్నీ ఆపివేసి చిత్తాన్ని సంపూర్ణంగా పరమాత్మాయత్తం చేసుకుంటాను. భగవంతుని నుండి వేరై దూరమయిన నా యీ జీవాత్మ భగవదున్ముఖం కావడం కోసం యీ శాస్త్ర రచన చేసాను. ఇది ప్రేమ శాస్త్రము. మహా విరక్తుడయిన వాడే యీ పురాణాన్ని ప్రచారం చెయ్యగలుగుతాడు. శ్రీకృష్ణదేవుని యందు వినా అన్యుల యందు ప్రేమ సంబంధం కలవాడు ఎవడూ ఈ గ్రంథ సార సర్వస్వానుభూతిని పొందజాలడు. అలాంటి వాడెవడు దొరుకుతాడు? సంసార సుఖాలను అనుభవించిన తరువాత అనేక మందికి వైరాగ్యం లభిస్తుంది. కాని జన్మించిన ఆదిగా వైరాగ్య సంపన్నుడయిన వాడెవడు దొరుకుతాడు? యోగ్యుడయినవానికే దీనిని ప్రసాదించాలి అట్టివాడే లోక కళ్యాణం చెయ్యగలడు" అని పరిపరి విధాల తర్కించుకున్న వ్యాసర్షికి వార్థక్యంలో పుత్రేషణ కలిగింది. శంకర భగవానుడు వైరాగ్య స్వరూపుడు. ఆ దేవదేవుడు నాపై దయచూపితే నా సదనంలో పుత్రరూపంలో విరాజిల్లు నాడే యీ సత్కార్యం సాధింపబడుతుంది. రుద్రునికి జన్మ ఉంది. కానీ మహారుద్రునికి జన్మ లేదు. పరమ శివమూర్తి అవతరిస్తేనే నా యీ భాగవత పురాణం ప్రచారమవుతుంది." అని అనుకుంటూ వ్యాసర్షి మహాదేవుని ఆరాధించాడు.

సదాశివదేవుడు ప్రసన్నుడై అభీష్ట వరాన్ని కోరుకోమనగా—దేవాధిదేవా! మహాదేవా! సమాధ్యవస్థలో మీరు అనుభవించే ఆనందంతో సమమయిన ఆనందాన్ని ప్రపంచానికి ప్రసాదించడం కోసం మీరు నాకు పుత్ర రూపంలో అనుగ్రహించెదరు గాక!" అని అర్థించాడు. శంకర భగవానునికి యీ లోకంలోకి రావడానికి యిష్టం లేదు. బొగ్గు గనిలోకి అడుగు పెట్టగానే సర్వాంగాలూ మసి అవుతాయి కదా!

"దేవా! మీరీ ప్రపంచ వాసనలో చిక్కుకో పని లేదు. కాని అనంత మానవాళి శ్రేయోదృష్ట్యా దయచేసి అవతరించండి. మిమ్మల్ని మాయ ఏమి చెయ్యగలదు?" అని వ్యాసర్షి ప్రశ్నించగా మహాదేవుడు తనలో—సమాధ్యవస్థలో నేను పొందే ఆనందంతో సమానమయిన ఆనందాన్ని ప్రజలకు ప్రసాదించకపోతే స్వార్థపరుడనవుతాను. విశ్వానికి సమాధ్యానందాన్ని ప్రసాదించాలి" అని నిశ్చయించుకుని ఆశుతోష భగవానుడు వ్యాసనందనుడుగా అవతరించ అంగీకరించాడు. వైరాగ్యమూర్తి అయిన శుకమహర్షి శంకరాంశ సంభూతుడు. కనుకనే అతడు

జన్మించినది మొదలు పూర్ణ విరాగి అయినాడు. జన్మ ప్రభృతి విరాగి అయిన వాడే ఇందుకు సంపూర్ణాధికారి కాగలుగుతాడు.

జ్ఞానులు మాయకు ఎంతమాత్రం లొంగరు. మాయకు వారు బహుదూరంగా ఉంటారు. అందులకే భగవద్భక్తులు మాయలో వుంటూ కూడా భగవదనుభూతినే పొందుతూంటారు. శుకదేవుని జన్మగాథలు వివిధ పురాణాలలో అనేక ప్రకారాలుగా వున్నాయి. కల్పభేదంచే అన్నీ యదార్థ మయినవే.

శుకమహర్షి మాతృ గర్భంలోనే ఉంటూ అంత కాలమూ పరమాత్మ ధ్యానం చేశాడు– "నాయనా! నువ్వు బయటకు రావేమిటి?" అని వ్యాసర్షి ప్రశ్నించగా శుకుడంటాడు– "నాకు సంసారభయం వుంది. మాయకు బహుదూరంగా వుండాలను కుంటున్నాను." అన్నాడు. అంత పరమాత్మ– "నిన్ను నా మాయ ఏమీ చెయ్యలేదు." అన్న మీదట శుకుడు మాతృగర్భ నుండి బయటకు వచ్చాడు. కుమారుని బ్రహ్మనిష్ఠ, వైరాగ్య, అలౌకిక ప్రేమలక్షణ, భక్త్యాదులను తిలకించి వ్యాసర్షి కూడ అతణ్ణి గౌరవించేవాడు. జన్మిస్తూనే శుకుడు అరణ్యాలవైపు పయనం సాగించాడు. నిర్వికార బ్రహ్మ రూపుడయిన నా కుమారుడు నానుండి దూరం కారాదు. ఇతణ్ణి ఆపండి" అని శుకుని తల్లి అయిన అరణీదేవి భర్తను అర్థించసాగింది. వ్యాసుడామెను వారిస్తూ "దేవీ! మనకు అత్యంత ప్రియమయిన దానినే పరమాత్మకు సమర్పించాలి. ఇతడు లోక కళ్యాణం కోసం అరణ్యాలను బట్టి పయనిస్తూన్నాడు." అన్నాడే కాని తరువాత వ్యాసుడు కూడ అత్యంత విహ్వలుడై విచారిస్తూంటాడు. వెనుకకు మరలకుండ పురోగమించిపోయే ఇతడు మరలి రాడు అనుకున్నాడు వ్యాసుడు. అతడు మహాజ్ఞాని అయిన కుమారుని వెన్నంటి నడిచాడు. పుత్రుణ్ణి పిలుస్తూ "కుమారా! కుమారా! మరలిరా! నన్ను విడనాడి వెళ్ళకు తండ్రీ! పెళ్ళిచేసుకోమని నేను నిన్ను పట్టుపట్టనురా!" అన్నాడు. అయినా శుకుడు కృష్ణధ్యాన తత్పరుడై సర్వస్వాన్నీ విస్మరించాడు. ఆ దశలో అతడు–వ్యాసా! ఎవరికి ఎవరు తండ్రి? ఎవరు తల్లి? లౌకిక సంబంధమయిన విస్మరణ కలిగిననాడే బ్రహ్మసంబంధం ఏర్పడుతుంది. లౌకిక సంబంధమయిన స్మరణ వున్నంత వరకు చిత్తం భగవదాయత్తం కాదు.

సర్వవ్యాపకుడయిన శుకమహర్షి వృక్షాలద్వారా సమాధానం యిస్తూన్నాడు. "మునీశ్వరా! నీకు పుత్ర వియోగ దుఃఖం కలుగుతున్నది. కాని మమ్మల్ని రాళ్ళతో కొట్టేవారికి కూడ మేము సుఖాన్నే యిస్తున్నాము. వృక్షాలకు పుత్రులు వాటి ఫలాలే. తమ్ము వేధించిన వారికి కూడ సత్ఫలాలను అందించగలవారే భగవద్భక్తులు. ఇట్టి దశలో పుత్రవియోగార్థం మీరెందుకు విచారించాలి? మీ కుమారుడు జగత్కళ్యాణార్థం పురోగమిస్తూన్నాడు." అని చెబుతూన్న వ్యాసుడు వ్యగ్రుడై మథన పడిపోతూండడం చూసి శుకుడు–

మహాత్మా! ఈ జీవుడు అనేక పర్యాయాలు పుత్రునిగా అనేకమార్లు తండ్రిగా అయ్యాడు. విషయ వాసనలో బద్ధుడయిన జీవుడు అనేకమార్లు తండ్రిగా కొడుకుగా, భార్యగా వస్తూవచ్చాడు! అనేక పర్యాయాలు పూర్వజన్మలోని శత్రువులు కూడ యీ జన్మలో యీ యింట పుడుతున్నారు. నిజవాసనలు కారణంగా తాతయే మనుమడుగా పుడుతున్నాడు. వాసనలే సదా సర్వదా పూర్వజన్మల కారణాలను వ్యక్తం చేస్తున్నవి. తండ్రీ! నీకూ నాకూ మధ్య ఎన్నో జన్మలయిపోయాయి. పూర్వజన్మలు జ్ఞప్తిలో వుండవు. నువ్వు నాకు తండ్రివుకావు, నేను నీకు పుత్రుడను కాను. మనయిద్దరికీ కూడా యదార్థమయిన తల్లీ – తండ్రి సర్వం నారాయణుడే, వాస్త

వానికి జీవునికి సంబంధం నారాయణునితోనే వుంది. జనకా! నా వెనుక రాకు! నీ జీవితాన్ని పరమాత్మకు అంకితం చెయ్యి! నాకు లభించిన ఆనందాన్ని విశ్వ ప్రజానీకానికి అంతకూ అందించ పెడుతున్నాను.

అంటూనే శుకదేవుడు అక్కడనుండి నర్మదా తీరానికి వెళ్ళిపోయాడు. తీరంచేరి అతడు "జనకా! ఎదురుగా వున్న తీరంలో మీరు కూర్చోండి. ఇక నన్ను గురించి ఆలోచించక నావైపు చూస్తున్న ధ్యానాన్ని మాత్రం పరమాత్మయం దుంచండి. పరమాత్మను అనుసరించ గల వాడే జ్ఞాని ద్రవ్యాదులను అనుసరించి మోహసాగరంలో మునిగి పోకండి పరమాత్మను అనుసరించ గలిగిననాడే కథా శ్రవణం సార్థకమవుతుంది. నారాయణధ్యాన పరాయణుడే కృతార్థుడు కాగలుగుతాడు" అంత వ్యాసర్షి భార్యకు నచ్చచెబుతూ - దేవీ! శుకుడు నీకు అత్యంత ప్రేమ పాత్రుడయితే వానిని సర్వాంతర్యామికి సమర్పించు. మనకు అత్యంత ప్రియమయనదానినే భగవంతునికి అర్పించాలి. ఇట్టి సర్వభూత హృదయ స్వరూపుడయి సద్గురు స్వరూపుడయిన శుకయోగీంద్రుల పదపంకజాలకు నేను మాటిమాటికి వందనం చేస్తూన్నాను.

సూతర్షి శుకమహర్షికి-ప్రణమిల్లి కథను ఆరంభం చేసాడు.

ఓ నాడు నైమిశారణ్య క్షేత్రంలో శౌనకుడు సూత మహర్షితో - నేటివరకూ ఎన్నో గాథలను విన్నాము. ఇప్పుడు సర్వగాథల సారతత్త్వాన్ని వినదలచాము. "కథాసారం మమకర్ణ రసాయనమ్" శ్రీకృష్ణ దేవుని యందు భక్తి దృఢంగా వర్థిల్లె గాథలను వినిపించండి. మాకు కృష్ణప్రాప్తి కావాలి. సర్వసారతత్వ మయిన నవనీత సదృశంగా - శ్రీకృష్ణ భగవానుడు సర్వ ప్రపంచ సారతత్త్వ స్వరూపుడు.

బాలగోపాలునికి వెన్న అంటే చాలా యిష్టము. వెన్న క్షీర సారమై బలవర్ధకమయినది. పరమాత్మ సార భోగి. ఇంతవరకూ ఎన్నో గ్రంధాలను చదివాము. పరమాత్మను పొందదలచిన సాధకులు అధిక సంఖ్యలో గ్రంధాలను పఠించ నవసరం లేదు. అధికంగా గ్రంధాలను పఠించడం వల్ల బుద్ధిలో విక్షేపం కలుగుతుంది. మన దేవుడు శ్రీకృష్ణ చంద్రుడు సారాన్నే స్వీకరిస్తాడు. భక్తులు కూడా సారాన్నే వాంఛిస్తారు. కనుక సమస్త గాథల సారతత్త్వాన్నీ అనుభవించాలని కోరిక కలిగింది. మానవుడు ప్రాపంచిక భోగాలను విడనాడాలి. శ్రీకృష్ణ పరమాత్మలోటి బంధాన్ని పెంచుకో గలిగిననాడే జీవుతో దేవుడవుతాడు.

భాగవతం నవనీతము. ఇతర శాస్త్రాలన్నీ పాల వంటివి, పెరుగువంటివీను. సర్వశాస్త్ర సార రూపంగా యీ శ్రీకృష్ణగాథ రాజిల్లుతూన్నది? శౌనకుడు మనోభీష్టాన్ని సువ్యక్తం చేస్తున్నాడు. "జ్ఞానవైరాగ్యాలతో భక్తికూడా వర్ధిల్లునట్టి గాథలను వినిపించండి. తద్వారా మాకు పరమాత్మ దర్శన మవుతుంది. ఈ గాథలు జ్ఞాన వైరాగ్యాలు వర్ధిల్లడానికేగానీ, ఏడ్వడానికి మాత్రం కావు మహాపురుషులారా! మహాభక్తుల చరిత్రలను ఆలకించడం వల్ల - ఆత్మోద్ధరణార్థం నే నేమీ చెయ్యలేక పోయానే - అని అనుకుంటాడు మానవుడు.

కథాశ్రవణానంతరం తన పాపాలకు పశ్చాత్తాపం కలిగి - హృదయం పరమాత్మలో సంలగ్నమయిననాడు - శ్రవణఫలం సంపూర్ణంగా సార్థకమయినట్లే, విషయ వాసనల యందు వైరాగ్యం కలిగి పరమాత్మ యందు చిత్తం అయత్తం కాకపోతే యీకథలు సత్కథలేకావు. బ్రహ్మదేవుడు నారద మహర్షితో - వత్సా! ప్రజలలో నా స్వామియందు భక్తి వర్ధిల్లునట్టి గాథలను ప్రచారం చెయ్యి" అంటాడు. కథలు మానవజీవితాన్ని ఉద్ధరిస్తాయి.

జీవితాలను మార్చివేస్తాయి. మానవ మాత్రునిలో క్రాంతిని రేకెత్తిస్తాయి. కథాశ్రవణానంతరం మీలో పరివర్తన కలగలేదంటే మీరు సరిగా ఆ కథను వినలేదనియే అనాలి.

శౌనకుడు-తనలో భక్తిభావాలు పరిఢవిల్లజేసే గాథలనే చెప్పుమన్నాడు. కానీ కేవలం జ్ఞానాన్ని వర్ధిల్లజేసే గాథలను చెప్పుమనలేదు. భక్తి జ్ఞానాలతో వైరాగ్యం కూడా వర్ధిల్లే గాథలనే వినిపించు మన్నాడు.

లౌకికదృష్ట్యా హల్వాలో గోధుమ విలువ అధికంగా లేదు. కానీ అది లేకపోతే హల్వా తయారు కాదు. తత్వదృష్ట్యా చూస్తే పిండి విలువ నేతి విలువ సమానమయినవే. హల్వా తయారు కావడానికి పిండి నెయ్యి బెల్లం కావలసిందే. అలాగే జ్ఞాన, భక్తి, వైరాగ్యాలు మూడూ అవసరమైనవే. సంపూర్ణంగా జ్ఞాన వైరాగ్యాలు కలిగిన నాడే నరుని లోని జీవభావం దూరమవుతుంది. భక్తి జ్ఞాన వైరాగ్య భావాలు పరిపూర్ణంగా కలవాడే ఉత్తమ వక్తగా పరిగణింపబడతాడు.

గంగాతీరంలో అనేకమంది ఋషులూ, మునులూ, సమావేశమై సుఖాసీను లయ్యారు. కానీ, భాగవత గాథను వినిపించడానికి ఎవరూ సంసిద్ధులు కాలేదు. అంత పరమాత్మ శుకమహర్షిలో ప్రేరణ కలుగ జేసాడు. శుకదేవునిలో భక్తి జ్ఞాన వైరాగ్యాలు సంపూర్ణంగా ఉన్నాయి.

భాగవతం ప్రేమశాస్త్రము. ప్రేమ పంచమ పురుషార్థము. కృష్ణప్రేమలో దేహభావాన్ని విస్మరించ గలిగితే ప్రేమ సిద్ధించినట్లే. ప్రేమనే పరమాత్మ తన స్వరూపంగా చెబుతూంటాడు.

జ్ఞాన మార్గంలో ప్రాప్తించిన దానినే అనుభవించాలి. భక్తిమార్గంలో భేదభావం భక్తిద్వారా దూరమయిపోతుంది. జ్ఞానపథంలో భేదం నిషేధమయింది. జ్ఞానమార్గంలో జ్ఞానంలో భేదభావాన్ని నిషేధించవచ్చును. భక్తిజ్ఞాన మార్గాల రెండింటి లక్ష్యం ఒకటే.

సూతుడు - "మీరందరూ జ్ఞానులు, జగజ్జనుల కళ్యాణార్థం మీరు ప్రశ్నించదలిస్తే సావధానంగా యీ గాథలను ఆలకించండి. పూర్వజన్మల పుణ్యం ఉదయించిన నాడే యీ విచిత్ర గాథలను ఆలకించే సదవకాశం కలుగుతుంది.

కలియుగ మానవులను మహా కాలసర్ప ముఖాన్నుండి విముక్తులను చెయ్యడం కోసమే శుకయోగి భాగవత గాథను వినిపించాడు. శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు భాగవత గాథను వినిపించేవేళ అమృతభాండంతో దేవతలు అక్కడకు వచ్చారు. వారు - "మహాత్మా! ఈ అమృత భాండాన్ని మీరు తీసుకొని బదులుగా మాకు భాగవత కథామృతాన్ని ప్రసాదించండి." అని అర్థించారు. అంత ఆ మహాత్ముడు పరీక్షిత్తు వైపు తిరిగి" - రాజా! అమృతాన్ని పానం చేస్తావా? కథామృతాన్ని పానం చేస్తావా?" అని అడుగగా పరీక్షిత్తు - మహాత్మా! స్వర్గామృత పానం వల్ల ప్రయోజనం ఏమిటి స్వామీ!" అని అడిగాడు, శుకయోగి అందుకు బదులు పలుకుతూ - "అమృత పానంవల్ల అమరసుఖాలు అనుభవించవచ్చును కానీ స్వర్గామృతం దుఃఖమిశ్రితము, తద్వారా పాప పుణ్యాలు నాశనమైపోతాయి,కానీ పాపాలు నాశనం కావు. కథామృతంవల్ల భోగవాసనలు నశిస్తాయి. కనుక అమృతంకంటె యీకథామృతమే సర్వశ్రేష్ఠమయినది." అన్నాడు.

సనక సనందన సనత్కుమార సనత్సుజాతాదులు బ్రహ్మలోకంలో నివసిస్తూంటారు. ఓసారి ఆ మహాత్ములు కూడ యీ భాగవత కథానందార్థం భారతదేశం లోకి వచ్చారు. దీనినిబట్టి చూడగా ఈ కథానందంతో సరితూగ

గల ఆనందం బ్రహ్మలోకంలో కూడ లభించదని తెలుస్తున్నది. అంత పరీక్షిన్మహారాజు — "స్వామీ! నే నీ స్వర్గామృతాన్ని పానం చెయ్య నవసరం లేదు. ఈ భాగవత కథామృతాన్నే నేను పానం చేస్తాను" అంటాడు.

జ్ఞాన వైరాగ్యాలను జాగృతం చెయ్యడానికి ఏడు రోజులలోనే ఈ గాథ సహకరిస్తుంది. జ్ఞాన వైరాగ్యాలు మనలో వున్నాయి. కానీ అవి నిద్రాణమై వున్నాయి. వాటిని జాగృతం చెయ్యాలి. ముందు గాథలో జ్ఞాన వైరాగ్యాలు మూర్ఛపోయినట్లు వస్తుంది. సప్త దినాలలో ముక్తి ప్రసాదించ గల యిట్టి గ్రంథరత్నం వేరొకటి ఏదీ లేదు.

సూతుడు : ఏడు రోజులలో పరీక్షిత్తు ముక్తి పొందిన గాథను మీకు వినిపిస్తాను. ఏడు రోజులలో తనకు మరణము నిశ్చయమయినదన్న విషయం పరీక్షిత్తుకు ముందుగానే తెలుసును; కానీ మనం మాత్రం కాలాన్ని విస్మరించి వేస్తూంటాము.

అవధూత అయిన శుకదేవుని వంటి మహాత్ముడు వక్త స్థానంలో ఆసీనుడై తేజరిల్లుతూ వుండాలి. పరీక్షిత్తు వంటి అర్హత కల శ్రోత లభించాలి. నాడే సప్త దినాలలో నిశ్శంకగా ముక్తి కరతలామలక మవుతుంది. కరెంటూ బల్బూ, రెండూ సక్రమంగా ఉండాలి. వక్త, శ్రోత యిద్దరూ సరి అయిన వారు సమకూరిన నాడే ముక్తి లభించితీరుతుంది. భాగవతగాథను అత్యంతశ్రద్ధా భక్తులతో విన్న పరీక్షిత్తును తీసుకువెళ్ళడానికి విమానం వచ్చింది. అతనికి సద్గతి లభించినది. విమానారూఢుడై అతడు పరంధామానికి వెళ్ళాడు.

ప్రస్తుత సమాజంలో కూడ విశేషంగా ప్రజలు భాగవత గాథను ఆలకిస్తున్నారు. మరి వారందరినీ తీసుకు వెళ్ళడానికి విమానాలు ఎందుకు రావడం లేదు? అంటే - వక్త, శ్రోత యిద్దరి కిద్దరూ సరి అయినవారు కారనే చెప్పాలి. విషయ వాసనలలో నిమగ్నుడయినంత కాలము మానవమాత్రునికి విమానం ఎలా లభిస్తుంది? లభించినా స్వర్గం చేరడానికి వారు సంసిద్ధం కావడం లేదు. అనేకానేకమయిన వికారాలతో, వాసనలతో, మనం బంధితులమై వుంటున్నాము. అందరికందరూ ధన, గృహ దార పుత్ర మోహంలో బంధితులై విల విల లాడుతూన్నారు. ఈ మహాసక్తినుండి దూరం కానంతవరకూ ముక్తి లభించదు. పరమాత్మలో సంలగ్నమయివున్న చిత్తం కలవారు ఎక్కడ కూర్చున్నా ఏమి? వారి దగ్గరే ముక్తి వుంటుంది. అట్టి మహాత్ములకు విమానాదులువస్తే నేమి? రాకుంటే నేమి? భగవంతుని యందు తన్మయులు కాగలిగిన నాడే ఆనందాన్ని పొందగలుగుతాడు. దానిని అధిగమించిన ఆనందం వైకుంఠాదులలో కూడా లేదు.

తుకారామ్ భక్తుని తీసుకు వెళ్ళాలని విమానం వచ్చింది, అప్పుడతడు భార్యతో-దేవీ! నేను నీకీ జన్మలో ఏమీ యివ్వలేక పోయాను. కాని భగవంతుడు మనకై విమానాన్ని పంపాడు. రా! కూర్చో! నిన్ను పరంధామానికి తీసుకు వెడతాను" అంటాడు. కాని అందు కామె అంగీకరించలేదు. "స్వామీ! వెళ్ళాలని వుంటే మీరు వెళ్ళండి. ఈప్రపంచాన్ని విడిచి మాత్రం నేను స్వర్గానికి రాలేను" అని ఆమె వెళ్ళ లేదు.

సంసార మోహాన్ని విడనాడడం చాలా కష్టము. వాసనలు పరిపూర్ణంగా క్షీణించేవరకూ శాంతి లభించదు కథలోని పగభాగమయినా మనస్సులో హత్తుకుంటే జీవితం మధుర మవుతుంది-వాసనలూ, భోగాలూ పెరగడం వల్లనే ప్రపంచం చేదుగా, విషంగా తయారవుతుంది. వాసనలు క్షీణించనంత వరకూ ముక్తి లభించదు. పూర్వ జన్మలోని శరీరం పోయినదే కానీ మనస్సు

మాత్రం పోలేదు. ప్రజలు తమ దేహ, గేహ, ధన ధాన్యాదులను గురించియే నిరంతరం చింతిస్తూంటారు. కాని మరణానంతరం కూడా వచ్చే దానిని గురించియే నిరంతరం యోచించాలి. ధన శరీరాదుల గురించి విచారించకండి. మరణానంతరం నీ వ్రేలి ఉంగరాన్ని కూడా ప్రజలు తీసి వేస్తారు.

ఆహార, విహార, వ్యవహార రహితంగా మనస్సు శుద్ధికాదు. మనస్సు శుద్ధి కానంతవరకూ భక్తికలుగదు.. జ్ఞాన వైరాగ్యాలు దృఢం కావడానికి యీ భాగవత గాధ అత్యవసరమై యున్నది.

వివేకం ద్వారా సంసారం అంతం కానంతవరకూ యీ విషయవాసనలూ యీ వ్యవహారాలూ అంతం కావు. జీవితంలోకి సంయమ; సదాచారాలు ప్రవేశించనంత వరకూ కేవలం పుస్తక జ్ఞాన మాత్రంచే ప్రయోజనం ఉండదు.

ఓ గృహస్థుని కుమారునికి అవసాన సమయం వచ్చింది. తండ్రి ఏడుస్తున్నాడు. అదే సమయంలో జ్ఞాన బోధ చేసే ఓ మహాస్వామి వచ్చాడు. అతడు యజమానిని ఓదారుస్తూ-"నాయనా! ఆత్మ అమర మయినది. మరణ మన్నది శరీరానికే కనుక నువ్వు నీ కుమారుణ్ణి గురించి ఏడవనక్కరలేదు." అన్నాడు. తరువాత కొన్నాళ్ళకు సాధువు మేక మరణించింది. దానితో అతడు ఏడవడం ఆరంభించాడు. ఆసాధువు ఏడవటం చూసి ఆ గృహస్థు— "స్వామీ! ఎవరి మరణానికయినా విచారించ కూడదని మీరే చెప్పారు. కదా! మరి మీ రెందుకు విచారిస్తున్నారు?" అని అడిగాడు. దానికి ఆ సాధువు బదులు పలుకుతూ" పిల్లవాడు మీ వాడు. కానీ మేక నాది. అందుకే నేను ఏడుస్తూన్నాను. అన్న "పరోపదేశే పాండిత్యమ్" దేనికి?

జ్ఞానానుభవం పొందండి. ముక్తులవడానికి జ్ఞానం అవసరమయింది. భాగవత గాథలు జీవితాన్ని తీర్చిదిద్దు తాయి. జీవన విధానాన్ని మార్చివేస్తాయి. అలా మారనిచో భాగవత కథా శ్రవణ ప్రయోజనమే వుండదు. భాగవత గాథలు ముక్తిని ప్రసాదిస్తాయనడంలో సందేహం లేదు.

అనుదినం మరణాన్ని గురించి రెండు మూడు పర్యాయాలయినా స్మరిస్తూండు. నేడే యమభటులు నన్ను తీసుకుపోవడానికి వస్తే కలిగే దశ ఏమిటని యోచించు. మీరిలా నిత్యం యోచించ గలిగితే పాపాలు చెయ్య లేరు. మానవులు నిత్యం మరణాన్ని గురించి యోచిం చరు. కానీ తిండిని గురించి మాత్రం ముమ్మారు యోచి స్తూంటారు.

ఈ భాగవత పురాణాన్నీ మాహాత్మ్యాన్నీ గురించి యితర పురాణాలలో వర్ణన లభిస్తుంది, కానీ అధిక సంఖ్యాకులు పద్మ పురాణాంతర్గత భాగవత మాహా త్మ్యాన్ని స్వీకరిస్తారు. ఇక భాగవత మాహాత్మ్యాన్ని వర్ణించాలి. దీనిని గురించి సనత్కుమార మహర్షి దేవర్షి నారదునికి వినిపించాడు. మహా మహిమాన్వితు లయిన ఋషులు, మునులూ, దేవతలూ కూడా యీ గాధ నాలకించాలని విశాల క్షేత్రానికి విజయం చేశారు. ఈ గాధలో లభించే ఆనందం బ్రహ్మానందం కన్న మిన్న అయినది. యోగులు ఆత్మోద్ధరణ మాత్రమే చేసుకో గలుగుతూన్నారు. కానీ సత్పురుషులు తమ తోటివారిని కూడ ఉద్ధరిస్తారు. బదరికాశ్రమానికే విశాల క్షేత్రమని పేరు వుంది.

# భాగవత మాహాత్మ్యము

## బదరీ విశాలునికి జయమగుగాక!

బదరీ నారాయణదేవుడు విశాలరాజు దగ్గరకు వచ్చినట్లు స్కాంద పురాణంలో కథ వస్తుంది. పుండరీకుని కోసం విఠల్‌స్వామి వచ్చినట్లు చరిత్ర స్పష్టంగా చెబుతూన్నది. ఏ భక్తునికోసం భగవంతుడు వచ్చాడో! ఆ భక్తుని జన్మ ధన్యమయింది కదా! బదరీ నారాయణుడు ప్రజలకు తపో ధ్యానాదుల ఆదర్శాన్ని ప్రసాదిస్తున్నాడు. నేను భగవంతుడనై కూడా తపో ధ్యాన సంలగ్నుడనై ఉంటున్నాను. "తపశ్చర్యారహితంగా శాంతి లభించదు" అని ఆయన చెబుతున్నాడు. ఈ మానవుడు కఠినమైన తపస్సు చెయ్యలేదు. అందుకే పరమాత్మ ఆదర్శ మార్గాన్ని బోధిస్తున్నాడు. బాలుడు మందు తినక పోతే తల్లి స్వయంగా తిని తినిపిస్తుంది, అప్పుడు బాలుడు_మందు కూడ ఓ తినే వస్తువని గ్రహించగలుగుతాడు. ఆ తల్లికి మందు తినవలసిన అవసరం ఎంత మాత్రం లేను కదా! కానీ! బిడ్డకు నచ్చజెప్పి వానిచేత ఆచరింప జేయడానికి ఆమె కూడా తింటుంది.

బదరీ నారాయణంలో లక్ష్మీ విగ్రహం ఆలయ బాహ్యస్థానంలో వుంది. తపస్సాధనకు స్త్రీ బాలురు యిద్దరూ విఘ్నాలను కలుగజేస్తారు" అని యిందులో స్త్రీ నింద ఎంతమాత్రం జరుగలేదు. కామ నిందమాత్రం జరిగింది. ఎవరూ దారాపుత్రాదులను విడనాడ నవసరం లేదు. అందులకే భార్యా బిడ్డలతో ఇంట్లోనే ఉంటూ భగవత్ భజన చెయ్యండి. అలాగే తపస్వినికి పురుష సాంగత్యం కూడా నిషేధమే.

విశాలనగరంలో సనత్కుమార మహర్షి నివసించే స్థానానికి నారదమహర్షి పరిభ్రమిస్తూ వచ్చాడు. సనకాదులు దేవర్షి వదనాన్ని తిలకించి – "కుతశ్చింతాపరో" నారదా! నీ విచారానికి కారణం ఏమిటి? హరి దాసులెన్నడూ విచారగ్రస్తులు కారే! భక్తులు సర్వదా ప్రసన్నంగానే వుంటారు. ఎన్నడూ విచారించని వారే భక్తులు కదా! వారు సర్వదా భగవచ్చింతనలో నిమగ్నులయి వుంటారు. అయినా మీరేల ప్రసన్నులుగా లేరు? అని ప్రశ్నించగా – దేవర్షి సమాధానమిస్తూ – "నా దేశం దుఃఖంలో వుంది, సత్య దాన దయా తపో ధర్మాదు లేవీ లేవు. మానవులు చెప్పేది ఒకటి చేసేది వేరొకటి. "ఉదరంభరిణో జీవాః" మానవులందరూ ఉదరంభరులై, స్వార్థపరాయణు లయిపోయారు.

సమాజంలో ఎవరికీ సుఖశాంతులన్నవి లేవు. నేను అనేక స్థానాలలో పరిభ్రమించాను. అయినా నాకు శాంతి లభించలేదు. నేడు దేశమంతా ఎందుకు దుఃఖిస్తూన్నది, అన్న ప్రశ్నకు నారదమహర్షి ఎన్నో కారణాలు చెప్పాడు. దైవకార్యాలయందు ఏనాడయితే మానవులు విశ్వాసాన్ని కోలుపోయారో, నాడే వారికి సుఖం లభించదు. ధర్మం ప్రధాన స్థానాన్ని ఆక్రమించని వారి జీవితాలు శాంతి పొందలేవు. విశ్వంలో యిప్పుడు ధర్మం అన్నది ఎక్కడుంది?

నారదుడు దుఃఖిస్తూ – ఇక యీ ప్రపంచంలో సత్యం వుండదు. "సత్యం నాస్తి" అసత్యం సర్వే సర్వత్రా వర్ధిల్లుతూంటుంది. అసత్యానికి మించిన పాపం లేదు. అసత్యవాదికి పాపాలు రావడమే కాకుండా వాని పుణ్యం కూడా నాశనమైపోతుంది. యదార్థమైన ఆనం

కాన్ని పొందదలచావా? సత్య నిష్ఠుడవై వ్యవహరించు. అసత్యభాషి యింతవరకూ ఎన్నడూ సుఖించ లేదు. ముందు సుఖించడు కూడ.

మితభాషివిగా ఉండగలుగుతే సత్యభాషివి కాగ లుగుతావు.

విశ్వంలో ఎక్కడా పవిత్రత కానరావడం లేదు. శరీర వస్త్రాదులను మానవుడు శుభ్రంగా వుంచుకోవాలి. వస్త్రాలను పవిత్రంగా వుంచుకుంటున్నారే గాని మన స్సును వుంచుకోవడంలేదు. మనస్సు పూర్తిగా పవిత్రంగా వుంచుకో। కారణం కూడా వచ్చేది మనస్సు మాత్రమే. నీతి, అవినీతుల విచక్షణ లేకుండ ధనార్జన జరుగు తూన్నది. దుర్మార్గంగా ఖర్చు కూడా అయిపోతున్నది. కుటుంబ సుఖానంతరం శాంతి అన్నది ఏమయినా వుంటు న్నదా? లేదా? అన్న ఆలోచన ఏ మానవుడూ చెయ్యడం లేదు. ఈ ధన సంపదలతో నేను నా కుటుంబాన్ని సుఖ సంపన్నం చేస్తున్నాను.

అని మాత్రం అతడు భావిస్తున్నాడు। మానవుడు ఇంద్రియ సుఖాలకు వశీభూతుడయి, పవిత్ర భావాలకు ఎంత మాత్రం స్థానం యివ్వక సంచరిస్తున్నాడు. విషయ వాసనలలో మునిగిపోయి అతడు సత్యమై శ్రేష్ఠమైన ఆనందం ఏమిటన్న విషయాన్నే విస్మరించి వేస్తున్నాడు. జీవితంలో పవిత్ర లక్ష్యంవైపు పురోగమించగల వాడే పాపదూరుడు కాగలుగుతాడు.

మానవమాత్రునికి తన జీవిత లక్ష్యమేదో తెలి యదు. ఆ మందమతి కర్తవ్య కార్యాలను ఆచరించడు. అన్న విక్రయం తీవ్రంగా జరుగుతూన్నది. పాపాలు పెరిగిపోతున్నాయి. అందులకే భూమాత అన్నాన్ని స్వాధీనం చేసుకున్నది. అన్న విక్రయం పాపమే.

జ్ఞాన విక్రయం కూడా విశేషం కాసాగింది. జ్ఞానాన్ని విక్రయించండి. బ్రాహ్మణు డయిన వాడు నిష్కామభావంతో జగత్తుకు జ్ఞానదానం చెయ్యాలి. అన్నదానం కన్న జ్ఞానదానం శ్రేష్ఠమైనది. కారణం? జ్ఞానంవల్ల సదా సర్వదా శాంతి కలుగుతుంది.

అన్న జ్ఞానాల విక్రయం ప్రారంభమయిన నాటి నుండీ పవిత్రత నాశనమై పాపాలు వృద్ధి చెందసాగాయి.

మానవునిలో సద్భావాలు నాశనం కాసాగిన నాటి నుండీ భావి జీవితం వికృతం కాసాగింది.

లోకంలో ఎక్కడా శాంతి కానరావడంలేదు. ఇలా సర్వే సర్వత్రా పరిభ్రమిస్తూ నేను బృందావనం చేరాను. అక్కడ ఓ కౌతుకం చూసాను. ఓ యువతి దగ్గర మూర్ఛావస్థలో పడియున్న ఇద్దరు పురుషు లున్నారు. ఆ స్త్రీ నలువైపులా చూస్తున్నది. నన్ను చూసి పిలి చింది. నేను [నారదుడు] దగ్గరగా వెళ్లాను. సాధువులు ఏ స్త్రీ దగ్గరకూ వెళ్ళరు. కనుకనే నారదమహర్షి ఆమె పిలవకుండ వెళ్ళలేదు. "క్షణం తిష్ఠ" అంది ఆ యువతి.

పరోపకారం చెయ్యగలిగిన వాడే సాధువు కాగలుగుతాడు. కాలం యొక్క మూల్యాన్ని గ్రహించ లేని వాడు అంతిమ దశలో తీవ్రంగా పశ్చాత్తాపం చెందు తాడు. ఎవరూ క్షణకాలాన్ని కూడా వృథా చేయరాదు.

ఓ క్షణం ఆగమని కోరిన ఆ యువతితో నేను — "అమ్మా? నువ్వెవరవు" అని ప్రశ్నించగా — నా పేరు భక్తి. ఈ జ్ఞాన వైరాగ్య నామధేయులయిన వీరిద్దరూ నా కుమారులు. వీరిప్పుడు వృద్ధులయి పోయారు. నేను ద్రవిడ దేశంలో జన్మించాను. ఆచార్య ప్రవరులయిన

శంకర, రామానుజు లిద్దరూ దక్షిణ భారతదేశంలోనే ప్రభవించారు. దక్షిణ దేశం భక్తి దేశం.

కర్ణాటకంలో నేను పోషింపబడ్డాను నే నక్కడే వృద్ధి చెందాను. ఆచార వ్యవహారాలు వర్ధిల్లే ప్రదేశంలో భక్తికి పుష్టి కలుగుతుంది కర్ణాటక ప్రాంతంలోయిప్పుడు ఆచార శుద్ధి గోచరమౌతున్నది. వ్యాస భగవానునికి కర్ణాటక ప్రాంతమంటే పక్షపాతం ఏదీ లేదు. కాని యదార్ధ విషయాన్నే ఆయన వర్ణించాడు. కర్ణాటక ప్రాంతంలో నేడు కూడ కొందరు జలాలు కూడ తీసుకోకుండ ఏకాదశీ వ్రతాలు చేస్తుంటారు.

ఇంద్రియాలను అన్నింటినీ భగవదర్పితం చేస్తూన్నాను" అన్న భావంతో ఏకాదశీ వ్రతం చెయ్యండి

మహారాష్ట్ర కొన్ని ప్రాంతాలలో నాకు సన్మానాలు జరిగాయి: పండరీపురం వంటి ప్రదేశాలలో భక్తి గోచర మవుతుంది. గుజరాత్‌లో నేను జీర్ణమైపోయాను. "గుర్జరే జీర్ణ వాం గతా" గుజరాత్‌లో నేను నా కుమారు లిద్దరితో వృద్ధురాలనై పోయాను. ధనదాసుడు ఎన్నడూ ప్రభుదాసుడు కాలేడు. గుజరాత్ ప్రాంతమంతా కాంచన లోభంలో ఉన్నది. అందుకే భక్తి చిన్నాభిన్నమై పోయింది.

భక్తికి ప్రధానాంగాలు నవ సంఖ్యలో వున్నాయి. యిందులో మొదటిది శ్రవణము, కేవలం కథలనాలకించడంవలన భక్తి పూర్తికాదు. విన్న దానిని మననం చెయ్యండి. మననం చేసిన దానిని జీవితంలో ఎంత వరకు ఆచరలో పెట్టగలిగావో గ్రహించు. నాడే భాగవత శ్రవణం సార్థకమైనట్లు తెలుసుకో. కథలు వినడం వలన పాపాలు జ్వలించి దగ్ధమైపోతాయి. కాని మననం చెయ్యడం ద్వారా ఆచరించ గలిగిన నాడు ముక్తి లభిస్తుంది.

శ్రవణ భక్తి చిన్నాభిన్న మవుతున్నది. కీర్తనలో కూడ కాంచన లోభం ఏర్పడుతూన్నది. నాటి నుండీ కీర్తన భక్తి కూడ భ్రష్టమై పోయింది.

జ్ఞానులకు అవమానం కన్న సన్మానమే భారంగా తోస్తుంది. ధనలోభం కన్న కీర్తి మోహాన్ని విడనాడడం కష్టము. కీర్తి మోహము జ్ఞానులను కూడా వేధిస్తూంటుంది. మనస్సును స్వాధీనంలో ఉంచుకోగలిగి నచ్చచెబుతూండక పోతే అది స్వేచ్ఛగా సంచరిస్తుంది.

కథా కీర్తనంలో సమాజం అనాయాసంగానే విస్మృతి చెందుతూంటుంది. మానవుడు సర్వస్వాన్నీ విడనాడి జపమాలతో ఆసీనుడయిననాడే అతనికి విశ్వం స్ఫురణలోకి వస్తుంది. కథాశ్రవణంలో కూర్చుంటూనే ప్రాపంచిక వ్యవహారాలను మనస్సులో నుండి దూరం చెయ్యి. నేను నా కృష్ణదేవుని శ్రీ చరణ సన్నిధిలో ఆసీనుడనయ్యాను అని భావించు, కీర్తన భక్తి నిష్కామంగా జరగాలి. తులసీదాస మహాత్ముడుకూడ "స్వాంతః సుఖాయ" అన్నాడు. నేను స్వసుఖంకోసం వ్రాసుకుంటున్నాను. అని అర్థం. ఇతరులకు ఏం సుఖం లభించినదన్న విషయం కొనసాగుతుంది.

అభిమానం కారణంగా వందన భక్తి కూడ అంతరించి పోయింది. అందరియందు కృష్ణ భావం కలిగి అందరికీ నమస్కరించు. వందన మాత్రం చేత విరోధ భావాలు నాశనమై పోతాయి.

భక్తుడయిన నరసింహా మెహతా భక్తుని లక్షణాలను వర్ణిస్తూ – "సకల లోకమే సబ్‌కో వందే" అన్నాడు.

నమస్కరించువాడే వైష్ణవుడు. వందనాలు అందుకో గోరిన వాడు వైష్ణవుడు కాదు. మనస్సులో అహంభావ మున్నంత వరకూ భక్తి వృద్ధి చెందదు.

నేటి ప్రజలు విశేషంగా శారీరికపూజ చేస్తున్నారు. భగవత్పూజకు వారికి అవకాశమే లభించడం లేదు, అనేక రకాలయిన సబ్బులు తయారయినాయి. ఎన్ని సబ్బులు రుద్దినా సహజంగా వున్న శరీరవర్ణం మారదు కదా? భగవంతుడు ప్రసాదించిన రంగే యదార్ధమయి నది కూడ. మానవుడు విలాసాలకు విశేషంగా బానిస అయి పోయాడు. ఈ కారణం వల్ల అర్చన భక్తి కూడ లోపించ సాగింది. కనుక జీవితాన్ని నిరాడంబరంగా వుంచుకోండి.

ఈ విధంగా భక్తికి చెందిన ఓ అంగం నాశన మయిపోయింది. జీవుడు పరమాత్మ నుండి విభక్తమయిన వాడే భగవద్విముఖుడైనట్లు గ్రహించాలి. బుద్ధి వివిధ విషయాసక్తమయిన నాడు భక్తి నాశనమై పోతుంది. భక్తి ఛిన్నాభిన్నం కావడంలో జీవనం కూడ విభక్తమై పోతుంది.

భక్తి దేవికి యిద్దరు కుమారులు. భక్తిని జ్ఞాన వైరాగ్యాలతో ఆదరించండి జ్ఞాన వైరాగ్యాలు మూర్ఛి ల్లిన వేళ భక్తి వికసిస్తుంది. కలియుగంలో జ్ఞాన వైరాగ్యాలు క్షీణించిపోతాయేకాని వర్ధిల్లవు.

పుస్తకాలలో యివి విపరీతమయిన నాటినుండీ జ్ఞానం లుప్తం కాసాగింది. నారద మహర్షి పలుకు తున్నాడు." జ్ఞాన వైరాగ్యాల మూర్ఛకు కారణం నాకు తెలుసు. ఈ కలికాలంలో అధర్మం పెచ్చు పెరిగి పోయింది. అందుకే వీరు మూర్ఛపోయారు. ఈ బృందా వన ప్రేమభూమిలో నీకు పుష్టి లభించినది. కలి యుగంలో జ్ఞాన వైరాగ్యాలు ఉపేక్షింప బడతాయి. నిరు త్సాహంతో వారు వృద్ధులై జీర్ణమైపోతున్నారు.

జ్ఞాన వైరాగ్యాలతో నేను భక్తిని జాగృతం చేస్తాను. జ్ఞాన వైరాగ్యాలతో నేను భక్తిని ప్రచారం చేస్తాను. జ్ఞాన వైరాగ్యాలను జాగృతం చెయ్యాలని నారద మహర్షి అనేక ప్రయత్నాలు చేసారు. ఫలితం శూన్యమయింది. అనేక పర్యాయాలు వేద పారాయణలు జరిగాయి. కాని జ్ఞాన వైరాగ్యాల మూర్ఛ పోలేదు.

కొంచెం జాగ్రత్తగా పరిశీలించి చూడగలిగితే ప్రతీ గృహంలోను యిట్టి సంఘటనలు ఏర్పడుతూం టాయి. మన హృదయాలే బృందావనాలు. ఈహృదయ బృందావనంలో ఎన్నడయినా వైరాగ్యం ఉదయించ వచ్చును కానీ ఆ జాగృతి స్థిరంగా ఉండదు.

ఉపనిషత్తుల వేదాదుల పఠన శ్రవణాదులచే మన హృదయాలలో అప్పుడప్పుడు యీక్షణ్మాత్ర జ్ఞాన వైరాగ్యాలు ఉదయించి మరల మూర్ఛ పోతూంటాయి.

వేదపారాయణవల్ల వైరాగ్యం కలుగుతుంది. కాని అది స్థిరంగా వుండదు. శ్మశానభూమిలో చితి జ్వలి స్తున్న వేళ దానిని చూచిన వారందరికీ వైరాగ్యం కలిగి తీరుతుంది. కాని అది స్థిరంగా వుండదు?

కామ సుఖానంతరం చాలామందికి వైరాగ్యం కలుగుతుంది. కాని అది కూడా స్థిరంగా వుండదు. సాంసారిక సుఖాల అనుభవానంతరం అనేక మందికి వైరాగ్యం కలుగుతూంటుంది. కాని అది కూడా స్థిరంగా వుండదు. విషయ భోగానంతరం అరుచి కలుగుతుంది. కాని అది వివేక వైరాగ్య రహితం కావడం వల్ల నిల బడదు.

జ్ఞాన వైరాగ్య భక్త్యాదులన్నీ వేదాల నుండియే ప్రాదుర్భవించాయి. కానీ వేదభాష నిగూఢమైనది కావడం వలన సామాన్యులకు అర్థం కాదు. కలియుగంలో శ్రీకృష్ణ కథ — శ్రీకృష్ణ కీర్తనవల్లనే జ్ఞాన వైరాగ్యాలు ఉత్పన్నమవుతాయి.

నారదుడు విచారంలో మునిగిపోయాడు. మూర్ఛ నుండి జ్ఞాన వైరాగ్యాలు లేవడం లేదు. తత్సమయంలో నారదా: నీ ప్రయత్నం ఉత్తమ మయినది. అని ఆకాశవాణి వినిపించింది. జ్ఞాన వైరాగ్యాలలో, భక్తి ప్రచారం కావాలంటే సత్కర్మలు చెయ్యండి. "ఎట్టి సత్కర్మలు చెయ్యాలి" అని దేవర్షి ప్రశ్నించగా, "సత్కర్మ ఏదో సంతమహాత్ములు చెబుతారు" అని బదులు పలికింది.

నారదమహర్షి అనేకమంది సాధు మహాత్ములను సంబోధించి. జ్ఞాన వైరాగ్య సమేతంగా భక్తికి పుష్టి కలిగే మార్గాన్ని చెప్పండి" అని అర్థించగా నిశ్చిత మయిన ఉపాయాన్ని ఎవరూ చెప్పలేక పోయారు. దానితో దేవర్షి విచారంలో పడిపోయాడు. నిశ్చలమైన మార్గాన్ని చూపగల సాధు మహాత్ములు నాకు ఎక్కడ లభిస్తారు?" వారెట్టి సాధనలు చెబుతారు?" అని యోచించుకొని, నారద దేవర్షి పరిభ్రమిస్తూ — బదరికాశ్రమం చేరాడు. అక్కడి తపోధనులయిన మునులను అతడు కలిసాడు. అక్కడా మహర్షులకు జరిగిన విషయమంతా వివరించాడు:

నేను జన్మించిన దేశానికే నేను ఉపకారం చెయ్యకపోతే నా జన్మ వృథా కదా! కనుక మీరు నేను చేయవలసిన సత్కర్మను గురించి చెప్పండి.

సనకాదులు పలుకుతున్నారు — దేశం గురించి నువ్వు దుఃఖిస్తున్నావు. నీ భావం దివ్యమైనది. భక్తిని ప్రచారం చెయ్యాలన్నది నీ ఉద్దేశం భాగవత పారాయణ చెయ్యండి. మీ కోరిక నెరవేరుతుంది. తద్వారా జగత్కళ్యాణం జరుగుతుంది. ఈ గాథ వలన జ్ఞాన వైరాగ్యాలు మేలుకుంటాయి. భాగవత గాథ జ్ఞాన వైరాగ్య భక్తులను వర్ధిల్ల జేస్తుంది,

వేదపారాయణ శ్రేష్ఠమైనది. తద్వారా మీ అభీష్టాలన్నీ నెరవేరుతాయి. కాని వేదార్థం శీఘ్రంగా సులభంగా బోధపడదు. కనుక సర్వ వేదసారమయిన యీ భాగవత జ్ఞాన యజ్ఞం చెయ్యండి.

భాగవత కథామృతాన్ని పానం చెయ్యడానికి వారందరూ అక్కడి నుండి గంగా తీరానికి వచ్చారు. శుద్ధ హృదయంలో, లేక ప్రదేశంలో సాత్విక భావాలు జాగృత మవుతాయి. భూ ప్రభావం సూక్ష్మరీత్యా మనస్సు మీద అవశ్యం పడుతుంది. భోగభూమి భక్తిలో ఆటంకాన్ని కలుగజేస్తుంది. కనుకనే గంగా తీరానికి రమ్మని ఆజ్ఞ అయినది.

సనత్కుమార సమేతంగా దేవర్షి నారదుడు గంగాతీరం చేరాడు. చేతులు జోడించి నారదుడు కూర్చున్నాడు. అక్కడికి ఋషులూ, మునులూ కూడ భాగవత కథా శ్రవణార్థం వచ్చారు. రాలేని వారి గృహాలకు భృగు మహా ఋషి వెళ్ళి వారిని భాగవత కథా శ్రవణార్థం రావలసినదిగా ఆహ్వానించి తీసుకొస్తున్నాడు. సత్కర్మ యందు అన్యులను ప్రేరేపించు వారికి కూడా పుణ్యం లభిస్తుంది.

కథారంభంలో భగవంతునికి జయకారం పలుకుతాడు. "హరయే నమః" అని శుద్ధోచ్చారణచేస్తారు. "హరయే నమః" అన్నది మహా మంత్రము.

ప్రపంచాన్నింటినీ విడనాడి మానవుడు ధ్యానంలో కూర్చుండిపోతాడు. అక్కడ కూడా మాయ విఘ్నాలను కల్పిస్తుంది. అనాది నుండీ, మానవునికీ మాయకూ మధ్య యుద్ధం జరుగుతూన్నది. జీవుడు పరమాత్మ సన్నిధికి పోతాడు. ఇది మాయకు యిష్టం కాని పని. సమస్త మోహాలనూ విడనాడి మానవుడు దైవసన్నిధికి చేరడానికి మాయ సుతరామూ యిష్టపడదు, దీనికి రూపమన్నదేదీ లేదు. పరమేశ్వరుడు సర్వ వ్యాపకుడయి నట్లే. మాయ కూడ సర్వత్రా వ్యాపించి ఉన్నది.

జీవేశ్వరుల కలయికలో మాయ అడ్డు పడుతుంది.

మాయ మనస్సును చంచలం చేస్తుంది. దారాపుత్ర ధనాదులలోనే సుఖము ఉన్నదని మాయ పురుషునికి నచ్చ చెబుతూంటుంది. మానవుణ్ణి మాయ పరాజితుని చేసి వేస్తుంది. మానవుడే ఓడి పోతుంటాడు! మాయ జయిస్తూంటుంది. దీనికి కారణం? మానవుడు పరమాత్మకు జయం పలుకడు. కథ భజనాది ప్రసంగాలలో ప్రేమగా భగవంతునికి జయకారం పలకాలి. దానివలన మాయ ఓడిపోతుంది. మానవునికి జయం లభించి తీరుతుంది.

భగవంతునికి జయకారం పలికితే నీకు కూడా జయం కలుగుతుంది.

ఆకలినీ, దాహాన్నీ మరచిపోవు. కనుక పాపాలు జరుగుతూనే ఉంటాయి. వీటిని సహించే అలవాటు చేసుకోవాలి. ముందు గాథలో క్షుత్పిపాసలవలననే పరీక్షిత్తు శాపగ్రస్తుడయినట్లు వస్తుంది.

సూతుడు శ్రోతలను జాగరూకులను చేస్తున్నాడు. "రాజా! నేడు దేవర్షి నారదుడే శ్రోతయై కూర్చున్నాడు. సనకాదులు ఆసనాలపై విరాజిల్లుతున్నారు. కనుక జయ జయకారాలు శుద్ధంగా జరుగసాగాయి.

ఈ భాగవత గాథ అతి దివ్యమయినది. ఈ గాథ నాలకించువారి శ్రవణేంద్రియాల గుండ పరమాత్మ హృదయంలో ప్రవేశిస్తాడు.

నేత్రశ్రోత్రాదులను పవిత్రంగా ఉంచుకో గల వారి హృదయారవిందాలలో పరమాత్మ ప్రవేశిస్తాడు. శ్రీకృష్ణదేవుడు చెవులలో నుండి నేత్రాల ద్వారా హృదయంలోకి వస్తాడు. మాటిమాటికి శ్రీకృష్ణ గాథను ఆలకించువారి కర్ణేంద్రియాల గుండా ఆ దేవదేవుడు హృదయంలోకి విచ్చేస్తాడు.

పాపాలు కూడా చెవులద్వారానే మనస్సులోకి ప్రవేశిస్తాయి. కథాశ్రవణంలో చెవులకు శిక్షణ ఈయ గలిగావా? భగవచ్చరిత్రలను ఆలకించగలిగావా? మనస్సు భగవంతునిలో స్థిరంగా నిలుస్తుంది. భగవంతుడు కర్ణం ద్వారా హృదయంలోకి ప్రవేశిస్తాడు. భగవంతుని హృదయ ప్రవేశానికి నేత్ర కర్ణాలు రెండూ ద్వారాలే! సాధనలే. చాలమంది కనుల ద్వారానే ప్రభుమూర్తిని హృదయంలోకి ఆకర్షించుకుంటారు, కనుక కర్ణ నయనాలను రెండింటిని పవిత్రంగా వుంచుకోండి. తద్వారా పరమాత్మను హృదయ మందిరంలోకి ఆకర్షించి జేసుకుని స్థిరంగా ఉంచుకోండి.

ప్రతి సత్కర్మారంభంలోనూ శాంతిపాఠం చేయబడుతుంది. "ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః" ఓ దేవా! మేము చెవులారా కళ్యాణప్రద వచనాల నాలకించెదముగాక! మా కనులూ మా చెవులూ పవిత్రంగా ఉండునుగాక? కాలం నాశనం కాలేదు. నాశనమైనదీ, పాడయిపోయినదీ మనస్సు మాత్రమే. శ్రోత నేత్రా

దులు పవిత్రంగా ఉంచుకున్న మీదటనె కథారంభం జరుగుతుంది.

సనకాదులు పలుకుతున్నారు — ఈ భాగవత శాస్త్రంలో పద్దెనిమిది వేల శ్లోకాలున్నాయి. అష్టాదశ సంఖ్య పరిపూర్ణమయినది. శ్రీరామ కృష్ణులు పరిపూర్ణులు. కనుకనె నవమినాడు ప్రకటించబడ్డారు. శ్రీకృష్ణుడు నవమినాడే గోకులంలోకి వచ్చాడు. అప్పుడే నందుడు మహోత్సవం చేయవచ్చాడు. శ్రీరామచంద్రునిలో ద్వాదశ కళలున్నాయని శ్రీకృష్ణునిలో షోడశ కళలున్నాయనీ భేదభావ ముంచరాదు.

భాగవతంలో నందమహోత్సవం ముఖ్యమైనది. ఈ గాధలో కూడా 18 శ్లోకాలున్నాయి. భాగవతంపై ప్రాచీన సర్వోత్తమ టీక శ్రీధరస్వామిది. ఆ మహాత్ముడు ఏ సాంప్రదాయిక టీకలనూ ఆధారం చేసుకోక స్వతంత్ర రీతిలో భాగవత తత్వ విచారణ చేశాడు. ఈ శ్రీధరీ టీకను ఆధారంగా చేసుకుని వంశీధార మహాత్ముడు టీక వ్రాశాడు. మన మహర్షులు కేవలం నిస్వార్థ భావంతోనే సద్గ్రంధ రచన చేసారన్నా రాయన.

భాగవత మహిమ నెవరు వర్ణించగలరు? భాగవతం సాక్షాత్తు శ్రీమన్నారాయణ స్వరూపమే. భగవంతుడు గోలోకానికి పయనం చేస్తున్న సమయంలోనే తన తేజఃస్వరూపాన్ని యీ గ్రంధంలో నిక్షిప్తం చేశాడని ఏకాదశ స్కంధంలో వ్రాయబడి వుంది.

అంటే భాగవతం భగవంతుని శబ్దమయమూర్తి. శ్రీకృష్ణుని వాఙ్మయమూర్తి.

"ప్రభూ! మీరు స్వర్గధామం చేరినమీదట అధర్మం పెచ్చుపెరిగిపోతే ధర్మం ఎవరిని శరణువేడాలి?" అని ఉద్ధవుడు ప్రశ్నించగా — "నా భాగవతాన్ని ఆశ్రయించినవారి గృహంలోకి కలి ప్రవేశించడు" అని కృష్ణ పరమాత్మ సమాధానం యిచ్చాడు.

భాగవతం భగవంతుని నామస్వరూపము. నామస్వరూపం వల్లనే అన్య రూపాలు సిద్ధిస్తాయి. మనోమాలిన్యాన్ని దూరం చెయ్యడం కోసమే యీ భాగవత శాస్త్రము. మనస్సు శుద్ధ మొనర్చుకొనడానికి యీ భాగవతం మహాసాధనము. ఈ గాధాశ్రవణ మననాంతరం కూడ పాపాలు చేస్తే యమదూతల బారిపడక తప్పదు.

భగవంతునిలో ప్రేమ సంబంధం కలిగి వ్యవహరించడం కోసం యీ భాగవతం మహత్తరమైన సాధనము. మానవుడు దారపుత్ర ధనహారాలయందే విశేష ప్రేమ కలిగి మెలుగుతున్నాడు. అందుకే దుఃఖపడుతున్నాడు.

శ్రీ రామానుజాచార్యుల వారి జీవితంలో ఓ ఘట్టం జరిగింది. "రంగదాసు" అని ఓ శేఠ్ వున్నాడు. అతడు ఓ వేశ్యయందు అత్యంతాసక్తి కలిగి సంచరిస్తున్నాడు. ఓనాడు ఆ వేశ్య. రంగదాసు లిద్దరూ రంగనాథాలయం మీదుగా వెడుతున్నారు. శ్రీమంతుడయిన శేఠ్ ఆ వేశ్యకు గొడుగుపట్టి నడుస్తున్నాడు. సరిగ్గా అదే సమయంలో రామానుజాచార్యులవారు ఆలయం నుండి బయటకు వస్తూ! ఆ దృశ్యం చూసారు. వీరు కూడా పరమేశ్వరునివారే. భగవంతుని చేరవలసిన వారే కదా! వీరుద్ధరించబడాలి. అనుకుంటూ వారు దారిలోనే ఆ రంగదాసుని కలుసుకొనినువ్వీ వేశ్యను ప్రేమించడంతో చూపిన విధానాన్ని చూస్తుంటే నాకు మహానందం కలుగుతున్నది. మలమూత్రాస్థులతో కూడిన యీ స్త్రీయందు నువ్వు ప్రేమగా వ్యవహరిస్తున్నావు. ఈ ప్రేమను భగవంతుని యందు లగ్నం చెయ్యి. ప్రేమించదగినవాడు

పరమాత్మ ఓ
నేను ... చెప్పి కొంటనంతో అతడు సమాధిలో మునిగి

అక్కడే అతనికి శ్రీ రంగనాథుని దర్శన మయింది. నాటి నుండీ అతడా స్త్రీని ప్రేమించ లేదు.

మానవుడు తన ప్రేమ పాత్రులను అనుక్షణం మారుస్తుంటాడు. కాని, ఎక్కడా వీనికి సంతోషం స్థిరంగా వుండడం లేదు. శాంతి లభించడం లేదు. బాల్యంలో తల్లిని ప్రేమిస్తున్నాడు. కొంచెం పెద్దవాడు కావడంతో స్నేహితుల్ని ప్రేమిస్తున్నాడు. వివాహం కావడంతో భార్యను ప్రేమిస్తున్నాడు. కొంతకాలం గడిచిన తరువాత ప్రియపత్నిని తిరస్కరించి – నిన్ను వివాహమాడి నేను మహాపరాధం చేశాను.”అంటున్నాడు. ఆ తరువాత సంతానాన్ని ప్రేమిస్తున్నాడు. అనంతరం ధనాన్ని ప్రేమిస్తున్నాడు. దేనియందూ స్థిరత్వం లేదు. కనుక భగవంతుణ్ణి ప్రేమ పాత్రునిగా చేసుకో! దాని వలన ప్రేమపాత్రులను మార్చుకోవలసి వుండదు.

భాగవత శాస్త్రాన్ని పదేపదే వినగలిగితే భగవంతుని తోటి ప్రేమ వర్ధిల్లుతూ వుంటుంది. ప్రస్తుతంఅనేక మంది విశేష భక్తితోనే ఉంటూన్నారు. కాని భగవంతుని సాంసారిక సుఖ సాధనంగా, సాంసారిక సుఖాలను సాధ్యంగా భావించి చరిస్తూన్నారు. కనుక భక్తి సార్థకం కావడం లేదు. ప్రజలు దుఃఖిస్తూన్నారు. భగవంతునే సాధ్యునిగా గ్రహించు. సంసార సుఖాలను మాత్రంకాదు.

కథలో హాస్యరసం గౌణమయింది. కథ ప్రజలను నవ్వించడం కోసం కాదు. కథ భగవంతుని ప్రసన్నుని చేసికోవడం కోసమే.

శ్రోతల హృదయాలలో శోకాన్ని జాగృతం చేయగలవాడే శుకుడు. కథ శుద్ధాంతరంగంతో ఏడవడానికే అవతరించింది.

నేటివరకూ నా జీవితం నిరర్థకంగానే గడిచిపోయినదన్న భావాలు హృదయంలో జాగృతమయిననాడు_ఇట్టి గాథల నాలకించిన ఫలం లభిస్తుంది. కథా శ్రవణానంతరం – పాపాలు నాశనం కాకపోతే – వైరాగ్యం కలగక పోతే కథాశ్రవణ ప్రయోజనం ఏమున్నట్లు ?

భాగవత దర్శన, పఠన, శ్రవణ పూజాదుల మాత్రంచే పాపాలు నాశన మవుతాయి. భాగవత శ్రవణ మాత్రం చేతనే సద్గతి కలుగుతుంది. కథాశ్రవణ లాభం ఆత్మదేవ చరిత్రద్వారా తెలియ జేయబడింది. దృష్టాంత రహితమయిన సిద్ధాంతం మనస్సుకు హత్తుకోదు. అందులకే ఆత్మదేవ బ్రాహ్మణుని చరిత్ర చెప్పడం జరిగింది. కథ కేవలం రూపకం మాత్రమే కాదు. కథాలీలలూ అందు సువ్యక్తం చేయబడిన అథా సిద్ధాంతమూ కూడ యదార్థమైనదే.

తుంగభద్రా నదీతీరంలో ఓ గ్రామం ఉన్నది. అక్కడ ఆత్మదేవుడని ఓ బ్రాహ్మణుడు ధుంధులి అనే పేరుగల తన భార్యతో వసిస్తూన్నాడు. ఆత్మదేవుడు, పవిత్రుడు, కాని అతని భార్య సహజక్రూరురాలు. జగడాలమారి, పరులను నిందిస్తూ, అభాండాలు వేస్తూంటుంది. ఆ దంపతులకు సంతానం లేదు. సంతానం లేని కారణంగా ఆత్మదేవుడు చింతాగ్రస్తుడై పోతూన్నాడు. సంతానార్థం అతడు చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థం కావడంతో ఆత్మహత్య చేసుకోవాలని అతడు పయన మయ్యాడు అడవివైపు పోతూండగా మార్గమధ్యంలో అతనికి కలిశాడు. ఆ మహనీయుణ్ణి దర్శిస్తూనే

అతడు ఏడ్వసాగాడు. ఆ మహాత్ముడతణ్ణి దుఃఖ కారణం అడిగాడు,

"స్వామీ! నా దగ్గర అన్నవస్త్రాలకు లోటు లేదు. కాని నా అనంతరం వాటిని అనుభవించడానికి ఎవరూ లేరు. అందుకే భరించలేని బాధలో ఆత్మహత్య చేసుకుందామని బయలు దేరాను." అన్నాడు. అందుకా మహాత్ముడు- నీకు సంతానం లేకపోవడం భగవత్కృపగా భావించు. సంతానం లేకుండ భగవంతుడు చేయడమంటే పరమాత్మ స్వహస్తాలా నీకు సత్కార్యాలు చేసుకునే సదవకాశాన్ని ప్రసాదించినాడన్న మాట. ఇది నీ అదృష్టంగా భావించు. అందుకే పరమాత్మ నీకు సంతానాన్ని ప్రసాదించ లేదు. పుత్రుడు దుఃఖకారకుడే.

భగవంతుడు నిన్ను ఉంచిన స్థితిలోనే ఉంటూ ఆ దేవ దేవుణ్ణి స్మరించుకుంటూ ఉండు.

కనుక పరమాత్మ ప్రసాదించిన స్థితిలోనే ఆనందాన్ని అనుభవించాలి.

ఓ నాడు ఏకనాథ స్వామి విఠలనాధుని దేవాలయంలోకి దర్శనార్థం వెళ్లాడు. ఏకనాధునికి యోగ్యురాలయిన భార్య లభించింది. అది భగవదుపకారంగా అతడు భావిస్తున్నాడు. ఆయన తనకు దారా సంగం కాదు లభించినది — సత్సంగం లభించినది — అని అంటూండే వాడు. కొన్ని క్షణాలకు అదే ఆలయానికి తుకారామ్ భక్తుడు కూడా అక్కడకు వచ్చాడు. తుకారాముని భార్య కర్కశ హృదయురాలు. అలాంటి భార్యను ప్రసాదించి నందులకు కూడ తుకారామ్ భగవంతునికి కృతజ్ఞతలు అందజేసాడు. దేవా! నువ్వు అంత మయిన మంచి భార్యను నాకు ప్రసాదించి ఉంటే రోజల్లా నేను ఆమె వెనుకనే నిన్ను మరచి ఉండే వాడను. కనుక కర్కశ చిత్తం గల భార్య దొరకడం మంచికే అయినది" అన్నాడు.

అనుకూలు రాలయిన భార్య లభించిన ఏకనాధునికి ప్రతికూలురాలయిన పత్ని లభించిన తుకారామునకూ లభించిన ఆనందం ఒక్కటే. ఇరువురికీ తమ పరిస్థితులకు సంతోషమున్నది. ఇద్దరూ వాటిని భగవదుపకారంగానే భావించారు.

తన భార్య మరణించడంతో నరసింహ మెహతా ఆనందాన్నే పొందుతూ :

భలం ధయుం భాంగీ జంజాల్।
సుఖే భజీసుం శ్రీ గోపాల్।

మేలే జరిగింది. కుటుంబ ఝంఝాటం దూరమయింది. నేను యితోధిక సుఖంగా, నిశ్చలంగా శ్రీ గోపాలుని భజించ గలుగుతాను అంటాడు."

ఓ మహాత్ముని భార్య అనుకూలవతి. మరొకని సతి ప్రతికూలురాలు. మూడవవాని పత్ని ప్రపంచాన్ని విడనాడి పోయినది. అయినా ఆ మహాత్ములు ముగ్గురూ తమ తమ స్థితులకు సంతసించారు.

ఏ పరిస్థితిలో నయినా సత్యమయిన వైష్ణవుడు పరమాత్మ కృపానుభవాన్నే పొందుతాడు. మనస్సును ప్రశాంతంగా సంతుష్టంగా వుంచుకుంటాడు. మనస్సును శాంతంగా వుంచుకోవడం కూడ మహాపుణ్యమే.

మాతాపితరులకు తమ కుమారుని గురించిన చింత విశేషంగా ఉంటుంది. కాని, పుత్రేషణతో బాటు అసంఖ్యాక వాసనలు కూడ అపరిచితు వుంటాయి. పుత్రేషణతో - విత్తేషణ, దానితో లోకైషణ, జాగృత మవుతాయి.

"నాకు పుత్రుణ్ణి ప్రసాదించండి" అని ఆత్మ దేవుడు ఆ మహాత్ముణ్ణి అర్థించాడు. కారణం? పుత్రుడే తండ్రికి సద్గతిని ప్రసాదిస్తాడు. "అపుత్రస్య గతిర్నాస్తి" ఆ మహాత్ముడు ఆత్మదేవునకు నచ్చచెబుతూ— "ఓ స్థానంలో వేదమాత- పుత్రుని వల్ల ముక్తి లభించదని చెప్పింది." అన్నాడు.

వంశ రక్షణార్థం సత్కర్మ చెయ్యి. కేవలం పుత్రుల వల్లనే సద్గతులు కలిగేటట్లయితే యీ విశ్వంలో అందరికీ పుత్రులు కలుగుతున్నారు. కనుక వారందరికీ సద్గతులు కలగాలి. నా కుమారుడు నాకు శ్రాద్ధం చేస్తాడని ఎన్నడూ ఆశించరాదు. నా పుత్రుడు నాకు పెట్టే శ్రాద్ధం వల్ల ఆ జీవుడు ఉత్తమ యోనిలో అవతరిస్తాడు. కాని జనన మరణ చక్రం నుండి విముక్తి మాత్రం పొందలేడని స్పష్టంగా తెలుసుకోండి.

శ్రాద్ధ పిండ దానాలు ముక్తిని ప్రసాదించవు. శ్రాద్ధ కర్మలు చెయ్యవద్దని సుతరామూ చెప్పడం లేదు. శ్రాద్ధ కర్మల ద్వారా పితృదేవతలు ప్రసన్నులవుతారు. శ్రాద్ధ కర్మ ధర్మమే. శ్రాద్ధకర్మ ద్వారా నరకం నుండి ముక్తి లభిస్తుంది. శ్రాద్ధ కర్మల ద్వారా ప్రసన్నులయి పితృదేవతలు ఆశీర్వదిస్తారు,

పిండ దానానికి యథార్థమయిన అర్థాన్ని ఎవరూ గ్రహించలేక పోతున్నారు. ఈ శరీరాన్ని పిండమంటారు. దీనిని పరమాత్మకు సమర్పించడమే పిండదానము. నేను నా జీవితాన్ని భగవంతునకు సమర్పించుకోవాలని నిశ్చయించుకోవాలి. నిశ్చయానుసారం జీవితాన్ని భగవదర్పణం చేయగలవానికి జీవితం సార్థక మవుతుంది, అట్టివాని పిండదానమే యదార్థమైనది. దానికి వ్యతిరిక్తంగా కేవలం పిండితో చేసిన పిండాలను దానం చెయ్యడం వలన ముక్తి లభించేటట్లయితే ఋషులూ, మునులూ-ధ్యానం యోగం తపస్సు అదిగా గల సాధనలను ఎందుకు చెబుతారు?

జనన మరణ చక్రాన్నుండి విముక్తుని చేయగలిగినది సత్కర్మ ఒక్కటే. ఆ సత్కర్మ కూడ స్వహస్తాలా చేసినది కావాలి. స్వయంగా ఆత్మోద్ధరణ చేసుకోవాలి. జీవుడు స్వయంగానే తనను ఉద్ధరించుకోగలుగుతాడు.

భగవద్గీతలో స్పష్టంగా :—

ఉద్ధరేదాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్.

[ గీత అ 6 శ్లో 5 ]

స్వయంగా నువ్వు ఆత్మను సంసార సాగరం నుండి ఉద్ధరించుకో? ఆత్మను అధోగతి వైపుకు పోనీయకు. జీవుడు తనను తానుద్ధరించుకొనకపోతే పరులెవరు వచ్చి ఉద్ధరిస్తారు? మానవునికి తాను వినా పరులెవరు వచ్చి హితం చెయ్యగలరు? స్వయంగా ఎవరికి వారు శ్రేయస్సును చేసుకోకపోతే పుత్రాదులేమి చేస్తారు?

భగవంతునికోసం బ్రతికేవారికి అవశ్యం ముక్తి లభిస్తుంది. వేదమాత ఘోషిస్తున్నది. భగవంతుని అపరోక్షానుభూతి కలుగదు. జ్ఞానం కలగనంతవరకూ ముక్తి లభించదు.

మరణానికి పూర్వంలో భగవదనుభూతిని పొందగలవానికే ముక్తి లభిస్తుంది. పరమాత్మ యొక్క అపరోక్ష సాక్షాత్కార రహితంగా ముక్తి లభించదు.

"శ్రుతిః॥ తమేవ విదిత్వాతి మృత్యుమేతి

నాన్యః పంథావిద్యతేఽయనాయ"

దానిని తెలుసుకున్న మీద మానవుడు మృత్యువును ఉల్లంఘించ గలుగుతాడు. పరమపద ప్రాప్తికి దీనిని మించిన అన్యోపాయం లేదు. భగవంతుని తెలిసికోకుండ అన్యసాధన లేదు. అన్యథా శ్రాద్ధ మాత్రంచే ఏమీ కీ లభించదు.

స్వపిండాన్ని దానం చెయ్యగలిగితే అంటే స్వశరీరాన్ని పరమాత్మార్పణం చేయగలిగితే నీకు శుభం కలుగుతుంది.

నీ పిండదానాన్ని స్వయంగా నువ్వే చేసుకో. అదియే ఉత్తమమయినది. పిండంలో ఉన్నవాడే బ్రహ్మాండంలోనూ ఉన్నాడు. శరీర రూపమయిన పిండాన్ని భగవదర్పణం చేయ నిశ్చయించుకో. నువ్వు నీ పిండాన్ని స్వయంగా ఎందుకు దానం చేసికోవు? గృహంలో ఉన్న సర్వస్వాన్నీ పనిలో లగ్నం చెయ్యి. "నారాయణా! నారాయణా!" అంటూండు.

ఆత్మదేవునికి ఆ మహాత్ముని వచనాలు నచ్చలేదు. "పుత్రసుఖాన్ని సన్యాసు లయిన మీరనుభవించలేదు. కనుక యీలాంటి మాటలే చెబుతారన్నాడు."

మాతా పితరుల ఒడిని పిల్లలు ఎంతగా మురికి చేసినా వారు ఆనందంగానే ఉంటారు. ఆ సుఖంలో సుఖాన్ని అనుభవించడమే ప్రాపంచికుల నియమము.

మహాత్ముడు దివ్యోపదేశం చేసినా ఆత్మదేవుడు మొండిపట్టు పట్టాడు "నాకు మీరు పుత్రుణ్ణి ప్రసాదించకపోతే - నేను ఆత్మహత్య చేసుకుంటాను" అనగా ఆ మహాత్ముడు దయదలచి ఓ ఫలాన్నిచ్చి యీ పండు నువ్వు నీ భార్యచేత తినిపించు. నీకు యోగ్య పుత్రుడు కలుగుతాడు" అన్నాడు.

పండు తీసుకొని ఆత్మ దేవుడు యింటికి మరలి వచ్చాడు. భార్యకు పండు నిచ్చాడు. దానిని తినడానికి బదులు ధుంధులి అనేక విధాలుగా తర్క వితర్కాలు కొనసాగించింది. "పండు తినడం వల్ల నేను గర్భవతి నవుతాను. తత్ఫలితంగా దుఃఖం కలుగుతుంది. బాలుని లాలన పోషణలలో ఎన్నో దుఃఖా లనుభవించాలి" అని ఏవేవో ఆలోచించుకొని తన చెల్లెలితో ఆ యీ విషయాలన్నీ చెప్పగా ఆమె నాకు త్వరలో పుత్రుడు కలుగుతాడు కదా! వాణ్ణి నీకు యిస్తాను. నువ్వు గర్భవతివైనట్లు నటించు" అంది.

ధుంధులికి పుత్రేచ్ఛ వున్నది. కానీ ప్రసవ వేదనా రహితంగా కావాలి. ఈ మానవుడికి సుఖేచ్ఛ వుంటుంది. అది ప్రయత్న, కష్ట రహితంగా లభించాలి.

మానవుడు పుణ్య కార్యాలు చెయ్యగోరడు. కాని ఫలాన్ని మాత్రం వాంఛిస్తాడు. పాపాలు చేస్తాడు. కానీ పాప ఫలాన్ని అభిలషించడు.

చెల్లెలి మాట ప్రకారం ధుంధులి ఆ యింట్లో వున్న ఆవుచే పండును తినిపించింది. తరువాత తాను గర్భవతి అయినట్లు నాటక మాడసాగింది. కొన్నాళ్ళు గడచిన తరువాత సోదరి పుత్రుని తీసుకొనివచ్చి తనకు పుట్టిన బిడ్డగా ప్రకటించింది. వానికి ధుంధుకారి అని పేరు పెట్టింది. మరోవైపు తాను పండును తినిపించిన గోవు ఓ మానవ బాలుని ప్రసవించింది. అతని కర్ణాలు ఆవు చెవుల వలె వుండడం వల్ల వానికి "గోకర్ణు" డని నామకరణం చేసారు. ఆ బాలురిద్దరూ పెద్దవారయ్యారు. గోకర్ణుడు పండితుడై జ్ఞాని కాగా ధుంధుకారి మహా దుష్టుడయ్యాడు.

భాగవతగాథ మూడు విధాలుగా ఉన్నది. 1.ఆధ్యాత్మికము, 2. ఆధిదైవికము, 3. ఆధిభౌతికము, యోచన చేస్తే సర్వం స్పష్ట మవుతాయి.

మానవ శరీరమే తుంగభద్రానది. భద్రకు కళ్యాణమని అర్థము. తుంగకు అధికమని అర్ధము. అత్యధిక కళ్యాణం చేయగలదియే తుంగభద్రానది. అదియే మానవ శరీరము.

మానవుడు స్వశరీరం ద్వారానే దేవుడు కాగలుగుతాడు.

స్వాత్మను స్వయంగా దేవునిగా చేయగల వాడే ఆత్మ దేవుడు. నరుడే నారాయణుడవుతాడు. మానవ శరీరంలో వున్న జీవుడు దేవుడు కాగలుగుతాడు. అంతే కాదు. పరులను కూడా దేవతలలా చేయగలుగుతాడు.

పశువులు స్వశరీరం ద్వారా తమకు ఏ శుభాలనూ చేకూర్చుకోలేవు. మానవుడు బుద్ధి కల ప్రాణి అవడం వల్ల స్వశరీరంతో తానుద్ధరింపబడుతూ అన్యులను కూడా ఉద్ధరించ గలడు,

కలహించే కుతర్కాలు చేసే దుంధులియే బుద్ధి. ప్రతియింటిలోనూ యీ దుంధులి వుంటుంది. దుంధులి యీ గాథలో కోలాహలం చెలరేగింప జేస్తుంది. ద్వైవిధ్యం కల వృత్తియే యీ దుంధులి. ఇట్టి ద్వైవిధ్యం కలబుద్ధి ఉన్నంతవరకూ ఆత్మ శక్తి జాగృతం కాలేదు.

బుద్ధి-పరుల వచనాలలో అనధికారంగా ప్రవేశిస్తుంది. ఇది మహా పాపము.

"నే నెవరిని? నా స్వామి ఎవరు" అని ఈ బుద్ధి ఎన్నడూ యోచించదు.

బుద్ధితో ఆత్మకు వివాహం (సంబంధం) అయినది. కాని దానికి ఓ మహాత్ముడు లభించనంతవరకూ సత్సాంగత్యం దొరకదు. అంతవరకూ వివేకం కలగదు. వివేక రూపియైన పుత్రుడు ప్రభవింపడు.

వివేకమే ఆత్మకు పుత్రుడు.

సత్సాంగత్య రహితంగా వివేకం ఉదయించదు.

ఆత్మ-బుద్ధుల సంబంధం ద్వారా వివేక రూపుడగు పుత్రుడు కలగనంతవరకూ జీవుడు సంసార రూపమయిన నదిలో పడి మునిగిపోతాడు. అందుకే ఆత్మదేవుడు గంగాతీరం గుండా పోతూ ఆ నదిలో మునిగి మరణించాలని నిశ్చయించుకున్నాడు.

వివేకం సత్సాంగత్యం వల్ల జాగృత మవుతుంది. వివేకమే ఆత్మను ఆనందితం చేస్తుంది.

నరుడు స్వయంగా నారాయణుడై, అన్యులను కూడ తత్సమానులను చేయగల శక్తి ఆత్మలో ఉన్నది. కానీ యీ ఆత్మశక్తిని జాగృతం చెయ్యాలి. హనుమంతుడు సర్వ సమర్థుడు. అయినా జాంబవంతుడు. అతనికి స్వస్వరూప జ్ఞానాన్ని కలుగజేస్తాడు. అప్పుడే మారుతి విజృంభించి రామకార్యాన్ని సాధిస్తాడు.

ఆత్మశక్తి సత్సంగం వల్ల జాగృత మవుతుంది. సత్సాంగత్య రహితంగా జీవితంలో దివ్యత్వమే రాదు.

సంతమహాత్ముల ద్వారా ప్రసాదించబడిన వివేకరూపమయిన ఫలం బుద్ధికి నచ్చదు.

బుద్ధి దుంధులి యొక్క సోదరి. మనస్సు బుద్ధిని కలహా చేస్తుంది. అందుకే దుఃఖాల పాలవుతూంటుంది. మనస్సు ఎన్నిపర్యాయాలో ఆత్మను మోసగిస్తూంటుంది.

అది చెయ్యవద్దని మనస్సు చెబుతూంటుంది. భగవంతునే శరణు వేడాలి.

కొంచెం ఆలోచించండి. ఆత్మదేవుడు అమాయకుడు. అతని మనో బుద్ధులు రెండూ మాటి మాటికీ మోసగిస్తూ వచ్చాయి. మనస్సుతో సలహా చెయ్యకు.

ఆత్మదేవుడు మనోబుద్ధుల మోసాలను గ్రహించలేక పోయాడు.

ఫలాన్ని గోవు తిన్నది. గోవు అంటే ఆవు. ఇంద్రియాలకు శక్తి అని అర్థము. ఫలాన్ని గోవుకు అంటే యింద్రియాలకు తినిపించడం జరిగింది.

సూతర్షి పలుకుతున్నాడు:- సత్సంగం వల్ల ఇంద్రియాలు వెనువెంటనే శుద్ధిచెందవు. మనో బుద్ధులు భాగవతాన్ని తద్వారా భగవంతునీ ఆశ్రయించ గలిగిన నాడే అవి శుద్ధమవుతాయి.

దుంధుకారి ఎవరు? సమయాన్నంతటినీ ద్రవ్య కామ సుఖాలలో వ్యర్థం చేసే వాడే దుంధుకారి. ఎవని జీవనంలో ధర్మ మన్నది లేక - కామ సుఖ ద్రవ్య, సుఖాల ప్రాధాన్యం మాత్రమే వుంటుందో వాడే దుంధుకారి.

సూతుడు సావధానులను చేస్తున్నాడు:- పెద్దవాడయిన దుంధుకారి ఐదుగురు వేశ్యలకు చిక్కుకు పోతాడు. శబ్ద స్పర్శ రూప రస గంధా లయిదూ పంచ వేశ్యలు. ఈ పంచ విషయాలే దుంధుకారి - అంటే బంధిస్తాయి. వాడు శవహస్తాలతో భక్షిస్తున్నాడు. స్పష్టంగా వ్రాయబడి వున్నది - శవహస్తేన భోజనమ్. శవహస్తాలంటే ఎట్టివి? ఏ హస్తాలు; పరోపకారం చెయ్యని హస్తాలో అవే శవహస్తాలు.

దుంధుకారి స్నాన శౌచ క్రియాశూన్యుడు. కాముకుడు కావడం వలన స్నానమయితే చేస్తున్నాడు. కానీ స్నానానంతరం సంధ్యావందన సేవాదులు చెయ్యక స్నానం చెయ్యడం వ్యర్థమే. కనుకనే వాడు స్నానం చేయని వానితో సమానుడని అర్థం చేసుకోవాలి.

స్నానానంతరం-సత్కర్మానుష్ఠానం జరగకపోతే అది పశుస్నాన మవుతుంది స్నాన మన్నది. కేవలం శరీరాన్ని స్వచ్ఛంగా వుంచుకోవడానికి మాత్రమే కాదు.

స్నానానంతరం సేవ. సంధ్య. గాయత్రీ జపాదులు జరగకపోతే ఆ స్నానం కూడా పాపమయ మవుతుంది. శాస్త్రాలలో మూడు రకాలయిన స్నానాలు చెప్పబడ్డాయి. ఇందులో ఋషిస్నానం శ్రేష్ఠమైనది. ఉషఃకాలంలో 4-5 గంటల మధ్య చేయబడే స్నానం ఋషి స్నానం మనబడుతున్నది. తరువాత 5-6 గంటల మధ్య చేయబడు స్నానం మనుష్య స్నాన మనబడుతుంది 6 గంటల తరువాత చేయబడు స్నానం రాక్షస స్నాన మనబడుతున్నది.

సూర్యదేవ దర్శనానంతరం దంతధావన శౌచాదులాచరణయోగ్యం కావు.

సూర్యుడు బుద్ధికి అధిష్ఠాన దేవత, సంధ్యావందనం చేయటం వల్ల స్నాన సంధ్యాదులు నియమిత రూపేణా ఆచరించండి. సమ్యక్ ధ్యానమే సంధ్యావందనము.

సత్కర్మానుష్ఠాన రహితంగా చేయబడు భోజనం భోజనం కాదు. పాపాలనే భుజిస్తున్నాడు! భగవద్గీతలో చెప్పబడినది :—

భుజంతే త్వఘం పాపా యే పచంత్యాత్మ
కారణాత్. అ 3 శ్లో 13

స్వశరీర పోషణార్థం అన్నోత్పాదన చేయువారు పాపాన్నే భుజిస్తున్నారు కనుక సదా సత్కర్మల నాచరించండి. ఆయుర్దాయాన్ని సదుపయోగం చేసుకోండి,

మనశ్శరీరాలను శిక్షణలో ఉంచుకో గలిగావా ? పాపాలు దూరమై పుణ్యం వర్ధిల్లుతుంది. మీ మనస్సును మీరు దండించుకోక పోతే మరి ఎవరు దండిస్తారు ?

పుత్రుని దురాచారానికి ఆత్మదేవుడు మథనపడి పోయాడు. పుత్రరహితంగా ఉంటే బాగుండేది. అనుకున్నాడు. దుందుకారి సంపదలను అన్నింటినీ నాశనం చేస్తాడు. తల్లిదండ్రులను కూడా కొట్టడం ఆరంభిస్తాడు.

తండ్రి దుఃఖాన్ని తిలకించి గోకర్ణుడు తండ్రి దగ్గరకు వచ్చి - వైరాగ్యాన్ని ఉపదేశించే వాడు - "తండ్రీ ! ఈ ప్రపంచం సారహీనమయింది. దుఃఖరూపమైన మోహంలో బంధింప జేస్తుంది. ఎవరికి ఎవరు కొడుకులు ? ధనాదు లెవరివి ?

ప్రపంచానికి వంధ్యాపుత్రుని ఉపమానం యీయబడింది. మాయ మిథ్యకాగా, ప్రపంచం వాస్తవ మయిన దెలా అవుతుంది ?

"తండ్రీ! యీగృహపరివారాదులను విడిచి అడవులకు వెళ్ళు, దేహ మోహాన్ని విడిచి పెట్టు అన్నింటినీ తెలుసుకొని స్వయంగా విడిచి పెట్టు, లేకపోతే కాలమే నిన్ను బలాత్కారంగా విడిపింప జేస్తుంది.

శ్లో॥ దేహేఽస్థి మాంసరుధిరేఽభిమతం త్యజత్వం
జాయా సుతాదిషు సదామమతాం విముంచ
పశ్యానిశం జగదిదం క్షణభంగ నిష్ఠః

( భాగవత మాహాత్మ్యం అ. శ్లో. 78 )

ఈ దేహం రుధిర మాంసాస్థి పిండము దీనినీ నాది అనుకోకు. స్త్రీ పుత్రాది మమకారాన్ని విడిచిపెట్టు, ఈ ప్రపంచం క్షణభంగుర మయినది కేవలం వైరాగ్య రసికుడవు కమ్ము, భగవద్భక్తిలో మునిగిపో.

సంసార మోహ త్యాగ రహితంగా భక్తి జరగదు.

ఏ విధంగా నయినా మనస్సును సాంసారిక విషయాలనుండి దూరంచేసుకొని ప్రభు ప్రేమలో సంలగ్నం చెయ్యి. సంసారాసక్తి అన్నది నశించేది కాదు.అది జరిగే వరకూ భగవద్భక్తి సిద్ధించదు. సాంసారిక విషయాలలో చిక్కుకొని పడి ఉండకు. భగవచ్ఛరణాలలో ఉండు.

ఈ దేహం నీది కాదు. కారణం దీనిని మనం శాశ్వతంగా ఉంచుకోలేకపోతున్నాము. అయిననాడు యిక మనదన్న దేముంది ?

జనకా ! ఇప్పటికే చాలా జరిగిపోయింది. ఇక మిగిలి యున్నది కొంచమే గంగాతీరం చేరి భగవధ్యానంలో నిమగ్నుడవయిపో. మనస్సు నిక్షేపం,దానిని కృష్ణ లీలలు యందు సంలగ్నం చెయ్యి. భావమన్న దానిని కలిగివుంటే-హృదయ పరివర్తన జరుగుతుంది. సేవల యందు పరదోష దర్శనం విఘ్న కారకము. కనుక పరుల దోషాలను దర్శించుట విడనాడుము. భగవంతుని ఆశ్రయించి, భగవన్మయ జీవితాన్ని గడుపుము భగవన్మయ జీవితాన్ని గడపడానికి ధ్యాన, జప పారాయణలు అత్యంతావశ్యకాలు.

ఉత్తమ పాఠానికి షడంగాలు :- మధురత్వము, స్పష్టంగా అక్షరాలను ఉచ్చరించుట, పదచ్ఛేద జ్ఞానము ధైర్యము, లయ, సామర్థ్యము, మధురకంఠము, పాఠం శాంత చిత్తంతో చెయ్యండి. అర్థం చేసుకోకుండ, అతిశయ శీఘ్రంగా పాఠం చెయ్యకండి.

ఆత్మదేవుడు గంగాతీరం చేరాడు. మానసిక సేవ ఆరంభించాడు. ఏకాంతంలో కూర్చుని మనస్సును ఏకాగ్రం చెయ్యసాగాడు.

చంచలమైన మనస్సును వివేక బోధ ద్వారా బంధించి ధ్యానమగ్నం చేయించండి. సంకల్పవికల్పాల నుండి మనస్సును దూరం చెయ్యండి. మానసిక సేవలో మనోధార అవిచ్ఛిన్నంగా ఉండాలి. అట్టిచో దివ్యమై ఉచ్చస్వరంతో జపపాఠం చెయ్యడం వలన మనస్సు ఏకాగ్రమవుతుంది. నిరోధ మేర్పడుతుంది.

ఆత్మదేవుడు సతతం భాగవత ధ్యానంలో తన్మయుడయి ఉంటున్నాడు.

నివృత్తియందు సర్వదా సత్కార్మలు జరుగుతూండాలి కానిచో పాపాలు ప్రకటించబడతాయి.

ఆత్మదేవుడు దశమస్కంధాన్ని పారాయణ చేస్తాడు. దాన్ని యదార్థంగా శ్రద్ధా భక్తిభావాలతో పఠించడం వల్ల అతడు దివ్యుడయినాడు.

ఆత్మ పరమాత్మను కలుస్తుంది. అప్పుడే అది కూడా దివ్యమౌతుంది. నేడు జీవుడూ - శివుడూ ఏకమయ్యారు. జీవేశ్వరుల సమ్మేళనం జరిగింది.

భాగవతాన్ని ఆశ్రయించివాడుభగవంతుడవుతాడు. దివ్యుడయిన వానిని పరమాత్మ అనేక పర్యాయాలు మహాత్ముని చేస్తూంటాడు.

పరమాత్మకు రెండు స్వరూపాలు - 1 అర్చనా స్వరూపం, 2 - నామ స్వరూపము. శ్రీమద్భాగవతము భగవంతుని నామ స్వరూపము. సామగ్రులతో అర్పింపబడువాడు అర్చనా స్వరూపుడు.

నామ స్వరూప రహితంగా స్వరూప సేవ ఫలించదు. స్వరూప సేవ సక్రమంగా జరగదు కూడ, దానికి కారణం? మనశ్శుద్ధి లేకపోవడమే. మనఃశ్శుద్ధి రహితంగా స్వరూప సేవలో ఆనందం లభించదు. సేవకుడు ప్రాపంచిక సంబంధం కలిగి ఉన్నంతవరకూ మాయ విడనాడదు. అట్టి స్థితిలో స్వరూప సేవానందం లభించదు.

సేవ చేయదలచావా? సంసార స్నేహ మోహాదులను విడిచిపెట్టాలి. సాంసారిక విషయాలలో స్నేహం చేయదలచావా? వివేకంగా చెయ్యి. అగ్ని సర్వస్వాన్నీ భస్మీపటలం చేస్తుంది. అయినా దానినే వివేక పూర్వకంగా వినియోగించుకో. గలిగితే దాని వలన మహోపకార మవుతుంది. అగ్ని లేకపోతే మానవుని మనుగడయే లేదు కదా!

మానవుడు ప్రపంచంలో స్వశరీరమందాసక్తి కలిగి వ్యవహరించినంత కాలం యీ ప్రపంచాన్ని విడిచి పెట్టలేడు. మాయను స్పృశించిన మనస్సు — మన్మోహనుని సేవ చెయ్యజాలదు, మనస్సు మాటిమాటికీ మాయాలోచన చేస్తూంటుంది. కనుక అది మలినమవుతూంటుంది. నామస్మరణ మనఃశుద్ధి కోసమే జరగాలి.

స్వరూప సేవలో మనస్సు లగ్నం కానంతవరకూ నామస్మరణ చెయ్యి.

స్వరూప సేవలో ఆనందం కలుగదు. కారణం? మనస్సు వ్యగ్రంగా, చంచలంగా వుంటుంది. మన మనస్సు మాటి మాటికీ భగవంతుని విడనాడి విషయాల వైపు పరుగు తీస్తూంటుంది. మానవుని మనస్సు

పాపాలు చేసి తీరేటంతగా సాంసారిక వ్యవహారాలయందు సం లగ్నమై పోతుంది.

స్వరూప సేవ చెయ్యగా మనస్సు ద్రవించాలి కనులు చెమ్మగిల్లాయి. ఆనందం కలగాలి. హృదయంలో సాత్త్వికభావం జాగృతమవ్వాలి. ఇవి జరిగిన నాడే సేవ సఫలమయినట్లు గ్రహించు. హృదయ భావరహితంగా చేయదగిన సేవ సఫలం కాదు. శుద్ధాంతరంగంతో పర మాత్మ సేవ చెయ్యగలిగితే భగవంతుడు ప్రసన్ను డవుతాడు.

మనస్సులో అనేకమైన మైలలు నిండివుంటాయి. స్వరూప సేవలో మనశ్శుద్ధి అత్యంతావశ్యక మయినది. మనశ్శుద్ధికి నామ సేవ అత్యంతావశ్యక మయినది. శ్రీ మద్భాగవతం మనో మాలిన్యాలను దూరం చేస్తుంది.

కలియుగంలో నామ సేవ ప్రధానమైనది. కలి యుగంలో నామ స్మరణే ప్రధానమయినది. భాగవతం భగవంతుని స్వరూపమే నామమే బ్రహ్మ. నామమే పర మాత్మ. అధిక వర్ణనమేల? నామం పరమాత్మ కన్న శ్రేష్ఠ మయినది. భగవంతుడు అదృష్టంగా వుంటాడు. అట్టి వానితో స్నేహం చెయ్యడం కష్టము. నామ స్వరూపము స్పష్టంగా కనిపిస్తుంది. ప్రత్యక్షంగా కనిపించని వాని నామాన్ని పట్టుకోగలవు కదా! తద్వారా అతడవశ్యం దృగ్గోచర మవుతాడు. భగవత్స్వరూపం సర్వులకూ అను కూలమై సులభంగా వుండదు, కాని నామ స్వరూపం సులభమయినది. జ్ఞానులు నామమందు నిష్ఠ కలిగి వుం టారు. వారు నామాన్ని ఆశ్రయిస్తారు. నామమే భగవత్ స్వరూపము. శ్రీరామచంద్రుడు కొంతమందిని మాత్రమే ఉద్ధరించాడు.కాని స్వధామ గమనానంతరం అతని నామం ఎంత మందిని ఉద్ధరించినదో లెక్క. పెట్టలేము. శ్రీకృష్ణ దేవుడున్న కాలంలో భూతలంలో ఉద్ధరింపబడినవారి సంఖ్య కన్నా అతడు నిర్యాణం చెందిన తరువాత ఉద్ధ రింపబడిన వారు అసంఖ్యాకంగా అగణితంగా ఉన్నారు.

మహా పాపాలలోకెల్లా మహాపాపం ఏది? భగవ న్నామ స్మరణ యందు నిష్ఠ లేకపోవడము, నామ సాధన సరళమయినది. భాగవతం భగవంతుని నామ స్వరూ పము:భాగవతాన్ని ఆశ్రయించడమే నామాన్ని ఆశ్ర యించడ మవుతుంది.

భాగవతాన్ని ఆశ్రయించిన వాడు భగవంతు డవుతాడు.

ఆత్మదేవుడు భాగవతంలోని దశమ స్కంధాన్ని పారాయణ చేయడం ఆరంభించాడు. కేవలం దశమ స్కంధ పారాయణ మాత్రం చేత అతనికి ముక్తి లభించినది.

సంస్కృత జ్ఞానముంటే నిత్యం దశమ స్కంధాన్నీ, విష్ణు సహస్రానీ్న, శివ మహిమ్న స్తోత్రాన్నీ పారాయణ చెయ్యండి. అర్థ జ్ఞాన సహితంగా పఠించండి. అర్థ జ్ఞాన రహితంగా చేసే పారాయణ అధమ పార మవుతుంది.

భగవంతుడు శీఘ్రంగా లభించడు. త్వరగా దయ చూపించడు కారణం? అందుకై మీరు కష్టాలను సహించడం లేదు. కష్టాలను సహించడానికి మానవుడు భయపడతాడు, భగవత్కృపకై దుఃఖాలను సహించండి. స్వేచ్ఛగా కష్టములను సహించగలవారిని యముండు బాధ పెట్టజాలడు.

ఆత్మదేవుడు ఆసనం వేసికొని 10-12 గంటలు కూర్చుంటాడు.

ఆసనం మీద శాంత చిత్తంతో కూర్చోండి. జ్ఞాను లకు సమాధ్యవస్థలో లభించే ఆనందంతో సమానమయిన

ఆనందమే భాగవత కథా శ్రవణమాత్రంచే లభిస్తుంది. ఎవని లీలలు యీ గాథలో వర్ణింపబడ్డాయో అవి ప్రత్యక్షంగా జరుగుచున్నట్లు భావించగలిగితే ఆనందం లభిస్తుంది. నా మనస్సు భగవంతునితో సారూప్యాన్ని చెందుతుందన్నదని భావించు :

దృశ్యం నుండి దృష్టి మరల్చ గలిగితే ద్రష్ట యందు మనస్సు లగ్నమవుతుంది. మనస్సు నిరోధించ బడిన నాడు ఆనందం ప్రకటింప బడుతుంది.

ధుంధుకారి ప్రవర్తన తనకు కూడా విశేషాన్ని కలిగిస్తుందన్న భావంతో గోకర్ణుడు అడవులకు వెళ్ళి పోయాడు. ఇక్కడ దుంధుకారి వేశ్యలను ఆనందపరచ డానికి దొంగతనాలు ఆరంభించాడు.

సూతర్షి శ్రోతలను సావధానులను చేస్తున్నాడు:— ప్రత్యేక ఇంద్రియానికీ జీవుడు ప్రభువై ఉన్నాడు. కాని ఇంద్రియాలు జీవునిపై ఆధిపత్యం వహించిన నాడు మానవుడు ఇంద్రియాధీనుడై పోతే జీవితం కలుషితమై పోతుంది. మానవుడు పరమాత్మతో స్నేహం చేయ గలిగిన నాడు సుఖాన్ని పొందుతాడు. భగవంతుని నుండి దూరమయిన జీవుడు ఆనాటి నుండి దుఃఖిస్తూనేవున్నాడు. జీవుని సుఖ దుఃఖాలకు మనస్సే కారణము.

దుంధుకారి అనిష్ట మార్గాలద్వారా ధనార్జన చెయ్య సాగాడు. అతడు రాజభవనంలో దొంగతనం చేయడానికి బయలు దేరాడు. ఆభరణాదులను దొంగిలించి వేశ్యలకు యిచ్చాడు. వేశ్యలు ఆలోచించ నారంభించారు. వీడు బ్రతికివుంటే ఎప్పటికయినా రాజోద్యోగులు వీణ్ణి బంధిస్తారు. అలాగే జరిగితే మహారాజు మన సర్వస్వాన్నీ తీసుకుపోతాడు. దానితో విడిచి పెట్టక దండిస్తాడు కూడ. కనుక మనం ఈ దుంధుకారిని హతమారిస్తే మనకు మేలు కలుగుతుంది. ఈ విధంగా యోచించుకొని వారు త్రాళ్ళతో దుంధుకారిని బంధించి వేధించినా వాడు మరణించ లేదు.

మహాపాపి మరణం సులభంగా శీఘ్రంగా జరగదు. వేశ్యలు జ్వలిస్తూన్న నిప్పులను దుంధుకారి ముఖంనిండా పోశారు. అంతతో ఊరుకోక చావమోదారు.

అంతకాలంలో పంచేంద్రియాలే జీవుణ్ణి వేధిస్తాయి. కష్టపెడతాయి. అప్పుడు జీవుడు విల విల లాడుతాడు. గిలగిలా తన్నుకుంటాడు.

తరువాత వేశ్యలు దుంధుకారి దేహాన్ని భూమిలో పాతిపెట్టారు. వాని శరీరానికి వారు అగ్ని సంస్కారం కూడ చెయ్యలేదు.

ఎవని చరిత్రను చూచినంత మాత్రం చేత అసహ్యం కలుగుతుందో వాడే దుంధుకారి. దుంధుకారి తన దుష్కర్మలు కారణంగా భయంకర ప్రేతరూపాన్ని పొందాడు. మహా పాపకర్మలు కారణంగా దుంధుకారి యమపురానికి కూడ పోలేక పోయాడు. అట్టివారు ప్రేత రూపాన్ని పొందుతారు.

గోకర్ణుడు దుంధుకారి మరణవార్త నాలకించాడు. అతడు గయకు వెళ్ళి దుంధుకారికై శ్రాద్ధకర్మ చేశాడు.

గయాశ్రాద్ధం శ్రేష్ఠమయినది. అక్కడ విష్ణుపాద మున్నది. దీనికి సంబంధించిన గాథ యీ ప్రకారంగా ఉంది;

గయాసురుడనే రాక్షసుడు తపస్సుచేసి బ్రహ్మ దేవుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకున్నాడు. వరంకోరుకో మన్నాడు బ్రహ్మ. అప్పుడతడు నా కెట్టి వరాన్ని ప్రసాదిస్తావు దేవా? అని అడిగాడు. నీ కేమయినా వరం కావలసి వస్తే

నన్నే అడుగు" అన్నాడు. వాని తపస్సుకు దేవతలుకూడ భయపడిపోయారు. ఈ రాక్షసు డెలా మరణిస్తాడా ? అని యోచించసాగారు. ఈ సందర్భంలో బ్రహ్మదేవుడు — వాని శరీరం మీద దీర్ఘకాలం యాగం చేస్తే వీడంత మవుతాడు, అని నిశ్చయించుకొని, "నీ శరీరాన్ని నాకియ్యి" అని కోరాడు. యజ్ఞకుండం గయాసురుని వక్షఃస్థలంపై తయారు చేయబడింది. నూరు సంవత్సరాల వరకూ యజ్ఞం జరుగుతూనే వుంది. అయినా వాడు మరణించలేదు. పూర్ణాహుతి కావడంతో వాడు పునః లేవసాగాడు. బ్రహ్మ చింతాక్రాంతుడయిపోయాడు. భయపడుతూనే శ్రీహరిని స్మరించాడు. సాక్షాత్కరించిన శ్రీమన్నారాయణుడు గయాసురుని వక్షఃస్థలంపై పాద ద్వంద్వాన్ని ఉంచాడు. మరణవేళ గయాసురుడు భగవంతుని వరమడుగుతూ "ఈ గయాతీర్థంలో ఎవరు శ్రాద్ధంచేసినా వానిపితృగణాలు సద్గతిని చెందుగాక! భగవానుడు వానికి వరాన్ని ప్రసాదిస్తూ, నీ శరీరంపై పిండ ప్రదానం చేయువారి పితరులకు ముక్తి లభిస్తుంది. భగవంతుడు గయాసురునికి కూడ ముక్తిని ప్రసాదించిన వరం కారణంగా గయలో పితృశ్రాద్ధం చేసేవారి పితరులకు ముక్తి కలుగుతుంది.

గోకర్ణుడు స్వగృహానికి మరలి వచ్చాడు. రాత్రివేళ అతడు ఎవరో ఏడుస్తూన్నట్లు విన్నాడు.

మానవుడు నవ్వుతూ పాపాలు చేస్తాడు. కాని పాప ఫలాన్ని అనుభవించే వేళ ఏడుస్తాడు.

ఒకే జననీ జనకుల కుమారులయినా గోకర్ణుడు దివ్యుడయ్యాడు, దుంధుకారి ప్రేతమయ్యాడు.

దివ్యుడవు కావాలన్నా ప్రేత రూపాన్ని పొందాలన్నా నీ చేతిలోనే వుంది.

"నువ్వెవరవు? నీయీ దశలేమిటి? భూత, ప్రేత పిశాచ రాక్షసులలో నీవెవరవు?" అని గోకర్ణుడు ప్రశ్నించగా —" సోదరా! నేను నీ తమ్ముడను. దుంధుకారిని. మహా పాపకర్మల ఫలంగా నాకీ దశ కలిగింది. నాకు ప్రేత జన్మ కలిగింది.

గోకర్ణుడు:— నేను నీకై గయలో పిండప్రదానం చేసి వచ్చాను. అయినా నీకీ స్థితి నుండి విముక్తి కలుగలేదా ?

"ప్రేతం:— గయా శ్రాద్ధ శతేనాపి ముక్తిర్మే న భవిష్యతి" మీరు ఎన్ని గయా శ్రాద్ధాలు చేసినా నాకు ముక్తి లభించదు.

గోకర్ణుడు:— అయితే నీకు సద్గతి ఎలా కలుగుతుంది? నీకయి ఏమిచేయుదును ? సరే యీ విషయమై రేపు సూర్యదేవుణ్ణి అడిగి తెలుసుకుంటాను."

గోకర్ణుడు మరునాడు సూర్యనారాయణునికి అర్ఘ్య ప్రదానం చేసి సవినయంగా శ్రద్ధాభక్తులతో—స్వామీ! కొంచెం సేపు ఆగండి." అనడంతో సూర్యదేవుడు ఆగిపోయాడు. ఇది త్రికాల సంధ్యావందన ఫలము.

బ్రాహ్మణుడయినవాడు త్రికాల సంధ్యావందనం నుండి ఎన్నడూ పతనం కారాదు. త్రికాలవందనం చేసేవాడు ఎన్నడూ మూర్ఖుడూ, దరిద్రుడూ కాజాలడు.

"వత్సా! నాతో పనేమిటి?" అని భాస్కరదేవుడు ప్రశ్నించగా, గోకర్ణుడు – నా సోదరుడు ఉద్ధరింపబడడానికి సముచితోపాయాన్ని సెలవిచ్చెదరుగాక!" అని కోరాడు.

"నీ సోదరునికి సద్గతి కలిగించాలనుకుంటే విధి విధానంగా శ్రద్ధాసక్తి భక్తులతో భాగవత గాధను విని పించు" అన్నాడు సూర్యదేవుడు.

శ్రాద్ధం వలన ముక్తి చెందని ఆత్మ భాగవత శ్రవణం వలన ముక్తిని పొందుతుంది. భాగవత శాస్త్రం ప్రభావం

దుంధుకారిని పాప విముక్తుణ్ణి చేయడం కోసం గోకర్ణుడు భాగవత సప్తాహాన్ని ఏర్పాటు చేశాడు. దుంధు కారి అక్కడకు వచ్చాడు. కాని వానికి కూర్చోవటానికి అక్కడ స్థానం లేకపోవడం వల్ల ఏడు కణుపులు గల వెదురు కర్రను పాతిపెట్టారు. నిత్యం ఒక్కొక్క కణుపే విచ్ఛిన్నం కాసాగింది. ఏడవ రోజున పరీక్షిత్ మోక్షగాథ జరిగింది. వెదురునుండి దివ్యపురుష డొకడు బయటకు వచ్చాడు. గోకర్ణునికి నమస్కరించి, అతడు "సోదరా! ప్రేతయోని నుండి నువ్వు నన్ను విముక్తుణ్ణి చేశావు." అన్నాడు.

భాగవత గాధ ధన్యమయింది కదా!

జడవస్తువైన వెదురు కణుపులే విచ్ఛిన్నమవు తూంటే చైతన్యం గల మానవ బంధనాలేల విచ్ఛిన్నం కావు? వివాహ సమయంలో ఇరువురి వ్యక్తులకు బంధన మేర్పడుప బడుతుంది. భార్యాభర్తల స్నేహమే గ్రంధి. ఈ గ్రంధి విచ్ఛిన్నం కావడం కష్టము. పరమాత్మ సేవకై ఒకరి కొకరి సహకారం లభించింది. ఈ విధంగా ఆలోచించుకో గలిగితే భార్యాభర్తలు సుఖంగా వుంటారు.

వెదురులో అంటే వాసనలలోదుంధుకారి ఉన్నా డన్న మాట. వెదురు యొక్క ఏడు కణుపులంటే విషయ వాసనల సప్త గ్రంథులే. వాసన కలిగినదా? పునర్జన్మ తప్పదు. వాసనలపై విజయాన్ని పొందడమే సుఖించ డానికి ఉపాయము మానవుడు మోహాన్ని విడిచి పెట్టడు. వాసనఅంటే ఆసక్తి.సప్తప్రకారంగా ఉంటుంది. 1. భార్యాసక్తి, 2. పుత్రాసక్తి, 3. వ్యవసాయాక్తి, 4. ద్రవ్యాసక్తి, 5. కుటుంబాసక్తి, 6. దేహ, గేహాసక్తి, 7. స్వగ్రామాసక్తి ఈ సమస్తాసక్తులనూ త్యజించాలి.

శాస్త్రంలో :— కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, అవిద్యలు సప్త గ్రంథులుగా చెప్ప బడ్డాయి. వీటిలో బంధించబడిన జీవుడు ముక్తికై నిరం తర ప్రయత్నం చేయాలి.

వెదురు వాసనా స్వరూపము. జీవుడు వాసనలో చిక్కుకుని ఉన్నాడు. వాసనల వల్లనే జీవునిలో జీవ భావం వచ్చింది. నానా గ్రంథులు విచ్ఛిన్నం కానంత వరకూ జీవభావం నిర్మూలం కాదు.

శ్రీమద్భాగవత కథాశ్రవణ మాత్రంచే వాసనా సంబంధమైన ప్రతి గ్రంధీ విచ్ఛిన్న మవుతూంటుంది భాగవత గాధవలన యీగ్రంథులు విచ్ఛిన్నమవుతాయి. భగవన్నామ స్మరణ మాత్రమే సత్యమయినదని గ్రహించ గలిగిన దానిని సత్యం స్మరించగలిగితే వాస నలు విచ్ఛిన్నమవుతాయి.

ఓ గృహస్థుడయిన శేఠ్ నియమబద్ధంగా జీవిస్తు న్నాడు. అతడు 12 సంవత్సరాల నుండి శ్రీహరిగాధలు వింటూ వస్తున్నాడు. కథ చెప్పడానికి ఓ విప్రశ్రేష్ఠుడు, వస్తున్నాడు. ఓ రోజున శేఠ్ ఎక్కడికో వెళ్ళవలసి వచ్చింది. కథా శ్రవణం నియమబద్ధంగా జరిగే దెలా? అతడు బ్రాహ్మణునితో — స్వామీ! రేపు కథ నాలకించ డానికి రాను. నా నియమ మేమవుతుంది?" అని ప్రశ్నిం చాడు.

నీ కుమారుడు ఆలకిస్తే చాలు నన్నాడు. "ఈకథను వినడం వలన వాడు విరాగి అయిపోతే ఎలాగ?" అని ప్రశ్నించగా, బ్రాహ్మణుడు-పన్నెండేళ్ళ నుండి కథలను వినే నువ్వు విరాగివి కాలేదు? నీ కుమారుడెలా అవుతాడు? అనగా శేఠ్ - "మేము రోజూ కథ నాలకిస్తున్నా హృదయ గ్రంథిని విచ్ఛిన్నం చేసుకోలేకపోయాము." అన్నాడు.

పై విధంగా మీరు తయారవకుండా కథను విన్నా రంటే హృదయ గ్రంధి విచ్ఛిన్నం కావలసిందే.

సాంసారిక సుఖాలను మనసా కూడా త్యాగం చెయ్యజాలని వాడు భక్తిని సిద్ధింప జేసికోలేడు. భోగాలను త్యజించ కూడదు. భక్తి కూడా కొనసాగాలి. ఇదెలా సాధ్యమవుతుంది? క్రమ క్రమంగా మనస్సునూ స్వభావాన్నీ బాగుచేసుకోవాలి. స్వభావం బాగుపడిన మీదటనే భక్తి సిద్ధిస్తుంది.

జ్ఞాన వైరాగ్యాలను పరిపుష్టి చేసుకునేందుకే యీ భాగవత గాధ.

పరమాత్మ చరణాలను ఆశ్రయించియే దుంధుకారి దివ్యుడు కాగలిగాడు. నా వంటి మహాపాపికి కూడా సత్కథా శ్రవణం వల్లనే సద్గతి లభించినదని దుంధుకారి అంటాడు.

దుంధుకారిని తీసుకు పోవడానికి విష్ణుపార్షదులు విమానాన్ని తీసుకు వచ్చారు. మరెవరినీ తీసుకుపోవడానికి వారు రాలేదు. అప్పుడు గోకర్ణుడు పార్షదులను "దేవదూతలారా! కేవలం దుంధుకారిని మాత్రమే తీసుకువెళ్ళడానికి విమానాలుతెచ్చారు?మరెవ్వరినీ తీసుకు వెళ్ళడానికి యేల తీసుకురాలేదు." అని ప్రశ్నించాడు.

విష్ణుపార్షదులు - ధుందుకారి ఏకాసనాసీనుడయి నిరాహారియై కథను ఆలకించాడు." అన్నాడు.

భగవచ్చరణాలలో - మనస్సులో నివసించడమే ఉపవాసము. ఉపవాస సమయంలో ఏ కొద్ది తిన్నా సంపూర్ణోపవాసం కాదు.

కథా శ్రవణానంతరం - దుంధుకారికి మాత్రమే ఏల ముక్తి లభించింది? కథను దుంధుకారివలె వినాలి. అతడు కథను మననం చేసుకుంటూ నిధిధ్యాసం చేసాడు. కనుకనే వానికి విముక్తి లభించింది. శ్రవణ మనన నిధి ధ్యాసల ద్వారా జ్ఞానం దృఢమవుతుంది.

శ్లో. అదృఢంచ హతం జ్ఞానం ప్రమాదేన హతః శ్రుతమ్
సందిగ్ధోహి హతో మంత్రో వ్యగ్రచిత్తో హతోజపః॥

దృఢత్వం లేని జ్ఞానం వ్యర్థమయినది. అటులనే అసావధానంగా చేసిన శ్రవణం కూడ వ్యర్థమే. సందేహ యుక్తమైన మంత్రం వ్యర్థమే. వ్యగ్రచిత్తంతో చేసిన జపం కూడ ఫలాన్నివ్వదు. మనస్సును లగ్నం చేయకుండా కథ నాలకించిన ప్రయోజనమేమి? అది ఫలాన్ని ప్రసాదించదు. కథాశ్రవణ సమయంలో మనస్సునూ దేహ గేహాదులనూ కూడ విస్మరించాలి. దేహగేహాత్మకమయిన విస్మృతితో తన్మయత్వంతో కథనాలకించి నేను భగవంతునితో తన్మయుడను కాగోరుచున్నాను - అని భావించుకోండి, కథను విని మననం చేసుకొని జీవితంలో ఆచరించగలిగితే జీవితం సార్థకమవుతుంది. కథను విన్న తరువాత జీవితంలో ఒక లక్ష్యాన్ని నిశ్చయించుకోండి. భగవద్గాధలను ఆలకించి మంచిని గ్రహించండి. సంపూర్ణ భాగవతంలో ఏ ఉత్తమ విషయాన్ని హృదయంలోకి ప్రవేశ పెట్టుకోగలిగినా జీవితం ఉద్ధరింపబడుతుంది.

ధుంధుకారి వలె మనం కథలనాలకించలేదని అందరూ గ్రహించారు. కనుకనే వారికి సద్గతి కలుగ లేదు. సత్కథలను మననం చేసికోవడం ఉత్తమమే. మననం చేసుకోకపోయినా లాభం ఉన్నది. తరువాత గోకర్ణుడు శ్రావణ మాసంలో రెండవసారి కథాశ్రవణం చేయించగా అందరికీ సద్గతి లభించినది.

తత్సమయంలో భక్తిరాణి అక్కడ సాక్షాత్కరించింది. జ్ఞాన వైరాగ్యాలను వెంటబెట్టుకు వచ్చింది. ఈ గాథ ద్వారా భక్తిరాణి సాక్షాత్కరిస్తుందన్న విషయం తెలుస్తుంది. జ్ఞానవైరాగ్యాలలో భక్తి వర్ధిల్లిన నాడు ముక్తి లభిస్తుంది. జ్ఞానవైరాగ్య రహితమైన భక్తి వల్ల ముక్తి లభించదు. ముక్తిదేవి ఆనందించి జ్ఞానవైరాగ్యాలతో నాట్యమాడ సాగింది.

మూర్ఛిత, క్షీణ జ్ఞానాన్ని మరల పరిపుష్టం చేయడానికి, జాగృతం చేయడానికి యీ భాగవత గాథ సంపూర్ణంగా సహకరిస్తుంది.

గోకర్ణుడు సభామండపంలో సాక్షాత్కరించాడు. "గోకర్ణా! నీ కథా కీర్తనంవల్ల ఆనందించాను. ఏదైనా వరం కోరుకో" అన్నాడు.

తత్సమయంలో సనత్కుమారుడు :— శ్రీకృష్ణ గాథను కీర్తించువారి. నామస్మరణ చేయువారి హృదయాలలో! దేవా! నువ్వు విరాజిల్లెదవు గాక." అందరికీ సద్గతి లభించినది.

వైకుంఠంలో లభించిన ఆనందం భాగవత గాథలో లభిస్తుంది. కాని విషయం ఏమిటంటే శ్రద్ధా భక్తి పూర్వకంగా కథ శ్రవణం చెయ్యాలి. మరణానంతరం ముక్తిని ప్రసాదించే గ్రంథం కాదు భాగవతము. బ్రతికి ఉండగానే ముక్తి నిస్తుంది.

భాగవతం ముక్తిని ప్రసాదించునట్టి శాస్త్రము. వేదాంత దివ్య సిద్ధాంతాన్ని వ్యాసర్షి యీ మాహాత్మ్యంలో వర్ణించాడు. షష్ఠాధ్యాయంలో విధివర్ణన జరిగింది.

సత్కర్మ విధిపూర్వకంగా కొనసాగిననాడు దివ్యమౌతుంది. సత్కర్మానుష్ఠానానికి కాల నిర్ణయమన్నది లేదు. సత్యనారాయణ వ్రత కథలో కూడ చెప్పబడినది. సత్కర్మాచరణకు ఆలస్యం చేయకండి.

ఓ ప్రభాత సమయంలో ధర్మరాజు దగ్గరకు ఓ యాచకుడు వచ్చి దాన మడిగాడు. మరునాడు రమ్మని ధర్మరాజు వాయిదా వేశాడు. ఈ సంభాషణను విన్న భీమసేనుడు వెంటనే విజయ దుంధుభిని మోగించ సాగాడు. భీమసేనునికి మతి భ్రమించ లేదు కదా! అని అందరూ భావించారు. కారణం? విజయ దుందుభి విజయ సమయంలోనే మ్రోగించబడుతుంది.

దీనికి కారణాన్ని చెబుతూ భీమసేనుడు — "నేడు మా అన్నగారు కాలాన్ని కూడా శాసించ గలిగాడు. రేపటివరకు తాము జీవించగలనని వారు భావిస్తున్నారు కదా! మాసోదరుని కాల విజయ సందర్భంలో నేనీ విజయదుందుభిని మ్రోగిస్తున్నాను.ధర్మరాజు ఉత్తర క్షణంలో తన తప్పును గ్రహించ గలిగాడు.

రేపటి ప్రభాత సమయంలో ఏమి జరగనున్నదో శ్రీరామచంద్రుడు కూడ గ్రహించ లేకపోయాడు. అన్నాడు.

ధర్మరాజు వెంటనే ఆ బ్రాహ్మణుని వెనుకకు పిలిపించి - యథా యోగ్యంగా దానం చేసి పంపాడు.

సత్కర్మ శీఘ్రంగానే చెయ్యాలి.
భవరోగానికి భాగవతమే ఔషధి.

జీవమాత్రులందరూ రోగులు సర్వాధిక దుఃఖాన్ని కలిగించే రోగము – జీవునకు భగవంతుని నుండి వియోగము. ఈ రోగ నివారణార్థం భాగవతాన్ని ఆశ్రయించండి. శ్రీకృష్ణుని నుండి ఏర్పడిన విరహరూప రోగానికి భాగవత శాస్త్రమే ఔషధము. రోగికి పరిచర్య చేసే సమయంలో ఆహార విహార నియమాన్ని పాటించాలి కదా! అటులనే యీ కథారంభానికి కూడ శుభ ముహూర్తాదులు కావాలి.

పురాణ ప్రవచనం చేసే పౌరాణికునికి కూడా కొన్ని లక్షణాలు చెప్పబడ్డాయి. ప్రథమ లక్షణం విరక్తి భావము. శుకమహర్షి నిర్వికార మూర్తి. మనం కూడా జగత్తులోనే ఉంటున్నాము. చూస్తుంటాము. కాని మన నేత్రాలు వికార రహితంగా ఉండలేవు. శుకదేవుడు బ్రహ్మదృష్టి సంపన్నుడు. ఆబాలగోపాలన్నీ అతడు భగవద్భావంలో చూడగలడు.

ప్రతి స్త్రీ పురుషులనూ భగవద్భావంతో చూడండి, సూతుడు సావధానులను చేస్తున్నాడు.

వైరాగ్యార్థం ఏమిటి? అనుభవించదగిన పదార్థాలు సానుకూలంగా ఉన్నా ఆకర్షింపబడకుండ ఉండగలడమే వైరాగ్యము. జగత్తును త్యాగం చెయ్యవలసిన అవసరం లేదు. భగవద్దృష్ట్యాచూస్తే ప్రవృత్తిని కూడ త్యజించాలి. స్వవికార దృష్టిని మార్చుకోవాలి. జగత్తును కామదృష్ట్యా చూడకండి. దోష దృష్టి పోనంతవరకు మన దృష్టి దివ్యదృష్టి కాదు.

ఉపదేశించునట్టివాడు బ్రహ్మవేత్త కావాలి. అతడు ధీరుడయి, గంభీరుడయి, దృష్టాంత కథన కుశలుడు కావాలి.

వక్త అయినవాడు నిస్పృహుడు కావాలి. నాడే ద్రవ్యమోహం దూరమౌతుంది, కానీ, కీర్తిదాహం దూరమవడం మహాకష్టము. జీవుడు కీర్తిమోహం కలిగియే ఉంటాడు. కీర్తిమోహంలో చిక్కుకున్న వాడు భక్తితో ఉండలేడు.

కథాశ్రవణం ప్రాపంచిక వస్తు విరక్తితో చెయ్యాలి. పురాణశ్రవణంలో కూర్చుని గృహవృత్తి విషయాలు ఆలోచిస్తూ ఉంటూంటే మనస్సు వికృతమవుతుంది. కథాస్థానంలో కేవలం కథను గురించి మాత్రమే ఆలోచించు. కథాశ్రవణం చేసేవారు యమసదనం చేరరు. వైకుంఠానికే వెడతారు.

మనస్సును సుస్థిరంగా ఉంచుకోవడానికి ఊర్ధ్వరేతస్కుడు కావాలి. బ్రహ్మచర్య పాలన వలన ఊర్ధ్వరేతస్కుడవుతాడు? చ్యుతుడయితే పుణ్యం క్షీణిస్తుంది. వక్త శ్రోతలూ, దుహితులు కారాదు. విధి విధానంగా కథాశ్రవణం చేస్తే సత్ఫలితం కలుగుతుంది. వక్త శ్రోతలు కూడా మనోనేత్ర వాక్కర్మాదులనూ, ప్రత్యేక కార్యాన్ని-బ్రహ్మచర్య పాలన పూర్వకంగా చెయ్యాలి.

శ్రద్ధాభక్తులతో భాగవత గాదనాలకించు వారికి పరమాత్మతో సంబంధం ఏర్పడుతుంది. భాగవతం భగవంతుని సాక్షాత్ స్వరూపము. ఇది భగవంతుని వాఙ్మయ రూపము.

వేదాంతంలో అధికారిని గురించి, అధికారాన్ని గురించీ విశేష చర్చ జరిగింది. "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా."

అందరికీ వేదాంతాధికారం లేదు. నిత్యా నిత్య వస్తువివేకము. శమదమాది షట్ సంపత్తీ ఇహాముత్ర ఫల భోగ విరాగ రహితంగా వేదాంతాధికారం లభించదు.

, జ్ఞాన ఉపాసనా విభాగాలతో వేదాలు మూడుగా

విభజించబడినాయి. అటులనే వాటి అధికారులు కూడా నిశ్చయింపబడ్డారు.

కాని భాగవత పురాణం మాత్రం సర్వులకూ ఉప యోగపడుతుంది. భాగవతాన్ని మీరు ఆశ్రయించ గలిగితే అది మిమ్మల్ని నిర్భయులనుగా సందేహ రహితులనుగా చేస్తుంది.

భాగవతంలో 180000 శ్లోకాలు ఎందుకున్నాయి? అష్టప్రకృతులు - భగవంతుడు తొమ్మిదవవాడు కనుక పూర్ణమైనది. నవమాంగము పూర్ణతాదర్శి. ఆహార వ్యవహార, పత్రలేఖనాది సర్వకార్యాలూ, భాగవతంలో వర్ణింపబడ్డాయి. ఈ ఒక్క గ్రంధాన్నీ ఆశ్రయించ గలిగితే జ్ఞాన సర్వస్వం లభిస్తుంది

ఈ గ్రంథము పూర్ణమైనది. భాగవతం నారా యణ దేవుని స్వరూపమే. జగత్తు భగవంతుడు. జీవుడు జగత్తు - ఈశ్వరుడు - ఆదిగాగల వాటితో సంబంధం గల జ్ఞానము భాగవతం వలన లభిస్తుంది.

భాగవతాన్ని మనం ఎంత ఎక్కువగా వింటే అంత సఫల జీవితాన్ని పొందగలిగినట్లే - అంత సంసారభారం తగ్గినట్లే. ఆలకించిన సద్విషయాలను మననం చేసుకొని వాటిని ఆచరించడానికి విశేషంగా ప్రయత్నించండి.

కేవల జ్ఞానము వ్యర్థము. ఆచరణలో పెట్ట గలి గిన జ్ఞానమే సార్థక మవుతుంది. గాంధీ మహాత్ముడు కూడ అంటూండేవాడు - మణుగున్నర జ్ఞానము కంటే తులం ఆచరణ శ్రేష్ఠమైనదని.

భగవంతుని దివ్య సద్గుణాలను అనుసరించు. పూర్వజన్మను గురించి ఆలోచించకుము.

జనక మహారాజు :- యాజ్ఞవల్క్య మహర్షిని గతజన్మ లీలను దర్శించాలని ఉన్నదని కోరుతాడు. అవి వద్దని నిషేధిస్తూ యాజ్ఞవల్క్యుడు - దుఃఖకారణ మని చెప్పినా జనకుడు వినకపోతే మహర్షి అతనికి గతజన్మ జీవనాన్ని చూపిస్తాడు. మహారాజు - గతజన్మ జీవన విషయం చూడగా - తన తల్లియే యీ జన్మలో భార్య అవుతుంది. దానితో అతనికి చెప్పలేని దుఃఖం కలుగుతుంది.

కనుక పూర్వజన్మలకు సంబంధించిన ఆలోచన లేకపోవడమే మంచిది. ఈ జన్మను సార్థకం చేసుకోవ డానికి ప్రయత్నించండి.

సంయమనత్వాన్ని పాలించండి. తద్వారా భగ వంతుణ్ణి పొందండి.

భగవత్ సన్నిధిని చేరడం ఆత్మదర్శనము.
హరయే నమః హరయే నమః హరయేనమః



శ్రీ రుక్మిణీ శ్రీకృష్ణాభ్యాం నమః

శ్రీ చక్రయంత్ర, ఉమామహేశ్వర స్తోత్ర సహిత

# రుక్మిణీ కళ్యాణము

లక్ష ప్రతుల ప్రచురణ వితరణోద్యమానికి సకాలంలో సహకరించి విశ్వవ్యాప్తంగా గల ఆంధ్ర ఆస్తిక సోదరీమణులైన కన్యల కళ్యాణ ప్రాప్తికి సహకరించండి.

* మహావకాశం *

తమ గోత్రనామాలపై రు. 150-00 లు మాత్రం అందజేయు వారి పేర సిద్ధి చేసిన శ్రీరామ రక్షాధారణా యంత్రాన్ని లేదా శ్రీ చక్రరాజాన్ని 15 రోజుల కాలవ్యవధిలో అంద జేయుటయే గాక సద్వినియోగార్థం "రుక్మిణీ కళ్యాణ" ప్రతులను (50 కాపీలు) అంద జేసెదము. మీ గృహంలో పెండ్లి కావలసిన వారి గోత్ర నామాల వివరాలతో ద్రవ్యాన్ని పంపవచ్చును.

## రుక్మిణీ కళ్యాణము

## లక్ష ప్రతుల ప్రచురణ వితరణోద్యమము

| పంచిపెట్టుకో దలచిన ప్రతుల సంఖ్య। | అందజేయవలసిన ద్రవ్యం |
|---|---|
| 3000 | రు 4500—00 |
| 2000 | రు 3000—00 |
| 1000 | రు 1600—00 |
| 500 | రు 900—00 |
| 250 | రు 500—00 |

N. B. ద్రవ్యం అందిన 10 రోజుల కాలవ్యవధిలో కావలసిన ప్రతులు అందజేయగలము.

సంపూర్ణ వివరాలకు :

పురాణపండ రాధాకృష్ణమూర్తి

ఫోన్ : 76356 | జయశ్రీ టాకీస్ కుడివైపు సందులో - రాజమండ్రి - 4.

రాజమండ్రి - ఆంధ్రాబ్యాంక్ - దేవీచౌక్ బ్రాంచ్ మేనేజర్ & స్టాఫ్ సౌజన్యంతో



ఓం శ్రీ గణేశాయ నమః
ఓం శ్రీకృష్ణ పరమాత్మనే నమః
శ్రీ శారదాంబాయై నమః

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-1 — అధ్యాయం-1

## శౌనకాదులు సూతుని ప్రశ్నించుట

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే.

శౌనకాదులు సూతుని ప్రశ్నించుట.

" పిబత భాగవతం రసమాలయం "

అది పరమ పావనమైన నైమిశారణ్యము. శౌనకాది మహర్షులు అక్కడ సత్రయాగం చేస్తున్నారు. వివిధ ప్రదేశాలనుండి మునులూ, మహర్షులూ విజయం చేసి ఆ సత్రయాగంలో పాల్గొన్నారు. స్వాహాకార, స్వధాకార వషట్కారాలతో ప్రాతర్మాధ్యందిన సవన విభాగంతో యజ్ఞం శాస్త్రమర్యాదానుసారం కొనసాగుతూన్నది. విరామ వేళలలో సూతర్షి వల్ల మునిజనులందరూ పురాణేతిహాసాలను ఆలకిస్తున్నారు. తద్గోష్ఠిలో సూతమహర్షి సృష్టి స్థితి సంహారాదులను గురించీ, సంతతి సమేతంగా మనువుల చరిత్రలూ, సప్త మహర్షులూ, మహేంద్రాది అమర శ్రేష్ఠులూ, అగ్నిష్వాత్తాది పితృగణమూ, గరుడ గంధర్వ యక్ష నాగాదులూ వారి పరివారమూ, సూర్య చంద్రుల వంశాలూ, వారిలో పవిత్ర చరిత్రలు కల భూపాలుర. మహనీయుల చరిత్రలూ సంగ్రహంగాను, సవిస్తరంగానూ విశదంగా వివరిస్తున్నాడు. కల్పకల్పాంతర గాథలూ, తత్సంబంధమైన అనేక విషయాలూ వర్ణిస్తూ సత్య, త్రేత, ద్వాపర కలియుగ ప్రమాణ, పరిణామ, లక్షణాదులను వర్ణిస్తూ అందలి ధర్మాదులను విశదీకరిస్తున్నాడు. ఓనాటి మాట. బ్రాహ్మీ ముహూర్తంలో ఆ సూత మహర్షి నిత్యకృత్యాలు

పూర్తి చేసి, అగ్ని కార్యాన్ని నిర్వర్తించి వ్యాసాసనాలంకృతుడైన నిరంజన - శౌనకాది మహర్షి గణం పురాణ వచనామృత రాగాల దాంతో అతణ్ణి ఆనందింప జేసి ఇలా ప్రశ్నించారు:

“సూత మునీంద్రా! సమస్త పురాణేతిహాస కథా కథన సమర్థుడవైన నీ ద్వారా కే మేము అనేక గాథలు ఆలకించాము. ప్రత్యే! చతుర్యుగ పరిభ్రమణంలోనూ కలియుగం వస్తూనే ఉంటుంది. ఈ యుగ లక్షణాలను తిలకించగా మహా భయ విచారాలు కలుగుతుంటాయి. వేదభూమి అయిన భారతావనిలో కూడ వేద విరుద్ధ ధర్మ ప్రచార మవుతాయి. స్వధర్మాన్ని విడనాడి విశేష సంఖ్యాకులు పర ధర్మాలను ఆచరిస్తారు. కుమారులు మాతా పితరులను ద్వేషిస్తుంటారు. కోడళ్ళు అత్త మామలను పీడిస్తుంటారు. గురు శిష్య పవిత్ర బంధం నాశనమై వారి మధ్య అంతర్యుద్ధాలు చెలరేగుతాయి. భార్యా భర్తలలో పరస్పర ప్రేమానురాగాలు లోపించి ఈర్ష్యా ద్వేషాదులు వర్ధిల్లుతూన్నాయి. మానవ సమాజం ఛిన్నాభిన్నమై, అస్తవ్యస్తమై యుక్తాయుక్త జ్ఞానం లేకుండా ఉంటూన్నది. అత్యల్పమైన ఆయుర్దాయ, మేధస్సులతో భార్యాపుత్ర విత్తాసక్త చిత్తాలతో పాపాచారులై విషయలోలురై కామభావంతో - సుఖ శబ్దార్థాన్నే గ్రహించ జాలక పరిభ్రమించేవారు ఆధివ్యాధులతో సదా దుఃఖ శోకాలనే అనుభవిస్తుంటారు. ఐహికాముష్మిక సుఖ శూన్యులై, హీనధనులై, సంతాన శూన్యులై జీవన పయనం సాగిస్తారు. కర్మ, ఉపాసన, జ్ఞానా లనే సాధన త్రయ విజ్ఞానమే లేక కలియుగ మానవ సుఖ శాంతి ప్రాప్తికి తరణోపాయ మేమిటా? అని మాకు దుఃఖము కలుగుతూన్నది. కలియుగ మానవ తరణోపాయ మార్గం ఏమైనా ఉన్నదా? లేదా - అన్న సందేహంతో మేము మధన పడుతున్నాము. సర్వ కాలజ్ఞుడవూ, వేదవేదాంగ పారగామివీ, అయిన నీ వల్ల ఈ సమస్యకు పరిష్కార మార్గాన్ని తెలియగోరుతూన్నాము.

పరమాత్మ యదువంశంలో అవతరించడానికి గల హేతువునూ, దివ్యలీలలనూ, వర్ణించు. నామ సంకీర్తన మాత్రంచే కాలచక్ర బంధితులైనవారు నిరతిశయా నందాన్ని ఎలా పొందగలుగుతారో వివరించు. శ్రీకృష్ణలీలా సంకీర్తన మాత్రంచే బ్రహ్మజ్ఞానులు సయితం దివ్యానందానుభూతిని పొందుతూన్నారుకదా! అట్టి శ్రీకృష్ణదేవుని దివ్యలీలా భూయిష్టమైన అమృత గాథలను యథాతథంగా వినాలన్న ఆసక్తితో ఉన్నాము. మోక్షాన్ని ప్రసాదించ నట్టి భగవత్కథామృతాన్ని పానం చెయ్యాలని ఎవరి కుండదు? శ్రీహరి లీలా భూయిష్టమూ, సమస్త మానవ తరణోపాయమూ అయిన పరమాత్మ గాథలను మాకు వినిపించి తద్వారా జగత్కళ్యాణాన్ని చేకూర్చెదవుగాక! స్వయంగా తాను పరమాత్మ అయి కూడ యోగ మాయను ఆశ్రయించి లోకానుసారం లీలా గృహీత శరీరుడై శ్రీకృష్ణుడు నటించాడు. ద్వాపర యుగాంతంలో అవతరించి కలియుగ ప్రవేశ వేళకు అంతర్ధానమై పోయాడు. శ్రీకృష్ణాశ్రయంలో ఉన్న ధర్మం-ఆయన అవతారం చాలించిన తరువాత ఎవరి నాశ్రయిం

చింది. ఆ ధర్మాన్ని గ్రహించలేని కలియుగ మానవుల గతి ఏమవుతుంది? నదీ తరణానికి నావికు డాధార మైనట్లే ఈ సంసార సాగర తరణానికి, కలియుగ మానవులకు నువ్వు మహా నావికుడవే. వీరిని తరింప జేయడానికి నిన్ను మించినవారు లేరు. దయచేసి మా సందేహాలను నివారించి కలియుగ మానవ తరణోపాయ మార్గాన్ని వివరించెదవు గాక!" అంటూ శౌనకాది మహర్షులు మౌనం దాల్చారు.

---

శ్రీకృష్ణ పరమాత్మనే నమః.

స్కంధం - 1 అధ్యాయం - 2

## భగవత్కథ - భక్తి మాహాత్మ్యము

కలియుగ మానవ తరణోపాయాన్ని సువ్యక్తం చేస్తూ-శౌనకాది మహర్షుల సందేహాలను పరిహారం చేసే మహా సంకల్పంతో సూత మునిచంద్రుడు ప్రారంభించ :-

బ్రహ్మనిష్ఠుడై ఉపనయన సంస్కారం కుండానే కర్మలను అన్నింటినీ పరిత్యజించి పురోగమిస్తున్న పుత్రుని తిలకించి — ఆ వియోగ దుఃఖంతో వ్యాస మహర్షి-"పుత్రా! పుత్రా! అని ఎలుగెత్తి పిలుస్తుంటే తన్మయ భావంతో ముందుకు వెళ్ళిపోతున్న శుకమునీంద్రుని వైపు నుండి "ఓ - ఓ" అని తరువులు బదులు పలుకుతున్నట్లు ప్రతిధ్వనిస్తున్నాయి. అట్టి సర్వభూత హృదయుడైన శుక మునీంద్రులకు ప్రణామం చేస్తున్నాను. అధ్యాత్మ తత్వ ప్రతిపాదితమై, మనుష్య మాత్రులను సంసార దుఃఖ సముద్రం నుండి ముక్తులను చేయగల సర్వ శక్తి సంపన్నమై పురాణ తిలకమైన మహా భాగవతాన్ని ప్రవచనం చేసిన శుకముని చంద్రులకు వందనాలు. నర నారాయణులకూ, సరస్వతీ మాతకూ, వ్యాస మహర్షికీ ప్రణమిల్లి జయరూపమైన భాగవత మహా పురాణాన్ని పఠించాలి."

పై విధంగా ప్రాచీన సంప్రదాయాన్ని పాటించి సూత మహర్షి పరమ ప్రసన్న చేతస్కుడై చెబుతున్నాడు: "శౌనకాదులారా! జగత్కల్యాణాభిలాషతో అడిగిన మీ ప్రశ్నలకు నాకు మహానందం కలుగుతున్నది. మీ ప్రశ్నలలో ఆత్మశుద్ధి ఏర్పడడానికి మహావకాశం కూడ వుంది. భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు వర్ధిల్లడమే గాక తద్ద్వారా మోక్షంకూడ పొంద వచ్చును. మోక్షాన్ని కోరేవారు అనన్యమైన ప్రేమతో కూడిన భక్తిని సాధనంగా చేసుకోవాలి. భక్తిలేని కర్మలు మోక్షాన్ని ప్రాప్తింప జేయలేవు. ధర్మఫలం మోక్షమే కానీ అర్థం కాజాలదు. ధర్మ సాధనమే అర్థంకానీ భోగానుభవాలకోసం మాత్రం కాదు. జీవనం కొరకే భోగ విలాసాలుకానీ ఇంద్రియ తృప్తికి మాత్రం కావు. ఈ జీవనానికి తత్త్వ జిజ్ఞాస ఫలం కాగా-చిత్తశుద్ధి కర్మలకు ఫలమవుతున్నది. జ్ఞాత - అజ్ఞాత భేద రహితంగా అఖండ, అద్వితీయ

జ్ఞానానుభవాన్నే తత్త్వ మన్నారు తత్త్వ వేత్తలు. దానినే కొందరు పరబ్రహ్మ మంటే మరి కొందరు పరమాత్మ అనీ, భగవంతుడనీ వ్యక్తం చేసారు. భాగవత మహాపురాణ శ్రవణ రూపమైన భక్తిద్వారా మహర్షులు ఆత్మానం దానుభూతిని పొందుతూన్నారు. వర్ణాశ్రమ ధర్మాలన్నీ భాగవతంలో అంతర్లీనమై ఉన్నాయి. దృఢమైన కర్మబంధ విచ్ఛేదనార్థం భాగవతాన్ని పఠించాలి. లేదా ఆలకించాలి. శ్రీకృష్ణ నామ సంకీర్తన ధ్యానాదుల ద్వారా పరమాత్మను అర్చించాలి. విజ్ఞానులైనవారు భగవచ్చింతన రూపమైన కరవాలంతో కర్మ బంధాలను ఖండించి వేస్తారు. మునీశ్వరులారా! తీర్థ క్షేత్ర సందర్శన సేవాదులద్వారా సత్సాంగత్యమూ, తద్ద్వారా సత్కథా శ్రవణమూ లభించి తద్ద్వారా భక్తిభావం వర్ధిల్లుతుంది. అట్టి భక్తుని హృదయ మందిరంలో పరమాత్మ నిత్య నివాసం చేస్తాడు. అతడు సమస్త పాపదూరుడై శ్రీకృష్ణ పరమాత్మ యందు అనన్య భక్తిని వర్ధిలజేసుకుంటూ పునరావృత్తి లేని మోక్ష పదాన్ని పొందుతాడు. ఏకమాత్రుడైన పరమాత్మ సత్త్వరజస్తమో గుణాలలో-బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకంగా ప్రాదుర్భవించి సృష్టి స్థితి సంహారాలు కొనసాగిస్తూంటాడు. కాష్ఠం, ధూమం, అగ్ని ఒకదానికంటె వేరొకటి శ్రేష్ఠమైనట్లే తమస్సు కంటె రజస్సూ, రజస్సు కంటె సత్త్వమూ శ్రేష్ఠమైనవిగా పరిగణింపబడుతూన్నాయి. భగవత్ ప్రాప్తి కలగాలంటే సత్త్వ గుణాన్నే ఆశ్రయించాలి. కనుకనే అనాది నుండీ మహర్షులు సనాతనుడైన పరమాత్మను పొందడానికి సత్త్వగుణాన్నే ఆశ్రయించి శ్రీహరిని శరణువేడి నిత్యానందానుభవం పొందేవారు.

పరాపవాదాలు చేయక, క్రూర కర్మ లాచరించక భయంకరమైన భైరవాది ఉపాసనలు కొనసాగించక సత్త్వ గుణాశ్రయుడైన శ్రీహరినీ, తదంశావతార మూర్తులనూ, కళావతార మూర్తులనూ ధ్యానించి ఆరాధిస్తూ మోక్షాన్ని ముముక్షువులైన వారు సాధించాలి. భార్యా పుత్ర ధనాసక్తచిత్తులై క్షుద్ర దేవతలను ఆరాధించునట్టి వారు ఈ మహా కాలచక్రంలో పడి తిరుగుతూండ వలసినదే! వేద వేదాంగ, పురాణేతిహాసాది విద్యలన్నీ శ్రీకృష్ణ భగవత్ ప్రాప్తి సాధనలనే సువ్యక్తం చేస్తూన్నాయి. యోగ, జ్ఞాన, భక్తి, తపోదానాది క్రియలన్నీ శ్రీకృష్ణ పరమాత్మ ప్రాప్తికి సాధనాలే. ఈ మాయా ప్రపంచంలో పరమాత్మ అనేక నామాలతో వివిధ రూపాలతో, భావింపబడుతూన్నా ఏకైకాగ్ని ఉపాధి భేదం కారణంగా అనేక రూపాలతో గోచరిస్తాడు. అట్లే అద్వితీయ పరమాత్మ కూడ మాయచే కల్పింపబడ్డ ఉపాధులు కారణంగా అనేక స్వరూపాలతో కనిపిస్తాడే కానీ వాస్తవానికి సజాతీయ, విజాతీయ స్వగత భేద రహితుడైన పరమాత్మ ఏకమాత్రుడే అయి ఉన్నాడు. మాయనాశ్రయించి ఆ పరంధాముడే చతురశీతి లక్షాత్మకమైన జీవ సముదాయాన్ని పంచ మహా భూతాదులనూ సృజించి ఆయా ప్రాణులకు అనుకూలమైన విషయ భోగాలను రచించి వివిధ రూపాలలో ప్రాదుర్భవిస్తూ ప్రాణి కోటిని రక్షిస్తూ వర్ధిల జేస్తూంటాడు.'

## స్కంధం-1 అధ్యాయం-3.
## అవతార వర్ణన

పరమాత్మకు విశ్వసృష్టి సంకల్పం కలగడంతో మహత్తత్త్వాదులతో కూడిన పురుష రూపాన్ని దాల్చాడు. అది దశేంద్రియ, మనో భూత పంచకాలతో నిండి ఉంటుంది. ఈ పదహారింటికీ షోడశ కళలని పేరు. వీటితో పరిపూర్ణుడైనవాడు కావడం వల్లనే శ్రీహరికి షోడశ కళా పరిపూర్ణుడన్న నామం విఖ్యాత మయింది. కారణ జలాలలో శ్రీహరి యోగనిద్రా పరవశుడై యుండగా ఆతని నాభి నుండి పద్మం పుట్టింది. దాని నుండి చతుర్ముఖ బ్రహ్మ అవతరించాడు. శ్రీహరి యొక్క విరాట్స్వరూపం నుండియే సమస్త లోకాలూ ప్రభవించాయి. సత్త్వ గుణ ప్రధానమైన ఆ రూపమే సర్వ విశ్వాలకూ కారణమై ఉంది. పరమయోగులైన వారు తద్రూపాన్నే అనేక సహస్ర శిరో నేత్ర హస్త పాద, కిరీట హార కేయూరాది భూషణ భూషిత మైనదిగా వర్ణించి, ధ్యానిస్తూంటారు. ఆదినారాయణుడైన అతనిలోనే చరాచర విశ్వమంతా సృజింపబడుతూంటుంది. ఆ పరమాత్మయే అఖండ బ్రహ్మచర్యాన్ని అవలంబించే నిమిత్తం సనక సనందన, సనత్కుమార, సనత్సుజాత రూపాలతో ప్రభవించి తేజరిల్లుతూంటాడు. భూమిని ఉద్ధరించే నిమిత్తం వరాహ రూపాన్ని దాల్చాడు. నారద రూపంలో పాంచ రాత్రాగమ ప్రచారం చేసాడు. నర నారాయణావతారాలు ఎత్తి మనో నిగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. కపిల రూపంలో అవతరించి సాంఖ్య యోగాన్ని బోధించాడు. ప్రహ్లాద, అలర్క భక్తులకు వేదాంతాన్ని దత్తాత్రేయ రూపంలో చేసాడు. ఆకూతీ రుచి ప్రజాపతులకు తనయుడై యమాది పుత్ర సమేతంగా స్వాయంభువమన్వంతరాన్ని సంరక్షించాడు. మేరుదేవీ నాభుల తపః ఫలంగా ఋషభుడై జన్మించి, ఋషులకు పరమ హంస తత్త్వోపదేశం చేసాడు. పృథురాజు రూపంతో భూమిని సమస్త సస్య సమృద్ధం చేసాడు. చాక్షుష మన్వంతరం అంతం కాబోతూండగా మత్స్యమూర్తియై దివ్యమైన నౌకలో వైవస్వత మన్వాదులను సంరక్షించాడు. క్షీర సాగర మథనవేళలో కూర్మరూపధరుడై మందరగిరి నెత్తి ధన్వంతరీ స్వరూపంలో అమృత హస్తుడై తేజరిల్లాడు. ఇంకా ఊరుకోక జగన్మోహినీ రూపంలో అమృతాన్ని అమరులకు అందించాడు. నృసింహావతార మెత్తి హిరణ్యకశిపుని అంతం చేసి ప్రహ్లాద భక్తుని రక్షించాడు. వామన రూపంలో బలి చక్రవర్తిని బంధించి స్వర్గరాజ్యాన్ని మహేంద్రునికి వప్పగించాడు. దుష్ట క్షత్రియ సంహారార్థం పరశురామావతారమెత్తి ధర్మాన్ని రక్షించాడు. వేదవ్యాస రూపంలో శృతి స్మృతి పురాణేతిహాసాలను రచించి ప్రచారం చేసాడు. రావణ వధార్థం దశరథరాముడై దుష్ట రాక్షస సంహారం చేసి ధర్మ మర్యాదను కాపాడాడు. భూభారాన్ని రూపుమాప బలరామ, శ్రీకృష్ణ రూపాలను ధరించి దివ్యలీలలను ప్రకటించాడు

జిన కుమారుడై బుద్ధావతారంతో ధర్మ, దేవ ద్వేషులను అంతం చేసాడు.

కలియుగాంతంలో చోరులే శాసకులు కాగా వేదన పడే ప్రజలను సంరక్షించే నిమిత్తం కల్క్యవతారమెత్తి దుష్టశిక్షణచేసి ధర్మాన్ని సంస్థాపిస్తాడు. మునులారా! తత్త్వనిధియైన శ్రీహరి భగవానుని నుండి అంశావతార, కళావ తారాలు ఆవిర్భవించడమే కాకుండ దేవ,ఋషి, మానవాదిగా గల శక్తిశాలురు కూడ జన్మించి జగత్కళ్యాణం కోసం కృషి చేస్తూంటారు.

శ్రీకృష్ణావతారం పరిపూర్ణావతారం. శేషించిన అవతారాలన్నీ అంశావతారాల క్రింద పరిగణించారు. ప్రాణి సముదాయానికి కష్ట పరంపరలు వచ్చినప్పుడల్లా పరమాత్మ ఏదో ఓ రూపంతో అవతారమెత్తి వారిని కష్టపరంపరల నుండి సంరక్షిస్తూంటాడు. రహస్యమై పరమ పావనమైన ఈ భగవద్గాథలను సంధ్యా సమయాలలో పఠించినా, ఆలకించినా దుఃఖాలన్నీ నాశనమై పోతాయి. మాయవల్లనే రూపం లేని పరమాత్మకు ఈ రూపాదులన్నీ కల్పన చేయబడుతూంటాయి. వాయువును ఆశ్రయించిన మేఘాలు - ఆకాశాన్ని ఆశ్రయించాయని జ్ఞాన శూన్యులు భావించునట్లు మాయను ఆశ్రయించిన విశ్వాన్ని పరమాత్మలో ఆరోపణ చేస్తూంటారు. ఆత్మయందు - స్థూల, సూక్ష్మ దేహాదులను ఆరోపించడం కేవలం అజ్ఞానమే కానీ యదార్థం మాత్రం కాదు. ఆత్మ సాక్షాత్కారానంతరం ఇవన్నీ పోయి బ్రహ్మానందానుభూతి కలుగుతుంది. బుద్ధిరూపమైన మాయ నాశనం కావడంతో జీవుడానందమయుడవుతాడు. పరమాత్మ యందు జనన మరణాదులు లేవు. ఆ దేవదేవుని దివ్యలీలలన్నీ వేద రహస్యాలు. ఆతని లీలలే సృష్టి స్థితి సంహారాలు - సర్వ తంత్ర స్వతంత్రుడైన ఆతని లీలాదులను జ్ఞానహీనులు గ్రహించలేరు. అనంతుడైన పరమాత్మ అఖిలాండకోటి బ్రహ్మాండాలను సృష్టించి వాటి కతీతుడై ఉంటాడు. నిష్కపట చిత్తునికి మాత్రమే, భగవంతుని యందు అచంచల విశ్వాసం కల భక్తునికి మాత్రమే ఆ లీలలు అర్థమవుతాయి. శౌనకాది మహర్షులారా! మీరట్టి పరమ భాగవతోత్తములే. కనుక జనన మరణ రూపమైన కాలచక్రంలో మీరు బంధించబడరు.

వేదవ్యాస మహర్షి విరచితమై-గంగాతీరంలో పరీక్షిన్మహారాజుకు శుక మునీంద్రుల ద్వారా వినిపించబడిన భాగవత మహాపురాణాన్ని వినిపిస్తాను వినండి. ఈ భాగవతం సర్వ విద్యాసారమైనదే గాక భవబంధాలనుండి మానవమాత్రులను విముక్తులను చేయగల దివ్య సాధనం కూడాను" అన్నాడు.

---

## స్కంధం-1 అధ్యాయం-4.

## వ్యాసుని విచారము.

ఆ రీతిగా సూత మునిచంద్రుడు పలుకగా చారు శ్రద్ధా భక్తులతో శౌనకాది మహర్షులు ప్రశ్నిం — "సూత మునీంద్రా! సర్వ శ్రేష్ఠ వక్తా! శుకమునీంద్ర ప్రోక్తమైన భాగవత

పురాణ గాథలను మాకు వినిపించండి. ఏ యుగంలో ఎట్టి స్థానంలో ఈ పవిత్రగాథ ఏ కారణంచేత చెప్పబడింది? వ్యాసర్షికి అసలు భాగవత రచనకు ప్రేరణ కలిగించిన వారెవరు? శుకమహర్షి పరమయోగి, సర్వ సమదర్శి, బ్రహ్మానుసంధాత, గోదోహన కాలం కంటె ఎక్కడా ఉండనివాడే! అట్టివాడు భాగవత గాథ పూర్ణమయే వరకూ పరీక్షిన్మహారాజు దగ్గర ఎలా ఉండ గలిగాడు. ఉపనయన సంస్కారం పూర్తికాక ముందే అతడు సన్యాసియై పురోగమిస్తూంటే - దిగంబరంగా స్నానం చేసే స్త్రీలు సిగ్గు పడలేదే. ఆ సమయంలోనే వారు వ్యాసర్షిని దర్శించి లజ్జతో వస్త్రధారణ చేయడమే కాక - ఆయన అదేమిటని ప్రశ్నించగా - సర్వాత్మ భావం కల శుకుని దర్శించడం వల్ల తమకు సిగ్గు కలగలేదనీ - స్త్రీ పురుష భేద భావం కల మిమ్మల్ని వృద్ధులయినా, చూడగా సిగ్గు కలిగినదనీ వారు సమాధానం చెప్పారు. జడబధిరోన్మత్త లక్షణ లక్షితుడైన శుకుని పరీక్షిన్మహారాజు ఎలా గ్రహించగలిగాడు? ఆ రాజుయొక్క జన్మ కర్మ లెట్టివి? అతడు సామ్రాజ్యాన్ని ఏల త్యజించవలసి వచ్చింది? గంగా తటాన అతడు ఉండవలసిన అగత్య మేమిటి? సర్వజ్ఞుడవైన నువ్వు మాకివన్నీ సవిస్తరంగా చెప్పు."

పై విధంగా ప్రశ్నించగా సూతుడు శౌనకాది మహర్షులకు సమాధానం చెబుతూన్నాడు. "జిజ్ఞాసువులారా - వైవస్వత మన్వంతరంలో 27 మహాయుగాలు అంతమైనాయి. 28వ పర్యాయం చతుర్యుగ పరిభ్రమణం జరగడంతో కృత యుగ, త్రేతాయుగాలు పరిసమాప్తమైనమీదట ద్వాపరాంత వేళలో - శ్రీహరి కళావతార మూర్తిగా వేదవ్యాస మహర్షి పాదుర్భవించాడు. సరస్వతీ తీరంలో ఆశ్రమాన్ని నిర్మించుకుని తపస్సుద్వారా సర్వజ్ఞుడై - రాబోయే కలియుగ లక్షణాదులను దివ్యదృష్ట్యా తిలకించాడు. అవన్నీ ప్రమాద భరితంగా అతనికి గోచరమయ్యాయి. అల్పాయుర్దాయంతో, స్వల్పమైన మేధస్సుతో మానవమాత్రులు దురాచారులై సంచరించడం వస్తువులన్నీ నిస్సారమైపోవడమూ వేద ధర్మ శూన్యులై భక్తిశ్రద్ధలు లేక - మానవమాత్రులు అమూల్య కాలాన్ని వ్యర్థం చేయడం వల్ల సర్వ విధాలా భ్రష్టులైపోతారని గ్రహించి - వ్యాసర్షి ఏకరూపంలో ఉన్న వేదాన్ని విభజించి పైల, జైమిని, సుమంత, వైశంపాయన మహర్షులకు బోధించాడు. వారు ఒక్కొక్క శాఖను శాఖోపశాఖలుగా విభజించి అసంఖ్యాలకు ఉపదేశించారు. అయినా వ్యాసుడు సంతృప్తి పొందక-మహాపురాణ మహాభారతాదులను రచించాడు. అయినా ఆ మహామనీషికి శాంతి లభించలేదు. భగవతత్త్వాన్ని నిరూపణ చేయగల గ్రంథ రత్నాన్ని వ్రాయక పోవడం వల్లనే తనకు ఈ అశాంతి కలుగుతూన్నదని గ్రహించి సరస్వతీ నదీతటాన వటవృక్ష ఛాయలో ఆసీనుడై ఉదాసీనంగా ఏదో యోచిస్తూన్నాడు. తత్సమయంలో అతని దగ్గరకు నారద దేవర్షి విచ్చేయగా వ్యాసుడతణ్ణి అర్ఘ్య పాద్యాది విధులచే అర్చించి సుఖాసనం ఇచ్చాడు.

## స్కంధం-1 అధ్యాయం-5.

## కీర్తన మహిమ

అంత దేవర్షి సుఖాసీనుడై మందస్మితం చేస్తూ - "పరాశరాత్మజా! సర్వజ్ఞుడవైన నువ్వు నాలుగు వేదాల సారంగా - పంచమ వేదమైన మహాభారతాన్నీ, పురాణోప పురాణాలనూ వ్రాసావు.అంతే గాక వేదవిభాగం చేసిన మహాత్ముడవు. అట్టి నువ్వు ఉదాసీనుడవై ఉండడానికి గల కారణం ఏమిటి? జ్ఞానివైన నీనంటి వానికి కూడ విచారమా? ఇది తగునా?" అని ప్రశ్నించగా వ్యాసర్షి బదులు పలుకుతూన్నాడు. "దేవర్షీ! నువ్వు చెప్పినది వాస్తవమే. వేదాలను విభజించి, మహాపురాణోప పురాణాలను రచించి, వేదసారమైన పంచమ వేదంగా మహాభారతాన్ని ప్రపంచానికి అందించినా నేను శాంతిని పొందలేక పోతూన్నాను. తద్వారా నాకు సంపూర్ణానందమూ లభించడం లేదు, హేతువును అవగాహన చేసుకోలేక పోతూన్నాను. దేవర్షీ! బ్రహ్మమానస పుత్రుడవూ, సర్వజ్ఞుడవూ, విశేషించి భగవద్భక్త శ్రేష్ఠుడవూ కావడం వల్ల నీకు తెలియనిది లేదు. జగత్రయ సంచారివై, భగవత్తత్త్వాన్ని గ్రహించిన మహాత్ముల అగ్రస్థానాన్ని అలంకరించిన నీవు యోగబలం ద్వారా సర్వ జీవ హృదయాంతర్వర్తివై సర్వ సాక్షిగా వుంటావు. పరమ ప్రభువైన శ్రీహరికీ, నీకు అవినాభావ బంధముంది. కావున మోక్షేచ్ఛ గలవారికి నీ దర్శన భాగ్యం తత్సాధన మవుతుంది. యోగ సాధనల ద్వారా నేను శబ్దబ్రహ్మలను గుర్తించి కూడ - సంపూర్ణానందాన్ని పొందలేకపోతూన్నాను. అందుకు గల కారణాన్ని విశదీకరించు" అని అర్థించగా దేవర్షి నిమీలిత నేత్రుడై యోచించి ప్రవచించ సాగాడు :-

"కృష్ణద్వైపాయనా! ఈ క్షణం వరకూ నువ్వు చేసిని కృషి, కొనసాగించిన గ్రంథ రచనాదులూ, సర్వమూ ధర్మార్థ కామాదులకు సంబంధించినవే. మోక్ష సాధనమూ, భగవద్గుణానుకీర్తనసంభరితమూ అయిన గ్రంథరత్నాన్ని జగద్వాసులకు ప్రసాదించలేదు. తత్కారణం వల్లనే నీకు పూర్ణానందం లభించలేదు. ప్రాపంచిక వర్ణనాదులు ఎన్ని కొనసాగించినా నిరతిశయానందాన్ని ప్రాప్తింప జేయజాలవు. శ్రీహరి లీలాభూయిష్టమైన గ్రంథమే నిరతిశయమైన ఆనందాన్ని ప్రసాదిస్తుంది.

* * *

వ్యాసమునీంద్రా! గత కల్పంలో నేను దాసీ పుత్రుణ్ణి. వేదవిదులయిన బ్రాహ్మణుల సన్నిధిలో నా జనని సేవలు చేసేది. ఆ భూసురోత్తములు చాతుర్మాస దీక్షలో ఉండగా బాల్యావస్థలో ఉన్న నేను కూడ తత్కాలంలో వారికి సేవలుచేసే వాణ్ణి. ఆ రోజులలో వారు భుజించగా మిగిలిన దానిని తింటూ భగవన్నామస్మరణతో ఆ మహాత్ముల ద్వారా శ్రీకృష్ణ తత్త్వాన్ని

ఆలకిస్తూ కాలక్షేపం చేస్తూన్నాను. ఆ పుణ్య ఫలంగా నాలో సంపూర్ణ భగవద్భక్తి అంకురించింది. సర్వ మానవ తరణోపాయమైన హరి భక్తితో కాలాన్ని గడిపే వాణ్ణి. ఆ భూసుర శ్రేష్ఠులయందు నాకు గల శ్రద్ధాభక్తులకు వారు ప్రసన్నులై - దీక్షా పరిసమాప్త్యనంతరం - ఆ మహాత్ములు మరలి పోయే సమయంలో నాకు అత్యంత రహస్యమైన జ్ఞానోపదేశం చేసారు. ఆ జ్ఞానం వల్ల నేను భగవన్మాయను గ్రహించ గలిగాను. మాయను గ్రహించిన మానవునికి మోక్ష ప్రాప్తి సునాయాసమే కదా! అందులకే నేను మాయా పరికల్పిత మైన సంసార వాంఛను పరిత్యజించి సతతం శ్రీహరి నామ సంకీర్తనంతోనే కాలం గడుపుతున్నాను. భగః ద్భక్తి మాత్రం చేతనే నాకీ జ్ఞానం కలిగింది. మునీంద్రా! సర్వ కర్మ ఫలాలనూ శ్రీకృష్ణార్పణం చేయ గలిగితే తాప త్రయం నాశన మవుతుంది. ఏ వస్తు సేవనం ద్వారా రోగం వస్తుందో తద్వస్తువునే ఔషధ రూపంలో ప్రయోగించ గలిగితే ఆ రోగం నాశన మవుతుంది. అలానే జనన మరణాలను కల్పించునట్టి కర్మలను భగవదర్పణం చేయ గలిగితే నిత్యానందం లభిస్తుంది. ఈ జగత్తులో శాస్త్ర ప్రతిపాదిత కర్మలన్నీ పరాభక్తినే ప్రసాదిస్తాయి. భగవదాజ్ఞానుసారం జ్ఞానులయిన వారు కర్మల నాచరిస్తూ నిరంతర భగవత్స్మరణతో ఉంటారు. ఓ వాసుదేవా! నీకు ప్రణామము, నిన్ను మేము ధ్యానిస్తూన్నాము. ప్రద్యుమ్న అనిరుద్ధ, సంకర్షణాది రూపాలకు వందనాలు. - అని ఈ ప్రకారంగా శ్రీహరి యొక్క చతుర్వ్యూహ రూపాల ద్వారా, ప్రాకృతమూర్తి రహితమగు నట్టి యజ్ఞ పురుషుని పూజించి, ధ్యానించునట్టి వాడు మాత్రమే యదార్థమైన జ్ఞానం కలవాడు భగవదాజ్ఞను పాలించిన నాకు పరమాత్మ ఆత్మ జ్ఞానోపదేశం చేసి ఐశ్వర్య భాః రూపమైన భక్తిని అనుగ్రహించాడు. కనుక వ్యాసా! భగః ద్భక్తితో నువ్వు శ్రీహరి లీలనే వర్ణించు - తద్ద్వారా జ్ఞానుల జిజ్ఞాస పరిపూర్ణ మవుతుంది. మనుష్య మాత్రుల దుఃఖాలన్నీ నశించి నిత్యానందాన్ని పొందడానికి ఇంతకంటె అన్య మార్గం లేదు. భగవల్లీలా భూయిష్టమైన గ్రంథ రచన చేసి జగత్కళ్యాణంతో నువ్వు ఆత్మ కళ్యాణాన్ని సాధించాలి."

## స్కంధం - 1 అధ్యాయం - 6

## నారదుని పూర్వ వృత్తాంతము

దేవర్షి ముఖతః ఆయన వృత్తాంతాన్ని ఆలకించిన వేదవ్యాస మహర్షి - "నారదా! నీకు జ్ఞానోపదేశం చేసిన మహాత్ములు వెళ్ళి పోయిన తరువాత నువ్వేమి చేసావు? తత్సమయానికి నీది బాల్యావస్థ కదా! మిగిలిన కాలాన్ని ఎలా ఎక్కడ గడిపావు? ఆ దేహాన్ని ఎలా విడిచావు? సర్వ వస్తువులనూ అంతం చేసేది కాలమే కదా! పూర్వ కల్ప స్మృతి నీ కెందుకు నాశనం కాలేదు? నా సందేహాలకు సవిస్తరంగా సమాధానం చెప్పు". అని కోరిన

వ్యాస మహర్షికి దేవర్షి పలుకుతూన్నాడు – "కృష్ణద్వైపాయనా! నాకు జ్ఞానోపదేశం చేసిన మహనీయులు వెళ్ళిపోయిన తరువాత బాల్య దశలో ఉన్న నేను నా జనని దగ్గరే ఉంటూ కాలయాపన చేస్తూన్నాను. ఆమె స్త్రీ – పైగా మూఢురాలు. వృత్తి రీత్యా దాసీది. ఆమెకు నేను ఏకమాత్ర సంతానాన్ని – అందువల్ల ఆమె నన్ను గారాబంగా చూసేది. నా యోగ క్షేమ చింతన వినా ఆమెకు వేరే ధ్యాస లేదు పరాధీన జీవనం కారణంగా అనుకున్నంతగా ఆమె నాకు సహకరించలేక పోయేది.

సూత్రధారుడు బొమ్మ నాడించిన రీతిగా పరమాత్మ ఈ మానవులను కర్మ సూత్ర బంధితులను చేసి ఆడిస్తూంటాడు. పంచవర్ష ప్రాయంలో ఉండగా నా జననిని పాము కరవగా ఆమె మరణించింది. నా కున్న ఏకమాత్ర బంధనంకూడ భగవదనుగ్రహం వల్ల ఖండింపబడి పోయింది. సర్వం ఈశ్వర ప్రేరణగా భావన చేసి ఉత్తర దిశగా నేను పయనం సాగించాను. సస్య శ్యామలమైన స్థానాలనూ, నదీనద నగర గ్రామ జన పదాదులనూ అధిగమించి క్రమంగా భయంకర మృగాకీర్ణమైన ఘోరారణ్యంలో ప్రవేశించాను. ఇంద్రియాలలో శక్తి సన్నగిల్లింది. దేహంలో బలం లేదు. క్షుత్పిపాసలు పీడించివేస్తూన్నాయి. ఎలాగో వేదన చెంది భయంకరారణ్యంలో కల ఓ నదిని చేరి అక్కడ స్నానం చేసి జలాలను పానం చేసాను. ఆ విజనారణ్యంలో ఓ అశ్వత్థవృక్ష చ్ఛాయలో కూర్చుని నాకు ఆ మహనీయులు ఉపదేశించిన నామాన్ని స్మరిస్తూ తద్రూపాన్నే ధ్యానిస్తూ భగవచ్చరణాల మీదనే దృష్టిని కేంద్రీకరించి తపస్సు చేయ నారంభించాను. శీతవాత ఆతపాదులను కూడ లెక్కచేయకుండ కొనసాగించే నా తపస్సు ఫలించింది. ఓనాడు దివ్య మంగళ సుందరమూర్తి యైన శ్రీకృష్ణభగవానుడు నా హృదయంలో దర్శన మిచ్చాడు. తత్సమయంలో ప్రేమభావం ద్వారా ఉత్పన్నమైన ఆవేశం వల్ల శరీరం రోమాంచిత మయింది. నయనాలు ఆనందబాష్ప జాలా సంభరితాలయ్యాయి. శాంతరస ప్లావితమై నా హృదయం శీతలమయింది. అనిర్వచ నీయానందానుభూతిని ప్రసాదిస్తూ – సర్వ దుఃఖ నాశనకారకమైన తద్రూపాన్ని సందర్శిస్తూండగానే ఆ దివ్య మంగళ సుందర శ్రీహరి రూపం అదృశ్యమై పోయింది. అనంతరం ఎంతగా ప్రయత్నించినా తద్రూపాన్ని నేను దర్శించలేక పోయాను. ఆ ప్రయత్నంలో నే నుండగా ఓనాడు అశరీర వాణి యిలా పలికింది –

"వత్సా! ఈ జన్మలో నీకు నా దర్శనం కాదు. జన్మాంతర వాసనలు నీ కింకా నశించ లేదు. అట్టి దశలో ఉన్న వారికి నా దర్శనం కలగదు. జన్మాంతర వాసనలను నాశనం చేసు కోగల సాధకునకు మాత్రమే, నా ప్రాప్తి అవుతుంది. మరో మార్గం ద్వారా నా దర్శనం దుర్లభమే. నా యందలి భక్తి వర్ధిల్లడానికి ఒకే ఒక పర్యాయం నేను నీకు దర్శన మిచ్చాను. నాపై నీకు అచంచల భక్తి – కేవలం – అత్యల్పమైన సత్పురుష సంసేవనం మాత్రంచే లభించింది. ఈ పాంచ భౌతిక దేహాన్ని త్యజించి – నువ్వు వైకుంఠధామంలో నా పార్షదులలో

ఒకడనై తేజరిల్లగలవు. నాపై నీకు గల భక్తి ప్రేమలు శాశ్వతంగా వుంటాయి. ప్రళయానంతరం కూడ నీ భావాలు అలానే వుంటాయి. అవన్నీ హరివాక్యాలుగానే భావించి దృఢ విశ్వాసంతో దైవ నామ సంకీర్తనతో నేను కాలం గడుపుతూండగా నా వాసనా సర్వస్వం నశించింది. పరిశుద్ధాంత రంగుడనై ఉండగా కాల మాసన్నం కావడంతో ఈ దేహాన్ని త్యజించి విష్ణుపార్షదుడనై వైకుంఠ ధామాన్ని పొంది కల్పాంతంలో సృష్టికర్త అయిన బ్రహ్మ దేవునిలో ప్రవేశించి చిరకాలానంతరం సృష్టి ప్రారంభ వేళలో బ్రహ్మ భగవానుని నుండి మరీచ్యాదులతో బాటు ప్రభవించాను. నాటి నుండీ హరి కరుణతో సమస్త లోకాలలో పరిభ్రమిస్తూ దైవ ప్రసాద లబ్ధమైన మహతీ వీణా నాదం చేసుకుంటూ భగవల్లీలా భూయిష్ట గుణగానంతో ఉంటూన్నాను. నేను గానాలాపన ఆరంభించేసరికి — తత్క్షణంలోనే పరమాత్మ నా హృదయ మందిరంలో దర్శన మిస్తాడు. సమస్త చిత్తవృత్తులనూ నిరోధించి హరినామ సంకీర్తనం చేయగలవాడు అపార సంసార సాగరాన్ని దాటగలుగుతాడు. అంతే కాదు అతనికే నిరతిశయానందం కూడ లభిస్తుంది. కనుక పాపరహితుడవూ, పరమయోగివీ కావడంవల్ల నీది సార్థకమైన జన్మయే. శ్రీహరి భగవానుని లీలా భూయిష్టమైన పవిత్ర చరిత్రలను రచించి నువ్వు విశేషంగా ప్రచారం చెయ్యి. తద్ద్వారా ఆత్మకళ్యాణంతో జగత్ కళ్యాణం చేకూరుతుంది'' అని భాగవత ధర్మాన్ని నారదమహర్షి ప్రబోధించి వెళ్ళిపోయాడు. అట్టి నారదమహర్షి ధన్యుడు కదా !'' అని సూతముని చంద్రుడు శౌనకాది మహర్షులకు అనంతర గాథను వర్ణిస్తూన్నాడు.

## స్కంధం-1 — అధ్యాయం-7

## ఉపపాండవ సంహారం - అశ్వత్థామ గర్వభంగం

శౌనకాది మహర్షులారా ! దేవర్షి నారదుడు వెళ్ళిపోయిన తరువాత వ్యాస మహర్షి సరస్వతీ నదికి పశ్చిమ తటాన గల 'శమ్యాప్రాసం' అనే ఆశ్రమం చేరాడు. అక్కడ మహర్షులు యజ్ఞ సంలగ్నులై ఉన్నారు. తత్సమీపంలోనే వ్యాసాశ్రమం కూడ ఉంది. ఆశ్రమాన్ని పరివేష్టించి బదరీ వృక్షాలున్నాయి. నిజాశ్రమంలో వ్యాసమహర్షి సమాహితచిత్తుడై - ఆచమించి ధ్యానంలో పరమాత్మనూ అతని మహామాయా శక్తినీ దర్శించాడు. త్రిగుణాతీతులైన వారు కూ భగవన్మాయా మోహితులయిన జీవులు గుణాత్మల స్థితిలోనే ఉంటూన్నారు. తత్కారణం వల్ల తద్విషయాలకు లోనై అనేకమైన కష్టాలు అనుభవిస్తూన్నారు. ప్రాపంచికమైన దుఃఖాలన్నీ నశించాలంటే భక్తియోగం వినా అన్య మార్గం లేదు. దీనిని మూఢులు గ్రహించలేకున్నారని తెలిసికొని - ఆ మహా మునీంద్రుడు భ[illegible] వైరాగ్యాలను సుగమంగా బోధించగల భాగవత మహా పురాణాన్ని రచించి ప్రప్రథమంగా - తత్త్వవేత్త,

తన పుత్రుడూ అయిన శుక మహర్షికి ఉపదేశించాడు'' అని సూతమహర్షి పలుకగానే శౌనకాదులందుకుని - ''మహాత్మా! సూతా! సర్వసంగ పరిత్యాగి అయిన శుకయోగీంద్రుడు ఈ పురాణాన్ని అధ్యయనం చేయడానికి గల కారణం ఏమిటి?'' అని ప్రశ్నించాడు.

దానికి సూతుడు ఇలా బదులు పలికాడు :-

శౌనకాది మునీంద్రులారా! ఆత్మారాములైన మహాజ్ఞానులుకూడ అకారణంగా భగవత్ సేవ చేస్తూంటారు. అదియే భగవద్గుణ లీలలో కల మాధుర్యము. భక్తజన ప్రియుడైన శుక మహర్షి శ్రీకృష్ణ ధ్యాన పరవశుడై మహోత్తమమైన భాగవత మహాపురాణాన్ని అధ్యయనం చేసాడు. పరీక్షిన్మహారాజు రాజర్షి - అతని జన్మకర్మాదులూ, పాండవేయుల స్వర్గారోహణ చరిత్రా చెబుతాను. ఇందులో శ్రీకృష్ణ లీలా పరిపూర్ణమైన పావన గాథలెన్నో వస్తాయి. అవన్నీ మోక్ష కారకాలే. కురు పాండవ భండన రంగంలో ఎందరో మహాయోధులు ఇరుపక్షాలలోనూ నేలపాలయ్యారు. భీమసేన గదాఘాత మాత్రంచే దుర్యోధనుడు తొడలు విరిగి పడిపోయాడు. ఆ స్థితిలో ఉన్న దుర్యోధనునికి ఆనందాన్ని ప్రసాదించాలని - అశ్వత్థామ ఉపపాండవులను దారుణంగా అంతం చేసాడు. అది మహా నీచమైన కార్యం కావడం వల్ల దుర్యోధనుడు కూడ సంతోషించలేదు. ఇరు పక్షాలవారూ అశ్వత్థామను దూషించారు. పుత్రశోకార్తయై పాంచాల రాజపుత్రి ద్రౌపదీదేవి కన్నీరు మున్నీరుగా విలపించడం చూసి - అర్జునుడు-''దేవీ! ఆ బ్రాహ్మణాధముణ్ణి అంతం చేసి, వాని శిరస్సును నీకు బహుమానంగా యిచ్చి, నీ శోకాన్ని రూపుమాపుతాను. వాడి శిరస్సును నువ్వు కాలదన్ని స్నానంచేసి సంతోషించెదవు గాక!'' అంటూ ఆమె నోదార్చి - శ్రీకృష్ణునితో యోచించి - అతనినే సారథిగా చేసుకుని కవచధారియై అశ్వత్థామను వెంబడించి శస్త్రాస్త్ర ప్రయోగం చేస్తూండగా - ప్రాణ సంరక్షణేచ్ఛతో అశ్వత్థామ ప్రయోగమే కానీ ఉపసంహార మెరుగని బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్రం సమస్త దిశలలోనూ తేజోరూపంలో పరివ్యాప్త మవుతూన్నది. దానిని చూసి అర్జునుడు ప్రాణాపాయ భీతితో- ''కృష్ణా! సచ్చిదానంద స్వరూపా! భవదీయానంత శక్తితో శరణాగతులకు అభయ ప్రదానం చేయడం నీ సహజ లక్షణం. పరాత్పరుడవైన నీ అనంత ప్రభావం వల్ల మాయామోహితులయిన వారిని నువ్వు ధర్మాదిగా గల స్వరూపాలను ధారణచేసి సంరక్షిస్తూంటావు. భూభార హరణార్థమూ, స్మరించి ధ్యానించునట్టి భక్తజనులకు మోక్షాన్ని ప్రసాదించడానికీ నువ్వు అవతరించావు. దేవా! ఈ మహా తేజస్సు ఎక్కడ నుండి వస్తూన్నది? దీని యదార్థ స్వరూపం నాకు బోధపడడం లేదు'' అంటూ భ్రాంతుడై ప్రశ్నించిన అర్జునునికి అభయదానం చేస్తూ శ్రీకృష్ణుడు - పార్థా! ఇది ద్రౌణి ప్రయోగించిన బ్రహ్మాస్త్రం - అతడు దీనిని ఉపసంహారం తెలియకుండానే ప్రయోగించాడు. ఇది దేనిచేతా శాంతించదు. బ్రహ్మాస్త్రం ద్వారానే దీని శక్తిని శాంతింపజెయ్యాలి. కనుక

నువ్వు బ్రహ్మాస్త్రాన్ని సంధించి తద్వారా దీనిని శాంతింపజెయ్యి" అనగానే వైరి వీర భయంకరుడైన అర్జునుడు ఆచమించి వాసు దేవునకు ప్రదక్షిణ ప్రణామాలు చేసి బ్రహ్మా స్త్రాన్ని ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్రాలు స్ఫురం వర్ధిల్లుతూ ఎదుర్కొంటూ ప్రళ యాగ్ని సన్నిభంగా వ్యాపిస్తున్నాయి. ఆ జ్వాలల్లో జీవరాశి విశేషంగా దగ్ధమై పోతూ న్నది. అది గ్రహించి వాసుదేవుడు పార్థునికి అయ్యస్త్రాలను ఉపసంహరించ వలసినదిగా ఆదే శించాడు. వెంటనే పార్థుడు వాటిని ఉపసంహ రించి మహా క్రోధంతో అశ్వత్థామపై పడి రజ్జువులతో అతణ్ణి బంధించి తీసుకు వచ్చి ద్రౌపది ముందు నిలబెట్టి - "దేవీ ! నీ పుత్ర హంతకుడైన బ్రాహ్మణాధముడు యిడుగో. వీని తల నరికి నీకు శాంతిని చేకూరుస్తాను" అంటూండగా, శ్రీకృష్ణు డందుకుని అర్జునా ! నిద్రావశులయి ఉన్న బాలురను అంతం చేసిన వాడు కూడ ఆతతాయులలోకి చేరతాడు. అట్టి వాడు విప్రుడే అయినా అంతం చేయదగిన వాడే ! కనుక వెనుకంజ వెయ్యక ప్రియ పుత్ర ఘాతకుడైన అశ్వత్థామను సంహరించెయ్యి" అన్నా, గురు కుమారుడు కావడం వల్ల అర్జు నుడు అతణ్ణి అంతం చేయలేక పోతూన్నాడు. అశ్వత్థామను బంధించి తీసుకురావడం చూడ జాలని - ద్రౌపది సవ్యసాచిని సమీపించి "ఆర్యా ! ఆచార్య ద్రోణుల అనుగ్రహం వల్లనే మీరు ధనుర్వేద వేత్తలలో అగ్రగణ్యు లయ్యారు. ద్రోణులవారు శస్త్రాస్త్రోపదేశ సమయంలో మిమ్ములనే అశ్వత్థామ కంటె మిన్నగా ప్రేమించి విద్య నేర్పారు. ఆచార్య వారు స్వర్గాన్ని అలంకరించినా ద్రోణ పత్ని సజీవంగానే ఉంది. ఆమె కూడ మీకు మాతృ సమానురాలే. పుత్ర శోకంతో విలపిస్తున్న నావలె కృపి కూడ అశ్వత్థామ మరణాన విలపిస్తుంది.

దైవ గతిని ఎవరు తప్పించ గలరు ? జరిగిన దేదో జరిగిపోయింది. అశ్వత్థామను విడిచిపెట్టడం మీ ధర్మం. అతడు బ్రాహ్మణు డవడ మలా ఉండగా గురు పుత్రుడు కూడ కనుక ఎంతమాత్రం వధార్హుడు కాడు.

పాంచాలి పలుకు లాలించి తన ఉద్దేశం కూడ అదే. అది గ్రహించిన శ్రీకృష్ణుడూ ధర్మరాజాదులూ అందు కానందించి వారిని అభినందించారు. అంత వాసుదేవుడు - అర్జునా ! భీముడు వినా మిగిలిన వారెవ్వరూ అశ్వత్థా మను అంతం చెయ్యడానికి అంగీకరించడం లేదు. నా అభిమతం కూడ అదే. పతితుడే అయినా విప్రుడు వధార్హుడు కాడు. ఇంకో విధంగా చూసి ఎవడైనా సరే ఆతతాయి అయినంత మాత్రాన వాణ్ణి అంతం చెయ్యాలి కనుక ధర్మ మార్గానికి భంగం కలుగకుండ చెయ్యి" అన్నాడు. వాసుదేవాభిమతాన్ని గ్రహించిన పార్థుడు - అశ్వత్థామ యొక్క మస్తకన్య స్తమై ఉన్న మాణిక్యాన్ని శిరోజ సమేతంగా ఖండించి బంధ విముక్తుణ్ణి చేసాడు. ద్రౌపదీ

మేతంగా పాండవేయులు పుత్ర శోకార్తులై యుద్ధంలో అంతమైన బంధు బాంధవు లందరికీ అంత్యక్రియలు నిర్వర్తించారు.

## స్కంధం-1 — అధ్యాయం-8

### పరీక్షిత్తుకు రక్షణ : కుంతీ స్తుతి - ధర్మరాజు విచారం.

శ్రీకృష్ణ సమేతులైన పాండవేయులు నారీ సమూహంతో భాగీరథీతీరం చేరి మరణించిన బంధువు లందరికీ తర్పణా లర్పించి వివిధ ప్రకారాలుగా వారిని స్మరించు కుంటూ శోకిస్తూ పావన గంగాస్నానం చేసి పరిశుద్ధులై - గాంధారీ ధృతరాష్ట్రులూ, కుంతీ, ధర్మరాజూ తీవ్రంగా చింతిస్తూంటే మునిజనులు వారిని ఓదార్చి ఆశీర్వదించారు. వాసుదేవుడు ధౌమ్యాదుల సమక్షంలో - "పాండవాగ్రజా! జీవకోటి అంతా కాలాధీనమై ఉంటుంది. కాలాన్ని అతిక్రమించ గల వారెవరూ లేరు. కనుక కాలాధీనమైన జీవులను గురించి శోకించడం జ్ఞానికి లక్షణం కాదు" అంటూ దుఃఖ శాంతికరమైన వచనాలతో ఓదార్చాడు. ఆ రీతిగా వాసుదేవుడు పాండవాగ్రజునికి సామ్రాజ్యాన్ని ప్రసాదించి అనుగ్రహించాడు. మహా సాధ్వియైన ద్రౌపదీదేవి కేశ పాశాన్ని పట్టి ఈడ్చిన హేతువుగా ఆయుర్దాయం నాశనమైన ధార్తరాష్ట్రులనూ వారి ఆ దుర్మార్గాన్ని ప్రోత్సహించిన వారినీ అంతం చేయించి అతడు ధర్మరాజు ద్వారా అశ్వమేధ త్రయాన్ని కొనసాగింప జేసి అతని యశస్సును వర్ధిల జేసాడు. అన్నీ అయిన తరువాత వాసుదేవుడు సాత్యకీ సమేతుడై ద్వారకకు పయనం కాబోతూండగా ఉత్తర మహా భయంతో "దేవదేవా! వాసుదేవా! రక్షించు. రక్షించు" అని ఏడుస్తూ వచ్చి "కృష్ణా! అచ్యుతా! అనంతా! నువ్వే రక్షించాలి. నాకు అన్య శరణ్యులు లేరు. ఇక్కడ పరస్పరం మృత్యురూపు లవుతూన్నారు. అల్లదిగో చూడు. జ్వలిస్తూ వచ్చే ఆ భీకరాస్త్రం నన్నే కాకుండా నా గర్భాన్ని కూడ దగ్ధం చేసేటట్లుంది. పాహిమాం!- పాహిమాం!" అంటూ ఆర్తనాదాలు చేస్తూంటే పాండవేయులు కూడ భయంతో భగవానుణ్ని ప్రార్థించారు. కరుణా సముద్రుడైన వాసుదేవుడు విశేషానుగ్రహంతో - సుదర్శన చక్రాన్ని ప్రయోగించి అశ్వత్థామ ప్రయోగించిన భయంకరాస్త్రాన్ని ఉపసంహరించాడు. అలా ఆ దయామయుడు పాండవ వంశాన్ని సంరక్షించి పురోగమించబోయే సమయంలో కుంతీదేవి ద్రౌపదీ సమేతంగా కుమారులను వెంటబెట్టుకుని వచ్చి శ్రీకృష్ణపరమాత్మను స్తుతించ సాగింది.

హే వాసుదేవా! సర్వ జీవుల బహిరంతరాలలో నువ్వు అద్వితీయ స్వరూపుడవై ఉండి కూడ ఇంద్రియాలకు గోచరించకుండా ఉంటావు. ప్రకృతికి అతీతమైన నీకు నా వందనాలు. నేను

స్త్రీమాత్రురాలనూ, అబలనూ అయిననేను అవినాశనపురుషోత్తముడవైన నిన్ను ఎలా గ్రహించేది ? వేషధారి అయిన నటుని వాస్తవ రూపాన్ని గ్రహించ జాలనట్లే సర్వాంతర్యామివైన నిన్ను దర్శించలేక పోతున్నారు. శుద్ధాంతరంగులైన భక్తుల హృదయ మందిరాలలో భ__ని వర్ధిల జేయడానికి అవతరిస్తూంటావు. అట్టి నిన్ను అబలనూ, అల్ప బుద్ధి కలదానినీ అయిన నే నెలా గ్రహించ గలను ? దేవకీ నందనా ! వాసుదేవా ! శ్రీకృష్ణా ! నీకు ప్రణామాలు. భవదీయ నాభీ పద్మం నుండి చతుర్ముఖ బ్రహ్మ ప్రాదుర్భవించాడు. కమల సమ నేత్రాలతో, పద్మ చిహ్నితమైన పాదాలతో పద్మ మాలాదులు ధరించి శోభించే నీకు విజయాంజలులు. కంసునిచే హింసింపబడ్డ దేవకీ వసుదేవుల వలన సంరక్షించిన నువ్వు పుత్ర సమేతనైన నన్ను - అనేక విపత్తుల నుండి సంరక్షించావు. విపత్తులు కలిగినపుడల్లా నీ దర్శన భాగ్య మవుతూంది. కనుక మాకు సదా విపత్తులే కలుగుతూండును గాక ! అహంకార శూన్యులే నిన్ను దర్శించ గలుగుతారు. నిన్ను మాయా ప్రపంచం అంటదు. దరిద్రులకు విభుడవూ, ఆత్మా రాముడవూ, మోక్షాధిపతివీ అయిన నేను నిన్ను ధ్యానిస్తున్నాను. ఆది మధ్యాంతాలు లేనివాడవూ, సర్వ వ్యాపకుడవూ, సర్వ నియంతవూ, కాలమే స్వరూపంగా కలవాడవూ, పరాత్పరుడవూ అని నేను నిన్ను భావన చేస్తున్నాను. నానా భేదాలతో విశ్వ పదార్థాలు ఉన్నా - సమస్త పదార్థాల యందూ సమ భావంతోనే నువ్వు విరాజిల్లుతూంటావు. మనుష్య రూపంలో అవతరించి సంచరించే నీ లీలల్లోని వాస్తవాన్ని సామాన్యులు అర్థం చేసుకోలేరు. ప్రియా ప్రియాలు రెండూ నీకు సమానమే. విశ్వ స్వరూపుడవూ, విశ్వాత్ముడవూ, అయిన నువ్వు జనన మరణ రహితుడవు అయినా పశు, పక్షి, నర, ఋషి, జల చరాది రూపాలలో అవతరించి ఆయా స్వరూపాలకు అనువైన కర్మ లాచరిస్తూ - వాటి యందుండే సుఖ దుఃఖా తీతుడవై ఉంటావు. ఈ జగత్తు ఆయన నీ లీలయే. బాల్యంలో నీ చిలిపి చేష్టలను తిలకించి బంధించాలని నీ తల్లి యశోద ప్రయత్నిస్తూంటే శిరసు వంచి నువ్వు కనుల నీరు కారుస్తూంటే - నీ కళ్ళకు పెట్టిన కాటుక నలుమూలలా అలుముకు పోయేటట్లు కళ్ళు నలుపుతూ నటించే ఆ నీ బాల లీలా రూపం నిరంతరం నా అంతరంగంలో భాసిల్లుతూండును గాక ! మంచిగంధపు చెట్లు మలయాద్రిపై వర్ధిల్లి ఆ పర్వతం యొక్క యశస్సును వర్ధిల జేసినట్లే నువ్వు యాదవ వంశాన అవతరించి - తద్వంశానికి కీర్తి తెచ్చావనీ, అందులకే అవతార మెత్తావనీ ఆత్మజ్ఞానులు సువ్యక్తం చేస్తూంటారు. దేవకీ వసుదేవుల జన్మాంతర తపః ఫలంగా ప్రాదుర్భవించావని మరి కొందరంటూంటారు. దైత్య భారాన్ని భరించ జాలని భూమి నిన్ను ప్రార్థిస్తే తద్భార హరణార్థమై నువ్వు అవతార మెత్తావని వేదవేదాంగ పారగాములు ప్రవచిస్తున్నారు. ఇంద్రియ లోలురై కర్మబద్ధులైన మానవులు జనన మరణ రూపమై సుఖ దుఃఖ ఫలానుభవ రూపమైన కాలచక్రంలో పడి పరిభ్రమిస్తూంటే

భవదీయ లీలా రూప పావన గాథల ద్వారా మూఢులను తరింప జేయడానికే నువ్వు అవతార మెత్తినట్లు సిద్ధులు తమ అభిప్రాయాన్ని తెలియ జేస్తున్నారు. వీరి భావాలన్నీ యదార్థాలే. భక్త జనులు నీ గుణ గానం చేస్తూ నీ గాథలను పదే పదే ఆలకిస్తూ, పఠిస్తూ నీ దివ్య నామ సంకీర్తనం ద్వారా మహానందాన్ని పొందుతూంటారు. నిత్యానందం కలిగి వారు జన్మ రాహిత్యాన్ని పొందుతారు. వాసుదేవా! నీ ఆశ్రితులమైన మమ్మల్ని విడనాడి నువ్వు ద్వారకా నగరానికి వెళతానంటున్నావు. భవదీయ దివ్య పాద కమలాలు వినా మాకు అన్యమైన ఆశ్రయ మేదీలేదు. పృథ్వీతలం మీద నరేశులందరూ మాకు శత్రు సమాజంలోని వారే. ప్రాణరహితమైన ఇంద్రియ సదృశంగా- నువ్వు లేని మేమంతా శక్తి శూన్యులమై పోతాము. యాదవ పాండవులకు నీ వల్లనే కీర్తి ప్రతిష్ఠలూ, నామరూపాలూ ఏర్పడ్డాయి. భవదీయ పద పద్మాంకితమైన కురుజాంగల దేశాలు వన పర్వత సమేతంగా నవ్య శోభను పొంది వర్ధిల్లుతూన్నాయి. విశ్వనాథుడవూ, విశ్వరూపుడవూ, విశ్వాత్ముడవూ నీవే. దేవ దేవా! నాలో బంధుప్రీతి నశించి గంగ సాగరంలో లీనమైనట్లు నా బుద్ధి నీయందే సంలగ్నమయేటట్లు కరుణించు. అర్జున సఖా! శ్రీకృష్ణా! రాజ వేషాలలో పరిభ్రమించే రాక్షసానీకాన్ని అంతం చెయ్యడానికి ప్రజ్వలితాగ్ని వలె ప్రాదుర్భవించావు. అనంత శక్తి సంపన్నా! గోవిందా! గో బ్రాహ్మణ, దేవతాదులను సంరక్షించడానికి ఈ దివ్యావతారం దాల్చిన నీకు అనేకానేక వందనాలు - అంటూ ...లణ పరమాత్మను అనేక విధాల స్తుతించి ప్రణమిల్లింది.

ఆమె ప్రార్థనకు వాసుదేవుడు పరమ ప్రసన్నుడై "అత్తా! ఈ కృష్ణుడు ఎక్కడున్నా నీవాడే. నీకు ఎట్టి భయం లేదని వరమిచ్చి - ద్రౌపదీ సుభద్రాదులను అనునయించి, పయనించనున్న నంద నందనుని జూచి బాంధవ మరణానికి ధర్మరాజు - అనేక విధాల శోకిస్తూ జ్ఞాన శూన్యుడై "వాసుదేవా! వ్యాసాది మునీంద్రులారా! శునక శృగాలాలకు ఆహారం కావలసిన ఈ దేహాన్ని విశ్వసించి బంధు బాంధవాదులనే కాక పూజనీయులైన గురువులను కూడ అంతంచేసి నేను మహా పాపి నయ్యాను. ఈ నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. కానీ ధర్మయుద్ధంలో రాజైనవాడు శత్రువులను జయించి ప్రజా పాలనం ధర్మబద్ధంగా చెయ్యాలని శాస్త్రాలు బోధిస్తూన్నాయి. పాపానికి దీనిలో స్థానం లేకపోయినా నాకు మాత్రం సంతోషం లభించడం లేదు. పతులను, సుతులను, సోదరులను, పితరులను అంతం చెయ్యడం హేతువుగా నేను ఈ స్త్రీల విషయమై మహాపరాధమే చేసాను. అది యజ్ఞ యాగాదులు చేసినా నాశనం కాదు. బురద నీరు బురదనీళ్ళ వల్లనూ, సుర చేత సురా శుద్ధమవనట్లే హింస వల్ల పుట్టిన పాపం హింసతో కూడిన యజ్ఞ యాగాదుల వల్ల నాశనం కాదు" అన్నాడు.

స్కంధం-1 — అధ్యాయం-9

ధర్మరాజాదులు భీష్ముని సమీపించుట

# భీష్మ నిర్యాణము

శ్రీకృష్ణుడూ, వ్యాసాది మహర్షులూ పాండవాగ్రజునికి ఎన్నో విధాల బోధించారు. పవిత్ర కురుక్షేత్రంలో భీష్మ పితామహుడు వీరశయ్య నలంకరించి ఉన్నాడు. ఆయన దగ్గర ధర్మోపదేశాలను ఆలకించే సంకల్పంతో శ్రీకృష్ణ సహితంగా అక్కడకు వెళ్ళారు. వారందరూ భీష్మునకు ప్రణమిల్లుతూండగా ఆయన సందర్శనార్థం - అక్కడకు దేవర్షులూ, బ్రహ్మర్షులూ విచ్చేసారు. పర్వత, నారద, ధౌమ్య బృహదీశ్వ, భరద్వాజ, పరశురామ, వశిష్ఠ, ఇంద్ర, ప్రమద, త్రిత, గృత్సమద, అసిత, కక్షీవంత, గౌతమ, అత్రి, సుదర్శన, శ్రీశుకాదులూ, శిష్య సమూహ సమేతంగా కశ్యప, బృహస్పత్యాదులంతా పవిత్ర కురుక్షేత్రానికి విజయం చేసారు. ఏక కాలంలో ఆ మహాత్ములందరినీ సందర్శించి దేశ కాలజ్ఞుడైన భీష్ముడు వారి నందరినీ ఆహ్వానించి మనసా అర్చించాడు, శ్రీకృష్ణ తత్వజ్ఞుడైన పితామహుడు ఆ దేవ దేవుణ్ని మానసికంగానే విశేషంగా పూజించి ధ్యానించాడు. ఆ తరువాత తనకు సమీపంగా కూర్చున్న ధర్మరాజాదులందరినీ తిలకించి నయనాల నుండి అశ్రుజలాలు ప్రవహించ - "ధర్మరాజా! బ్రాహ్మణ భక్తులూ, ధర్మమార్గగాములూ, భగవద్భక్తులులూ అయి కూడ క్లేశాలనే అనుభవించారు. యోచించి చూడ అవి మీవంటి వారికి రావలసినవి మాత్రం కాదు. అయినా తప్పలేదు. చిన్ననాడే తండ్రిని పోగొట్టుకున్నారు. తదాదిగా యితః పర్యంతం మిమ్మల్ని కష్టాలే ఆవరిస్తూ వచ్చాయి. వాయువశాలై, మేఘాలున్నట్లే లోకపాలురతో సహా ప్రాణులన్నీ కాలవశమై చరించ వలసిందే. కాలాన్ని అనుసరించియే మీరు క్లేశాలన్నీ అనుభవించారు. కాకుంటే ధర్మ, భీమార్జునుల వంటి అసామాన్య పరాక్రమశాలురు ఉండికూడ కష్టాలు సంభవించాయి. అంటే కాలస్వరూపుడై పరమేశ్వరేచ్ఛ కాక మరేమిటి? ఇవన్నీ ఇలా ఉండగా సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్మ రక్షకుడై ఉండగా కూడా ఆపదలు తప్పలేదంటే సర్వం కాలాధీనమే అని అంగీకరించి ధైర్యస్థైర్యాలతో రాజ్యపాలనం చేయడమే కానీ అన్య మార్గం లేదు" అని పితామహుడు వారికి ఎన్నో ధర్మాలు బోధించి - "నాయనా! ధర్మజా! ఈ స్థితిలో నువ్వు వినా అన్యులెవరూ భూ పరిపాలన చెయ్యలేరు. ఇందుకు నువ్వు సర్వ సమర్థుడవు. సర్వం సర్వేశ్వరాధీనమని విశ్వసించి రాజ్యపాలన చెయ్యి - వాసుదేవుడు సమ దృష్టి కలవాడే అయినా భక్తజన పక్షపాతి, భక్తులకోసం ఏమైనా చేస్తాడు. కనుకనే నా ప్రాణ త్యాగ సమయానికి యిక్కడకు వచ్చి నాకు తన

సందర్శన భాగ్యాన్ని ప్రసాదించాడు. పరమ భక్తులయిన మహాయోగులు శ్రీకృష్ణ భగవన్నామ స్మరణ చేస్తూ తద్ధ్యానంతో పరమపదాన్ని పొందుతారు. నా దేహ త్యాగ సమయం వరకూ వాసుదేవ పరమాత్మ నా చెంతనే ఉండి తత్సమయంలో దివ్య మంగళ సుందర చతుర్భుజ స్వరూపంతో నాకు దర్శనమిచ్చి – మోక్షాన్ని ప్రసాదించును గాక !'' అని పలుకుతూన్న పితామహుని పలుకుల నాలకించి ధర్మ నందనుడు ఆయనను ప్రశ్నించి ధర్మసందేహాలను నివారించుకున్నాడు. పితామహుడు ధర్మ నందనునికి అనేకానేక ధర్మోపదేశాలు చేస్తు డగానే ఉత్తరాయణ పుణ్యకాలం ప్రవేశించిం మహారథిక శ్రేష్ఠుడూ, సర్వ ధర్మ మర్మజ్ఞు అయిన భీష్ముడు ఇంద్రియాలను అన్నింట నిరోధించి మౌనవ్రతుడై సనాతన దేవు వాసుదేవ భగవానునియందు మనస్సును స కేంద్రీకరించి (?) ఇలా స్తుతించ సాగాడు....

# భీష్మకృత శ్రీకృష్ణస్తుతి

వివిధ సాధనల ద్వారా విశుద్ధమై, వాంఛారహితమైన నా అంతరంగం శ్రీకృష్ణ పరమాత్మ యందే సంలగ్నమగును గాక ! నిత్యానందమయ స్వరూపుడై ఉండి కూడ .. లీలార్థం ప్రకృతిని స్వీకరించి సృష్టి పరంపరకు కారణభూతుడైన వాసుదేవ భగవచ్చరణ కమలాల యందే నా చిత్తం ఆయత్తమగును గాక ! భువనత్రయ మోహనమై తమాల వర్ణ సమశ్యాములుడై పీతాంబరాన్ని ధరించి ముం గురులచే భాసిల్లునట్టి వదన మండలంతో అర్జున సఖుడైన వానియందే నా మనస్సు లయ మగును గాక ! రణరంగంలో హయ పాద ఘట్ట నలచే బయల్వెడలిన ధూళిచే ధూసరితమైన ముంగురులతో శోభిల్లే వదనమూ, మదీయ శర పరంపరాఘాత విదీర్ణ కవచమూ కల్గి – పార్థ సారథ్యంలో సంలగ్నుడైన శ్రీహరి భగవాను నకు ప్రీతికరణ శ్రద్ధా ప్రణామిల్లుతూన్నాను. కౌరవ పాండవ సేనా మధ్యభాగంలో నిలచి దృక్ప్రసార మాత్రంచే కౌరవ పక్షీయ యోధుల ఆయుర్దాయాన్ని హరించిన శ్రీకృష్ణ చంద్రుని యందే నా మనస్సు నిలబడునుగాక! స్వజనులను అంతం చేయ విముఖుడై పార్థుడు శోకిస్తూండగా – అతని శోక మోహాదులను సమూలంగా నిర్మూలింప జేసే మహా సంక ల్పంతో గీతోపదేశం చేసిన శ్రీకృష్ణ చరణ కమలాల యందే నా చిత్తం ఆయత్తమగును గాక ! ఆతతాయినైన నేను నిశిత శరాఘాతా లతో కృష్ణార్జునుల కవచాలు ఖండించి వారి శరీరాలను గాయపరచ తత్సమయంలో పార్థుడు అడ్డు వచ్చినా ఆగక – భీష్ముని అంతం చేస్తాను! అంటూ నామీద కురుకుతూ నాపై అవ్యాజాను రాగాన్ని చూపిన శ్రీకృష్ణ పరంధాముడే నాకు గతి – వామ హస్తంతో పగ్గాలూ, దక్షిణ హస్తంతో ఛెలుకర్రా పట్టుకుని తెల్లని గుఱ్ఱా లను పూన్చిన రథంపై కూర్చుని సంగర యజ్ఞా నికి ఆధారం వహించిన అనంతుణ్ణి చూస్తూనే

ప్రాణత్యాగం చేసిన కారణంగా కురుక్షేత్రం లోని వీరులకు సారూప్య ముక్తి లభించింది. అట్టి పార్థసారథి మదీయావసాన కాలంలో కూడ నాకు ప్రేమపాత్రుడగును గాక ! దివ్య రాస లీలా ప్రసంగంలో శ్యామసుందరుడు అంతర్ధానం కాగా ఆ దేవదేవుని యందు తన్మయులైన గోపకాంతలు ఏ శ్రీకృష్ణచంద్రుని లీలలను అనుకరించి నటించారో ఆ గోపికా మనోహరుని యందే నా చిత్తం సంలగ్న మగును గాక ! ధర్మరాజకృత రాజసూయాధ్వరంలో అగ్రతాంబూలా లందుకున్న శ్రీకృష్ణచంద్రుడు మరణ వేళలో నా నయనాలముందే ఉండును గాక ! ఏక మాత్రుడైన సూర్యుడు అనేకులకు అనేకంగా గోచరమవుతూన్నట్లే అద్వితీయుడై ఉండీ పరమాత్మ అనేక హృదయాలలో అనేక స్వరూపాలతో భాసించే శ్రీకృష్ణదేవుడు నా హృదయారవిందంలో తేజరిల్లును గాక !'' అని ధ్యానిస్తూ అతడు శ్రీకృష్ణ పరమాత్మయందే లీనమై పోయాడు. తత్సమయంలో మలయానిలం వీచగా దేవ దుందుభులు ప్రతిధ్వనించ పువ్వుల వాన కురిసింది. భీష్ముని పవిత్ర కళేబరానికి అంత్యక్రియలు పూర్తిచేసి ధర్మరాజాదులు స్వల్పకాలం శోకించారు. అందరికందరూ వాసుదేవ భగవానుణ్ని సంస్తుతించి నిజాశ్రమాలకు మరలిపోయారు. వాసుదేవ సమేతుడై పాండవాగ్రజుడు సపరివారంగా కరిపురం చేరాడు. అక్కడ గాంధారీ ధృతరాష్ట్రులకు ధైర్యంచెప్పి వారి ఆదేశానుసారం పట్టాభిషిక్తుడై ధర్మంగా ప్రజాపాలన చేసాడు

స్కంధం- — అధ్యాయం-10

## వాసుదేవుని ద్వారకాగమనము.

పరస్పర ద్వేషాగ్ని దగ్ధులయిన కురు వంశాన్ని పునః అంకురింపజేసి పాండవాగ్రజుని రాజ్యసింహాసనాసీనుని చేసి వాసుదేవుడు ఆనందించాడు. భీష్మ పితామహ, వాసుదేవుల ప్రబోధం వల్ల ధర్మజుడు భ్రాంతిని దూరం చేసుకో గలిగాడు. శ్రీకృష్ణ భగవదాశ్రయంతో చతుస్సాగర వేలావలయిత పృథ్వీమండలాన్ని శాసించ సాగాడు. భీమాది అనుజు లందరూ అగ్రజుని కనుసన్నలలో మెలగ సాగారు. వారి రాజ్యంలో సకాలంలో వర్షాలు కురియగా - పృథివి సస్యశాలిని అయింది. గోవులు సమృద్ధిగా పాలిస్తున్నాయి. నదీనద పర్వతారణ్య ఓషధ్యాదులు ఋతు ధర్మానుసారం సాగుతున్నాయి. జనులందరూ శాంతి సౌఖ్యమయ జీవనాన్ని గడిపారు. బంధు బాంధవులకూ, సుభద్రకూ శోకశాంతికై వాసుదేవుడు హస్తినాపురంలో కొంతకాలం ఉండి ద్వారకానగరానికి బయలుదేరాడు. ధర్మరాజు దగ్గర అనుమతిని తీసుకొని పెద్దలందరికీ ప్రణమిల్లి, సమ వయస్కులను ఆలింగనం చేసుకుని పిన్న వారి కందరికీ ఆశీస్సులు పలికి అతడు వెళ్ళిపోబోతూండగా తద్వియోగాన్ని భరించలేక వారంతా మూర్ఛపోయారు. ఒకే ఒక్కసారి దర్శించినంత మాత్రాన భగవద్విరహాన్ని ఎవరూ సహించ

లేకపోతూంటే శయనాసన భోజన వేళల్లో సాన్నిహిత్యం కల పాండవేయులు శ్రీకృష్ణ విరహాన్ని ఎలా భరించ గలుగుతారు ? వారందరికందరూ వాసుదేవుడు పయనమై పోతూండగా- వద్దంటే అపశకున మని భావించి కనులార్పకుండ అతనిపై పే చూస్తున్నారు. వాసుదేవుడు పురోగమించే సమయంలో భేరీ మృదంగ వీణా వేణు పటహ ఢక్కాది మంగళవాద్యాలు ప్రతిధ్వనించాయి. భగవద్దర్శనాభిలాషతో, కురు వంశీయులైన నారీజనం సౌధాగ్రాల నుండి దర్శిస్తూ పూలవాన కురిపిస్తున్నారు. పార్థుడు శ్వేతచ్ఛత్రం పట్టగా సాత్యకీ ఉద్ధవులు వింజామరలు వీచగా బ్రాహ్మణులు వేదపూర్వకంగా మంగళాశీర్వాదాలు చేసారు. హస్తినాపురంలోని నారీమణులందరూ శ్రీకృష్ణ భగవంతుని యందు చిత్తాల నుఆయత్తం చేసుకుని పరస్పరం భాషించుకుంటూన్నారు.

ప్రియ సఖులారా ! ఈ సనాతనుడే ప్రళయకాల వేళలో సయితం తన అద్వితీయ నిర్విశేష రూపంతో ఉండి జీవ బీజ సర్వస్వాన్నీ తనలోనే లయం చేసుకుంటాడు. తత్సమయంలో త్రిగుణాలుండవు, పునః సృష్ట్యారంభం కావాలన్న సంకల్పం కలగగానే నామ రూపాత్మకమైన యావత్ సృష్టి ప్రారంభ మవుతుంది. విశ్వ వ్యవహారార్థం శ్రుతులనుకూడ నిజనిశ్వాస రూపంలో బహిర్గతం చేస్తాడు. ఆ పరంధాముడే ఈ వాసుదేవుడు. జగత్తులో ఆసురీ ప్రవృత్తి వర్ధిల్లి అధర్మం పెచ్చు పెరిగినప్పుడల్లా ఈ దేవదేవు డవతరించి శిష్టజన సంరక్షణ, ధర్మ సంస్థాపనల నిమిత్తం - అధర్మాన్నీ, అసుర సమూహాన్నీ అంతం చేస్తూంటాడు. శ్రీకృష్ణావతారం కారణంగా యాదవ వంశ మంతా పవిత్రమయింది. ఈ మహాదేవుని వాసం వల్లనే స్వర్గాన్ని మించి ద్వారకానగరం భాసిల్లుతూన్నది. ఆ పదహారువేల నూట ఎనమండుగురూ గతంలో ఎన్ని వ్రత దాన తపస్యాదులు చేసి శ్రీహరి నారాధిస్తే అతన్ని పతి రూపంలో పొందినారో కదా ! రుక్మిణీ స్వయంవరంలో ఈతడే – శిశుపాల జరాసంధులను పరాజితులను చేసి బాహుబలాన్ని ప్రదర్శించి ఆమెను గ్రహించాడు. అట్టి శ్రీకృష్ణ పరమాత్మ అనంత లీలలను వర్ణించగల వారెవరు ? ద్వారకా నగర ప్రజలు ఎంత ధన్యులో ? అంటూ ప్రపంచాన్ని విస్మరించారు.

హస్తినాపురాన్ని అధిగమించి వాసుదేవుడు పురోగమిస్తూంటే రథ, గజ, తురగ పదాతి సేనలతో ధర్మరాజాదులు అనుసరించి బహుదూర పర్యంతం వస్తూంటే శ్రీకృష్ణుడు వారిని బలవంతంగా వెనుకకు పంపి ఉద్ధవ సాత్యకీ సమేతుడై కురుజాంగల, పాంచాల శూరసేనాది దేశాలు అధిగమించి బ్రహ్మావర్త, కురుక్షేత్ర, మత్స్య సారస్వత, కురుదేశాలు మీదుగా పయనిస్తూంటే దీర్ఘ ప్రయాణం సాగించడం వల్ల గుర్రాలు అలసిపోయాయి. మధ్యమధ్య అనేక స్థానాలలో ఆయా నగర జనులు ఉపహారాలర్పించి హారతులు సమర్పించారు. వాసుదేవుడు సకాలంలో సంధ్యావందనాలు చేసుకుంటూ తనదైన ఆనర్తక దేశం చేరుకున్నాడు.

## స్కంధం-1 — అధ్యాయం-11

### ద్వారకలో శ్రీకృష్ణునకు రాజోచిత స్వాగతము

శ్రీకృష్ణచంద్రుడు ద్వారకానగరం సమీపిస్తూండగానే తన పాంచజన్య శంఖాన్ని పూరించాడు. మధుర గంభీరమైన ఆ శంఖనాద శ్రవణ మాత్రంచే నాగరికు లందరూ ఆ దేవ దేవుని సందర్శన కాంక్షతో యెదురై వచ్చి ఆనందాతి రేకంతో నయనాల నుండి ఆనందా శ్రువులు జలజల రాల కంఠం గద్గదం కాగా - హే కృష్ణా! భక్తజన వత్సలా! హర బ్రహ్మేంద్రాదు లందరూ నీకు వందనాలు చేస్తూంటారు. నీ సంరక్షణలో ఉన్న వారిని సర్వ సమర్థుడైన కాలుడు కూడ ఏమీ చెయ్య లేడు. అట్టి నీకు వందనాలు" అంటూన్న తన పురజనుల నందరినీ ఆదరించి నగరంలో ప్రవేశిం చాడు. మధు భోజ అంధక, వృష్ణ దాశార్హ, కుకుర యదు వీర శోభితమైన ద్వారకా నగరం ఋతు ధర్మాలన్నీ కలిగి భాసిల్లు తూన్నది. భోగవతీ నగర సమమైన ఆ నగరం ఉద్యాన వనాలతో, కమల సంభరిత సరోవరాలతో, నవ్య శోభతో అలరారుతూన్నది. వాసుదే వాగమన వార్తతో నగరమంతా ఆనందంతో పులకరించి - స్వాగత పత్ర, ధ్వజ తోరణ, పతాకాలతో సర్వాలంకృత చేసారు. సుగంధ జలాలను రాచబాటల మీద, పురవీధులలోను చల్లి, ముత్యాల రంగవల్లులతో శోభాయ మానం చేసి శ్రీహరిపై పూలజల్లులు కురిపిస్తూ ప్రత్యేక ద్వారం దగ్గరా హారతు లిచ్చి, ఉప హారాలు సమర్పించి గౌరవించి సత్కరిస్తూ న్నారు. వాసుదేవాగమనం కారణంగా — వసు దేవ అక్రూర, ఉగ్రసేన, బలరామ, చారుదేష్ణ, ప్రద్యుమ్న, సాంబాదులు ఆనంద పారవశ్యంచే అన్న పానాలను సయితం త్యజించి ముందుగా శ్వేత గజాన్ని ఉంచుకుని మంగళ ద్రవ్యాలతో స్వాగతం పలుకుతూన్నారు. దేవకాంతలను పోలిన వారకాంతలు శ్రీకృష్ణ లీలలను గానం చేసుకుంటూ వచ్చారు. వారందరి కందరినీ తిలకించి యథోచితంగా వారిని ఆదరిస్తూ శిరస్సు వంచి కొందరికీ, వాక్కుతో ప్రణామం అని కొందరినీ, ఆలింగనం చేసుకుని మరికొందరినీ, మందహాస దృక్ప్రసారంతో శేషించిన వారినీ - ఆనందింప జేసాడు. పత్నీ సమేతులై విజయం చేసిన విప్రశ్రేష్ఠుల ఆశీర్వచనాలు స్వీకరించి, వందిమాగధులు కైవారాలు పలుకగా ద్వారకా పురం ప్రవేశం చేసాడు. శ్యామసుందరుడు ఆబాల గోపాలానికీ ఆనందాన్ని ప్రసాదిస్తూ ఛత్ర చామరాది రాజలక్షణ లక్షితుడై పురంలో పదార్పణం చేసి - మాతా పితరుల సుందర భవనంలో ముందుగా దేవక్యాదులకు ప్రణమిల్లాడు. వారతణ్ణి ఒడిలో కూర్చోబెట్టు కుని పరమానందం పొందారు. మాతల ఆదేశా నుసారం షోడశ సహస్ర పత్నుల దర్శనార్థం వారి మందిరాలకు వెళ్ళాడు. అనంతుడైన వారి అనంత రూపాలతో ఏక కాలంలో వారి కంద రికీ గోచరించాడు. చిరకాల విరహంతో ఉన్న

వారంతా భర్తృ దర్శన సంజనితానందంలో మైమరచి లజ్జా భారంతో శిరసులు వంచి నిలబడ్డారు. ప్రాణనాథుని దర్శన మాత్రంచే కలిగిన ఆనందాశ్రువులు ఎంతగా ఆపుకుందామన్నా ఆగక - ముత్యాలవలె జలజల నేల రాలాయి. నిజ కాంతుని సందర్శన భాగ్యం ఏకాంతంలోనే జరిగినా వారికి సంతృప్తి కలగడం లేదు. ముని జన మానస మోహనుడైన జగన్మోహనుని వియోగాన్ని క్షణకాలం మాత్రం ఎవరు భరించ గలరు ? వాయు సంఘర్షణ కారణంగా దావాగ్ని బయల్వెడలి ఆ అడవినే భస్మం చేసి వేసినట్లు పృథ్వీ భార కారకులయిన దుష్ట క్షత్రియులు పరస్పరం కలహించి అంత మయ్యారు. ఈ సర్వం శ్రీహరి మహా మాయా ప్రభావమే. అచ్యుతానంతుడే ద్వారకా పురంలో పదహారు వేల మంది సతులతో సర్వులకూ అనుకూల రూపాలలో సందర్శన భాగ్యాన్ని కలుగజేసి ప్రసన్నులను చేసాడు. ఆ మహా మహిమాన్వితుని లీలలను గ్రహించ జాలని అజ్ఞానులు — వాసుదేవుని తమతో సమంగా భావించుకుంటూ అతని యందు సాంసారిక ధర్మాలను ఆరోపిస్తూంటారు. ఆ పత్నులు కూడ తమ పతి కామాదులకు లోనైన వాడనీ, భావన చేసి భగవదైశ్వర్యాన్ని గ్రహించలేక ప్రాకృతుడని భావించి ప్రసన్న లవుతూంటారు

అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి నష్టమైన ఉత్తర గర్భాన్ని వాసుదేవుడు పునః ప్రతిష్ఠించగా జన్మించిన పరీక్షిత్తు జ్ఞానియైనాడు కదా ! అట్టి ఆగర్భ వైష్ణవుని జన్మ కర్మ మరణాదులూ, తదనంతరం అతడు పొందిన గతిని గురించీ వివరించ వలసినదని శౌనకాది మహర్షులు అర్థించగా సూతర్షి వర్ణిస్తున్నాడు. "శౌనకాది మహర్షులారా ! ధర్మరాజు పరిపాలన ఆరంభించాడు. కన్న సంతానంకన్న మిన్నగా ప్రజా పాలన చేస్తున్నాడు. శ్రీకృష్ణ ధ్యానానికి విశేష కాలాన్ని వినియోగిస్తూ భోగదూరుడై సంచరిస్తూన్నాడు. అష్టైశ్వర్య యుక్తుడైన అతడనేక యాగాలు చేసి స్వర్గం చేరడానికి కావలసిన అధికారాన్ని పొందాడు. యావద్భూమండలం ధర్మరాజు యొక్క అధీనంలోనే ఉంది. స్వర్గ పర్యంతం అతని యశస్సు వ్యాపించింది. అమరులు సైతం వాంఛించ దగిన భోగ సామగ్రి ఉన్నా అతడు వైరాగ్యంతోనే వ్యవహరిస్తూన్నాడు.

మాతృ గర్భంలో ఉన్న పరీక్షిత్తు - అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రంచే పీడింపబడుతూండగా - అతడు అంగుష్ఠమాత్ర శరీరుడైన శ్రీకృష్ణ భగవానుని దర్శించి - ఎవరీతడు ? అని యోచిస్తూండగా భగవానుడు బ్రహ్మాస్త్రాన్ని ఉపసంహరించి అదృశ్యమై పోయాడు. ఆ తరువాత తిథి వార నక్షత్ర లగ్నాదులతో కూడిన మంగళ సమయంలో దివ్య ప్రకాశంతో పరీక్షిత్తు ప్రభవించాడు. తత్సమయంలో సమస్త గ్రహాలూ ఉచ్ఛ స్థితి లో ఉన్నాయి. ధర్మరాజు - పరీక్షిత్తు యొక్క జన్మ వృత్తాంతాన్ని ఆలకించి మహానందంగా పురోహితు లయిన ధౌమ్యుల వారిని పిలిచి

కృపాచార్యాదుల సమక్షంలో మంగళ పూర్వకంగా జాతకర్మ చేయించాడు. పరమ పవిత్ర తీర్థమైన ప్రజా నామక స్థానంలో పాండవాగ్రజుడు ఉత్తములకు గో, భూ, సువర్ణ, గజాశ్వాదులను దానం చేసి విశేషంగా అన్నదానం చేసాడు. సంతృప్తులైన విప్రులు - శ్రీహరి భగవానుని విశేషానుగ్రహం వల్ల పాండవ వంశం రక్షించబడినదని ఆనందాన్ని వ్యక్తం చేసారు. పాండవాగ్రజుడు వారిని తిలకించి - "భూసుర శ్రేష్ఠ విద్వాంసులారా! వీడు దీర్ఘాయుర్దాయం కలవాడై పవిత్ర యశస్సంపన్నుడై రాజర్షుల మార్గానుగామి అవుతాడా?" అని ప్రశ్నించగా వారిలా బదులు పలికారు....

"ధర్మప్రభూ! ఈ పరీక్షిత్తు ఇక్ష్వాకు వంశీయుల వలె ప్రజా పాలన చేస్తాడు. రఘురామునిలా బ్రాహ్మణ భక్తితో, సత్య ప్రతిజ్ఞుడై, శిబిసమ దాతయై, భరత చక్రవర్తితో సమాన కీర్తి గల యజ్వాయై, సహస్ర బాహువైన కార్తవీర్య సమ ధనుర్ధారియై, ప్రచండాగ్ని సదృశ దుర్ధర్షుడై, సాగర సమ దుస్తరుడై, మృగరాజ సమ పరాక్రమియై, హిమాద్రి సదృశ శ్రయుడై పృథ్వీ సమ తితిక్ష కలిగి మాతృ పితృ సమ సహనశీలుడై, బ్రహ్మదేవ సమ సమత్వ భావ సంపన్నుడై, మహాదేవ సమ కృపాకరుడై - జీవుల కాశ్రయమీయడంలో వాసుదేవ సమానుడవుతాడు. సర్వ సద్గుణ సమపేతుడు కావడంవల్ల శ్రీకృష్ణ పరమాత్మకు విశేష ప్రేమపాత్రుడవుతాడు. ఔదార్యంలో రంతి దేవునీ, ధార్మికత్వంలో యయాతిరాజునూ, దృఢ నిష్ఠ యందు ప్రహ్లాదునీ, ధైర్యం విషయంలో బలిని పోలిన వాడూ కాగలడు. అశ్వమేధాలు అనేకంగా చేసి - వృద్ధులను సేవించి రాజర్షి సముడైన పుత్రుని ప్రభవింప జేసి దుష్ట శిక్షణతో కలిలో కృతయుగ ధర్మ ప్రతిష్ఠ చేసి విప్రశాపం వల్ల తక్షక నాగ జ్వాలల్లో అంతం కానున్నానని తెలుసుకుని - సర్వసంగ చేసి పరిత్యాగం వ్యాస నందనుడైన శుకమహర్షి ద్వారా భాగవత జ్ఞానాన్ని పొంది - ఆత్మ జ్ఞానియై గంగాతీరంలో శరీరాన్ని త్యజించి పరమానందం పొందుతాడని చెప్పారు. ధర్మరాజు ఆ దైవజ్ఞుల నందరినీ అర్చించి స్వగృహాలకు పంపి వేసాడు. ఆ బాలుడు అనుదిన ప్రవర్ధమానుడవుతున్నాడు. గర్భంలో ఉండగానే పద్మ గర్భునిచే పరిరక్షింపబడ్డ ఆతడు ఎలా వర్ధిల్లుతాడో? ఏ యే కార్యాలాచరిస్తాడో? అని విజ్ఞులాతని జీవితాన్ని అనుక్షణం పరీక్షిస్తూండడం వల్ల 'పరీక్షిత్తు' అన్న నామంతో అతడు పిలువబడాడు. తత్సమయంలో బంధు వధకు ప్రాయశ్చిత్తంగా యాగం చెయ్యాలని నిశ్చయించుకుని తన దగ్గర పన్నులరూపాన, దండ విధానంలోనూ సంపాదించినదే కానీ పవిత్రంగా సంపాదించిన ద్రవ్యం లేకపోవడం వల్ల ధర్మరాజు విచారిస్తూండగా వాసుదేవుడు దిగ్రహించి "ధర్మరాజా! ఉత్తర దిశలో విశేషమైన ధనం ఉంది మరుత్తు - అనే మహారాజు యాగం చేసి కాంచన పాత్రలూ అపార ధనరాసులూ అక్కడే విడనాడి వెళ్ళిపోయాడు. భూసురోత్తములకు భూరి దక్షిణ లీయగా వారు స్వల్ప ధనమే తీసుకొని మిగిలిన దానిని అక్కడే విడచి

వెళ్ళిపోయారు. ఆ ధనరాసులకు యజమాని అన్నవాడు లేడు. శాస్త్ర ధర్మానుసారం అది మహారాజుకే చెందుతుంది. ధనంజయుని పంపి ఆ ధనరాసులను సేకరించి నువ్వు ఈ యాగాన్ని కొనసాగించు'' అనగా శ్రీకృష్ణాదేశానుసారం ధర్మరాజు అర్జునుని పంపి ఆ ధనరాసులను స్వాధీనం చేసుకుని అశ్వమేధ యాగాలు మూడు చేసి భగవదనుగ్రహం పొందగలిగాడు. శ్రీకృష్ణుడు సమీపంలోనే ఉండి పాండవాగ్రజుని చేత ఆ యాగాలు చేయించి అందరినీ ఆనందపరచి ద్వారకకు వెళ్ళిపోయాడు.

## స్కంధం-1 — అధ్యాయం-12

### గాంధారీ ధృతరాష్ట్రులు అరణ్యాలకు పోవుట.

తీర్థయాత్రా ప్రసంగంలో విదురుడు మైత్రేయుని ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొంది మరలి వచ్చిన తరువాత ఆ వార్త విని ధర్మరాజు సపరివారంగా అతనికి సాదరంగా స్వాగతం పలికి - ఆనందంగా అతనిని తీసుకువచ్చి ఉన్నతాసనాసీనుని చేసాడు. తరువాత అతడు వినయ వినమితాంగుడై శిరసు వంచి "తండ్రీ ! గుడ్లను తమ రెక్కల క్రింద ఉంచి పొదిగి తల్లి పక్షి పిల్లలను చేసి పెంచి పెద్దచేసిన రీతిగా నువ్వు మమ్మల్ని పెంచి పెద్ద చేసావు. విషపూరితాన్నం నుండీ లాక్షాగృహదాహాన్నుండీ మాత్రమే కాదు మాకు కలిగిన వివిధ విపత్తుల నుండి మమ్మల్ని రక్షించి ఇంతవారమయేలా చేసావు. తీర్థయాత్రా సమయంలో మేము నీ స్మరణలో ఉన్నామా ? యాత్రా కాలంలో నువ్వు దర్శించిన క్షేత్ర వివరాను చెప్పు. యాత్రా సమయంలో నువ్వు ద్వారకకు వెళ్ళావా ? అక్కడ మన బంధు బాంధవులూ, హితులూ కృష్ణ సమేతులై క్షేమంగా సుఖంగా ఉన్నారా ? అన్నీ సవిస్తరంగా చెప్పు'' అని కోరగా విదురుడు బదులు పలికాడు— ''నాయనా ! ధర్మరాజా ! ఈ ఖండంలోని క్షేత్రాలను అన్నింటినీ నేను సందర్శించాను. ద్వారక కూడ చూసాను. అని చెప్పాడే? కాని విదురుడు అమంగళకరమనీ ధర్మరాజాదులు దుఃఖిస్తారనీ యాదవ వంశ నాశన విషయాలు ప్రస్తావించ లేదు. పాండవులు విదురుని దేవతల వలె అర్చించి ఆరాధిస్తున్నారు. విదురుడు కూడ ధృతరాష్ట్రుని కోసం కొంత కాలం కరి పురంలోనే ఉండిపోయాడు. సాక్షాత్తూ యమ ధర్మరాజే మాండవ్య మహర్షిచే శపించబడి దాసీ స్త్రీకి పుత్రుడై పుట్టి శత సంవత్సరాలు భూతలంపై ఉండవలసి వచ్చింది. అందులకే విదురుడెన్నడూ ధర్మ మార్గం నుండి పతనం కాలేదు. పాండవేయులు పరీక్షిత్తును చూసుకుంటూ అఖండైశ్వర్యంతో సుఖా లనుభవిస్తున్నారు.

విదురుడు కాలగతి నెరిగినవాడు. ఓనాడతడు ధృతరాష్ట్రుని చేరి – ''ప్రభూ ! మనవారందరూ నాశన మయ్యారు. నువ్వు చూస్తే

వృద్ధుడవై పోయావు. కాలాధీనుడై మానవ మాత్రుడు సర్వాలనూ వదలి పోవలసిన వాడే అయినా ధన ధాన్యాలు శాశ్వతమా ? నువ్వు భీమసేనుడు తిండి పెడితే తిని బ్రతుకుతున్నావు. ఇది శ్వానంతో సమానమైన లక్షణము. నువ్వు ఎవరినైతే ద్వేషించి హింసింప జేసావో ? వారి చెంతనే బ్రతకడం కంటె నీచ కార్యం వేరొకటి లేదు. కనుక నువ్వు కరిపురం వదలి సర్వసంగ పరిత్యాగివై శరీరాన్ని విడచి పెట్టగలిగితే సద్గతులను పొందగలుగుతావు'' అంటూ ఉపదేశించిన విదురుని వచనాలను విన్న ధృతరాష్ట్రుడు తన అంగీకారాన్ని తెలియ జేసాడు. శీఘ్రంగా విదురుడు ధృతరాష్ట్రుని వెంట బెట్టుకుని అరణ్యాలకు పయనించడాన్ని గమనించి గాంధారి కూడ సర్వసంగ పరిత్యాగినియై వారిని వెంబడించి పురోగమించింది. వారు ముగ్గురూ అరణ్యాలకు వెళ్ళిపోయారు.

మరునాడు ఉదయ కాలంలో ధర్మరాజు-నిత్య కృత్యాలు నిర్వర్తించుకుని వృద్ధులకు ప్రణమిల్లే అభ్యాసానుసారం పెద తండ్రి అంతః పురానికి వెళ్ళి చూడగా గాంధారీ, విదుర, ధృతరాష్ట్రులు కనిపించ లేదు. దానితో ధర్మ రాజు శోకించి "వీరు కష్టాలు భరించ జాలక — ఏ నదిలోనో మునిగి ప్రాణ పరిత్యాగం చెయ్య లేదు కదా !" అంటూ సంజయుని వైపు తిరిగి "ఆర్యా ! వీరి వృత్తాంతం నీ కేమైనా తెలుసునా ?" అని ప్రశ్నించగా, తన కేమీ తెలియదంటూ అతడు కూడ అనేక విధాల విచారించాడు. సరిగా అదే సమయంలో దేవర్షి నారదుడు తుంబుర సమేతంగా అక్కడకు వచ్చాడు. ధర్మరాజు ఆ దివ్య పురుషులకు యోగ్యాసనాలు సమర్పించి వారికి ప్రణమిల్లి వారు సుఖాసీనులయిన మీదట - "దేవర్షీ ! మీరు త్రిలోక సంచారులు. సర్వజ్ఞులయిన తమకు ఈ జగత్తులో తెలియని దేదీ లేదు. మాకు విశేష గౌరవనీయులయిన గాంధారీ ధృతరాష్ట్ర విదురుల జాడ తెలిస్తే చెప్పండి" అనగా దేవర్షి బదులు పలికాడు.

"పాండవాగ్రజా ! నువ్వు వారిని గురించి ఈషణ్మాత్రం విచారించ నవసరం లేదు. కారణం ? ఈ విశ్వమే కాదు, లోకపాలురు సయితం ఈశ్వరాధీనులై చరించ వలసినదే. ఒకప్పుడే ప్రాణులకు ఆ పరమాత్మయే సంయోగాన్నీ, వేరొకప్పుడు వియోగాన్నీ కల్పిస్తూంటాడు. రజ్జు బంధితమైన వృషభం - భారాలను మోస్తున్నట్లే వర్ణాశ్రమ ధర్మరూపమైన వేద సూత్ర బంధితుడై వాజ్ఞానుసారం మనుష్యమాత్రుడు సంచరిస్తూంటాడు. ఐంద్రజాలకుని ప్రేరణానుసారం వస్తువులన్నీ సంయోగ వియోగాలను పొందుతూన్నట్లే భగవదిచ్ఛానుసారం జీవులన్నీ సంయోగ వియోగాలను పొందుతూంటాయి. జీవ రూపంలో నిత్య వస్తువుగా చూసినా, దేహ రూపంలో అనిత్యంగా చూసినా జడరూపంలో కూడ అనిత్యంగానే తిలకించినా, చైతన్య రూపంలో నిత్యంగా [illegible]ంచినా చిట్టచివరకు శుద్ధ బ్రహ్మరూపంలో

నిత్యా నిత్యాతీతంగా దర్శించినా - విచారానికి అవకాశమే లేదు. మోహం వల్లనే విచారం కలుగుతుంది. కనుక విజ్ఞుడు దుఃఖించ కూడదు. వృద్ధులయిన గాంధారీ ధృతరాష్ట్ర విదురాదులు - "మేము లేకుండా ఎలా బ్రతుకుతారు ?" అన్న సందేహాన్ని త్యజించు. ఈ పాంచ భౌతికమైన శరీరం కాల కర్మలకు వశమై ఉంటుంది. అజగర ముఖగ్రస్తుడైన వాడు తనకు తానే రక్షించుకోలేని స్థితిలో అన్యుల నేమి రక్షించ గలడు ? అల్ప జీవులు, మహా జీవులకు ఆహారమై పోతాయి. తృణం పశువులకు గ్రాసమవుతూండగా - చతుష్పాద జంతువులు ద్విపాద పశువులకు గ్రాసమై పోతున్నాయి. అంటే ఓ జీవి మరో జీవికి ఆహారమైపోతున్నది. ఈ జీవు లన్నింటియందు బహిరంతర భేద రహితంగా పరమాత్మ నిండి నిబిడీకృతుడై ఉన్నాడు. తాను అద్వితీయుడై ఉండికూడ నిజ మాయచే అనేకానేక స్వరూపాలలో భాసిల్లుతూన్నాడు. సర్వ జీవ సంరక్షకుడైన సర్వేశ్వరుడీ సమయంలో ధర్మ విద్రోహులను అంతం చెయ్యడానికి కాలస్వరూపుడై అవతార మెత్తి ఉన్నాడు. దేవ కార్యాన్ని అతడు విశేష భాగం పూర్తి చేసాడు. ఇంకా కొంచెం మాత్రం ఉంది ! అది నెరవేరేవరకూ వుంటాడు. నువ్వంత వరకూ ఆ పరంధామునే ధ్యానిస్తూ వస్తువు లన్నింటి యందూ స్వప్రకాశుడైన పరమాత్మనే దర్శిస్తూండాలి.

ధర్మనందనా! హిమవత్పర్వతానికి దక్షిణ దిశగా సప్త మహర్షుల ఆనందార్థం గంగ సప్తధా విభాజిత మయింది. అందువల్ల వాటికి సప్త స్రోతస్సులని పేరు. ఆ తీర్థ సమీపంలోనే ఋషిపాశ్రమాల దగ్గరకు వెళ్ళారు - గాంధారీ ధృతరాష్ట్ర విదురులు. అక్కడ వారంతా త్రికాలాలలో స్నానం చేస్తూ బంధాలను త్యజించి జలపానం మాత్రమే చేస్తూ ఇంద్రియాలను జయించి శాంత చిత్తంతో దైవధ్యానం చేస్తూ సత్వ రజ స్తమో గుణ రూపమైన మాలిన్యాన్ని అంతం చేసి బుద్ధియందు అహంకారాన్నీ, ఆత్మయందు బుద్ధినీ, పరమాత్మ యందు జీవాత్మనూ లయం చేసి సర్వ కర్మలనూ త్యజించి సమాధి నిష్ఠలో ఉన్నారు. వారి నిష్ఠకు విఘ్నం కలిగించకు. ధర్మరాజా ! నేటికి ఐదు రోజులలో ధృతరాష్ట్రుడు శరీరాన్ని త్యజించి గార్హపత్యాది అగ్నుల ద్వారా పర్ణ కుటీరంతో సహా భస్మమై పోతాడు. అది చూసి గాంధారి కూడ భర్తను అనుసరిస్తుంది. వారి ఇద్దరినీ దర్శిస్తూ విదురు డా ప్రదేశాన్ని విడనాడి తీర్థ యాత్రలకై వెళ్ళిపోతాడు" అంటూ దేవర్షి నారదుడు తుంబురునితో కలిసి వెళ్ళిపోయాడు. ధర్మరాజు నారదమహర్షి ఉపదేశాలను ఆలకించి శోకాన్ని త్యజించి భగవద్ధ్యానంలో లీనమై పోయాడు.

## స్కంధం-1 — అధ్యాయం-14

### ధర్మరాజు శ్రీకృష్ణుని విషయమై అర్జునుని ప్రశ్నించుట.

యాదవ సమేతుడైన వాసుదేవ సందర్శనాభిలాషతో అర్జునుడు ద్వారకా నగరానికి వెళ్ళి చాలా రోజులయింది. ఇక్కడ ధర్మజునికి అనేకంగా దుశ్శకున, దుఃస్వప్నాదులు వస్తున్నాయి. ఋతు ధర్మాలు మారిపోగా లోభ క్రోధ లతో అసత్య పరాయణులై మానవులు పాపాత్ములై పోయారు. సర్వత్రా కపటం పెరిగి పోయింది. స్నేహితులలో అంతర్యుద్ధాలు, మాతా పితర, సోదరీ సోదర భావాలు వివక్షతలూ ఏర్పడ్డాయి. కాముకులై కేవలం భార్యనే దేవతగా భావన చేస్తూన్నారు. నిజోదర పోషణార్థం ఏ కార్యాన్నయినా చేయడానికి సంసిద్ధమవుతూన్నారు. కలియుగ లక్షణాలు క్షణ క్షణం వర్ధిల్లడాన్ని గమనించి ధర్మనందనుడు భీమునివైపు తిరిగి-"సోదరా! మన అర్జునుడు ద్వారకా నగరానికి వెళ్ళి నెలలు ఏడు నిండినా ఇంతవరకూ తిరిగి రాలేదు. దేవర్షి నారదుల వారి ప్రసంగం ద్వారా యాదవుల కుశలవార్త సందేహాస్పదంగా ఉంది. అంబర మార్గంలో ఉల్కా పాతాలు గోచరమయ్యాయి. పదే పదే భూకంపాలు ఏర్పడుతూన్నాయి. మనుష్యులలో ఆధివ్యాధులు వీర విహారం చేస్తున్నాయి. నా వామభాగం అదురుతూన్నది. హృదయంలో దడ జనించింది. సంధ్యా సమయంలో భాస్కరుని వైపు తిరిగి ఆడ నక్క ఏడుస్తూంటే దాని ముఖం నుండి అగ్ని వెలువడుతున్నది. ఉత్తమ జంతువులైన ఆవులు మొదలుగా గలవి అపసవ్యంగా ప్రయాణం చేస్తూంటే గాడిద మొదలైన నీచ జంతువులు సవ్యంగా పురోగమిస్తూన్నాయి. ఏనుగులూ, గుఱ్ఱాలూ ఏడుస్తున్నట్లు గోచరమవుతూంటే ఏదో అరిష్టం సమీపంలోనే ఉన్నట్లు అంతరాత్మ కనిపిస్తూన్నది. ఉలూక, వాయసాది యమదూతలైన పక్షులు అర్ధరాత్రి వేళ పరస్పరం అభిముఖంగా నిలబడి అర్ధరాత్రి వేళ భయంకర నాదాలు చేస్తూన్నాయి. ధూమ్ర వర్ణంతో దశ దిశలూ నిండాయి. చంద్ర మండలానికి చతుర్దిశలయందూ మండలాకారం ఏర్పడింది. పర్వత సమేతంగా పృథ్వి కంపించింది భయంకరమైన ఉరుములతో ఆకాశం నిండిపోతూన్నది. ప్రచండ వాయువులు ధూళిని వర్షింప జేస్తున్నాయి. పిడుగులు పడుతూన్నాయి, గ్రహ యుద్ధాలు చెలరేగగా, భూమ్యంతరిక్షాలు జ్వలిస్తూన్నట్లు - చూస్తుండగా మహా శబ్దాలు ఉత్పన్న మవుతూన్నాయి. వీటన్నింటినీ తిలకిస్తూంటే వాసుదేవుడు అవతారం చాలించి వైకుంఠధామం చేరుకున్నాడేమోనని అని అనిపిస్తూన్నది." అని ధర్మరాజు ఇంకా ఏదో చెప్పబోతూండగానే కన్నీరు మున్నీరై విలపించగా తేజోహీనమైన ముఖంతో అర్జునుడు అక్కడకు వచ్చాడు.

ఆ స్థితిలో ఉన్న అర్జునుని చూస్తూనే ధర్మరాజు "సోదరా! ద్వారకా నగరంలో మన వారందరూ క్షేమమేనా? నీ ప్రయాణం బాగా జరిగిందా? దేవకీ వసుదేవులూ, బలరామ కృష్ణులూ క్షేమమే కదా! మన యందు

స్నేహము కలిగిన వారందరూ మన క్షేమాన్ని కాంక్షిస్తున్నారా ? శ్రీకృష్ణ పత్నులైన పదహారు వేల నూట ఎనమండుగురూ పరస్పర మైత్రి కలిగి జగన్నాథుని సేవిస్తున్నారా ? వారి కుశల సమాచారాన్ని ఆలకించే వరకూ నా మనస్సు ఆతురత్వాన్ని పొందుతూనే ఉంటుంది. నీ వదనం చూస్తుంటే శ్రీ విహీనంగా ఉంది. నిన్నెవ్వరూ ఎక్కడా నిందించి అవమానించ లేదుకదా ! ఎవరికైనా ఏమైనా ఇస్తానని వాగ్దానం చేసి ఇవ్వలేక పోయావా ?

బ్రాహ్మణులూ, ధేనువులూ, వృద్ధులూ, రోగ పీడితులూ నారీ జనాదులలో ఎవరైనా నిన్ను శరణు వేడితే వారిని రక్షించ జాలనని పరిత్యజించలేదు కదా ! అగమ్యా గమనాది ప్రమాదాలలో నువ్వు చిక్కుకోలేదు కదా ! నిన్ను చూస్తుంటే నాకు తీవ్రమైన విచారం కలుగుతూన్నది. ఇంతవరకూ, ఎట్టి విపత్కర పరిస్థితు లెదురైనా నిన్నిలా చూడలేదు" అన్నాడు.

## స్కంధం-1 — అధ్యాయం-15

## కృష్ణ వియోగంతో పాండవులు రాజ్యాన్ని త్యజించుట

## పరీక్షిత్తుకు పట్టాభిషేకం - పాండవేయుల మహాప్రస్థానము

వాసుదేవునికి ప్రియ మిత్రుడైన అర్జునుడు తనకు అనేక ఘోర సంగ్రామాలలో సారధిగా సహకరించిన ఆ దేవ దేవుని దివ్య మంగళ సుందర మందస్మిత యుక్త వదన మండలాన్ని మరువలేకున్నాడు. ఆ దివ్య స్వరూపం విస్మరించడానికి వీలు లేకుండా అతని హృదయారవిందంలో నిలచిపోయింది. తత్కారణంగా పార్థుడు యాదవుల పరస్పర మరణానికీ దానిని మించి శ్రీకృష్ణుడు అవతారం చాలించినందులకూ అత్యంతగా దుఃఖించి కళ్ళు తుడుచుకుంటూ "అగ్రజా ! మన బాంధవుడు, సారధి, సఖుడూ అయిన శ్రీకృష్ణుడు మనల నందరినీ విడనాడి స్వధామానికి వెళ్ళిపోయాడు. తత్కారణంగానే నేను తేజోహీనుడనైపోయాను. జీవచ్ఛవ మయ్యాను. వాసుదేవానుగ్రహం వల్లనే కదా మనం ద్రౌపదీ స్వయంవరంలో శత్రువుల నందరినీ జయించ గలిగాము. ఆ దివ్య పురుషానుగ్రహం వల్లనే కదా నేను మత్స్య యంత్రాన్ని ఛేదించి ద్రౌపదిని తేగలిగినది. ఆ మహాత్ముని చేయూత వల్లనే కదా మహేంద్రాదులను లెక్కచేయక ఖాండవ వనంలో అగ్నిహోత్రునికి తృప్తిని కలిగించినది. తత్కారుణ వల్లనే కదా మయ దానవ వినిర్మిత మయసభా భవనాన్ని పొందగలిగాము. ఆ పరమ పురుషుని ప్రేరణ చేతనే కదా భీముడు జరాసంధుని అంతం చేసివేసినది. ద్రౌపదీ మాన సంరక్షకుడైన ఆ దేవదేవుడే మన వనవాస దీక్షా కాలంలో దూర్వాస మునీంద్రుడు దశ సహస్ర శిష్య గణ పరివేష్టితుడై వేంచేయగా పాంచాలి భక్తితో సమర్పించిన పత్ర మాత్ర

పరితృప్తులై వారందరినీ సంతుష్టులను చేసి రక్షించినది ఆ శ్రీకృష్ణుడే కదా! నీలకంఠుని మెప్పించి ఎవని కరుణచే పాశుపతాస్త్రాన్ని నేను సాధించగలిగినానో, లోకపాలు రందరినుండీ అనేకాస్త్రాలు గ్రహించి మహేంద్రుని అర్థాసనాన్ని అలంకరించగలిగానో నివాతకవచ కాలకేయాది దుష్ట రాక్షసుల అంతానికి చేయూతనిచ్చిన మహనీయుడెవరో? ఆ శ్రీకృష్ణదేవుని వల్లనే కదా మనం భీష్మ ద్రోణాది మహావీర రక్షితమైన కౌరవసైన్యాలను జయించ గలిగాము. ఎవని సహకారం మనకు రక్షాకవచమైనదో, సంగ్రామరంగం స్థలంలో నా గుర్రాలు అలసిపోగా నేను రథావరోహణం చేసి పృథ్విపై నిలచిన నాడు ఏ మహాత్ముని మాయామోహంచే యోధానుయోధులందరూ - నాపై ఏకమాత్ర బాణాన్ని కూడ ప్రయోగించలేక పోయారో? ఎన్ని అపరాధాలు చేసినా బిడ్డను తండ్రి కాపాడి మన్నించినట్లు నన్ను సంరక్షించిన దయాసముద్రుడెవడో? నిరంతరం కలిసి మెలసి శయనాసన భోజనాదులు సాగించామో ఆ మనబావ, మన సఖుడు, మన బాంధవుడు, మన సర్వస్వమైన శ్రీకృష్ణుడు యదువృష్ణి భోజ, అంధక వంశీయులైన వారందరితో ఈ లోకాన్ని విడనాడి వెళ్ళిపోయాడు.

ప్రభూ! వీరయాదవ శూన్యమైన ద్వారకానగరంలో నారీ జనం వసించడం కష్టతరమని గుర్తించి వారందరినీ వెంట బెట్టుకొని నేను వస్తూంటే తత్సమయంలో ధూర్త గోపకులు నన్ను వారించి ఆ స్త్రీలను బలాత్కారంగా తీసుకుపోతూంటే అబలలా నేను ఏమీ చెయ్యలేక పోయాను.

అవే అశ్వ, గాండీవ, అస్త్రాదులు కాగా ఆ వీర ధనంజయుడనే అయినా శ్రీకృష్ణుడు లేని నేనూ - నా పరాక్రమమూ నిష్ప్రయోజనమై పోయాయి. కేవల భస్మంలో వేసిన గోఘృత హోమ సదృశంగా - కపట చిత్తుని సేవవలె, ఊసర స్థానంలో నాటిన బీజంవలె నా శక్తులన్నీ వృథా అయిపోయాయి. విప్రశాపదగ్ధులైన యాదవులందరూ పరస్పరం కలహించి అంతమయ్యారు. యదార్థానికి ఈ సర్వం శ్రీకృష్ణ పరమాత్మలీలయే కదా! విశ్వంలో ఓ ప్రాణిని మరొకటి అంతం చెయ్యడం ఓ జీవి మరో జీవిని పోషించడమూ జరుగుతూ ఉంటుంది. జలచరాలలో చిన్నవాటిని పెద్దవి కబళిస్తూంటాయి. తద్రీతిగా పరమాత్మ యాదవ వీరులచే రాజులనందరినీ అంతం చేయించి - చిట్టచివరకు పరస్పర మరణాన్ని కల్పించి - యాదవ నాశనంతో పృథ్వీభారాన్ని దూరం చేసాడు శ్రీకృష్ణదేవుని దివ్యోపదేశం దేశకాలాను యోగ్యమయింది. వాటి స్మరణ మాత్రాన నా మనస్సు పరవశమవుతూన్నది!!

అని పై రీతిగా అర్జునుడు శ్రీకృష్ణావతార పరిసమాప్తి విషయాలను వివరించి భగవద్గీతను సంస్మరించి సర్వసంగపరిత్యాగియై విశేషించి కాలచక్ర విముక్తుడు కాగలిగాడు. పార్థునివల్ల సర్వవిషయాలను ఆలకించి కుంతీదేవి సర్వసంగ ముక్తియై దేహాన్ని చాలించింది.

ముల్లును ముల్లుతోనే తొలగించి ఆ రెంటినీ వదలినట్లు వాసుదేవుడు యదువంశంలోనే అవతరించి పృథ్వీ భారాన్ని దూరం చేసి పరంధామం చేరాడు. శ్రీకృష్ణ నిర్యాణ సమాచారాన్ని ఆలకించిన పాండవాగ్రజుడు స్వర్గారోహణానికి దృఢ సంకల్పం చేసాడు. శ్రీకృష్ణావతార పరిసమాప్తినాడే - కలియుగం ఆరంభమయింది. అది అధర్మంలో అజ్ఞానులందరినీ బంధించి వేస్తుంది. కామక్రోధలోభ మోహమద మాత్సర్యాలు సర్వత్రా వ్యాపిస్తున్నాయి.

హస్తినాపుర సామ్రాజ్యానికి ధర్మరాజు పరీక్షిత్తును పట్టాభిషిక్తుని చేసి అనిరుద్ధ కుమారుడైన వజ్రనాభుని మధురా మండలాధిపతిగా చేసాడు. తరువాత తాను సర్వాలంకారాలనూ పరిత్యజించి ప్రాజాపత్యయాగం చేసి ఆహవనీయాద్యగ్నులను ఆత్మారోపణ చేసి వాక్కును మనస్సులోనూ, మనస్సును ప్రాణంలోనూ, ప్రాణాన్ని అపానంలోను, అపానాన్ని మృత్యువులోనూ, మృత్యువును పాంచభౌతికమైన దేహమందూ లయం చేసి-దేహానికి మృత్యురూపానుభవాన్ని కలిగించి - దానిని గుణత్రయమందూ, వాటిని మూల ప్రకృతియందూ, దీనిని ఆత్మయందు, దానిని అవినాశనమైన బ్రహ్మయందూ లీనం చేసి దృశ్యమాన విశ్వసర్వస్వం బ్రహ్మమన్న భావంతో - బ్రహ్మను భవాన్ని పొంది నార చీరలు ధరించి, ఆహారపానీయ వర్జితుడై, మౌనియై జడోన్మత్త పిశాచ లక్షణాలుకలవాడై జడలు విరబోసుకుని - బ్రహ్మనిష్ఠుడై ఉత్తరాభిముఖంగా పురోగమించ సాగాడు. శ్రీకృష్ణ భగవచ్చరణారవిందానురక్తితో - భీమార్జున నకుల సహదేవులు కూడ అగ్రజుని అనుసరించిసాగారు. భర్తలందరూ పాంచభౌతిక దేహత్యాగం చేసి స్వర్గం చేరడం కనులారా తిలకించిన ద్రౌపదీదేవి కూడ శరీరాన్ని త్యజించి అమర ధామాన్ని పొందింది. ప్రభాసక్షేత్రంలో దేహాన్ని త్యజించిన విదురుడు తన సంయమనీపురం చేరాడు. భగవత్ప్రియ భక్తులయిన పాండవేయులు స్వర్గారోహణ గాథను చదివినా, విన్నా మానవులు భక్తి వర్ధిల్లగా మోక్షాన్ని పొందుతారు.

---

## స్కంధం-1 — అధ్యాయం-16

### పరీక్షిత్తు దిగ్విజయం చేయుట : పృథ్వీ ధర్మదేవతల సంవాదం

అనంతర గాథను సూతమహర్షి వర్ణిస్తూండగా శౌనకాది మహర్షులు శ్రద్ధాభక్తులతో ఆలకిస్తున్నారు.

"మహర్షులారా! పాండవేయులు మహాప్రస్థానం చేసిన తరువాత విద్వాంసుల సలహా సహకారాలతో పరీక్షిన్మహారాజు ధర్మంగా ప్రజాపాలన చేస్తున్నాడు. ఉత్తర పుత్రి అయిన ఐరావతిని పరిణయమాడి జనమేజయాది నలుగురు పుత్రులను కన్నాడు. కృపాచార్యుని ఆధ్వర్యంలో అశ్వమేధయాగాలు మూడు గంగాతీరంలో చేయగలిగాడు. స్వయంగా దేవతలు

ఆ యాగాలలో హవిర్భాగాలు స్వీకరించారు. అతడు ఒకానొక పర్యాయం దిగ్విజయ యాత్ర కొనసాగిస్తూండగా - శూద్రరాజ వేషధారియై కలి పురుషుడు ఓ వృషభాన్నీ, ఓ గోవునూ హింసిస్తూండడం చూసి - వాణ్ణి దండించి విడిచాడని చెప్పగా శౌనకుడు ప్రశ్నించాడు. "సూతర్షీ! మరణ ధర్మంగల మానవులంతా మందభాగ్యులై రాత్రివేళ నిద్రలోనూ, పగటివేళ వ్యర్థమైన కాలక్షేపాలతోనూ జీవితాన్ని వ్యర్థం చేసుకుంటారు. బ్రహ్మజ్ఞానం పొందే వరకూ జ్ఞానులయిన వారు క్షణ కాలాన్ని కూడ వృథా చేయకుండ, ఆయుర్దాయం వర్ధిల్లడం కోసం యమధర్మరాజును ఆహ్వానించి శాంతి కర్మలు ఆచరిస్తూ నిరంతర సద్గోష్ఠులతో భగవద్ధ్యానాలతో కాలాన్ని సంపూర్ణంగా సద్వినియోగం చేసుకుంటారు. అధర్మ మార్గంలోనే చరించే కలిని సంహారించకుండా - ధర్మమార్గాను వర్తనుడై పరీక్షిన్మహారాజు ఎందుకు వదలి పెట్టాడు? పరమార్థ ప్రదాయకమైన విషయమయితే సమాధానం చెప్పు!! అంటూ అడిగిన దానికి సూతుడు సమాధానం చెబుతూన్నాడు.

శౌనకాదులారా! కలియుగం ప్రవేశించి సనాతన ధర్మాలు నాశనమై తద్విరుద్ధ ధర్మాల ప్రచారం కావడం చూసి పరీక్షిన్మహారాజు శస్త్రపాణియై చతురంగ సైన్యాలు వెన్నంటి రాగా దిగ్విజయార్థం బయలు దేరాడు. సింహ ధ్వజంతో అలరారే అతని రథానికి శ్యామవర్ణం కల అశ్వాలు పూన్చబడ్డాయి. భద్రాశ్వ, కేతుమాల్య, భారత, కురు, కింపురుష దేశాలు జయించి ఆయా దేశాధినాథులనుండి బహుమానాలు అందుకుని ప్రతీ ప్రాంతంలోనూ తన పూర్వజులయిన పాండవేయుల కీర్తినీ, యాదవ పాండవులకుగల సంబంధ బాంధవ్యాలను గురించీ ఆలకిస్తూ శ్రీకృష్ణ పరమాత్మ తన పితామహుడైన అర్జునునికి బావమరదిగా, సఖునిగా, సారథిగా, దూతగా, తోడు నీడై సహకరించిన విషయాలను ఆలకిస్తూంటే పులకాంకిత దేహుడై పురోగమిస్తూన్నాడు. ఆ యాత్రా సమయంలో పరీక్షిన్మహారాజు పండిత శ్రేష్ఠులను సమ్మానిస్తూ ఆది నుండీ తన వంశానికిగల కీర్తిని సుస్థిరం చేసాడు. కురుక్షేత్ర ఘోర సంగ్రామ రంగంలో రాత్రి కాలంలో శత్రువుల ద్వారా ప్రమాదాలు రాకుండ సంరక్షిస్తూ ధర్మరాజు సభాసదుడుగా కూడ శ్రీకృష్ణదేవుడు వ్యవహరించాడన్న మాటలు వింటూన్న ఆ పరీక్షిన్నరేంద్రునికి ఆ దేవదేవుని యందలి భక్తి వర్ధిల్లసాగింది.

యాత్ర సాగుతూండగా ఓ నాడు పరీక్షిత్తు శిబిరానికి ఎదురుగా ఏక పాదంతో బల హీనంగా ఉన్న ఓ వృషభమూ, గోరూపధారిణియై విచారిస్తూన్న పృథ్వీ దేవీ కనిపించారు. ధర్మ దేవత ఏకమాత్ర పాదంతో వృషభ రూపంలో ఉన్నాడు. వారిద్దరి మధ్య సంభాషణ ఆరంభమయింది. "కళ్యాణీ! నువ్విలా దుఃఖిస్తూన్నావేమి? బంధుబాంధవులు బహు దూరంలో ఉన్నారా? లేక ఏమైనా ఆపద వచ్చిందా? ధర్మం పాద మాత్రంగా ఉన్నదనా? లేదా నిన్ను శూద్ర రూపంలో ఉన్న కలి పురుషుడు శాసిస్తున్నాడనియా? నీకు దుఃఖం కలగడం న్యాయమే. వేద ధర్మ దూరులై నిన్ను

శాసించే శాసకులనూ, వేదాన్ని విక్రయించే విప్రులను, యాగాలు లేకపోవడం వల్ల హవిర్భాగాలు లేక బాధలుపడే దేవతలనూ తిలకిస్తూంటే నీకే కాదు, ఎట్టివారికైనా దుఃఖం కలగక తప్పదు. స్వేచ్ఛాన్వ్యవహార సంలగ్నులైనవారు ధర్మాన్ని అతిక్రమించి స్నాన, పాన, ఆహార, వస్త్ర, స్త్రీ సహవాసాదులు కొనసాగించడం చూస్తూంటే అతివృష్టి, అనావృష్టి ఏర్పడి కరువు కాటకాలవల్ల సర్వనాశనమవుతుందని విచారిస్తున్నావా? భూమాతా! శ్రీకృష్ణపరమాత్మ గోలోకానికి వెళ్ళడంతోనే కలిపురుషుడు విజృంభించాడు. అతనివల్లనే ఈ అధర్మ లక్షణాలన్నీ వర్ధిల్లుతూన్నాయి. నీ విచారానికి కారణమదేనా? మహా బలశాలురు కూడ కాలానికి వందనాలు చేస్తారు. అట్టికాలమూ, దేవతలూ కూడ నీకు ప్రణమిల్లుతూంటారు. అట్టి నీ సౌభాగ్యాన్ని కూడ కలిపురుషుడు అపహరించాడు. నీ దుఃఖానికి యిదేనా కారణం?'' అని ప్రశ్నించిన ధర్మదేవతకు గోరూపధారిణి అయిన భూమాత బదులు పలుకుతూన్నది.

ఓ ధర్మదేవతా! భగవత్సహకారంతో లోకాలకు శాంతి సౌఖ్యాలను ప్రసాదించే నువ్వు పాదచతుష్టయంతో భాసిల్లుతూంటావు. సత్యం, పవిత్రత, దయ, క్షమ, త్యాగ, సంతోష, సరసత్వ, శమ, దమ, సమత్వ, తితిక్ష, ఉపరతి, శాస్త్రవిచారణ, వైరాగ్య, ఐశ్వర్య, వీరత్వ, తేజోబల, స్మృతి, స్వాతంత్ర్య, కౌశల్య, కాంతి, ధైర్య, కోమలత్వ, నిర్భయత్వ, వినయ సౌశీల్య, సాహసోత్సాహ, సౌభాగ్య, గాంభీర్య, స్థైర్య, ఆస్తిక్య, యశోగౌరవ, నిరహంకారాలనే ఈ 39 గుణాలే కాక యింకా అనేకానేక కళ్యాణ గుణాలు ఆ శ్రీకృష్ణదేవుని ఆశ్రయించి తేజరిల్లుతూంటాయి. సర్వగుణాశ్రయుడైన పరమాత్మ గోలోకధామానికి వెళ్ళిపోయాడు. తదాదిగా కలిపురుషుడు విజృంభించాడు. అధర్మం పెచ్చు పెరగడంతో ధర్మానికి స్థానమే లేకుండా పోయింది. ఏకమాత్ర పాదంతో నువ్వు ఉన్నావు. దేవతలూ, ఋషులూ కూడ నాతో కలసి చిరకాలం ప్రార్థించగా శ్రీహరి అవతరించి స్వర్గాదులకు సయితం లేనట్టి మహత్తర సౌభాగ్యాన్ని, భూతలానికి అనుగ్రహించాడు. తద్వారా నాకు మహాభాగ్యం కలిగింది. ఆ దేవదేవుడు అవతారం చాలించడంతో నాకు కష్టాలు మొదలయ్యాయి. నాకు కలిగిన సౌభాగ్య గర్వభంగార్థమే పరమాత్మ నాకీ శిక్ష విధించాడు. పాదమాత్రావశేషంగా ఉన్న నిన్నూ భారంతో క్రుంగిపోయే నన్నూ ఉద్ధరించడానికే కృష్ణరూపంలో అవతరించి అనుగ్రహించాడు. అతడీ భూమండలంలో ఉన్నంత కాలమూ—దుర్మార్గుల బాధలు లేకుండా అందరూ సుఖించారు. అవతార సమాప్తితో అధర్మం పునః వర్ధిల్లింది. ధర్మసంస్థాపనార్థం శ్రీకృష్ణ వియోగంలో సుఖం ఎలా కలుగుతుంది?'' అంటూ భూమాత ధర్మదేవతకు చెబుతూంటే పరీక్షిత్తు వారి సంవాదం వింటూ తూర్పుగా ప్రవహించే సరస్వతీ తీరం చేరాడు.

## స్కంధం -1 — అధ్యాయం-17
## కలిపురుషుని పరీక్షిత్తు శిక్షించుట

సరస్వతీ నదీ తీరంలో-శూద్ర రూపంలో రాజ వేషాన్ని ధరించిన కలిపురుషుడు వృషభ రూపంలో ఉన్న ధర్మ దేవతనూ గో రూపంలో ఉన్న పృథ్వీ మాతనూ హింసించడం చూసిన పరీక్షిత్తు వెంటనే ధనుర్బాణ ధారియై సింహనాదం చేసి కలిపురుషుని సమీపించి పలికాడు. ఓరీ! ఎవడవురా నువ్వు? బలశాలివైన నువ్వు నా రాజ్యంలోని దుర్బల ప్రాణులను ఎందుకు హింసిస్తావు. నటునిలా రాజ వేషాన్ని ఎందుకు ధరించావు? నిర్జన ప్రదేశంలో ఈ సాధు జంతువులను బాధిస్తున్నావా? ఆగు, నువ్వు మహాపాపివి.వధార్హుడవు"అంటూ కలిని నిరోధించి – గోరూప పృథ్వినీ, వృషభ రూప ధర్మ దేవతనూ తిలకించి ఏక పాదంతో, దుర్బల శరీరంతో అతి కష్టం మీద నువ్వు నడుస్తూంటే నాకు చాల వేదన కలుగుతూన్నది. నీ వాస్తవ రూపం ఏమిటి? నా రాజ్య పాలనలో అన్యాయంగా ఎవరూ దుఃఖించ రాదు. నిశ్చయంగా నీ క్లేశ కారణాన్ని వివరించు" అంటూ అతడు గోవు కేసి తిరిగి "గోమాతా! దుర్మార్గులచే సన్మార్గులు పీడింపబడే రాజ్యాన్ని పాలించునట్టి ప్రభువు యొక్క ఐశ్వర్యయశస్సులన్నీ నాశనమై పోతాయి. బలహీనుల, సజ్జనుల క్లేశాలను రూపుమాపడం ప్రభు కర్తవ్యం. నువ్వు విచారించకు" ఇప్పుడే ఈ దురాత్ముణ్ణి అంతం చేసి మిమ్మల్ని కాపాడుతాను. మా వంశ కీర్తిని నాశనం చేసే స్థితిలో మీకీ గతిని కల్పించిన వాడెవడైనా ప్రాణాలతో బయటపడలేడు. నా ధర్మానుసారం నేను దుష్టులను అంతం చేస్తాను." అంటూ తమకు అభయమిచ్చిన పరీక్షిత్తును చూస్తూ వృషభరూపంలో ఉన్న ధర్మదేవత పలికింది. "రాజా! వాసుదేవునే సారథిగా, దూతగా చేసుకున్న అర్జునుడు ప్రభవించిన పాండవ వంశంలో నువ్వు జన్మించావు. శాస్త్రోపదిష్ట మోదిత భిన్న భిన్న మార్గాలలో పయనిస్తూ మోహంలో చిక్కుకున్న మాకు క్లేశ కారణుడు గోచరించడం లేదు. ప్రారబ్ధం క్లేశ కారణ మనీ కొందరూ, స్వభావమే అందుకు కారణమని మరి కొందరూ, అదీకాదు భగవంతుడే కారకుడని శేషించిన వారూ వక్కాణిస్తున్నారు. మరి కొందరు మాత్రం దుఃఖ కారణాన్ని నిర్ణయించ జాలమంటారు. కనుక స్వబుద్ధ్యా మా దుఃఖ హేతువును నువ్వే నిర్ణయించి చెప్పు." అని అర్థించగా పరీక్షిత్తు బదులు పలుకుతూన్నాడు.

"ఓ ధర్మ దేవతా! నేను నిన్ను గుర్తించాను. నీ స్థాయి కనుకూలంగా నువ్వు నాకు ఉపదేశించావు. అధార్మికునికి కలిగే దోషమే అపనిందలు మోపే వారికీ కలుగుతుంది. మనో వాగతీతమైనది - పరమేశ్వరుని మాయ, నువ్వు నాలుగు పాదాలతో కృతయుగంలోనూ, మూడు పాదాలతో త్రేతాయుగంలోను, రెండు పాదాలతో ద్వాపర యుగంలోనూ ఉంటావు. అధర్మాంశలైన ఆసక్తి, గర్వాలు కారణంగా కలియుగంలో నువ్వు ఏకమాత్ర

పాదంతో ఉంటావు. దీనిని కూడ నాశనం చెయ్యాలని కలిపురుషుడు చూస్తున్నాడు. భారాన్ని భరించలేనని భూదేవి గోరూపధారిణియై విలపించగా పరమాత్మ శ్రీకృష్ణ రూపంలో అవతరించి ఆ భారాన్ని హరించాడు. శ్రీకృష్ణ చరణాంకితమైన భూదేవి - ఆ దేవదేవుడు గోలోకధామం చేరగానే అభాగ్యురాలై పోయింది. అధార్మికులు రాజ రూపాలు ధరించి విప్రద్రోహులై తనను పాలిస్తారని భూమాత విలపిస్తున్నది. దీనిని నువ్వు ఉపదేశించిన ధర్మ బలంతోనే నేను గ్రహించాను.ఇక మీకువచ్చిన భయం లేదు." అంటూ వారికి అభయ మిచ్చి సర్వశస్త్రాస్త్ర ధారియై పరీక్షిన్మహారాజు రాజ వేషంలో ఉన్న కలిపురుషుని అంతం చెయ్యాలని అతని పైకి నిశితకరవాలంతో దూకాడు. అది గ్రహించిన కలి కపటవేషాన్ని త్యజించి పరీక్షిత్తు పాదాలపై బడి రక్షించు ప్రభూ!' అని అర్థించగా శరణాగత వత్సలుడై ఆ చక్రవర్తి మందస్మితం చేస్తూ కలితో అంటూ న్నాడు.

"కలిపురుషా! అర్జునవంశ సంజాతుడైన వాడెవడూ శరణన్న వారిని సంహరించరు. అధర్మానికి సహాయకుడవైన నువ్వు - నా రాజ్యంలో ఉండరాదు. రాజశరీరాలలో నువ్వు ప్రవేశించడం కారణంగా - లోభ, అసత్య, చోరత్వ, దుర్మార్గ, స్వధర్మ పరిత్యాగ, కపట, దరిద్ర, కలహా, ఆదిగాగల అనేక పాప సంబంధమైన గుణాలు వర్ధిల్లుతూన్నాయి. కనుక యిక క్షణ కాలం కూడ నువ్వు నా రాజ్యంలో ఉండరాదు. సత్యధర్మాలేనా శాసనంలో వర్ధిల్లాలి. శ్రీకృష్ణుడవతరించిన ఈ దేశంలో వేదవిధుల ననుసరించి యాగాలూ సత్కార్యాలూ జరుగుతూండాలి. సర్వాత్మ స్వరూపుడైన పరమాత్మ సర్వజీవుల బాహ్యాభ్యంతర వ్యాప్తుడై భక్తుల అభీష్టాలు నెరవేరుస్తూంటాడు. కనుక శీఘ్రంగా నా రాజ్యం వదలి పొమ్మన్న పరీక్షిన్నరపాలునికి నమస్కరించి కలి వినయంగా "ప్రభూ! మీ శాసనానుసారంనే నుంటాను. నేనుండవలసిన స్థానాలను మీరే నిశ్చయించి చెప్పండి" అనగా పరీక్షిత్తు "కలీ! ద్యూతం, మద్యం, స్త్రీ సంగం, హింస అనే నాలుగు స్థానాలలోనూ, నువ్వు ప్రవేశించు అనగా కలి ధనమందు కూడ స్థాన మిప్పించండి." అని అర్థించగా మహారాజు అంగీకరించాడు. ఆ నాటి నుండీ కలిపురుషుడు ద్యూత కలహా, స్త్రీసంగమ, హింసాధనాదులందు ప్రవేశించాడు. కనుక విజ్ఞులు, ఈ అయిదింటినీ అధర్మ స్థానాలుగా గ్రహించి దూరంగా ఉంటారు. ఆత్మ కళ్యాణాన్ని వాంఛించే వారు ఎవరూ వీటిని సేవించరాదు. కలిగర్వమణచి పరీక్షిత్తు తపశ్శౌచ దయా రూపాలయిన పాద త్రయాన్ని పునః ధర్మదేవతకు ప్రసాదించి వృషభ, గోరూపధారులయిన పృథ్వీ ధర్మ దేవతలను ఓదార్చి పితృ పితామహదత్తమైన రాజ్యాన్ని శాసించాడు"

శౌనకాదులారా! ఆ మహాత్ముని రాజ్యంలోనే మీరీ సత్రయాగం చేస్తూన్నారు అని" సూతుడు పలికి నాటికి మౌనం వహించాడు.

## స్కంధం-1 — అధ్యాయం-18

## శృం గి శా ప ం

అనంతర కథను సూత మహర్షి చెప్పగా శౌనకాదులు ఆలకిస్తున్నారు. "మహర్షులారా! మాతృగర్భంలో ఉండగానే అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మ నామ కాస్త్రం నుండి శ్రీకృష్ణునిచే రక్షింపబడ్డ పరీక్షిన్మహారాజు మునిశాపం వల్ల తక్షక నాగుని విషాగ్ని జ్వాలలచే మరణమని తెలిసి కూడ శోకించక గంగానదీ తీరంలో శ్రీశుకుని వల్ల భగవత్తత్త్వాన్ని గ్రహించి దేహత్యాగం చేసాడు.

శ్రీహరి లీలా కథామృతపాన మాత్రంచే మనుష్యమాత్రులు మోహాదూరులై పరమ పదాన్ని పొందగలుగుతారు. శ్రీహరి అవతారం చాలించినా - కలిపురుషుడు ప్రవేశించ కుండా పరీక్షిత్తు నిరోధించ గలిగాడు. ఆ మహారాజు సారగ్రహి సంకల్ప మాత్రంచే పుణ్యం కలుగుతుందనీ చేస్తేనే కాని పాపఫలం లభించదనీ గ్రహించిన వాడైన పరీక్షిన్మహారాజు - కలిని నిగ్రహించాడే కానీ ద్వేషించ లేదు. పసి వాని విషయంలో ధైర్యంగానూ, వీరశూరుల విషయంలో తోడేలు భయంగానూ సంచరించినట్లుగానే కలిపురుషుడు కూడ అజ్ఞానుల విషయంలో ధైర్యంగానూ, జ్ఞానుల విషయంలో భయంతోనూ చరిస్తూంటాడు. ఆ కారణం వల్లనే పరీక్షిత్తు శాసన కాలంలో కలి తన ప్రభావాన్ని చూపించలేక పోయాడు.

మహర్షులారా! మీరడిగిన ప్రశ్నకు సవిస్తరంగా పరీక్షిన్మహారాజు చరిత్ర చెప్పాను. ముముక్షువులకు ముక్తిని ప్రసాదించునట్టి శ్రీకృష్ణ లీలా భూయిష్టమైన గాథ లనేకంగా ఉన్నాయి. జిజ్ఞాసువులైన వారు భగవత్కథలనే ఆలకించాలి. భగవంతునే సేవించాలి." అన్న సూతర్షి వచనాలను ఆలకించిన శౌనకాదులు పునః ప్రశ్నిస్తున్నారు.

"సూత మునీంద్రా! నువ్వు సర్వమానవ తరణోపాయమైన శ్రీకృష్ణ లీలామృతాన్ని అందజేస్తున్నావు. కనుక నువ్వు దీర్ఘాయుర్దాయంతో వర్ధిల్లెదవు గాక! చిరకాలం సాగే యాగ ధూమంతో శరీరం ధూమసమం అయినా ముక్తి కలుగుతుందన్న విశ్వాస శూన్యులమైన మాచే శ్రీకృష్ణ లీలామృత పానం చేయించి సంతృప్తిని ప్రసాదిస్తున్నావు. క్షణ కాల సజ్జన సాంగత్యం మాత్రంచే స్వర్గాదులే తూగజాలనినాడు-తుచ్ఛమైన భోగాదులతో పని ఏ ముంది? మునీంద్రా! శంకర బ్రహ్మేంద్రాదులే శ్రీకృష్ణ కథామృత పానంలో పారంగతులు కాలేక పోతూంటే సామాన్యుల విషయం వర్ణించ నేల? హరికథా కథనంలో సర్వసమర్థుడవైన నువ్వు - గంగా తీరంలో శుక మహర్షి పరీక్షిన్మహారాజుకు వినిపించిన భాగవతాన్ని మాకు వినిపించు" అని అర్థించిన శౌనకాదులకు సూతర్షి సమాధానం చెబుతూన్నాడు.

"మహాత్ముల సేవ వల్ల నేను ధన్యుడనయ్యాను. అంతమాత్రం చేతనే నేను ధన్యుడను

కాగా - సత్పురుషుల ధన్యత్వ మెంతటిదో చెప్పగల వారెవరు? శ్రీ మహాలక్ష్మి ఎవరెన్ని విధాల ప్రార్థించినా-అనంత కళ్యాణ గుణుడైన భగవంతుని పాదాలనే సేవిస్తూంటుంది. బ్రహ్మార్పితమైన జలాలే హరి పాదాలలో గంగా రూపాన్ని ధరించి - సదాశివ సమేతంగా భువన త్రయాన్ని పవిత్రం చేస్తూంటాయి. ఏ దయాసాగరుని పాదారవిందావిర్భూత జల సంపర్క మాత్రంచే లోకాలన్నీ పావనమవుతూంటాయో ఆతడే శ్రీకృష్ణ భగవానుడు. సర్వసంగ పరిత్యాగం చేసి పరమహంస స్థితిని అందుకోవడమే మనుష్య ధర్మం. ధీరసంపన్నులు అదే స్థితిని పొందుతారు. శక్త్యనుసారం పక్షి ఆకాశ మార్గంలో ఎగురునట్లు విద్వాంసులయిన వారు - వారి వారి శక్తులను అనుసరించి శ్రీ కృష్ణ లీలాభి వర్ణన చేస్తూంటారు. గురు కృప కారణంగానే శ్రీకృష్ణదేవుని విశేష కరుణ ప్రేరణలతో నేను ఆలకించిన దానిని నాకు తెలిసినంతలో చెప్పగలిగినదంతా చెబుతాను - శ్రద్ధగా ఆలకించండి.

ఒకానొకనాడు - పరీక్షిన్మహారాజు వేటకై అరణ్యానికి వెళ్ళి లేళ్ళగుంపును వెన్నంటి ప్రయాణించి అలసిపోయాడు. అతణ్ణి క్షుత్పిపాసలు వేధించసాగాయి. ఎక్కడా జలాశయమేదీ అతనికి కనబడ లేదు. అన్వేషించుకుంటూ అక్కడే ఉన్న శమీక ముని చంద్రుని పవిత్రాశ్రమం చేరాడు. ఆ మహర్షి ఇంద్రియాలను బంధించి ఉన్నాడు. అంతేకాదు — ప్రాణ వాయువును సైతం బంధించి జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలకు అతీతంగా బ్రహ్మనిష్ఠుడై సమాధ్యవస్థలో ఉన్నాడు. పరీక్షిత్తుకు అక్కడ తృణాసనమైనా కనిపించలేదు. దాహ పీడితుడై అలసిసొలసిన వాడై శమీక మహర్షిని పలకరించి చూసాడు. ఫలితం శూన్యమే. క్షుత్పిపాసా పీడితుడై యున్న ఆ మహారాజులో తత్ క్షణంలో వివేకం మాయమై పోయింది. అంతే ఆ మహర్షి తనను నిరాదరిస్తున్నాడన్న అనుమానం కలగడంతో అక్కడే పడి ఉన్న ఓ చచ్చిన పామును ఆ మహర్షి మెడలో పడవేసి నిజరాజధానికి తరలి పోయాడు.

సర్వసమర్థుడూ మహత్తర తేజస్స్వరూపుడూ అయిన శృంగి మహర్షి శమీక ముని చంద్రుని కుమారుడు ఆశ్రమంలో జరిగిన అక్రమాన్ని తిలకించి కుపితుడై "వాయస, శునక సదృశంగా తపస్వుల ద్వారపాలురుగా ఉండవలసిన వారు ధనమదాంధులైన ఈ రాజాధములు తమకు తపోభంగం కలుగకుండ చేయడానికి తపస్వులు వీరిని ధర్మశాసకులుగా నిర్ణయించారు. అట్టివారు ద్వార స్థానాలలోనే ఉండాలి కానీ యజమానుల సదనాలలో ప్రవేశించి వారి పాత్రలలో భుజించ కూడదు. అవతారం చాలించి శ్రీహరి గోలోకం చేరడంతో ఈ రాజులు ధర్మ మర్యాదను ఉల్లంఘించారు. శక్తి సంపన్నులైన వారు ఇట్టి అధార్మికులను దండించవలసినదే." అంటూ శృంగి మహర్షి కాశికి ప్రవంతిలో స్నానం చేసి ఆచమనం చేసి వజ్రరూపమైన వాక్కుతో పితృదేవుని తను అవమానించిన రాజు నేటికి ఏడవరోజున తక్షక నాగుని విషాగ్ని జ్వాలలకు ఆహుతి అయిపోవును గాక!" అంటూ శాపమిచ్చి తండ్రిని సమీపించి

అతనిపై మెడలో ఉన్న మృత సర్పాన్ని చూసి బిగ్గరగా విలపించసాగాడు. అంతలోనే శమీకముని చంద్రుడు సమాధి నుండి లేచి తన మెడలో పడి ఉన్న మృత సర్పాన్ని తీసి "కుమారా! ఎందుకు విలపిస్తున్నావు? నిన్ను ఎవరు ఏమి చేసారు?' అని ప్రశ్నించి పుత్రుని వల్ల యావత్సమాచారాన్ని గ్రహించి "మూర్ఖుడా! ఎంత పని చేసావు. సామాన్య దోషానికి ప్రభువుకు మృత్యు దండనవిధిస్తావా? నువ్వు తెలిసీ తెలియని బుద్ధితో భగవత్స్వ రూపుడైన చక్రవర్తిని శిక్షించడం? రాజశూన్య మైన దేశంలో బలశాలురు దుర్బలురను పీడించి వేస్తారు. వైదిక ధర్మ కర్మాచరణకు స్థానమే ఉండదు. స్త్రీల మాన రక్షణకు సహకారమే లభించదు. దేశం సంపూర్ణంగా అస్తవ్యస్తమై పోతుంది. ఎంత విపరీతాన్ని కలిగించావు" అంటూ కుమారుని అనేక విధాల మందలించి సర్వేశ్వరా! బాల్య దశచే యుక్తాయుక్త జ్ఞాన రహితంగా నా పుత్రుడు చేసిన దోషాన్ని మన్నించెదవుగాక! అంటూ ఆ మహర్షి పర మాత్మను ప్రార్థించాడే కానీ - పరీక్షిన్మహా రాజుపై ఈ మహాత్ముడు ఆగ్రహించలేదు. మహా త్ములయిన వారు పరుల ద్వారా జరిగే మానావ మాన సుఖదుఃఖాదులను సానందంగా అనుభ విస్తారే కానీ తిరిగి వారికి అపకారాన్ని చెయ్యరు. ఆత్మ గుణాతీతమైనదని తెలిసిన శమీకముని చంద్రుడు అట్టి మహనీయులలో అగ్రస్థానంలో భాసిల్లుతూన్నవాడు.

## స్కంధం-1 — అధ్యాయం-19

### —! పరీక్షిన్మహారాజు నిరాహార దీక్ష - శుకమునీంద్రుల ఆగమనం :—

నిజ రాజధానికి మరలి వచ్చిన పరీక్షిన్మహా రాజు తపోధనుని అవమాన పరచినందుకు బాధ పడి పశ్చాత్తాపంతో "ఎంత అపరాధం చేసాను? అనార్యులు చేయునట్టి పనిచేసాను. ఏ గోబ్రాహ్మ ణాదులను - నా పితృపితామహాదులు దేవతలను వలె ఆరాధించినారో? అట్టి వంశంలో జన్మించి కూడ తపస్విని అవమానించాను. నేను చేసిన పాపం నన్నే కాకుండా నా దేశాన్ని కూడ ధ్వంసం చేస్తుందేమో? విప్రశాపాగ్ని భస్మం చేయలేనిదేముంది? శృంగిముని శాపంచే తక్షక విషాగ్ని జ్వాలల్లో నేను అంతం కావలసినదే, అందుకు తిరుగే లేదు. ఇది నేను యోచిస్తూ విచారించడానికి తగిన సమయం కాదు. ఈ మహర్షి శాపం సంసార బంధితుడైన నాకు వివే కాన్ని కలిగించింది" అని విమర్శించుకుని మరణం అవశ్యంభావ్యమని దృఢంగా సంకల్పించుకుని రాజ్యాన్ని కుమారుడైన జనమేజయునికి వప్ప గించాడు. శీఘ్రమే తాను సర్వసంగ పరి త్యాగియై - ఐహిక వాంఛలన్నిటికీ తిలాంజలులు అర్పించాడు. హరిపాదోద్భవ, సర్వపాప వినాశిని అయిన గంగా తీరం చేరి ఆమరణ నిరాహార దీక్షతో ఆసీనుడై శ్రీకృష్ణ పరబ్రహ్మయందు ధ్యానాన్ని నిలిపి శ్రీకృష్ణనామ స్మరణ చేస్తు న్నాడు. తీర్థాలను కూడ పవిత్రం చేయగల

మహర్షులు ఆ వృత్తాంతాన్ని ఆలకించి "ఆహా! విధి వైపరీత్యం ఎట్టిదో కదా! కలిలో కృత యుగ లక్షణాలను ప్రతిష్ఠించిన పరీక్షిన్మహారాజు నేటికి ఏడవ రోజున తక్షకుని విషాగ్ని జ్వాలల్లో ఆహుతి అయిపోతాడట." పిడుగు వంటి ఆ దుర్వార్తనాలకించివారు శీఘ్రంగాగంగాతీరానికి పయనించారు. వారిలో ప్రముఖుల నామాలను ఆలకించండి. అత్రి, వశిష్ఠ, చ్యవన, శరద్వంత, అరిష్టనేమి, భృగు, అంగిరస, పరశురామ, పరాశర, విశ్వామిత్ర, ఉతథ్య, ఇంద్ర, ప్రమథ, ఇధ్మవాహ, మేధాతిథి, దేవల, ఆర్ష్టిషేణ, భారద్వాజ, గౌతమ, పిప్పలాద, మైత్రేయ,కవష,ఔర్వ, వ్యాఘ్ర, నారదాదులు. పరీక్షిత్తు వారందరినీ సన్మానించి పాదాభివందనం చేసి పలికాడు.

మహనీయులారా! మీ వంటి మహానుభావులను ఏక కాలంలో దర్శించ గలిగిన నేను ధన్యుడను. నిందిత కర్ములైన రాజులు విప్రోత్తముల పాదప్రక్షాళన చేయడానికి కూడ అనర్హులే. అలా కాక భూపాల వంశాలలో జన్మించినా, సామ్రాట్టునయినా బ్రాహ్మణ శాపం కారణంగా-నేను దేహగేహాసక్తిని విడనాడాను. నాకు ఇహ పరలోకాలు కూడా తుచ్ఛంగానే కనిపిస్తున్నాయి. శ్రీకృష్ణపరమాత్మ ధ్యానం తప్ప నాకుఅన్యధ్యానమేదీలేదు. పరమమహర్షులారా! కరుణించి నాచే శ్రీకృష్ణ కథామృతాన్ని పానం చేయించండి. హరి గాథలను ఆలకించడం వల్ల మనుష్య మాత్రులలో భక్తివర్ధిల్లుతుందన్న విశ్వాసం నాకు కలుగుతూన్నది ఏడురోజుల కాల వ్యవధిలోనాకుమరణం తప్పదని సిద్ధాంతమైనది. కనుక శ్రీకృష్ణలీలా మృతం పానం చేసి ముక్తుడనవుతాను. నాలో భక్తి వర్ధిల్లేటట్లు ఆశీర్వదించండి. మోక్ష కారణ భూతమైన హరికథలను వినిపించండి.!!

అది గంగా ప్రవంతీ తీరం. ఆ నదికి దక్షిణంలో పూర్వాగ్రమయిన దర్భాసనంపై ఆసీనుడై సర్వసంగాలనూ త్యజించి ఆమరణ నిరాహార దీక్షితుడైన పరీక్షిన్మహారాజు పై అమరులు సుమవృష్టిచేసారు. ఆ మహారాజు యొక్క దృఢాభిప్రాయానికి యావన్మంది మహర్షులూ పరమానందం పొంది, కల్యాణప్రద వచనాలు పలుకుతూ "చక్రవర్తీ! చతుస్సాగర వేలావలయిత భూమండలాధి నాథుడవైన నీకు సామంతులందరూ నతమస్తకులై పన్నులు చెల్లిస్తూంటే మహావైభవోపేతమైన సర్వ భోగైశ్వర్యాలనూ, ఐహిక, పారలౌకిక లోకాలనూ కూడ పరిత్యజించి మహత్తర వైరాగ్యాన్ని పొంద గలిగావు.నీజన్మ సర్వదా ధన్యమైప్రశంశనీయమైనదే, ఆజన్మకృష్ణ భక్తుడవుకావడం వల్లనే నీకి ధైర్య స్థైర్యాలు కలిగాయి. సర్వాన్నీ పరిత్యజించ గలిగిన నువ్వు వైకుంఠం చేరే వరకూ మేము - నీ దగ్గరే ఉంటాము. నీ అభీష్టం అవశ్యం నెరవేరుతుంది." అని ఆశీర్వదించారు.

ఆ పవిత్ర మనోహర వచనాలను ఆలకించిన పరీక్షిత్తు "మహాత్ములారా! మీ రనేక ప్రాంతాల నుండి విజయం చేసారు. మూర్తిమంతాలై సత్య లోకంలో భాసిల్లే వేదాలతో

సమానులైన మీకు పరోపకార వాంఛ వినా మరేమీ ఉండదు. మీరు పరస్పరం యోచించి నాకు ముక్తి మార్గాన్ని ఉపదేశించండి. సర్వకాలాల్లోనూ జీవుడు సర్వవిధాలా ఏమి చేస్తూండాలి? అల్పకాలంలో మరణించనున్న వాని కర్తవ్యం ఏది?" అని కోరగా అదే సమయంలో వ్యాసనందనుడైన శుక మహర్షి అక్కడకు విచ్చేసాడు. ఆ మహాత్ముని యందు వర్ణాశ్రమ ధర్మ సంబంధమైన బాహ్య చిహ్నలేమీ లేవు. ఆత్మానుసంధాన భూమికలో ఉన్నాడు. స్త్రీ బాల సమూహాలు అతణ్ణి పరివేష్టించి ఉంటాయి. షోడశవర్ష ప్రాయంలో సుందర సుకుమారాంగాలతో, విశాల నయనాలతో సమున్నతమైన నాసికతో, సమమైన కర్ణాలతో, ధనుస్సమానమైన కనుబొమలతో - శంఖ సదృశ కంఠంతో సువిశాల ఫాల భాగంతో, విశాల వక్షః స్థలంతో దిగంబరుడై అపరశివదేవునిలా విజయం చేసిన శుక మహర్షిని తిలకించిన ఋషులందరూ లేచి ప్రణమిల్లారు.

## ప్రథమ స్కంధం సమాప్తము

# కృష్ణాష్టకమ్

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనం, దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుం.
అతసీ పుష్పసంకాశం హారనూపుర శోభితం, రత్నకంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుం.
కుటిలాలక సంయుక్తం పూర్ణ చంద్రనిభాననం, విలసత్కుండల ధరం కృష్ణం వందే జగద్గురుం.
మందారగంధసంయుక్తం చారుహాసం చతుర్భుజం, బర్హిపింఛావచూడాంగం కృష్ణంవందే జగద్గురుం.
ఉత్ఫుల్ల పద్మ పత్రాక్షం నీలజీమూత సన్నిభం, యాదవానాం శిరోరత్నంకృష్ణం వందేజగద్గురుం.
రుక్మిణీ కేళి సంయుక్తం పీతాంబర సుశోభితం, అవాప్త తులసీగంధం కృష్ణం వందే జగద్గురుం.
గోపికానాం కుచద్వంద్వం కుంకుమాంకిత వక్షసం, శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందేజగద్గురుం.
శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలా విరాజితం, శంఖచక్ర ధరం దేవం కృష్ణం వందే జగద్గురుం.
కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్, కోటిజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి

ఓం

క్లీం - కృష్ణాయ - గోవిందాయ - గోపీజన వల్లభాయ స్వాహా.

# అత్యద్భుత ఫలప్రదాయకమైన

# శ్రీ కృష్ణ అష్టాదశాక్షరీ యంత్రరాజము




క్లీం కృష్ణాయ - గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా.

మద్రాస్ - శ్రీశివానంద చారిటబుల్ ట్రస్ట్ ప్రెసిడెంట్

**శ్రీశ్రీశ్రీ ఓం నారాయణజీ మహరాజ్ వారి సౌజన్యంతో.**

శ్రీ కృష్ణ పరమాత్మనే నమః

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం 2 - అధ్యాయం 1

## ధ్యానవిధి విరాట్ స్వరూప వర్ణన

పరీక్షిన్మహారాజు ప్రశ్నలకు శుకమహర్షి ప్రసన్న శాంతహృదయుడై ఈ విధంగా సమాధానం చెప్ప సాగాడు. పరీక్షిన్మహీపాలా ! మనుష్యమాత్రులు ఆల కించడానికీ, స్మరించి జ్ఞప్తియందుంచు కోవడానికీ - దీని కంటె శ్రేష్ఠమైన ప్రశ్నలేదు. దీనికి ఆత్మజ్ఞా నులు ప్రసన్నులవుతారు.

రాజా! గృహకృత్య సంలగ్నుడైన సంసారి తన్ను తానే మరచి ప్రాపంచికమైన వ్యర్థ ప్రసంగాలతో కాలాన్ని గడిపేస్తాడు. స్త్రీ సాంగత్య, నిద్రాదులతో రాత్రినీ ధనార్జనాదులతో పగటినీ గడిపివేస్తాడు. కుటుంబంలో సన్నిహితులనీ అతడు భావించే కళత్ర, పుత్రాదుల దేహాలు కూడ అసత్యాలే, అహో రాత్రులు వాణ్ణి మృత్యువు కబళించివేస్తున్నా - అశాశ్వతమను కోడు రాజా! సర్వాత్ముడైన - శ్రీ కృష్ణభగవానుని లీలలను వినేవాడే సుఖాన్ని పొందుతాడు. భక్తిజ్ఞాన వైరాగ్యాలు కారణంగా అట్టివానికి మరణవేళలో పర మాత్మ జ్ఞాపకముంటాడు. విధి నిషేధాములకు అతీ తులై నిర్గుణ రమణులైన మహర్షులు కూడ హరికథా శ్రవణ మననాదుల యందు ఆనందాన్ని పొందుతూం టారు. నా తండ్రి అయిన వ్యాస మహర్షి ద్వారా వేద స్వరూపమైన భాగవత తత్త్వాన్ని నేను విన్నాను. బ్రహ్మనిష్ఠుడనై కూడ నేను శ్రీ కృష్ణలీలా పూర్ణ మైన భాగవతామృతపానం చేసానంటే ఆ పురాణంలో ఎంత ఆనందం నిండి ఉన్నదో ? గ్రహించు. బ్రహ్మ నిష్ఠుల మనస్సులను సయితం ఆకర్షించునట్టి భాగవ తాన్ని వినిపిస్తాను. శ్రద్ధగా ఆలకించు. తద్వారా మానవ ధర్మాలన్నీ నీకు అర్థం కాగా ఆనందాన్ని పొందగలుగుతావు. ముక్తిమార్గాన్ని త్యజించి చిరకాలం పశుపక్ష్యాదులవలె జీవించడం కంటే శ్రీ కృష్ణనామ సంకీర్తనతో క్షణకాలం బ్రతికినా చాలును.

ఖట్వాంగుడనేరాజర్షి మరణమాసన్నమైనదని గ్రహించి సర్వసంగాలనూ రెండు ఘడియల కాలంలో పరిత్య జించి - మోక్షాన్ని పొందగలిగాడు. ఆయుర్దాయం ఉన్న వాడు మోక్షాన్ని పొందడంలో సందేహంలేదు. మృత్యు కాలం సమీపించినవాడు చేయవలసిన దానిని గురించి వివరిస్తాను. అవశ్యం నీకు మోక్షం లభిస్తుంది. వైరాగ్య రూప నిశితకరవాలంతో అహంకార మమకారా లను ఖండించి వెయ్యాలి. ధైర్యంగా గృహాన్ని పరిత్య జించి పావన తీర్థం చేరి స్నానమాచరించి ఏకాంత స్థానంలో ఆసీనుడై 'అ' కార 'ఉ' కార 'మ' కారా

త్మక మైన ప్రణవమంత్రాన్ని జపించాలి. ప్రాణ వాయువును బంధించి మనస్సును స్వాధీనమందుంచుకుని బుద్ధినీ, మనస్సునూ ఏకం చేసి, సర్వేంద్రియాలనూ అంతర్ముఖం చేసి. వాసనా జనిత విషయాల యందు విముఖుడై శ్రీ కృష్ణదేవుని దివ్యసుందర మంగళమూర్తిని మనసా బంధించి ధ్యానించాలి. ధ్యానవేళలో రజోగుణం చేత నిక్షిప్తం కానీ, తమోగుణం వల్ల మూఢత్వంకానీ ఏర్ప డినా ధైర్యాన్ని కోలుపోకూడదు. యోగధారణ ద్వారా అవి రెండూ నాశనమౌతాయి. ధారణస్థిరమైననాడు భగవద్దర్శనం కలుగుతుంది, తద్వారా భక్తి స్థిరమవు తుంది." అని చెబుతూంటే - పరీక్షిన్మహారాజు "శుక మునీంద్రా! ధారణ ఎలా సిద్ధిస్తుంది? దేని యందు ధారణ కలిగి ఉండాలి? మనోమాలిన్యం శీఘ్రంగా నశించాలంటే మార్గం ఏమిటి? వివరంగా చెప్పండి." అని ప్రశ్నించగా శుకమహర్షి సమాధానమిస్తున్నాడు.

"రాజా! ఆసన, శ్వాస, ఆసక్తి, జితేంద్రియత్వం బుద్ధితో మనస్సును పరమాత్మ యొక్క స్థూల స్వరూ పంలో ప్రవేశ పెట్టడం - ఇవి ప్రధానమైన సాధనలు, కార్యరూపమైన విశ్వమూ తద్విశ్వమందు యిప్పు డున్నవీ భవిష్యత్తులో రాబోయేవీ, అన్నీ పరమాత్మ యొక్క స్థూలరూపాలే. దానినే మునీషులు విరాట స్వరూప మంటారు. జలాగ్ని వాయురాకాశాలూ, **ప్రకృతి, మహత్త్వ అహంకారాలనే** సప్తావరణలచే వ్యాప్తమైయున్న బ్రహ్మాండ దేహమందున్న వాడే విరాట్పురుషుడు, ధారణకు యోగ్యమైన వాడతడే. ఆ పురుషుని దివ్యస్వరూపాన్ని తత్త్వజ్ఞులు ఈ విధంగా అభివర్ణిస్తూంటారు.

పాదతలం పాతాళం పార్ష్ణిభాగం రసాతలం, గుల్ఫ ద్వయం,మహాతలం, జంఘలు. తలాతలం,జాను భాగం సుతలం, ఊరుభాగాలు. అతలవితలాలు, పొత్తికడుపు, మహాతలం, నాభియే ఆకాశం, వక్షస్థలం స్వర్గలోకం, మహర్లోకం కంఠం, ముఖం జనోలోకం లలాటం తపోలోకం, సహస్ర శిరస్సులు గల భగవానుని మస్త కమే సత్యలోకం, అమరులు భుజాలు, శ్రవణ, శబ్ద, శ్రవణేంద్రియాలన్నీ కలసి దిశలుకాగా అశ్వినీ కుమా రులు నాసికా స్థానాల్లో ఉన్నారు. గంధము ఘ్రాణేం ద్రియం కాగా ముఖంలో అగ్నిహోత్రుడు భాసిల్లుతూం టాడు, ద్యులోకం నయనాలు, దర్శించగల శక్తియే భాస్కరుడు, అహోరాత్రాలు రెప్పలు. బ్రహ్మలోకమే భూవిలాసము, జలమే తాలుభాగము. రసమే జిహ్వే ంద్రియం కాగా వేదాలే బ్రహ్మరంధ్రమయి ఉన్నాయి. యముడు దంష్ట్రిలు, స్నేహకళ వేదాంతపంక్తి, భగవ న్మాయయే మందస్మితం, ఈ అపార సృష్టి సర్వస్వం ఆ మహామాయాశక్తి యొక్క కటాక్ష విక్షేపమే, లజ్జ పైపెదవి, క్రిందిపెదవి లోభం. స్తనభాగం ధర్మం కాగా పృష్ఠభాగం అధర్మ స్థానమవుతూన్నది. ప్రజా పతి మూత్రేంద్రియం మిత్రావరుణులు, అండకోశాలు. సాగరం కుక్షి, పర్వతాలు. ఎముకలు. నదులు, నాడీ సమూహము. వృక్షాలు రోమాలు, మహావాయువే శ్వాస, కాలము గమనము. గుణరూప చక్రాన్ని పరి భ్రమింపజేయడమే విరాట్పురుషుని కార్యము. మేఘాలే కేశాలు, సంధ్య పరమ యొక్క వస్త్రం అవ్యక్తం - అంటే మూల ప్రకృతి భగవంతుని హృదయమన్నారు పెద్దలు, విరాటుని మనోరూపమైన చంద్రుడే సర్వ వికారాలకూ స్థానము. మహతత్త్వం చిత్తం కాగా - రుద్రుడే అహంకారం, అశ్వగార్ధభ, ఉష్ట్రి, గజ, హరి ణాది వన్యమృగాలూ, పశువులూ కటి ప్రదేశంలో ఉంటాయి. నానా విహంగాలూ. ఆ దేవదేవుని రచనా కౌశాలాన్ని వ్యక్త పరుస్తూంటాయి. స్వాయంభువ

మనువూ, బుద్ధీ మను సంతతి అయిన మానవులూ విరాటుని నివాస స్థానీయులవుతున్నారు. గంధర్వ విద్యాధర. చారణ. అప్సర, షడ్జమాది స్వరాలూ. స్మృతీ దైత్యుకీ భగవద్వీర్యం కాగా విప్రులు ముఖం, క్షత్రియులు భుజాలు. వైశ్యులు ఊరువులు. శూద్రులు పాదస్థానంలో రాజిల్లుతున్నారు. భగవంతుని సంపూర్ణ స్వరూపమే చాతుర్వర్ణ్యవ్యవస్థ., దేవతా నామాలతో చేయబడే ద్రవ్యమయలేయాగానే అతని కార్యాలు. భగవంతుని ఈ స్థూల మయస్వరూపాన్నే మౌనులు ఉపాసిస్తుంటారు, దీనికన్న భిన్నమైన పదార్థమేదీలేదు. తన్ను తానే స్వప్నావస్థలో అనేక స్వరూపాల్లో చూస్తుంటాడు మానవుడు.అదేరీతిగా బుద్ధి వృత్తుల సహకారంతో సర్వానుభవాలనూ గుర్తించగల వాడు సర్వాంతర్యామియైన పరమాత్మ మాత్రమే. ఆ భగవద్ధ్యాన మాత్రంచే మనుష్య మాత్రుడు పతనం కాకుండ మోక్షం పొందగలుగుతాడు.



స్కంధం 2 - అధ్యాయం 2

భగవంతుని స్థూల, సూక్ష్మరూప వర్ణన – ధారణాక్రమ

## సద్యోముక్తుల వర్ణన

బృహస్పతిని ఆరాధిస్తే బ్రహ్మతేజస్సు లభిస్తుంది. ఇంద్రుని ఉపాసిస్తే ఇంద్రియ శక్తి వర్ధిలుతుంది. ప్రజాపతిని అర్చిస్తే సంతానం కలుగుతుంది. మాయాశక్తిని ఉపాసిస్తే లక్ష్మి లభిస్తుంది. అగ్నిని ఆరాధిస్తే తేజస్సుప్రాప్తిస్తుంది. వస్తువులను ఆరాధిస్తే ధనమూ రుద్రుని ఆరాధిస్తే వీరత్వమూ ప్రాప్తిస్తాయి. అన్నం కావాలనుకున్నవాడు అదితినీ స్వర్గాన్ని కోరేవాడు అమరులనూ, రాజ్యకాంక్షకలవాడు విశ్వేదేవతలనూ, జనవశ్యాన్ని కోరేవాడు సాధ్యదేవతలను, ఉపాసించాలి. అశ్వినీ దేవతలనూ ఆయుర్దాయాభివృద్ధికే - ప్రతిష్ఠ కోసం భూదేవినీ, గంధర్వులను సౌందర్యంకోసమూ, పత్నిప్రాప్తికి ఊర్వశినీ స్వర్గాధిపత్యార్థం బ్రహ్మదేవునీ ఉపాసించాలి. యశస్సు కోసం యజ్ఞపురుషునీ, కోశాగారాధిపత్యానికి వరుణదేవతనూ, విద్యకు శంకరునీ, సతీపతుల ప్రేమానురాగాలకు పార్వతీమాతనూ, ధర్మం వర్ధిల్లడానికి శ్రీహరినీ వంశాభివృద్ధికి పితృగణాన్నీ. బాధా నివారణకు మరుద్గణాన్నీ రాజ్యార్థం మన్వంతరాధిపతులనూ అభిచారాదులకోసం నిరృతినీ, భోగార్థం చంద్రుణ్ణీ నిష్కామత్వానికి నారాయణ భగవానునిఆరాధించాలి. ముక్తిని కోరేవాడు పురుషోత్తముని. ప్రార్థించాలి. భక్తజనుల సాంగత్యంవల్ల ఉపాసకులకు పరమాత్మయందు అచంచలమైన భక్తి లభించి వర్ధిల్లుతుంది. భక్తజన సమాజంలో భగవల్లీలా భూయిష్ఠమైన గాధలను ఆలకించడం వల్ల దుర్లభజ్ఞానం లభిస్తుంది. తద్వారా మానవుడు సంసార సముద్రాన్నుండి తరించ గలుగుతాడు, అట్టి భక్తుడు చిటచివరకు అఖండానందాన్ని పొందుతాడు " అని పరీక్షిన్మహీపాలునికి శుకయోగీంద్రుడు చెప్పాడని సూతుడు చెప్పగావిని శౌనకుడు ప్రశ్నించాడు.

"సూతర్షీ ! శ్రీ కృష్ణభగవత్కథా మృతాన్ని పానం చెయ్యని వాని జన్మ వృథా మే కదా ! ఆహార నిద్రాభయ మైథునాలను పశుపక్ష్యాదుల వలె కొన

సాగిస్తూ అమూల్యకాలాన్ని వ్యర్థం చేసేవాడు దుర దృష్టవంతుడే. శ్రీ కృష్ణకథామృతం ప్రవేశించని శ్రవణాలు కలవాడు పశుతుల్యుడే. అట్టివాడు ఉష్ట్ర, శునక గార్ధభ, సమంగా ఆయుర్దాయాన్ని వ్యర్థం చేసుకొంటూ న్నట్లే. శ్రీ కృష్ణ గాధలను ఆలకించని శ్రవణ రంధ్రాలు నాగులు నివసించే బిలాలవంటివే, సర్వాభరణ సుశోభిత మయినదే అయినా భగవంతునికి వంచని శిరస్సు బరువు చేటే. బంగారు కంకణాలతో అలంకరించ బడినవే అయినా పరమాత్మను పూజించని హస్తాలు శవహస్తాలే. భగవత్తీర్థాలను దర్శించని నయనాలు నెమలి కన్నులే. దైవసందర్శనానికి వెళ్ళని చరణాలు తరువులతో సమానమైనవే. సజ్జనుల చరణ ధూళిని శిరస్సుపై దాల్చని వాడు బ్రతికీ చచ్చినవానితో సమానమే, భగవంతుని పాదాలందు శోభిల్లే తులసి మాలికా సుగంధాన్ని ఆఘ్రాణించని శ్వాస ఉన్నా లేనట్లే. కనుక శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుకు వినిపించిన శ్రీహరి కథా సంభరితమైన భాగవతాన్ని వినిపించు అని కోరాడు.



స్కంధం 2 - అధ్యాయం 3

## అన్యదేవతోపాసన - భక్తిప్రాధాన్యత.

సూత మహర్షి శౌనకాదుల ప్రార్థనను మన్నించి చెప్పసాగాడు. "శౌనకాదులారా ! పరీక్షిన్మహారాజు శుకమునీంద్రుని దివ్యోపదేశాన్ని గ్రహించాడు, పుత్ర మిత్ర కళత్ర పశు, ధన, దేహగేహాదుల యందు మమకారాన్ని త్యజించి, ధర్మార్థ కామసంబంధమైన వాసనలను దూరం చేసి సర్వకర్మలనూ సన్యసించి - శ్రీ కృష్ణ భగవదాయత్తమైన చిత్తంతో మీరు నన్ను అర్థించినట్లే అతడు శుకమునీంద్రులను అర్థించాడు. శుకమహర్షీ ! సర్వజ్ఞులయిన మీరు చెప్పిన దంతా పరమసత్యం. మీ వచనాలను ఆలకించడం వల్ల నా అజ్ఞానం మటుమాయమయింది, బ్రహ్మాదుల సయితం గ్రహించజాలని - ఈ సృష్టి స్థితి సంహారాలను పరమాత్మ ఎలా చేసాడు ? ఏయే శక్తులను ఆలంబనంగా చేసుకుని పరమాత్మ ఈ జగన్నాటకాన్ని నడిపిస్తున్నాడు ? మహాశ్చర్యకరమైన బ్రహ్మాండాది నిర్మాణ కార్యక్రమమూ, భగవల్లీలలూ, వాటి రహస్యాలూ, తత్త్వవేత్తలైన మహా విద్వాంసులకే కానీ తెలియడం లేదంటే సాధారణుల విషయం వేరే చెప్పాలా ? అద్వితీయుడైన పరమాత్మ అనేకానేక కార్యకలాపాదులకై నిజ మాయనాశ్రయించి ఏక కాలంలో అసంఖ్యాక రూపాలు ధరిస్తున్నాడా ? కాక క్రమేణా ధరిస్తూన్నాడా ? వేదవేత్తలూ, బ్రహ్మనిష్ఠులూ అయిన మీరు భగవల్లీలలను నాకు విశదీకరించండి." అని ప్రార్థించిన పరీక్షిత్తుకు శుక మహర్షి దైవతత్వాన్ని ప్రతి పాదిస్తూన్నాడు - రాజా ! పరమ పురుషుని పాదారవిందాలకు అనేక కోటి వందనాలు. సృష్టిస్థితి సంహారార్థం సత్వ. రజస్తమో గుణాలతో బ్రహ్మ, విష్ణు మహేశ్వర రూపాలను ధరించి భాసిల్లినట్టివాడు, చరాచర జీవరాశిలో సర్వాంతర్యామియై ప్రకాశించునట్టివాడు, బుద్ధికి కూడ అందనట్టి స్వరూప, స్వభావాలు కలవాడు, అనంతుడూ అఖండ శక్తి సంప

న్నాడూ, సాధుజనుల క్లేశాలను నాశనం చేసి పరమ హంసలయిన వారికి కోరినవాటిని ప్రసాదించునట్టివాడు, చరాచర జగద్రూపుడూ భక్తిహీనులచే గ్రహింపబడని వాడూ, శ్రవణ, మనన, సంకీర్తనలచే పూజాప్రణా మాదులచే సర్వ పాపాలనూ నాశనం చేయునట్టి దివ్య లీలలచే భాసిల జేయునట్టి పరాత్పరునకు ప్రణమిల్లు తున్నాను. ధీశాలి అయిన వాడు హరిభక్తి తత్పరుడై ఇహపర సౌఖ్యాలను సయితం త్యజించి పరమ పదాన్ని అందుకోగలుగుతాడు.

భగవదర్పణం చేసిన తపోదాన యాగఫలాలు - అక్షయా లవుతాయి. కిరాతులు, హూణులు, ఆంధ్రులు, పుళింద పుల్కసాదులు కూడ ఏ భగవద్భక్తులను ఆశ్ర యించినంతమాత్రాన తరించగలుగుతున్నారో? అట్టి వాసుదేవ భగవానునకు వందనాలు, ఆత్మస్వరూపుడుగా జ్ఞానులకూ, సగుణ విగ్రహుడుగా భక్తజనులకూ వేద మయమూర్తిగా కర్మిష్ఠులకూ ధర్మ విగ్రహుడుగా ధార్మికులకూ తపోమూర్తిగా తాపసులకూ, శంకర బ్రహ్మేంద్రాదులకు ధ్యానించ యోగ్యుడైన శ్రీ కృష్ణ పరబ్రహ్మ నన్ను కరుణించును గాక! సృష్ట్యారంభ సమ యంలో చతుర్ముఖ బ్రహ్మకు - గతకల్పస్మృత్యర్థం వేదవేదాంగాలను ప్రసాదించిన పరాత్పరుడే నాహృదయ మందిరంలో సాక్షాత్కరించునుగాక! ఆ దేవదేవుడే పాంచభౌతిక శరీరసృష్టిచేసి - జీవరూపంలో తానే ఈ దేహంలో ప్రవేశం చేస్తున్నాడు. ఇంద్రియ దశకమూ, ప్రాణ పంచకమూ, మనస్సూ - ఇవియే షోడశకళలు. భగవానుడు షోడశ కళామయుడై షోడశ విషయాల యందూ రమిస్తూ ఉంటాడు. సర్వభూతమయుడైన ఆ పరాత్పరుని లీలలను నా వాక్కు ద్వారా అభివర్ణిస్తాను. వేదవ్యాస భగవానునికు ప్రణామాలు. నారదమహర్షి కోరిన దానిని బ్రహ్మదేవుడు చెప్పగా దానినే నేను నీకు చెబుతాను సావధానుడవై ఆలకించు.



స్కంధం 2 - అధ్యాయం 4

## సృష్టి వర్ణన

ఒకానొక సమయంలో బ్రహ్మమానస పుత్రుడూ దేవర్షి అయిన నారదుడు తన తండ్రిని సమీపించి 'జనకా! లోకపితా మహుడవూ, దేవశ్రేష్ఠుడవూ, సృష్టి కర్తవూ అయిన నీకు ప్రణమిల్లుతూన్నాను, కరుణించి నాకు ఆత్మ జ్ఞానోపదేశం చెయ్యి,

ఈ ప్రపంచ లక్షణ మెట్టిది? దీని కాధారమేది? దీని కర్త ఎవరు? ఎవరి యందీ విశ్వం లయమవు తూన్నది? ఎవరి స్వాధీనంలో ఉంది. దీని యదార్థ స్వరూపం ఎట్టిది? భూతభవిష్యద్వర్తమాన కాలజ్ఞుడ వైన నీకు తెలియ రానిదేదీలేదు. హస్తామలకసమంగా జ్ఞానం నీ అధీనంలోనే ఉంది. ఇట్టి జ్ఞానసంపన్నుడవైన నువ్వు ఎవరి ఆలంబనం మీద ఉన్నావు? నీకు ప్రభు వెవరు? నీ యదార్థ స్వరూపమెట్టిది? ఏక మాత్రుడ వైన నువ్వు పంచ భూతాలతో అనంతమైన సృష్టిచేస్తు న్నావు. ఇది మహాద్భుతంగా ఉన్నది. తన నుంచి దారాన్ని సృష్టించి సాలెపురుగు దాని యందే క్రీడించు విధంగా నువ్వు స్వశక్తిని ఆశ్రయించి సునాయా సంగా ఈ జీవజాలాన్ని సృజిస్తున్నావు. నీలో మాత్రం

ఎట్టి వికారానికీ ఆస్కారం లేదు. ఈ మహా విశ్వంలో నామ రూప గుణాదులతో గోచరించే పదార్థ సమూహంలో సదసత్, ఉత్తమాధమ మధ్యమ భేదాలేవీ నాకు కనిపించడంలేదు. నాకు సర్వం సమంగానే గోచరమవుతూన్నది. ఈ విశ్వమంతా నీ స్వరూపమే. జగదధి నాథుడవై కూడ నువ్వు తపస్సు కొనసాగించావంటే నీ కంటె ఘనులెవరో ఉన్నట్టే కదా! సర్వేశ్వరుడవూ, సర్వజ్ఞుడవూ అయిన నువ్వు కరుణించి నా సందేహాలను దూరం చెయ్యి." అని ప్రార్థించాడు.

అందుకు చతుర్ముఖుడు ప్రసన్నుడై "వత్సా! నారదా! జగత్కళ్యాణ దాయకమైన నీ ప్రశ్న నాకు మహానందాన్నే కలుగజేసింది. భగవద్గుణ గాన సంభరితమైనది నీ ప్రశ్న. మద్విషయమై పలికిన నీ పలుకులు సత్యమైనవే. మత్పరమైన పదార్థాన్ని గుర్తించే వరకూ నా పై నీకు సందేహం కలుగుతుంది. భగవంతుని అనంత దివ్యప్రకాశం వల్లనే సూర్యచంద్ర గ్రహ నక్షత్రాదులు జగత్తును ప్రకాశింప జేస్తున్న విధంగానే చిన్మయుడైన పరమేశ్వర ప్రకాశం వల్లనే నేను కూడ భాసిస్తూ తద్వారా జగత్తును భాసిల జేస్తున్నాను. రవి చంద్రాదులకు కానీ నాకు కానీ స్వయంప్రకాశశక్తిలేదు. ఏకమాత్ర పరమాత్మమే స్వయంప్రకాశ స్వరూపుడు. అట్టి వాసుదేవునకు ప్రణమిల్లు తూన్నాను. అది గ్రహించజాలని మాయా మోహితులందరూ జగద్గురువుగా నన్నే భావన చేస్తున్నారు. ఈ మహా మాయ వారి సమక్షంలో నిలవక సుదూరంగా పోతూ ఉంటుంది. అయినా మాయా మోహితులయిన అజ్ఞానులు "అహంకార. మమకార, బద్ధులై సంచరిస్తూంటారు. నారదా! ద్రవ్య కాల కర్మ, స్వభావ జీవాదులు యదార్థానికి పరమాత్మ కంటె వేరైనవి కావు. వేదం నారాయణ పరాయణం కాగా అమరులందరూ అతని సర్వాంగాలలోను కల్పింపబడ్డారు. యాగాలన్నీ శ్రీ మన్నారాయణుని ఆనందం కోసమే జరుగుతూంటాయి. యాగసంభూతమైన లోకాలుసయితం శ్రీ హరి యందుకల్పింపబడినవే. నారాయణుని యందే యోగ, తపస్స్వాధ్యాయాదిసత్కర్మలన్నీ ప్రకాశిస్తూంటాయి. అతడు సర్వద్రష్టయైకూడ భగవంతుడే. నిర్వికారుడై కూడా సర్వస్వరూపుడై తేజరిల్లు తూంటాడు. అతడే నన్ను సృష్టించాడు. అతని ప్రేరణవల్లనేనేను సృష్టికార్యాన్ని కొనసాగించ గలుగుతూన్నాను. సృష్టి స్థితి సంహారార్థం - అతడు గుణాతీతమైన వాడే అయినా రజస్సత్త్వ తమోగుణాదుల ద్వారా మాయద్వారా అతని యందుంచబడ్డాయి. ద్రవ్య జ్ఞాన క్రియలను ఆశ్రయించి ఈ త్రిగుణాలే - నిత్య ముక్తుడైన పురుషుడు మాయ యందున్న వేళ - కార్యకారణ కర్తృత్వ బంధితు డవుతూంటాడు. భగవంతుడు ఇంద్రియాతీతుడు. అయినా సత్త్వరజస్తమోగుణ రూపావరణచే నిజరూపాన్ని మరుగు పరచడం ద్వారా అతణ్ణి సామాన్యులు గుర్తించ లేకపోతున్నారు. నాకూ యావద్విశ్వానికీ కూడ ఆ భగవానుడే ప్రభువై ఉన్నాడు. మాయాధినాథుడైన పరమాత్మకు సృష్టి చెయ్యాలన్న సంకల్పం కలగగానే నిజమాయచే స్వయం ప్రాప్తమైన-కాల, కర్మ స్వభావాలను గ్రహించాడు. స్వయం శక్తితో కాల, గుణ క్రియాల యందు సంక్షోభాన్ని కలిగించాడు. స్వభావం భగవంతునిలో రూపాంతరాన్ని కలుగజేసింది. కర్మమహత్తత్వాన్ని పుట్టించగా రజస్తమో గుణాల వృద్ధి వల్ల మహత్త్వంలో కలిగిన వికారం నుండి యే తమోగుణ ప్రాధాన్యం కలిగిన ద్రవ్యజ్ఞాన క్రియలు ప్రభవించాయి.

వాటినే వైకారిక, తైజస, తామసాలు, అన్నారు. అవియే జ్ఞాన, క్రియా, ద్రవ్య శక్తులనబడ్డాయి. మహా

భూత హేతువైన తామస సాహంకారం వికార దశను పొందునాడు ఆకాశం ప్రాదుర్భవించింది. శబ్దం - ఆకాశ తన్మాత్రకు గుణమయింది. దీని ద్వారా దృష్టా దృశ్య జ్ఞానం కలుగుతుంది. ఆకాశ మందుద్భవించిన వికారం ద్వారా వాయువు జన్మించగా - అది శబ్ద స్పర్శ గుణ ప్రాధాన్యం కలదయింది. వాయువు నుండి ప్రభవించిన తేజస్సుకు రూపం ప్రధాన గుణమయింది. గుణ కారణ గుణాలు కార్యమందు సంక్రమించడం వల్ల శబ్ద స్పర్శగుణాలు దీనిలో కూడ ఉన్నాయి. తేజస్సు నుండి ప్రభవించిన ఉదకాలకు ప్రధానమైన గుణం రసమే అయినా శబ్ద స్పర్శ రూపాదులు కూడ దాని లోనూ ఉన్నాయి. జలాలనుండి పృథ్విపుట్టింది. గంధం పృథ్వికి ప్రధాన గుణం అయినా దీనియందు శబ్ద స్పర్శరూప రసాదులున్నాయి. వైకారికమైన అహంకారం వల్ల మనస్సు. ఇంద్రియాధిష్ఠాన దేవతలు పదిమందీ ఆవిర్భవించారు. దిశ, వాయు, సూర్య వరుణ, అశ్వని దేవతలూ, ఇంద్రాగ్ని విష్ణుమిత్ర ప్రజాపతులే వారు. తైజసాహంకారం వల్ల త్వక్ శ్రోత్ర జిహ్వా, ఘ్రాణ, నేత్రాది, జ్ఞానేంద్రియ పంచకమూ కలసి దశేంద్రియాలూ ఉత్పన్నమైనాయి. తైజసాహంకారం నుండి జ్ఞానశక్తి రూపమైన బుద్ధీ, క్రియాశక్తి స్వరూపమైన ప్రాణాలూ ప్రాదురవించాయి. ఈ పంచభూతాలూ, దశేంద్రియాలూ, మనస్సూ, సత్వరజస్తమోగుణాలూ కలియక పోతే భోగసాధనమైన దేహ నిర్మాణం జరుగదు. భగవత్ప్రేరణ వల్లనే ఈ తత్త్వాలన్నీ పరస్పరం కలసి కార్య కారణ భావాలను గ్రహించి పిండాండ బ్రహ్మాండాలను వ్యష్టి సమిష్టి రూపంగా నిర్మాణం చేసాయి. ఆ బ్రహ్మాండం సహస్ర వత్సరాలు జీవరహితంగా జలంలో ఉంది. కాలకర్మ స్వభావాలను గ్రహించిన భగవంతుడు తదండాన్ని జీవింపజేసాడు. అయ్యండాన్నే ఛేదించుకుని విరాట్పురుషుడు ప్రాదుర్భవించాడు. ఆ దివ్యపురుషుడు సహస్రసంఖ్యలో శీర్ష, పాద, నేత్ర, కర్ణ, భుజాలు కలిగి ప్రకాశించాడు. ఆ విరాట్పురుషినే విద్వాంసు లయినవారు ఉపాసిస్తూంటారు. అతని నాభి స్థానానికి అధోభాగంలో సప్తలోకాలూ, ఊర్ధ్వ భాగంలో సప్తలోకాలూ కల్పింపబడ్డాయి, విరాటుని వదనభాగం బ్రాహ్మణులనీ, భుజాలు క్షత్రియులనీ ఊరుభాగం వైశ్యులనీ, పాదభాగం శూద్రులనీ వ్యక్తం చేయబడ్డారు. సర్వలోకమయుడైన విరాటుని యందే సర్వలోకాలూ, సర్వజీవులూ ఉంటాయి,

స్కంధం 2 - అధ్యాయం 5

## విరాడ్రూప విభూతి వర్ణన

విరాట్పురుషుని వదనం నుండి వాక్కూ, దాని అధిష్ఠాన దేవత అగ్ని ఆవిర్భవించాయి, త్రిష్టుప్, అనుష్టుప్, ఉష్ణిక్, బృహత్. పంక్తి జగతీ అనే సప్త ఛందస్సులూ, ధాతు సమేతంగా ప్రభవించాయి. దేవ పితృ మానవాదులకు భుజింప యోగ్యమయిన అమృతాహారం, సర్వరసాలూ, రసనేంద్రియమూ రసాధిష్ఠాన దేవత అయిన వరుణ దేవుడు కూడ విరాటుని జిహ్వానుండి ఆవిర్భవించారు. అతని నాసికారంధ్రాల

నుండి ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన. సమానాలనే పంచప్రాణాలూ, వాయువూ, ఘ్రాణేంద్రియం నుండి అశ్వినీకుమారులూ, సర్వౌషధులూ, సామాన్య విశేష గ్రంథాలూ పుట్టాయి, విరాట్పురుషుని నేత్రేంద్రియం, రూప తేజస్సులకూ నేత్రగోళమై ఉంది, సూర్య, స్వర్గాదులకు జననస్థానం సర్వదిశలూ, పావన తీర్థ ప్రదేశాలూ, విరాటుని కర్ణముల నుండి ప్రభవించాయి. ఆకాశశబ్దాలు శ్రోత్రేంద్రియం కూడ ప్రాదుర్భవించాయి. విరాటుని దివ్యదేహం విశ్వంలో వస్తు సర్వస్వంలో సారసౌందర్యాలకు నిలయమై భాసిల్లుతూన్నది. స్పర్శవాయు, యాగాదులు అతని చర్మం నుండి జన్మించగా అతని రోమసమూహాలే ఉద్భిజాలకు జనన స్థానమయింది. ఆదివ్య పురుషుని కేశ, శ్మశ్రు, నఖముల నుండి మేఘ, విద్యుత్, పాషాణ ధాతువులు కలిగాయి. లోకరక్షకులయిన లోకపాలురు ఆతని భుజాలనుండి అవతరించగా ఆ దివ్యమూర్తి విక్రమమే భూలోక, భువర్లోక, స్వర్లోకాలకు ఆశ్రయము. యోగక్షేమాలకు ఆశ్రయమే ఆ పరమపురుషుని చరణారవిందాలు. అవి సర్వాభీష్టాలనూ నెరవేర్చే అభయస్థానాలు అతని అంగమే జల, వీర్యాదుల ఉత్పత్తికి కారణము, ప్రజాపతులకు మేఘమే ఆశ్రయం, విరాటుని జననేంద్రియమే రత్యానందానికి హేతువు. యమ, నిరృతి, మిత్రహింస, మృత్యు, నరక, మలత్యాగాదుల ఉత్పత్తి స్థానమూ, వెన్నూ, నాడీమండలం నుండి నదీనద సమూహం ప్రాదుర్భవించాయి. అస్థుల నుండి గిరులు ప్రభవించాయి. అతని హృదయమే మనస్సునకు పుట్టినిల్లు, శంకర. సనకాదులూ ధర్మమూ, నేనూ నువ్వూ కూడ, ఆయన నుండి ప్రభవించినవారమే. అంతఃకరణ, విజ్ఞానాదులన్నీ ఆ దేవదేవుని చిత్తాన్ని ఆశ్రయించియే ఉంటాయి. సురాసుర నాగ. యక్ష, రాక్షస, మానవ, గరుడ, గంధర్వ, పిశాచ పితృగణాలూ, అప్సరః కాంతలూ. పశుపక్షి మృగసంతతులూ, తరులతాగుల్మాదులూ, సర్వజీవరాశీ, జలస్థలాకాశాలలో ఉండే సర్వప్రాణికోటీ, గ్రహనక్షత్ర తారాగణమూ, విద్యున్మేఘాదులూ, ఆ దివ్య విరాట్పురుషుని అంగాలే. దశాంగుళ ప్రమాణంలో ఆ దివ్య పురుషునిలో ఈ విశాల విశ్వమంతా ఇమిడి ఉంది.

వేదాంతశాస్త్రంలో దశాంగుళ న్యాయవర్ణన యిలా ఉంది - పృధ్వికంటె 10 రెట్లు జలాలూ, దానికంటే అగ్ని. అగ్నికంటె వాయువూ, దానిని మించి ఆకాశమూ, దానికన్న మిన్నగా అహంకార, మహత్త్వ మూల ప్రకృతులూ, ఒకదానికంటె వేరొకటి 10 రెట్లుండగా ఇవన్నీ కలిసి పరమాత్మ యందు ఏక మాత్రపాదంగా ఉన్నాయి. నిజమండలాన్ని భాసింజేస్తూ భాస్కరుడు లోకాలను అన్నిటినీ తేజరిల్ల జేసేటట్లు విరాట్పురుషుడు బాహ్యాభ్యంతరాలలో ప్రకాశిస్తూన్నాడు, సంకల్ప క్రియాదులచే మనుష్యుడు సృష్టించే వాటికంటె అతడు పరమైనవాడై అమృతుడై అభయుడై మోక్షాధినాథుడై తేజరిల్లుతూంటాడు. అందులకే అతని మహిమ వర్ణనాతీతమయింది. లోకాలన్నీ భగవంతుని ఏకమాత్రపాదంలో ఉన్నాయి. అందులో యావజ్జీవరాశీ ఉంది, భూ. భువ. స్వర్లోకాలకు పైన మహర్లోకం ఉంది, ఆపైన జన, తపో లోకాలూ, ఇంకాపైన సత్యలోకమూ ఉంది. అమృత స్థానమై క్షేమ, అభయదాయకమైనది ఆ దివ్య స్థానము. జన, తప, సత్య, లోకాలలో బ్రహ్మచారులూ వానప్రస్థ, సన్యాసులూ. నివసిస్తూంటారు. కర్మ, ఉపాసన, అన్న పేర్లతో మార్గాలు రెండున్నాయని శాస్త్రాలు చెబుతూన్నాయి వాంఛలు కలవారికి అవిద్యా

కర్మమార్గమూ, విరాగులయిన వారికి నిష్కామ రూప మైనఉపాసనా మార్గమూ వ్యక్తం చేయబడ్డాయి, కర్మ మార్గాన్ని ఆశ్రయిస్తే భోగప్రాప్తి మార్గ మైన దక్షిణాయనగతి, కలుగుతుంది. ఉపాసనా మార్గంలో పయనిస్తే మోక్ష ప్రాప్తి రూపమైన ఉత్త రాయణ గతి లభిస్తుంది. ఈ రెండింటికీ ఆధారం పురు షోత్తముడే. నిజ కిరణజాలంచే భాస్కరుడు సర్వాన్నీ తేజరిల్ల జేస్తూ దేనినీ స్పృశించకుండునట్లుగానే పర మాత్మ కూడ - అండ, భూత పంచక, ఏకాదశేంద్రి యాలనూ, గుణమయుడైన విరాటునీ సృజించి - తాను సర్వమందూ నిండి ఉండి కూడ సర్వాతీతంగా వుంటాడు. విరాట్పురుషుని అంగాల నుండి నేనావిర్భ వించిన సమయంలో నాకు అతని అంగాలు వినా - యజ్ఞసామగ్రి ఏదీ లభించలేదు. తత్సమయంలో నేనా విరాట్పురుషుని యందే కుశ, పశు, యూప, యజ్ఞస్థల, యజ్ఞశాల, పాత్రలు, ధాన్యాలు, ఓషధులు, ఘృతా దులు, లోహాలు, మృణ్మయ, సలిలాదులు, ఋగ్య జుస్సామాది చాతుర్హోత్ర విధులు, యజ్ఞనామ సం కల్పాదులూ, తంత్రగతి, శ్రద్ధ, ప్రాయశ్చిత్త సమర్ప ణాదులన్నీ గ్రహించి ఆయా సామగ్రులతో యాగాల ద్వారా సేవించాను. తదనంతరం నీ జ్యేష్ఠ భ్రాతలైన సనకాదులూ, దక్షుడు ఆదిగాగల ప్రజాపతులూ సర్వాం తర్వర్తి అయిన విరాటుని ఆరాధించారు. క్రమంగా - మను - దేవఋషి, పితర, మానవాదులందరూ యాగా లొనర్చి - విరాట్పురుషుని అర్చించారు. నారాయణ భగవానుని యందే ఈ విశ్వమంతా లీనమై వుంది. ప్రకృతి గుణరహితుడైన అతడు సృజనారంభ సమ యంలో మాయా గుణాదులను గ్రహిస్తూ వుంటాడు. ఆ దివ్య పురుషుని భవ్య ప్రేరణవల్లనే సృష్టి కార్యాన్ని నేను నిర్వహిస్తూంటాను. ఆ దేవ దేవుని వశంలో వుండే రుద్ర భగవానుడే లయకార్యాన్ని నిర్వ హిస్తాడు. విష్ణుభగవత్స్వరూపంతో అవిరాట్పురుషుడే పాలన కార్యాన్ని కొనసాగిస్తూంటాడు. సత్త్వరజస్త మోగుణాలను గ్రహించి తేజరిల్లేది ఆతడే. ఈ రీతిగా నీ సందేహాలకు సమాధానం చెప్పాను. కార్యకారణ భావాభావాలన్నీ జగద్రూపుడైన భగవంతుని స్వరూ పమే. ఈ విశ్వంలో భగవదతీతమైన భిన్నవస్తువన్న దేదీలేదు. ప్రేమపూర్ణమైన హృదయంతో అనుక్షణం నేను పరమాత్మను స్మరిస్తూంటాను. కనుక ఎన్నడూ నా నుండి అసత్యం వెలువడదు. ఎన్నడూ నా మనస్సు అసత్య సంకల్పాలను చెయ్యదు. ధర్మమర్యాదలను ఉల్లంఘించి దుర్మార్గంలో నా యింద్రియాలు ఎన్నడూ ప్రవర్తించవు. వేదమూర్తి నయిన నా జీవితం తపో మయం. నాకు ప్రజాపతులు కూడ వందనం చేస్తూం టారు. వారందరికీ అధిపతినైన నేను అష్టాంగాలతో కూడిన యోగ సాధనా నిష్ఠను అనుష్ఠించాను. అయినా నేను కూడ మూలకారణుడయిన పరమాత్మను గ్రహించలేక పోయాను. కేవలం భక్తికే ఆ దేవ దేవుడు లభిస్తాడు. సర్వమంగళమయుడూ, శరణన్న వారిని సంరక్షించి జనన మరణ రూపమైన కాల చక్రం నుండి ఉద్ధరించే వాడూ అయిన సర్వేశ్వరుని చరణార విందాలకు వందనం చేస్తున్నాను. తన సీమను తాను గ్రహించలేని ఆకాశంవలె తమ మహిమను తామే గుర్తించ జాలనివారు విరాటుని మహిమలనెలాగుర్తించ గలుగుతారు. నేనూ నా పుత్రులైన మీరూ, మహా దేవుడూ కూడా ఆ పరంధాముని సత్యస్వరూపాన్ని గ్రహించ లేక పోతూంటే సాధారణ మానవులెలా తెలుసు కోగలరు ? దైవమాయామోహితుల మయిన మనం ఈ సృష్టిలోని విశ్వాన్నే గుర్తించ జాలక నిజ బుద్ధ్యాను సారం నిర్ణయించు కుంటున్నాము. భగవం

తుని అవతార లీలలను మనం సదా గానం చేస్తున్నా - ఆ మహా మహిమాన్వితుని తత్త్వాన్ని మాత్రం గ్రహించలేక పోతున్నాము. అట్టి పరంధామునకు ప్రణమిల్లుతూన్నాను. ఆ దేవదేవుడు ప్రత్యేక కల్పంలోనూ తనయందే సృష్టి చేస్తూ, పాలిస్తూ ఉపసంహరిస్తూంటాడు. మాయా రహితుడూ జ్ఞానస్వరూపుడూ అయిన అతడే అంతరాత్మ రూపంలో ఏకరస స్వరూపుడుగా ఉంటాడు. భూతభవిష్యద్వర్తమానాలలో, జాగ్రత్ స్వప్నసుషుప్తులలో పరిపూర్ణుడై భాసిల్లుతూంటాడు. పరాత్పరునికి ఆద్యంతాలన్నవి లేవు. అతడు గుణరహితుడై, సనాతనుడై, అద్వితీయుడై ఉంటాడు, శరీరేంద్రియ అంతః కరణాదులను శాంతింప చేసి తననే ధ్యానించు వారికి అతడు సాక్షాత్కరిస్తాడు. కుతర్కవాదులకు ఆదివ్యపురుషుని దర్శనం కాదు.

విరాట్పురుషావతారమే పరాత్పరుని ప్రథమాంకవారము. కాల, స్వభావ. కార్య కారణాదులూ, మనస్సూ పంచభూతాలూ అహంకార, త్రిగుణ, ఇంద్రియాలూ బ్రహ్మాండ శరీరమూ, ఆ శరీరరాభిమాన దేవతా-స్థావర జంగమాత్మకమైన జీవరాశీ ఆ భగవత్స్వరూపమే హరిహరులూ, నేనూ దక్షుడు ఆదిగాగల నవ ప్రజాపతులూ, నువ్వూ భక్తజనులూ. స్వర్గలోకాధిపతులూ, పక్షిరాజైన గరుత్మంతుడూ, నరప్రభువులూ, అధోలోకాధిపతులూ, విద్యాధర, గంధర్వ. యక్ష, రాక్షస, చారణ, నాగ, పితృ ఋషి, దైత్య. దానవ, సిద్ధ, భూత. ప్రేత, పిశాచ, కూష్మాండ, జలచర. వనచరాది సర్వజీవ గణాధిపతులూ, ఐశ్వర్య తేజోబలాదులు కల వస్తుజాలమూ, సర్వం దైవ స్వరూపమే, అంతే కాకుండా భగవానుని లీలావతారాలున్నాయి, వాటి శ్రవణ మాత్రంచే పాపాలన్నీ నాశనమవుతాయి. కనుక సావధాన చిత్తుడవై ఆలకించు.

స్కంధం 2 - అధ్యాయం 7

# లీలావతార వర్ణన

బ్రహ్మదేవుడు భగవంతుని అవతార లీలలను సంక్షిప్తంగా చెప్పనారంభించాడు. "వత్సా ! నారదా ! ప్రళయ పయోధిలో మునిగిన పృథ్విని ఉద్ధరించడానికి అనంతుడైన భగవంతుడు వరాహావతారమెత్తి ఆది దైత్యుడైన హిరణ్యాక్షుని - తన కోరలతో అంతం చేసి పృథ్విని ఉద్ధరించాడు. రుచి ప్రజాపతి పత్ని అయిన ఆ కూతియందు సుయజ్ఞ నామంతో అవతరించి దక్షిణయను పత్నియందు 'సుయమ' నామక దేవతలను ప్రభవింపజేసి జగత్త్రయ వాసులక్లేశాలను రూపుమాపాడు, కనుకనే తత్సమయంలో అతనిని "హరి" అని సంబోధించారు. దేవహూతి కర్దముల శృంగార ఫలితంగా తొమ్మండుగురు సోదరీమణులతో కపిలునిగా అవతరించి మాతృమూర్తికి సాంఖ్యయోగాన్ని ఉపదేశించాడు. అత్రి మహర్షిపల్లి అనసూయకు 'దత్తాత్రేయుడు'గా అవతరించి యదురాజ, కార్తవీర్యార్జున అలర్కాదులకు యోగ. మోక్షమార్గాలూ ప్రబోధించాడు. సృష్ట్యారంభ సమయంలో నేను అఖండమైన తపస్సు చేయగాప్రసన్నుడై సనక,సనందన.సనత్కుమార.సనత్సుజాత. నామాలతో అవతారమెత్తి ఋషులు మరచిన ఆత్మజ్ఞానాన్ని పునః వారికి బోధించగా వారు తత్త్వ

జ్ఞానులయ్యారు. దక్షపుత్రి అయిన మూర్తిదేవి వల్ల ధర్మని ద్వారా నరనారాయణ రూపాలతో అవతరించి బదరీ వనంలో తపస్సు చేసాడు. తత్సమయంలో అమరేంద్రుని ద్వారా విచ్చేసిన అప్సరో భామలు - తపోభూమిని చేరి నరనారాయణుల సందర్శన మాత్రంచే నిజస్వభావాన్ని మరచి పోయారు. వారి తపస్సును భగ్నం చెయ్యలేక పోయారు. మన్మధాదులను శంకరాదులు క్రోధంచే దగ్ధం చేశారే కానీ క్రోధాన్ని మాత్రం దరి చేర నీయలేదు. తండ్రి ద్వారా - సవతి మాత ద్వారా అవమానింపబడ్డ ధృవ కుమారుడు - ఘోరమైన తపస్సు చేయగా ఆ భగవానుడే చతుర్భుజ రూపంతో దర్శన మిచ్చి - వానికి ధృవ పదాన్ని అనుగ్రహించాడు. ఆ ధ్రువునికి మహర్షులే ప్రదక్షిణలు కావిస్తూ పరంధాముని స్తుతిస్తూ ఉంటారు. వేద విరుద్ధంగా ప్రవర్తించిన వేనుడు విప్రశ్రేష్ఠుల హుంకారానికి అంతమైపోతే అవతరించి వేనరాజును నరకగామి కాకుండ రక్షించాడు. అంతే కాదు పృధ్విని ధేనువుగా భావనచేసి ఓషధులను అన్నింటినీ పితికి విశ్వాన్ని సంరక్షించాడు. నాభి పత్ని అయిన సుదేవి యందు ఋషభ రూపావతారమెత్తి సర్వసంగ పరిత్యాగియై ఆత్మజ్ఞానియై జడభావంతో ఉండగా మహర్షులు పరమహంస పదమనీ, అవధూత చర్యయనీ భావనచేసి జ్ఞాన సాధనచేసి వారు కూడ తరించారు, తదనంతరం నేను చేసిన మహాయజ్ఞంలో కాంచన ప్రభలతో హయగ్రీవుడై అవతరించాడు. వేదమయుడూ, యజ్ఞమయుడు సర్వదేవమయుడూ అయిన ఆహయగ్రీవ భగవానుని నిఃశ్వాస రూపంలో సమస్త వేదాలు వెలువడ్డాయి. చాక్షుష మన్వంతరాంతంలో మనువు కావలసిన సత్యవ్రత రాజర్షి - మత్స్యావతారుని సందర్శించాడు. తత్సమయంలో భూరూపమైన నౌకకు ఆధారుడై ఉండడం వల్లనూ. అతడే సర్వజీవాశ్రయుడై తేజరిల్లాడు. నా నుండి ప్రళయ పయోరాశిలో పడిపోయిన వేదాలను సంగ్రహించి ఆతడు అందులో విహరించాడు. అమృతం కోసం సురాసురులు పాలసముద్రాన్ని మధించగా - కచ్ఛపావతారమెత్తి మందరాద్రిని మునిగిపోకుండా పైకి ఎత్తిన కచ్ఛప భగవానుడతడే. నృసింహావతారుడై - హిరణ్యకశిపుని అంతం చేసి- అమరుల భయాన్ని రూపుమాపి భక్తప్రహ్లాద కుమారుని సంరక్షించాడు. మకరం గజరాజును హింసిస్తుండగా దాని ఆర్తనాదాన్ని ఆలకించి గరుడవాహనమెక్కి సుదర్శన చక్రంతో ఆ మొసలిని అంతం చేసి గజేంద్రుణ్ణి రక్షించినది ఆ శ్రీహరి భగవానుడే. అదితి కశ్యప దంపతులకు వామనమూర్తిగా ప్రభవించి మూడడుగుల నేలను బలి చక్రవర్తి నుండి గ్రహించి త్రివిక్రముడై జగత్రయాన్ని ఆక్రమించి బలిని బంధించి మహేంద్రునికి స్వర్గ రాజ్యాన్ని ప్రసాదించాడు. నారదా! నీ అపార భక్తిప్రేమలకు బద్ధుడై హంసరూపావతారుడై యోగజ్ఞాన ఆత్మ తత్త్వాలను ఉపదేశించునట్టి భాగవత ధర్మాన్ని ప్రబోధించాడు. స్వాయంభువుడు ఆదిగాగల సర్వమన్వంతరాలలోనూ మనువాదిగా రూపాలలో ప్రాదుర్భవించి మనువంశాదులను వర్ధిలజేసి సర్వదిశలలోనూ, తేజస్సును వ్యాప్తి జెందింపజేస్తూ నిర్విఘ్నంగా ప్రజాపాలన చేస్తూంటాడు. వివిధ కాలాలలో భూభారభూతులుగా ఉన్నట్టి దురాత్ములైన శాసకులను అంతం చెసి ధర్మ సంస్థాపన చేస్తూంటాడు. అమర గణానికి ధన్వంతరి రూపంలో అమృతాన్ని అందించడమే కాదు, తననామ సంకీర్తన చేయునట్టి వారల భయంకర రోగాలను కూడ అంతం చేస్తూ రాక్షసాపహృతమైన హవిర్భాగాలను పునః అమరులకు అనుగ్రహించాడు. బ్రాహ్మణ ద్రోహులై సనా

తన మర్యాదలను. అతిక్రమించి సంచరించే దుష్టక్షత్రియాధములను అంతం చెయ్యడానికి పరశురామావతారమెత్తి పరశుధారియై 21 పర్యాయాలు దుష్టక్షత్రియులను సంహరించి పృథ్వీభారాన్ని హరించాడు. భరత లక్ష్మణ శత్రుఘ్న సమేతంగా శ్రీరాముడై తన కళలతో ప్రాదుర్భవించి పిత్రాదేశార్థం సీతాలక్ష్మణ సమేతుడై వనవాసదీక్షితు డయ్యాడు. ఆ కాలంలోనే లోక కంటకుడైన రావణాది దుష్ట రాక్షసులను అంతం చేసి పృథ్వీ భారాన్ని రూపుమాపి ధర్మాన్ని స్థాపించాడు. సమూహాలుగా రాక్షసులు జన్మించి సర్వులనూ పీడిస్తూంటే శ్వేత కృష్ణకేశాల నుండి బలరామ శ్రీ కృష్ణ రూపాలలో అవతారమెత్తి వివిధ లీలలు ప్రదర్శించి శిష్టజన సంరక్షణార్థం దుష్టులను సంహరించాడు. కలియుగ మానవులు అల్పమేధస్సు, అల్పమయిన ఆయుర్దాయమూ కలవా రవుతారని ప్రత్యేక ద్వాపర యుగాంతంలోనూ - సర్వమానవ తరణోపాయార్థం వేద వ్యాస రూపంలో ప్రాదుర్భవించి శాఖోపశాఖలుగా వేదవిభాగం చేసి శిష్యులకు ప్రబోధించడమే కాకుండ సర్వపురాణాలనూ, ఇతిహాసాలనూ రచించి లోక రక్షణ చేస్తూంటాడు. మయదానవ నిర్మితమాయా నగరాలలో నివాసం ఏర్పరచుకుని క్రూర రాక్షసులు సత్యనాశనం చేస్తూంటే బుద్ధావతారమెత్తి అనేక ధర్మాలను ఉపదేశించి త్రిపుర రాక్షస సంహారానికి సహకారం చేసాడు.

కలియుగంలో అంతిమ సమయంలో సజ్జన సదనాలలో సయితం భగవత్కథలను ఆలకించడానికి అవకాశం లేనప్పుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యాదులు కూడ వేదధర్మాలను పాటించక భ్రష్టులై పోగా శూద్ర ప్రభుత్వాలు వర్ధిల్లగా స్వాహాకార స్వధాకారాలు వినిపించవు. ఆ సమయంలో దేవయజ్ఞాలు పూర్తిగా నిరోధించబడగా కల్క్యవతారమెత్తి దురాత్ములను అంతం చేసి సత్యయుగ ధర్మాన్ని సంస్థాపిస్తాడు. సృష్ట్యారంభవేళలో మత్స్యరూపుడై, తపోరూపుడై, నవ బ్రహ్మరూపుడై, మరీచ్యాది మహర్షి స్వరూపుడై కూడ తానే అవతరిస్తాడు. ధర్మ, విష్ణు, మను, దేవత, రాజరూపాలలో అవతారమెత్తి రక్షణకార్యాన్ని కొనసాగిస్తాడు. అధర్మ, రుద్ర, క్రోధ, సర్ప, దైత్యాది స్వరూపాలలో ప్రాదుర్భవించి సంహారం చేస్తూంటాడు. ఆ పరమేశ్వరుని అనంత కళ్యాణ గుణాలను పరిగణించ గలవారెవ రున్నారు ?

త్రివిక్రమావతార సమయంలో మానదండ సమంగా కొలవడానికై బయల్వెడలిన దివ్యపాద సంచలనం వల్ల అంతిమావరణమైన ప్రకృతి కూడ కంపించి పోయింది. సహస్ర శీర్షుడైన ఆదిశేషువు కూడ భగవద్గుణగానంలో అసమర్థుడవుతూంటే సామాన్యుల విషయం వర్ణించనేల ? ఆ పరమపురుషుని యోగ మాయను మహాదేవుడూ, నేనూ, నువ్వూ, ప్రహ్లాద, శతరూప, మను, ప్రియవ్రత, ప్రాచీనబర్హి, ఋభు, ధృవ, ఇక్ష్వాకు, పురూరవ, హనుమంత, పరాశరాదులూ, ఎరుగుదురు. అచంచల భగవద్భక్తి కలవారు- స్త్రీ, శూద్ర, హూణ, భిల్లవంశీయులయినవారైనా గ్రహించ గలుగుతారు. భగవద్భక్తి భావంతో పాపాత్ములు కూడ తరించగలరంటే వేదధర్మ పరాయణులైన, భక్తుల విషయం వర్ణించాలా ? భగవద్భక్తుడు పొందజాలనిది ఏదీ లేదు షడ్గుణైశ్వర్య సంపన్నుడైన పరమాత్మ స్వరూపాన్ని సంగ్రహంగా మాత్రం చెప్పగలిగాను. భాగవత స్వరూపమైన దీనినే నువ్వు విశదీకరించి ప్రచారం చేయగలిగితే మానవులందరూ భక్తులై మాయను అధిగమించి తరించ గలుగుతారని నారద మహర్షికి బ్రహ్మదేవుడు ఉపదేశించాడని - శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పిన విధంగా శౌనకాదులకు సూతర్షి చెప్పాడు.

## స్కంధం 2 - అధ్యాయం 8

# పరీక్షిత్తు వివిధ ప్రశ్నలు వేయుట

శుకమహర్షి ప్రసంగాన్ని ఆలకించిన పరీక్షిత్తు మునీంద్రా! దేవర్షికి భగవద్గుణగానం చేయుమని బ్రహ్మదేవుడు చేసిన ఆదేశ ప్రకారం అతడెవరికి భాగవత ధర్మోపదేశం చేసాడు. భగవత్కథా శ్రవణం నిరతిశయానందాన్ని ప్రసాదిస్తూ సర్వమానవ కళ్యాణ దాయకమవుతూన్నది. ఆ భగవత్కథలను నాకు వివరించి ధన్యుణ్ణి చేసెదరుగాక! శ్రీ కృష్ణ లీలామృత పానం ద్వారా హృదయ మందిరంలో దైవదర్శన మవుతుంది. శరత్కాలంలో జలాశయాలు నిర్మల మవుతూన్నట్లే శ్రీ కృష్ణ కథాశ్రవణ, సందర్శనాదుల వల్ల మానవ హృదయాలు పరిశుద్ధ మవుతాయి మార్గాయాసంచే కష్టాలనుభవించి గృహస్థు స్వగృహం చేరగానే దానిని విడనాడలేనట్లు కృష్ణకథామృత పానమత్తుడు ఆ దేవదేవుని శ్రీ చరణ ధ్యానాన్ని విస్మరించలేడు. శరీరం మాత్రమే పంచభూత నిర్మితం కానీ జీవునకు తత్సంబంధం ఎంత మాత్రం లేదు. దాని నైసర్గిక స్వభావం వల్లనే సర్వం జరిగిపోతూన్నదా? లేక దానికి వేరే కారణ మేమైనా ఉన్నదా? సర్వజగద్రచనకు కారణ భూతమైన పద్మం భగవంతుని నాభినుండి ఆవిర్భవించింది. అవయవ పరిచ్ఛిన్నుడైన జీవుని వలెనే సీమితమైన అవయవాదులచే పరమాత్మ కూడ పరిచ్ఛిన్నుడై ఉన్నట్లు మీరు చెప్పారు. సృష్టి కర్త అయిన బ్రహ్మ ఎవని నాభికమలం నుండి అవతరించి కూడ ఆ దేవదేవుణ్ణి సందర్శించ లేక పోయాడో? సృష్టిస్థితి సంహారకారుడూ సర్వాంతర్యామీ, మాయాధినాథుడూ అయిన భగవంతుడు మహామాయను విడనాడి ఏ స్వరూపంలో దేని యందు శయనిస్తాడు? లోకాలూ, లోకపాలురూ కూడ ఆ పరమ పురుషుని అంగాల నుండి అవతరించిన వారేననీ మీరు తెలవిచ్చారు. ఈ వాక్యద్వయంలో కల అంతరార్థాన్ని విశదీకరించండి, అవాంతర మహాకల్పాలు ఎన్ని విధాలు? ఎలా భూతవర్తమాన భవిష్యత్కాల నిర్ణయం చెయ్యాలి? స్థూల దేహాభిమానులయిన జీవుల ఆయుర్దాయం కూడ నిర్ణయించ బడింది కదా! కాల సంబంధమైన స్థూల, సూక్ష్మగతులను నిర్ణయించే దెలా? జీవులకు ఏ యే కర్మలవల్ల ఏ యే గతులు కలుగుతాయి? సత్వరజస్తమో గుణాలద్వారా దేవమనుష్యాది జన్మలు కలగ డానికి ఏ యే కర్మలు ఎవరెవరు ఎలా చేస్తుంటారు? బ్రహ్మాండ పరిణామం బాహ్యాభ్యంతరాలలో ఎంతెంత ఉంటుంది? పృథివ్యంతరిక్ష పాతాళ, గ్రహ నక్షత్ర, గిరి నదీనద, సాగర ద్వీపాలూ. వాటి యందు ఉద్భవించే ప్రాణులూ దేని నుండి జన్మిస్తాయి. యుగ భేద, పరిమాణ యుగధర్మ నానావతార, గాథాదులూ మహాత్ముల జీవన చరిత్రలూ వర్ణాశ్రమ ధర్మాలూ, తత్త్వసంఖ్య, వాటి స్వరూప లక్షణాలూ, దేవతారాధన క్రమం. అధ్యాత్మ యోగ విధీ, విశదీకరించండి. విభిన్న వృత్తులవారు, రాజర్షుల మహర్షుల, మహాపురుషుల గాథలూ, ఆపదలలో చిక్కుకున్న వారి ధర్మాలూ విశదీకరించండి. ఎట్టి ఐశ్వర్యాలు యోగీశ్వరు లయినట్టి వారికి లభిస్తాయి? ఆ మహాత్ముల లింగ శరీరం ఎలా విచ్ఛిన్నం అవుతుంది? వేదోపవేద ధర్మ శాస్త్రేతిహాసాదుల తాత్పర్య స్వరూపాదులను సవిస్తరంగా చెప్పండి. సర్వప్రాణుల ఉత్పత్తీ, స్థితి [illegible] లూ ఎలా జరుగుతాయి?

వాపీకూప తటాకాదులను నిర్మించడం, శ్రౌత స్మార్త కర్మలూ, యజ్ఞయాగాదులూ, కామ్య కర్మలూ, ధర్మార్థ కామాలూ వాటి సాధనలూ విధిప్రళయ సమయంలో సమస్త జీవులూ ప్రకృతిలో లీనమై పునః ఎలా ఉద్భవించేదీ పాషండులు ఎలా జన్మించేదీ వివరించండి. బంధమోక్షాలు ఎలా ఉంటాయి ? ఆత్మజ్ఞాని ఎలా ఉంటాడు ? సర్వ స్వతంత్రుడైన భగవానుడు తన మాయతో ఎలా క్రీడిస్తూంటాడు ? నిజమాయను విడిచి సాక్షివలె ఎలా ఉదాసీనుడై ఉంటాడు ? నాకు క్షుత్పిపాసా బాధలు కానీ, మృత్యుభీతి కానీ లేదు. విప్ర శాపం కారణంగా నాకు మరణం నిశ్చయమయింది. కనుక తద్విచారం అవసరం లేదు. భవదీయవదనారవింద బహిర్గతమగునట్టి అమృతమయమగు సత్కథలను ఆలకిస్తున్నాను. మోక్షసాధనాన్ని నాకు అనుగ్రహించండి "అని అర్థించాడు."

స్కంధం 2 - అధ్యాయం 9

## నారాయణుడు బ్రహ్మకు చతుశ్లోకిని ఉపదేశించుట

పరమశాంత చిత్తుడై శుకమహర్షి ఇదులు పలుకుతున్నాడు. పరీక్షిన్మహీపాలా ! మానవమాత్రునికి స్వప్నంలో చూసిన వస్తుజాలంతో సంబంధం లేనట్లే - ఆత్మానుభవం కల జ్ఞానికి పదార్థాలతో సంబంధం ఉండదు. ఆత్మ మాయా హేతువుగా నానారూపాలలో గోచర మవుతూంటుంది. మాయాగుణాలలో రమించే సమయంలో 'నేను-నాది' అన్నభావాలు కలుగుతూంటాయి. ఈ గుణాదులను సంక్షుభితం చేసేకాల, మోహాదులను ప్రాదుర్భవింప జేసే మాయను అధిగమించి నిత్యానందాన్ని అనుభవించేవాడు 'నేను-నాది' అన్న భావాలను విడనాడి ఉదాసీనుడై గుణాతీతుడవుతాడు.

భగవానుడు చతురాననుని తపస్సుకు ప్రసన్నుడై దర్శనమిచ్చి పరమాత్మ తత్త్వోపదేశం చేసాడు. దానినే నీకు విశదీకరిస్తాను. త్రిలోక గురువైన బ్రహ్మదేవుడు కమలాసనంపై ఆసీనుడై సృష్టిని గురించి యోచించ సాగాడు. అయినా అతనికి సృష్టిరూప జ్ఞానం కలగలేదు. అలా ఆతడాలోచిస్తూండగా 'తపస్సు చెయ్యి, తపస్సు చెయ్యి' అన్న వచనాలను ఆతడు భగవదాదేశంగా భావించి తపస్సు చెయ్యసాగాడు. ఏకాగ్రచిత్తుడై సహస్ర దివ్యవర్షాలు తపస్సుచేసాడు. దానికై ప్రసన్నుడై శ్రీ మన్నారాయణుడు అతనికి తన దివ్యలోకాన్ని చూపించాడు, సర్వశ్రేష్ఠమై, క్లేశ, మోహ, భయరహితమైన ఆ భవ్యస్థానంలో అమరులు ఆ దేవదేవుని స్తుతిస్తూన్నారు. అక్కడ సత్త్వ రజస్తమో గుణాలలో దేనికీ స్థానం లేదు. మాయకు అసలక్కడ అవకాశమే లేదు. అనంత సూర్య ప్రకాశంతో శ్యామవర్ణుడూ. పీతాంబరధారీ శంఖ, చక్ర, గదా, శారంగధారీ అయి శ్రీహరి భగవానుడు ప్రకాశిస్తున్నాడు. శ్రీ మహాలక్ష్మి వివిధ విభూతులతో అతని చరణ కమలాలను సేవిస్తూన్నది. నంద, సునంద ప్రబల అర్హణ, ఆదిగాగల శ్రీహరి పార్షదులు అతణ్ణిసేవిస్తూన్నారు. పురుష, ప్రకృతి, మహత్తత్వ

అహంకార, మనస్సాదిగాగల పది ఇంద్రియాలూ శబ్దాదులయిన పంచతన్మాత్రలూ, పంచమహాభూతాలూ ఈ పంచవింశతి తత్త్వాలూ రూపుదాల్చి ఆ దేవదేవుణ్ణి పరివేష్టించి ఉన్నాయి. స్వస్వరూపాలతో ధర్మ, ఐశ్వర్య, శ్రీ కీర్తి, జ్ఞాన, వైరాగ్యాదులు ఆయన చుట్టూ ఉన్నాయి. మహానందంతో అతడు హరి సన్నిధానంలో నిలబడ్డాడు. శ్రీహరి బ్రహ్మను సమీపంగా తీసుకొని-వత్సా! సర్వవేద విజ్ఞానం నీ హృదయంలోనే ఉంది. తపస్సుచేసి, సృష్టి రచనా శక్తికై నన్ను సందర్శించ గలిగావు. కష్టాత్ముడు నన్ను దర్శించలేడు. నీ మనోభీష్టమేమిటో చెప్పు. నెరవేరుస్తాను. నన్ను దర్శించకుండానే కేవలం శబ్దాన్ని మాత్రం ఆలకించి - నువ్వు మహా తపస్సు చేసావు. కనుక నీకు నాలోకంతో నన్నుకూడా సందర్శించే అదృష్టం కలిగింది. పరిపూర్ణంగా నేను నిన్ను అనుగ్రహిస్తున్నాను, నా హృదయం తపస్సు, తపస్సుకు ఆత్మస్వరూపుడను నేనే. తపస్సు ద్వారానే నేను సృష్టి స్థితిలయాలు చేస్తూంటాను. దుర్లంఘనీయమైన నాశక్తి తపస్సు మాత్రమే అని పలుకగా - బ్రహ్మ - "దేవా! సర్వ సాక్షిభూతుడవయిన నీకు నా మనోభీష్టం తెలియనిది ఏమీ కాదు. నాకు సగుణనిర్గుణరూప జ్ఞానాన్ని ప్రసాదించు మాయాపతిన నీ సంకల్పం ఎన్నడూ వ్యర్థం కాదు. సాలెపురుగు జాలాన్ని నిర్మించి తాను అందే క్రీడించేటట్లు - నువ్వు మాయాశ్రయుడవై, అసంఖ్యాక స్వరూపాలను సృష్టించి పోషించి సంహరిస్తూంటావు నీ కంటె భిన్న పదార్థమేదీ లేదు. ఈ కార్య రహస్యాన్ని గ్రహించాలను కుంటున్నాను. సృష్టికార్య నిర్వహణలో కర్తృత్వాధికారగర్వం లేకుండా, ఉండేలాగ, పూర్వకల్ప సృష్టి విధానాన్ని నాకు విశదంగా చెప్పు. గుణ కర్మానుసారం కల్పాంత ప్రాణులకు జన్మలు ప్రసాదించేటట్లు, సర్వస్వతంత్రుడనన్న అభిమానం నాకు కలగకుండ ఉండేలాగున నువ్వు కరుణిస్తే నేను సృష్టిరచన చేస్తాను." అన్నాడు.

అంత ప్రసన్నుడైన శ్రీహరి "వత్సా! అత్యంత గోప్యమైన ఆత్మజ్ఞానాన్ని నీకు బోధిస్తాను. సావధానుడవై ఆలకించు. నీకు నా అనుగ్రహం వల్లనే నాగుణ రూపలీలాదులు తెలుస్తాయి, సృష్టికి ముందు ఏకమాత్రుడనై నేను మాత్రమే ఉన్నాను. నన్ను అధిగమించిన స్థూల సూక్ష్మ పదార్థమేదీ లేదు. ఈ రెండింటికీ హేతువైన అజ్ఞానమూ లేదు. సృష్టి లేని స్థానంలోనూ, సృష్టిలోనూ నేనున్నాను. శేషించి ఉన్న పదార్థ సర్వస్వం కూడ నేనే. యదార్థానికి లేనిపీ. అనిర్వచనీయ పదార్థరాశీ ఇద్దరు చంద్రులవలె పరమాత్మనైన నా యందే కనబడుతూంటాయి. తారామండలంలోని రాహు సదృశంగా యదార్థంగా - ఉన్నా నేను కూడ గోచరించను. ఇదే నా "మహామయ" అని తెలుసుకో, పంచభూతాలతో ఏర్పడిన పెద్ద, చిన్న శరీరాలు పంచమహా భూతకార్యాలు కావడంవల్ల భూత పంచకం ఆ దేహంలో ప్రవేశిస్తుంది. అది యందే ఆ దేహాలకు హేతుభూతం కావడంవల్ల వాటి ప్రవేశమూలేదు. అదే తీరున జీవదృష్ట్యా ఆత్మరూపంలో ప్రవేశించేది నేనే. "ఇది బ్రహ్మకాదు." ఇది బ్రహ్మకాదు అన్న నిషేధ పద్ధతిద్వారానూ ," ఇదిబ్రహ్మ-ఇది బ్రహ్మ" అన్న సమ న్వయపద్ధతి చేతనూ సర్వాతీత, సర్వస్వరూప సర్వత్రాస్థిరమై ఉన్నదే. పరమాత్మ స్వరూపమని తెలుస్తూన్నది. ఇదే పరమాత్మ తత్వాన్ని గ్రహించడానికి మార్గం. అపల భక్తిద్వారా నువ్వు సమాధి స్థితిలో నాసిద్ధాంత మందు సంపూర్ణ నిష్ఠతో ఉండగల్గితే కల్ప కల్పాలలో సృష్టి రచనను కొనసాగిస్తున్నా నీకు మోహం కలగదు. అంతేకాదు నువ్వు నిరతిశయ

ఆఖండానంధాను భూతిని పొందగలవు," అని ఆత్మ జ్ఞానోప దేశం చేసి అంతర్ధానమై పోయాడు. పూర్వ కల్పానుసారం చతుర్ముఖ బ్రహ్మ సృష్టి రచనకు ప్రారంభం చేసాడు. ధర్మాధిష్ఠాత అయిన బ్రహ్మ దేవుడు ప్రజాకళ్యాణ వాంఛతో యమనియమాది నిష్ఠ డయి వున్న వేళలో దేవర్షి నారదుడు. మాయా తత్త్వాన్ని గ్రహించాలని అక్కడకు వచ్చి బ్రహ్మ దేవుని సంతుష్టాంత రంగునిచేసు కున్నాడు. ప్రసన్న డైన బ్రహ్మను దర్శించి తన సందేహాన్ని దేవు వ్యక్తం చెయ్యగా అతనికి బ్రహ్మ దేవుడు దశ లక్ష యుక్తమయిన భాగవతాన్ని వివరించాడు. దానిని అ కిస్తే నీకు కలిగిన శంకలన్నీ దూరమవుతాయి. తండ్రి ద్వారా నేను ఆలకించిన భాగవతాన్ని నీకు చె తాను. సావధానంగా ఆలకించు."

శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

స్కంధం 2 - అధ్యాయం - 10

## భాగవత లక్షణాలు

శుకమహర్షి పరీక్షిన్మహీపాలునికి మహాభాగవత లక్షణాలు వివరిస్తున్నాడు. "రాజా ఈ మహా పురాణంలో సర్గ, విసర్గ స్థాన, పోషణ, ఊతి, మన్వంతరాలూ, ఈశానుకథ, నిరోధమూ, ముక్తి, ఆశ్రయాలనే దశలక్షణాలూ, సువ్యక్తం చెయ్యబడ్డాయి. శ్రుతి తాత్పర్య. అనుభవాల చేత ఈ ఆశ్రయలక్షణం నిర్ణయించబడింది. మహాత్ములు కొందరు అన్య విషయాలు తొమ్మిదీ సుగమంగా నిర్ణయించారు. గుణాలందు సంక్షోభం ఈశ్వర ప్రేరణ వల్ల కలిగి రూపాంతరం చెందడం కారణంగా పృధివ్యాకాశాది భూత పంచకమూ, శబ్దాది పంచతన్మాత్రలూ, ఇంద్రియ అహంకార మహత్తత్త్వాదులూ ప్రభవిస్తున్నాయి. 'సర్గ' మని దీనినేవ్యవహరించారు. దివ్యవిరాట్పురుషుని ద్వారా అవతరించిన చతుర్ముఖ బ్రహ్మద్వారా జరుగునట్టి చరాచర సృష్టి రచనయే "విసర్గ" మని పిలువ బడుతూన్నది. లయమే లక్షణంగా గల పుష్టిని ఓ మర్యాదలో స్థిరంగా ఉంచడంలో సిద్ధించిన శ్రేష్ఠత్వాన్ని 'స్థాన'మని వ్యవహరించారు. తన వల్ల సంరక్షింపబడు తూ సృష్టిలో భక్తులయందు భగవంతునికి కలిగే కృప 'పోషణ" మని అభివర్ణించారు. ప్రజాపరిపాలనా రూ మైన ధర్మాచరణ మన్వంత రాధి నాధుల భగవద్భ మన్వంతర మనబడుతూన్నది, జీవకోటిని జన్మాంతరవాసనలు కర్మ బద్ధులను చేయడానికి "ఊ అన్నారు. అవతార లీలలు - వీటినే ఈశాను కథ అని పేర్కొన్నారు, యోగ నిద్రా పరవశుడై వాను డున్నప్పుడు జీవరాశిఅంతా ఆయనలో లయ ఉండడమే "నిరోధ" మనబడుతూన్నది. అజ్ఞాన కల్పి లైన భోక్తృత్వాదులను పరిత్యజించి పరంధామ యందు ఆనందాను భవాన్ని పొందడాన్ని "ముక్తి అంటారు. ఉత్పత్తి, సృష్టి స్థితి సంహార రూపాల ఈ జగత్తు ఎవని యందు భాసిల్లుతూన్నదో అ బ్రహమే "ఆశ్రయం" అనబడుతూన్నది. పరబ్రహ్మ శాస్త్రాలు పరమాత్మ అని వ్యవహరిస్తూంటా ఇంద్రి యాభిమానీ, ద్రష్టా అయిన జీవుడేఇంద్రియ

ష్ఠానదేవతలైన సూర్యాది రూపాలలో ప్రకాశిస్తూంటాడు నేత్రగోళయుక్తమైన ఈ శరీరమే ఈ రెంటినీ వేరు చేస్తూంటుంది. ఈ మూడింటిలో ఒకటి శూన్యమైతే శేషించినరెండూకూడ ఉండవు. ఈమూడింటినీగ్రహించ గలిగినవాడు పరమాత్మ మాత్రమే. అతనికి మాత్రం ఏ ఆశ్రయమూలేదు. అతడికతడే ఆశ్రయమైఉన్నాడు. తన నివాసార్థం విరాట్పురుషుడు బ్రహ్మాండాన్ని భిన్నం చేసుకుని జలాలను సృజించాడు. విరాట్ పురుషరూప నరసృష్టికావటం వల్ల జలాలకు "నార" అన్ననామం ఏర్పడింది. నారములయందు శయనించ డం వల్ల అతనికి నారాయణ నామం ఏర్పడింది. అతని కృప వల్లనే జీవ, ద్రవ్య, కాల స్వభావాదులకు 'శక్తి' కలుగుతూ ఉంటుంది. యోగనిద్ర నుండి లేచిన ఆ నారాయణ భగవానుడే నిఖిలబ్రహ్మాండ బీజరూపమైన సువర్ణ స్వవీర్యాన్ని ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధి భౌతిక రూపాలతో త్రిభాగాలు చేసాడు. విరాట్ భగ వానుని ఆకాశం ద్వారా ఇంద్రియ, మన, దేహబలాలు కలిగాయి. అతని నుండియే వీటన్నిటికీ ప్రభువైన "ప్రాణం" ప్రభవించింది. ప్రభువు వెనుక దాసజనం వెడుతూన్నట్లే ప్రాణబలం ఉన్నప్పుడే సర్వేంద్రి యాలూ శక్తివంతాలవుతాయి. ప్రాణశక్తి తగ్గితే ఇంద్రియ శక్తి కూడ సన్నగిల్లి పోతుంది. ప్రాణ వాయువు వేగంగా చలిస్తూంటే విరాట్పురుషునకు క్షుత్పిపాసలు పర్ధిల్లుతూంటాయి. తినాలి. త్రాగాలి. అన్న కోరిక కలగడంతో [illegible] పురుషునికి ముఖం ఏర్ప డింది. దాని నుండి తాలు భాగము తద్వారా రసనేంద్రి యమూ రసాలూ పుట్టాయి. విరాట్పురుషునికి భాష చెప్పకలగగానే వాగింద్రియ [illegible]

దేవత అయిన అగ్ని, వాగింద్రియానికి భాషణాశక్తి ప్రభవించాయి. అనంతరం [illegible] వే[illegible]ం [illegible]కా రంధ్రమూ, గంధాఘ్రాణేచ్ఛా కలగడంతో ఘ్రాణేంద్రి యమూ. తదధిష్ఠాన దేవత అయిన వాయువూ ప్రభ వించాయి. దర్శనాభిలాష కలగడంతో నేత్రగోళాలూ. తదధిష్ఠానదేవతఅయిన సూర్యుడూ. నేత్రేంద్రియమూ, ఆవిర్భవించాయి. తద్వారా రూపగ్రహణం ప్రారంభ మయింది.

వేదమూర్తులైన మహర్షులు విరాట్ పురుషుని మేలుకొలుపాలని ప్రయత్నించగానే అతనకి కలిగిన శ్రవణేచ్ఛద్వారా కర్ణాలూ.తదధిష్ఠాన దేవతలైనదిశలూ ప్రభవించాయి. వస్తుతత్వ గ్రహణేచ్ఛవల్ల చర్మం పుట్టింది. త్వగింద్రియంలో రోమాలూ బాహ్యాభ్యంతరా లలో సంచరించే వాయువులూ పుట్టి త్వగింద్రియం తన శరీరమంతా వ్యాపించడంతో స్పర్శజ్ఞానం కలిగింది. అసంఖ్యాక విధాలైన కర్మాచరణేచ్ఛ కలగడంతో కర ములూ, వాటికి అధిష్ఠానదేవత అయిన ఇంద్రుడూ, ఈ రెంటి కర్మరూపమైన గ్రహణమర్ధ్యమూ కలిగాయి. గమనాభిలాషతో పాదాలూ, వాటికి అధిష్ఠానదేవ రూప ములో విష్ణువూ, తత్కర్మరూపమైన గమన క్రియా జన్మించాయి. రత్యానందాన్ని పొందాలని సంతానేచ్ఛను కలిగి ఉండడంతో లింగోత్పత్తీ. ఉపస్థేంద్రియమూ, తదధిష్ఠానుడైన ప్రజాపతీ వీటికి ఆశ్రయమైన కామ సుఖమూ ప్రభవించాయి. మలత్యాగేచ్ఛతో గుదద్వారా పాయ్వింద్రియాధిష్ఠాన దేవత- మిత్రుడూ మలత్యాగ క్రియా ఏర్పడ్డాయి. అపానద్వారం ద్వారా ఈదేహాన్ని త్యజించి మరో దేహాన్ని పొందాలన్న వాంఛవల్ల నాభి ద్వారం ఏర్పడింది. దాని వల్ల అపాన, మృత్యువులు జన్మించాయి. ఆహార పానీయగ్రహణేచ్ఛ కారణంగా ఉదర, ఆంత్రనాళాదులు ఉత్పన్నమయ్యాయి. కుక్షికి అధిష్ఠాన దేవతగా సాగరమూ. నాడులకు అధిష్ఠాన దేవతలుగా నదులూ తుష్టి. పుష్టి - వీటికి ఆశ్రయా లైన విషయాదులూ పుట్టాయి. మాయా సంబంధమైన విచారణ కొనసాగించడంతో హృదయమూ, మనస్సూ, మనస్సుకు అధిష్ఠానమయిన చంద్రుడూ కామసంక ల్పాలూ జన్మించాయి. విరాట్పురుషుని దేహంలో జల

తేజో భూతాలవల్ల త్వక్ మాంస. రుధిర. మేదో మజ్జాస్థులూ, ఆకాశ జల వాయువులనుండి ప్రాణో త్పత్తీ జరిగింది. శ్రోత్రేంద్రియాదులు శబ్దాది విషయా లను గ్రహిస్తూంటాయి. అహంకారం నుండివిషయాలు ప్రభవిస్తాయి. సమస్తమయిన వికారాలకూ మనస్సే జన్మస్థానము. బుద్ధి పదార్థాల బోధను కలిగిస్తుంది. విరాట్పురుషుని స్థూల స్వరూపాన్ని గురించి నీకు అభి వర్ణించాను. పృథివ్యాపస్తేజోవాయురాకాశ అహంకార, మహత్తత్త్వ ప్రకృతి అనే ఎనిమిదింటి చేతా యిది ఆవరింప బడి ఉంటుంది. దీనిలో అర్ధభాగమైన పర మాత్మ యొక్క సూక్ష్మ శరీరంఅవ్యక్తమై. నిర్విశేష మై ఆదిమధ్యాంత రహితమై నిత్యమై విరాజిల్లుతూ ఉంటుంది. అది మనో వాగతీతమై అవకాశమే కాని దివ్య స్వరూపమని శ్రుతులు ఘోషిస్తున్నాయి, స్థూల సూక్ష్మలైన ఈ రూప ద్వయం మాయా కల్పితమే. అందులకే మనీషులు ఈ రూపద్వయాన్ని స్వీక రించరు. యథార్థానికి క్రియా రహితుడైన పరమాత్మ క్రియా సంపన్నుడవుతూన్నాడు. నిజమాయా శక్తితో విరాట్, బ్రహ్మరూపాలు రెండూ ధరించి ఆ పర మాత్మవాచ్య, వాచక, శబ్దార్థ రూపాల్లో ప్రకటితుడై అసంఖ్యాక నామ రూపాలతో క్రియలను స్వీకరిస్తూం టాడు. ప్రజాపతులు, మనువులు, మహర్షులు, నాగ గరుడ, గంధర్వ విద్యాధర, చారణ, పితృ, సిద్ధ. యక్ష, రాక్షస, కిన్నర, కింపురుషభూతప్రేత వినాయక కూష్మాండ, ఉన్మాద భేతాళయాతుధాన మృగ పశు పక్షి వృక్ష పర్వత సరీ సృపాదులన్నీ భగవత్స్వరూ పాలే. చరా చర భేదంతో రెండు తరగతులనూ, అం డజ, జరాయుజ, స్వేదజ ఉద్భిజ భేదంతో చతుర్వి ధాలుగా ఉండే జీవ జాలమూ, భూచర, జల చర, ఆకాశచారులయిన జీవకోటీ - సత్త్వ ప్రధానంగల నరులూ, తమోగుణ ప్రధానంగా నరకవాసులూ, ప్రభ విస్తూంటారు. ఇందులో ఒక్కొక్క గుణం మిగిలిన రెండు గుణాలతో కలసిననాడు ఒక్కొక్కటి మూడు మూడుగా మారుతూ అనేకత్వసిద్ధ కలుగుతుంది. ఆ పరమాత్మయే విష్ణురూపుడై ఈ జగత్తును పాలించి పోషిస్తూ లయవేళలో ప్రళయ రుద్రరూపంతో ఈ విశ్వాన్ని తన యందే లీనం చేసుకుంటూ ఉంటాడు.

అచింత్యైశ్వర్య సంపన్నుడైన పరమాత్మను మనీ షులు ఇలా అభివర్ణిస్తూన్నారు. సృష్టిస్థితి సంహార కారుడంటూ తత్త్వజ్ఞానులైన వారు పరమాత్మను ధ్యానించి దర్శించారు. వారీ సంసారాన్ని అధిగ మించారు. భగవంతుని యందు సంసార సృష్టి రచ నాదులు ఉన్నా మనీషుల దృష్టిలో భగవంతుడు విశ్వా తీతుడైన వాడు కర్తృత్వభోక్తృత్వాదులన్నవేవీ అతని యందు లేవు. ఏకైక రీతిగానే కల్పకల్పాంతరాలలో సృష్టిక్రమం జరుగుతూ ఉంటుంది. ఇందులో మరో రకమైన పద్ధతి ఏదీ లేదు. మహాకల్పారంభవేళలో ప్రకృతి వల్ల క్రమ క్రమంగా మహత్తత్వాదులు ఉత్పన్న మౌతూంటాయి. కల్పారంభ సమయంలో ప్రాకృత సృష్టి ఏకరీతిగానే జరుగుతూంటుంది. చరా చర రూపవైకృత సృష్టి మాత్రం నవ్యరూపంలో కొన సాగుతుంది. ఇప్పుడు పద్మకల్ప విశేషాలు వివరిస్తాను. సావధానంగా ఆలకించు. కాల పరిణామ, కల్ప, మన్వంతర విశేషాదులు తరువాత చెబుతాను. అన్నాడు

శౌనకుడు ప్రశ్నిస్తూన్నాడు. సూతమునీంద్రా! కుటుంబాన్ని వదలి విదురుడు తీర్థయాత్రార్థియై వెళ్ళా డని గతంలో చెప్పావు కదా! తత్కాలంలో మైత్రేయ మహర్షి వల్ల విదురుడు ఆత్మజ్ఞానాన్ని పొందా నని చెప్పావు. విదుర మైత్రేయ సంవాద, రూపమైన అధ్యాత్మ విద్యతో బాటు విదురగాథను సంపూర్ణ గా ఆలకించాలని ఉంది - అని పరీక్షిన్మహీపాలుడు అర్థిం చగా శుక మహర్షి బోధించిన మహత్తర విషయాలనే మీకు చెబుతాను. అని సూతమునీంద్రుడు ముందుకు సాగుతున్నాడు.

ద్వితీయ స్కంధం సమాప్తము.

# శ్రీ మద్భాగవత మహాపురాణము

## స్కంధం-3 — అధ్యాయం-1

## ఉద్ధర విదుర సమాగమము

ఉపప్లావ్యం నుండి శ్రీకృష్ణుడు రాయబారిగా హస్తినాపురం వెళ్లిన సమయంలో దుర్యోధనుని ఆతిథ్యం త్రోసిపుచ్చి ధర్మమూర్తి, భగవద్భక్త శిఖామణి అయిన విదురుని గృహానికి వెళ్ళి అక్కడ విదుర దంపతుల ఆతిథ్యాన్ని స్వీకరించాడు. ఏవం విధ విశిష్ట గుణసంపన్నుడైన విదురుడు సర్వాన్నీ త్యజించి వనాలకుపోయి మైత్రేయ మహర్షిని సందర్శించి ప్రశ్నించిన విషయాలనే - రాజా! నువ్వు నన్ను అడిగావు. కొంత సమాధానం చెప్పాను. శేష విషయాన్ని ఆలకించు అన్నాడు - శుకమహర్షి.

అంత పరీక్షిత్తు ప్రశ్నిస్తూ "వ్యాసనందనా? విదుర మైత్రేయులకు ఎలా కలయిక ఏర్పడింది. ఎక్కడ వారు ఏ సమయంలో కలిసారు? విశేష విషయజ్ఞుడైన విదురుడు సాధారణ ప్రశ్నలు వెయ్యడుకదా? సాధారణు లయినవారికి మైత్రేయుడు కానరాడు కదా! సామాన్య విషయాలు బోధించడు. మహిమోపేతమైన విషయాన్నే చెప్పి ఉంటాడు. కనుక మోక్ష కారకమైన విదురమైత్రేయ సంవాదాన్ని వివరించుడనగా శుకమహర్షి ప్రశాంత చిత్తుడై ఆ విషయమై చెప్ప నారంభించాడు. పరీక్షిన్నపాలా! పుత్ర ప్రేమాభి భూతుడైన ధృతరాష్ట్రుడు - ధర్మరాజాది పాండవేయులను అనేక విధాల బాధించినాడు. లాక్షా గృహదాహం, కపట ద్యూతం, ద్రౌపదీ వస్త్రాపహరణ ఆదిగాగల క్లేశాలపాలుజేసి అరణ్య అజ్ఞాతవాసాలు పూర్తిచేసి మరలివచ్చిన తరువాత కూడ ధర్మంగా రావలసిన వారి రాజ్యభాగ మివ్వక బాధిస్తూంటే వాసుదేవుడే స్వయంగా రాయబారిగా వచ్చినా ఎంతగా అతడూ, పరశురామాది మహర్షులూ బోధించినా ఆలకించక పెడచెవిని బెట్టి ఆ దేవదేవుణ్ణే బంధించాలని ప్రయత్నించాడు. కౌరవుల ఈషణ్మాత్ర పుణ్యం శ్రీకృష్ణ నింద వల్ల నాశనమైపోయింది. వాసుదేవుడు మరలి ఉపప్లావ్యం చేరాడు.

అనంతరం ధృతరాష్ట్రుడు విదురుని పిలచి సమాలోచన సాగించడంతో అతడు కౌరవులు కొన సాగించిన సర్వ అత్యాచారాలనూ ఖండించి వేసాడు. అంతే కాదు పాండవుల సత్య, ధర్మ గుణాలను ప్రశంసించాడు. కర్ణ శకుని దుర్యోధన, దుశ్శాసనాదులు విదురుని చూపించి చివరకు ఆ మహా

తమ్మణ్ణి అంతం చెయ్యాలని ప్రయత్నాలు చేసారు. మాయా కల్పితమని భావించి సత్త్వగుణమూర్తి అయిన విదురుడు సింహద్వారంలోనే ధనుస్సును ఉంచేసి తీర్థయాత్రలకు వెళ్లిపోయాడు. అసంఖ్యాక పుణ్యక్షేత్రాలను సందర్శిస్తూ దేవతా విగ్రహాలను దర్శిస్తూ నదీనద సాగర నగర పర్వతాదులను సేవిస్తూ ఏకమాత్రుడుగా పరిభ్రమించసాగాడు. తనను ఎవ్వరూ గుర్తించ వీలులేని అవధూత వేషంలో పరిభ్రమిస్తూ పూర్ణ విరాగియై విశుద్ధాంత కరణుడై శరీర ధారణార్థం సాత్వికాహారాన్ని స్వీకరిస్తూ నియమ పరాయణుడైన దైవధ్యానం చేసుకుంటూన్నాడు. ఆ మహాత్ముడు ప్రభాసక్షేత్రం చేరే సమయానికే వాసుదేవుని సహకారంతో ధర్మరాజు కౌరవులను అంతం చేసి భూమండలానికి ఏకచ్ఛత్రాధిపతి అయ్యాడనీ. ఆ మారణహోమ కాండను గురించి ఆలకించి - విదురుడు దుఃఖ సంతప్త హృదయుడై - సరస్వతీ నదీతీరంచేరాడు.

ఆ పవిత్ర తీర్థంలో అగ్ని, అసిత, ఉశనత్రిత, మను. పృథు, వాయు, సుదాస, గో. గుహ, తీర్థాదులే కాక శ్రాద్ధ దేవ నామం కల ద్వాదశ తీర్థాలనూ సేవించాడు. సుర, భూసుర. ప్రతిష్ఠిత లయిన అసంఖ్యాక దేవతామూర్తులను తిలకించి చక్ర చిహ్నితాలైన గిరి శిఖరాలను దరిస్తూ వాసుదేవ భగవత్స్మరణతో క్రమంగా - సౌరాష్ట్ర, సౌవీర, మత్స్య, కురుజాంగల దేశాలు దర్శించి అల్పకాలంలోనే యమునా నదీ తీరం చేరి బృహస్పతి శిష్యుడు, భక్త శిఖామణీ అయిన ఉద్ధవుని తిలకించి పులకితదేహుడై గాఢాలింగనం చేసుకుని- ఉద్ధవా! శ్రీకృష్ణుడు కుశలమేనా? యాదవులంతా క్షేమమేనా?" అంటూ క్రమంగా అందరి యోగక్షేమాలూ అడుగుతూ ధర్మరాజు భీమార్జున, నకుల సహదేవ, ద్రౌపదీ సుభద్ర, కుంతీ ఆదిగా గలవారి యోగక్షేమాదులను కూడా ప్రశ్నిస్తూ జన్మ, కర్మ, రహితుడైన వాసుదేవుని పవిత్ర దివ్యగాథలను కూడ వినిపించుడని అర్థించాడు.

— 0.

స్కంధం-3 అధ్యాయం-2

## భగవల్లీలాభివర్ణనము.

శ్రీకృష్ణ స్మరణ మాత్రంచే ఉద్ధవునికి దేహం పులకించింది. కంఠం గద్గదమయింది. ఆనందాశ్రువులు కారణంగా అతని నోట మాటరాక ఆ దేవదేవుని మూర్తినే మనసా ధ్యానిస్తూ నోట మాట రాక రెండు ఘడియలు ఆ స్థితిలోనే ఉండి అనంతరం స్వస్థచిత్తుడై "విదురా! శ్రీకృష్ణరూప భాస్కరుడు అస్తమించడంలో మా గృహాలను అజగరం కబళించివేసింది. ఇక నీకు నేను చెప్పగల కుశల సమాచారాలు ఏమున్నాయి? మానవలోకమంతా దురదృష్టవంతమైనదై పోయింది. సాగరంలోని

మత్స్యాలు చంద్రుణ్ణి గ్రహించజాలనట్లు నిరంతరం వాసుదేవునితోనే ఉండే యాదవులు ఆతని దివ్య మంగళ స్వరూపాన్ని గుర్తించజాలక పూర్తిగా అభాగ్యులై పోయారు. అకారణ కలహానికి కాలు దువ్వి నాశనమై పోయారు. శిశుపాలాదులు వాసు దేవుణ్ణి ఎంతగా నిందించినా వారి వాక్యాల ద్వారా మహనీయుల ధీశక్తి మాత్రం భ్రమించ లేదు. ఇతఃపరం తపస్సుచేయని వారికి కూడ దర్శన మిచ్చి వారికి సంతృప్తి కలగకుండానే అంతర్ధానమై పోయాడు. నిజయోగ మాయా ప్రభావంచే శ్రీహరి త్రిజగన్మోహనుడై అవతరించి తనకే స్వ స్వరూపం ఆశ్చర్యాన్ని కలిగించేదిలా తాను ధరిం చిన ఆభరణాలు నిజదేహ కాంతిచే ప్రకాశించే రీతిగా అపూర్వ దివ్యమంగళ శ్రీవిగ్రహ రూపంలో నటించాడు. ధర్మజుడు చేసిన రాజసూయ యాగ సమయంలో - నయనాభిరాముడైన శ్రీకృష్ణుని సందర్శించి అక్కడున్న వారందరూ - ఈ శ్రీకృష్ణ విగ్రహ చిత్రీకరణలో బ్రహ్మదేవుని సామర్థ్యం సంపూర్ణంగా వ్యక్తమైన దనుకున్నారు. భగవంతుని హాస్యమయ విలోకన మాత్రంచే గోపభామల మనస్సూ, దృష్టీ ఆతని మీదనే సం లగ్నమయ్యేవి. తత్సమయంలో దేహ గేహాదు లను విస్మరించినారు చిత్ర ప్రతిమవలె నిలబడి పోయేవారు. చరాచర జగన్నాథుడూ, ప్రకృతికి అధిపతీ అయిన వాసుదేవుడు - భక్తజనులకు శాంత రూపంలోనూ, రాక్షసులకు ఘోరాకారం లోనూ, గోచరమవుతూంటే - విగ్రహానుగ్రహ రూపమైన ఆ లీలలు వారి హృదయాలను ద్రవింప జేసేవి. కాష్ఠంలో అగ్ని జన్మించేటట్లు పుట్టుకలేని వాడే అయినా బలరామసహితుడై వసుదేవునియింట జన్మించడం. సర్వులకూ అభయదానం చేసే వాతే అయినా కంసాదుల భీతితో వ్రజ భూమిలో వసిం చడం, అనంత పరాక్రమ సంపన్నుడై కూడ కాల యవనునికి భీతిచెందిన వానిలా మధురా పురాన్ని విడనాడి పోవడం - తలంచుకుంటూ ఉంటే నేను చిత్రిపత్రితమనై పోతూన్నాను. దేవకీ వసుదేవులను దర్శించి శ్రీ కృష్ణుడు సాష్టాంగ ప్రణామంచేసి "తల్లిదండ్రులారా! కంస భీతిచే మీ సేవ చేయలేక పోయినందుకు క్షమిం చండి! అన్న కృష్ణ వచనాలు జ్ఞాపకం వస్తే హృదయం వేదన పడుతూన్నది. భృకుటీ విలాస మాత్రంచే యావద్భూభారాన్నీ హరించ గల శ్రీకృష్ణ చరణ కమల ధ్యానం కలవాడెవడూ ఆ దేవదేవుని మరువలేడు. రాజసూయయాగ వేళలో కృష్ణ ద్వేషియై నిందించిన శిశుపాలునకు కూడ యోగి జన దుర్లభమైన గతి కలిగిన విషయం మీరెరిగినదే. ఘోర మహాభారత సంగ్రామంలో శ్రీ కృష్ణుని దర్శిస్తూ పార్థుని శరాగ్ని జ్వాలలకు ఆహుతి అయిపోయిన వీరులందరూ పరమపదాన్నే పొందారు. సర్వలోకాధిపతియైన శ్రీ కృష్ణ సమానుడు వేరొక డుండడు. మహేంద్రాది సుర శ్రేష్ఠులు కూడ నతమస్తకులై ఆ దివ్య పురుషునికి ప్రణ మిల్లుతూంటారు. వాసుదేవుడు అట్టి సర్వేశ్వరుడు.

సింహాసనాసీనుడై ఉగ్రసేన ప్రభువుఉన్ననాడు ఆయన సమక్షంలో ముకుళిత హస్తుడై నిలచి – ఆ బాలగోపాలుడు క్రీడావస్తువులను ఛిన్నాభిన్నం చేసినట్లు వారి నందరినీ అంతం చేసివేసాడు. కాళియ మర్దనం చేసి విషపూరిత జలాలను పాన యోగ్యంగా మార్చాడు. నందగోప కులంలో వర్ధిల్లిన ధనరాసులను సద్వినియోగం చేసే సత్సంకల్పంతో గోవర్ధన గిరికీ, గో సంతతికీ అర్చనలు జరిపించి గోయాగ రూపంగా సద్వ్యయం చేయించాడు. తద్ద్వారా తనకు అభిమాన భంగమైనదని మహేంద్రుడు క్రోధంతో రాళ్ళవాన కురిపించగా గోవర్ధనగిరిని ఛత్ర సమంగా ఎత్తి గో గోప సమూహాన్ని సంరక్షించాడు. శరత్పూర్ణిమ నాడు దివ్యమోహన మురళీనాదం చేసి గోప బాలికలను ఆకర్షించి రాసక్రీడలలో వారిని అనుగ్రహించాడు.

—0—

స్కంధ-3, అధ్యాయం-3

## భగవల్లీలాభివర్ణనము

మధురా నగరం చేరి కంసుని అంతంచేసి మాతా పితరులను బంధ విముక్తులను చేసి సాందీప మహర్షి దగ్గర వేద వేదాంగాలను గ్రహించాడు. లోకంలో ఆదర్శాన్ని స్థాపించే నిమిత్తం తాను జగద్గురువై కూడ గురుసేవ చేసి మృతుడైన సాందీప నందనుని యమసదనం నుండి తీసుకు వచ్చి సమర్పించాడు. రుక్మిణీ స్వయంవర వేళలో శిశుపాల జరాసంధాదులను ఓడించి రుక్మిణిని అనుగ్రహించి వివాహం చేసుకున్నాడు. సప్త వృషభ రాజాలను స్వయంవర సమయంలో మర్దించి నాగ్నజితిని పరిణయ మాడాడు. ఇంద్రియ లోలురైన సామాన్యులను వలె సత్యభామను సంతోషింప జెయ్యాలని అమరధామం నుండి దేవ పారిజాత వృక్షాన్ని తెచ్చియిచ్చాడు. క్రూరాసురుడైన నరకుణ్ణి అంతం చేసి అతని పుత్రుడైన భగదత్తునికి పట్టం కట్టి నరకాసుర బంధితులయిన పదహారువేల క్షత్రియ కన్యకా మణులనూ అనుగ్రహించి పరిణయమై యోగమాయా శక్తి ద్వారా అన్ని రూపాలనూ ధరించి వారందరినీ సంతోషపరచి విశేష సంఖ్యలో పుత్రులను కన్నాడు. దంత వక్త్ర, బల్వల, ముర, బాణాసుర, ద్వివిద శంబర, సాళ్వ, జరాసంధ, కాలయవనాదులలో కొందరినీ, స్వయంగాను, మరికొందరిని తీను, ప్రద్యుమ్నాదుల చేతనూ సంహరించి సంహారింప జేసాడు పాండవ పక్షం చేరి కౌరవ సేనలను అంతం చేసి భూభారం పూర్తిగా తొలగ లేదని యాదవుల బుద్ధులను భ్రమింపజేసి ముసలం కారణంగా మధుపాన మత్తులైన యాదవులను పరస్పర కలహం కారణంగా అంతంచేసే సంకల్పంతో పాండవాగ్రజుని రాజ సింహాసనాసీనుని చేసి కురు వంశానికి

ఉత్తరా గర్భస్థుడైన పరీక్షిత్తును సంరక్షించి ధర్మజునిచేత అశ్వమేధ యాగాలను మూడింటిని నిర్విఘ్నంగా చేయించారు. విశ్వాత్ముడైన ఆ శ్రీకృష్ణుడే ద్వారకానగరంలో ఉండి వేద ధర్మాన్ని స్థాపించి భక్తిని వర్ధిల జేసాడు. ఆ దేవదేవుని అవ్యాజానుగ్రహం వల్ల యాదవులందరూ విముక్తి పొందారు. యాదవ కులం నాశనం కావాలన్నది దైవ సంకల్పం. సత్య సంకల్పం కార్యరూపం దాల్చడానికి విప్రశాపం హేతువుగా ఓ ముసలం పుట్టింది. యదు వృష్ణి భోజకాంధక వంశీయులైన వీరులంతా ఓ నాడు ప్రభాస తీర్థం చేరి స్నాన సంధ్యా తర్పణాదులతో దేవ పితృ ఋషులను తృప్తి పరచి గోదాన, భూదాన, సువర్ణ, వస్త్రాదులను దానం చేసారు. సమారాధన కూడ పరిసమాప్తమైన తరువాత భూసురోత్తములకు సాష్టాంగ ప్రణామాలు చేసారు.

—0—

స్కంధం-3 అధ్యాయం-4

## విదుర మైత్రేయ సమాగమము

భూసుర శ్రేష్ఠుల ఆశీర్వాదాలూ, ఆదేశాలూ పొందిన మీదట యాదవులు కూడ విశేషంగా భుజించి, మధుపానం చేసి పరస్పర నిందలు చేసుకుంటూ సూర్యుడు అస్తమించే వేళకు చెలరేగిన కలహం దారుణ రణంగా మారగా పరస్పరం అంతం చేసుకున్నారు. శ్రీకృష్ణదేవుడు — నిజమాయనూ, దాని చిత్ర విచిత్ర గతులనూ తిలకిస్తూ సరస్వతీ స్రవంతిలో స్నానమాచరించి ఆచమనం చేసి అశ్వత్థ వృక్ష మూలంలో సుఖాసీనుడయ్యాడు. అంతకు ముందే అతడు యాదవ సంహార సమాచారాన్ని నాకు విశదీకరించినను బదరికా వనానికి వెళ్ళమన్నాడు. భగవదాదేశ ఆశయాలనుగ్రహించిన నేను దేవాధిదేవుని వియోగాన్ని సహించలేక ప్రభాస క్షేత్రం వరకూ వెన్నంటి నడిచాను. ఆ సరస్వతీ నదీ తటాన అశ్వత్థ తరు మూలంలో చతుర్భుజరూపుడే పీతవవస్త్ర ధారియై ఎడమ తొడపై కుడి కాలును పెట్టిన శ్రీహరిని దర్శించాను. అదే సమయంలో అక్కడకు వ్యాస మిత్రుడైన మైత్రేయ మహర్షి విజయం చేసాడు. కృష్ణ భక్తుడైన మైత్రేయుని సమక్షంలోనే శ్రీహరి నన్ను ఆనందింప జేస్తూ మందస్మితంతో "ఉద్ధవా! అంతరంగికమైన నీ అభిమతం నాకు తెలుసు. నీకు ఆ దివ్య సాధనోపదేశం చేస్తున్నాను.

ఈ సాధన సాధారణ జనులకు అసాధ్యమైనది. గతించిన జన్మలలో నువ్వు ప్రజాపతులు కొనసాగించిన యాగాలలో భాగస్వామివై నన్ను పొందాలని ఆరాధించావు. ఇదే నీ చివరి జన్మ. దివ్యమైన నా అనుగ్రహం నీకు లభించింది. ఈ

భూతలాన్ని విడనాడి నేను పరమధామం చేరే నిశ్చయంలో ఉన్నాను. పద్మకల్ప సమయంలో నా నాభీ పద్మ మందున్న చతుర్ముఖ బ్రహ్మకు ఉపదేశించిన భాగవత ధర్మాన్ని నీకు బోధిస్తున్నాను. సావధానుడవై ఆలకించు మనగా — నా హృదయం ఆనందంతో నిండిపోయింది. దేహం పులకాంకితమై ఆనందాశ్రువులు జల జల రాలుతూండగా గద్గద కంఠంతో అంజలి బద్ధుడనై — "శ్రీకృష్ణదేవా! నీ పాదార విందార్చనా తత్పరుడైన వానికి ధర్మార్థ కామమోక్షాలు లభిస్తాయనడంలో సందేహం ఎంత మాత్రం లేదు. వాటిపై నాకు ఎట్టి అభిలాషా లేదు. నిస్పృహుడవై కూడ నువ్వు కర్మలాచరించడమూ జన్మలేనివాడవై కూడ జన్మించిన వానివలె గోచరించడమూ స్వయంగా కాలుడవై ఉండి కూడ వైరి వీరులకు భీతి చెందిన వాని వలె ద్వారకా నగరంలో దాగొనడం ఆత్మా రాముడవై యుండి కూడ పదహారు వేల మంది క్షత్రియ కన్యలను పరిణయ మాడడం — వీటిని అన్నింటినీ తిలకించి మహా విద్వాంసులైన వారు కూడ భ్రాంతి చెందు తూంటే సామాన్యుల గతి ఏమిటి?

దేవాదిదేవా ! అఖండమై అబాధకమైన నీ స్వరూప జ్ఞానమేలేని నన్ను పిలచి నాతో సంప్రదిస్తూంటావు. మూఢులు ఇదంతా సామాన్య మానవ కృతంగా భావన చేస్తూంటారు.

అనాధనాధా! బ్రహ్మదేవునికి బోధించిన భాగవత ధర్మాన్ని నాకు బోధించు." అంటూ శిరసువంచి వినయంగా అర్థించాను. తత్సమయంలోనే పరమాత్మ నాకు ఆత్మజ్ఞాన సంభరితమైన భాగవత ధర్మాన్ని ఉపదేశించాడు. ఆ దేవదేవునికి వందనం చేసి - ఆ దివ్య జ్ఞానాన్ని పొంది నేనిలా వచ్చాను. శ్రీకృష్ణ సందర్శనంవల్ల మహానందం కలిగింది. కానీ యిప్పుడు ఆదేవదేవుని వియోగం వల్ల మహా దుఃఖాన్ని పొందుతూన్నాను. నరనారాయణ వాస స్థానమైన బదరి కాశ్రమానికి - శాంతికోసం - తపస్సు చేయాలని యిప్పుడు అక్కడకు వెళ్ళబోతున్నాను." అన్న ఉద్ధవ వచనాల ద్వారా బంధు నాశన సమాచాన్ని ఆలకించి విదురుడు తీవ్రంగా దుఃఖిస్తూంటే ఉద్ధవుడు అతనికి ఆత్మ జ్ఞానాన్ని బోధించి శాంతిని ప్రసాదించాడు. ఆపై బదరి కాశ్రమానికి పురోగమించనున్న ఉద్ధవుని చూస్తూ విదురుడు అడిగాడు. "ఉద్ధవా ! యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు నీకు బోధించిన ఆత్మజ్ఞానాన్ని నాకు ప్రబోధించు" అని అర్థించాడు.

అంత ఉద్ధవు డందుకుని "విదురా ! భగవానుడు తన అవతార పరిసమాప్తి వేళలో మైత్రేయునితో విదురునకు నువ్వు జ్ఞానోపదేశం చెయ్యి ! అని ఆదేశించి ఉన్నాడు. కనుక నువ్వు మైత్రేయుని సేవించి జ్ఞానం పొందు' - అని చెప్పి ఉద్ధవుడు ఆ రాత్రి విదురునితో కలసి శ్రీకృష్ణ లీలా ప్రసంగంచేసి ప్రభాత సమయంలో లేచివెళ్ళి పోయాడు" అన్న శ్రీ శుకమహర్షి పలుకు లాలకించిన పరీక్షిత్తు మహాత్మా ! వీర యాదవులంతా ఒక్కుమ్మడిగా మరణించినా శ్రీకృష్ణ నిర్యాణం జరిగిన

ఉద్ధవు డొక్కడూ ఎలా సజీవంగా ఉండగలిగాడు?" అని ప్రశ్నించాడు.

"రాజా! సత్య సంకల్పుడైన వాసుదేవ భగవానుడు సంకల్ప మాత్రంచే యదుకులాన్ని అంతరింప జేసి తాను కూడ అవతార పరిసమాప్తి చేయడానికి ముందుగా తనతో సమానుడైన ఉద్ధవుని ద్వారా భాగవత ధర్మం విశ్వంలో వ్యాప్తి చెందాలనే సంకల్పంతో ఉద్ధవునికి నిజస్వరూప జ్ఞానం కలగజేసి భూమండలంలో ఉంటూ భాగవత జ్ఞాన బోధ చేయుమని ఆదేశించాడు. దాన్ని అనుసరించి ఉద్ధవుడు భగవదాజ్ఞానుసారం ఈ లోకంలో ఉంటూ విదురునికి కౌరవ, యాదవ, పాండవ నాశనాన్ని, కృష్ణాదేశాన్నీ విశదీకరించి పవిత్ర బదరికాశ్రమం చేశాడు.

అంత హాత్ముడైన విదురుడు ప్రేమ విహ్వలుడై విచారించి యమునా తీరం గుండా పయనించి గంగానదీ తీరాన గల మైత్రేయ మహర్షి సన్నిధికి వెళ్ళాడు.

—0—

స్కంధ-3, అధ్యాయం-5

## సృష్టి క్రమవర్ణన

విశుద్ధాంతరంగుడైన విదురుడు మైత్రేయుని చేరి ప్రణమిల్లి - ఆ మహర్షి అనుమతించగా ఆసీనుడై - మైత్రేయ ముని శ్రేష్ఠా! ప్రపంచంలో ప్రతి వ్యక్తీ సుఖాన్ని కోరియే కర్మ లాచరిస్తూ ఉంటాడు. కానీ అతడు కేవలం సుఖాన్నే పొందడం లేదు. దుఃఖ నాశనం కావడమూ లేదు. దుఃఖమే వర్ధిల్లుతూన్నది. దీనికి పరిష్కారమార్గం ఏమిటి? దౌర్భాగ్యంవల్ల హరిభక్తి విముఖులై ఉంటే - మీవంటి మహాత్ములు అజ్ఞానులను తరింప జేయడానికి లోకంలో ప్రాదుర్భవిస్తూంటారు. ఆ హరిని ఎలా ఆరాధిస్తే శాంతి లభించి భగవత్సాక్షాత్కారం కలుగుతుంది? అట్టి జ్ఞానోపదేశం చెయ్యండి. జగత్రయ నాధుడైన శ్రీహరి అవతార మెత్తి నటిస్తున్నాడు. అకర్తయై కూడ - కల్పాంతంలో పునః సృష్టిస్థితి సంహారాలు కొనసాగించి అయాంతంలో ఎలా యోగ నిద్రా పరవశు డవుతూన్నాడు? ఏకమాత్రుడైన తానే నిఖిల బ్రహ్మాండంలో అనేక రూపాలలో ఎలా గోచర మవుతూన్నాడు? గో బ్రాహ్మణ దేవతార్థియై అనేకమైన అవతారాలెత్తి అప్రాకృత కర్మలు ఎలా ఆచరిస్తూ ఉంటాడు? నాకు బోధపడేటట్లు ఆయా విషయాలను విస్తరంగా వివరించి ఆనందాన్ని ప్రసాదించండి. మహాత్మా! సర్వలోక మహేశ్వరుడైన శ్రీహరి లోకపాల సమేతంగా లోకాలనూ, లోకాలోక పర్వ

తానికి బాహ్యాభ్యంతరాలలో ఉండే భాగాదులనూ, నానా రూపాలతో అలరారే అధికార జీవులనూ, ఏయే తత్త్వాల ద్వారా సృజించాడు? ప్రజా సమూహం యొక్క కర్మ, స్వభావ, స్వరూప నామాలతో ఉండే భేదాన్ని ఆ శ్రీహరి ఎలా చేసాడు? వ్యాసర్షి ద్వారా వర్ణాశ్రమ ధర్మాలు అనేక పర్యాయాలు ఆలకించాను కానీ ఎన్ని పర్యాయాలు విన్నా సంతృప్తి కలగ జేయనిది భగవద్గుణాను కీర్తనమే. మీ వంటి సంత మహాత్ముల సమాజంలో నారదాదులు ఎన్నో పర్యాయాలు హరికథా గానం చేస్తూంటారు? శ్రవణ మాత్రంచే బంధ విముక్తుని చేయగలిగినదే హరికథ. మునీంద్రా! మీ హితుడైన వ్యాసర్షి హరిగుణగానార్థమే మహా భారత రచన చేసాడు. అందులో అనేక స్థానాలలో విషయ సుఖవర్ణన చేస్తూ మానవుల చిత్తవృత్తులు భగవదాయత్తం కావాలని కూడ ప్రయత్నించాడు. భగవత్కథాభిరుచి కలవానికి అన్య విషయాలు రుచించవు. భగద్విముఖులై క్లేశాల పాలయ్యే మనుష్యులను గురించి నాకు బాధ కలుగుతూంటుంది. అట్టి వారి జీవితం వృధా వ్యయమై పోతూన్నది. మీరు దీన మానవాళిపై దయదలచి పూవులనుండి తుమ్మెదల మధుర రసాన్ని గ్రహించినట్లు — సర్వ విద్యా సార భూతమైన హరికథామృతాన్ని ప్రసాదించెదరు గాక! సృష్టి స్థితి సంహారార్థం — సర్వేశ్వరుడు మాయాశ్రయంతో శ్రీరామ శ్రీ కృష్ణాది అవతారాలెత్తి ప్రదర్శించిన దివ్యలీలా రహస్యాన్ని వివరించండి" అని వినయంగా అర్థించిన విదురునిపై కరుణించి మైత్రేయమహర్షి అతడు వేసిన ప్రశ్నలకు సమాధానం చెప్పాడు.

"విదురా! సర్వులయందూ గల విశేష కరుణచే నువ్వు వేసిన ప్రశ్నలు జగత్కళ్యాణదాయకాలు. సదా శ్రీహరి యందే సంలగ్నమైన చిత్తం కల నీ కీర్తి విశ్వ వ్యాప్తమయింది. వేద వ్యాసమహర్షికి నువ్వు ఔరస పుత్రుడవు. జీవకోటిని శిక్షించగల యమధర్మరాజువు. మాండవ్య మహర్షి శాపం కారణంగా, దాసస్త్రీ యందు శ్రీ కృష్ణ ద్వైపాయనునకు జన్మించిన నువ్వు శ్రీహరికి మహాభక్తుడవు. అందులకే వాసుదేవుడుకి తన నిర్యాణ కాలాన్ని ముందు నన్ను పిలచి నీకు జ్ఞానోపదేశం చేయుమని నాకు ఆదేశించాడు. యోగమాయ ద్వారా సృష్టి స్థితి సంహారార్థం విస్తృతం చేయబడిన భగవల్లీలలను క్రమంగా చెబుతాను. సృష్టికి పూర్వం అద్వితీయుడైన పరమాత్మ మాత్రమే ఉన్నాడు. ద్రష్ట, దృశ్యం – అన్న బేధం లేకుండ అసంఖ్యాక వృత్తులతో కూడిన అనేకత్వం కలవాడు కూడ అతడే. స్వేచ్ఛానుసారం అతడు సర్వాత్మనా ఏకమాత్రుడుగా ఉన్నాడు. ద్రష్టయై అతడు దర్శించడం ఆరంభించగా చూసే దేమీ లేకపోయింది. తత్సమయంలో అద్వితీయ పరమాత్మ మాత్రమే భాసిల్లుతూన్నాడు. తనను ఆ సమయంలో అతడు అసత్తుగా సంభావించసాగాడు. తత్త్వ దృష్ట్యా కించ తానెన్నడూ అసత్పదార్థం కాదు కదా? భగవచ్ఛక్తులన్నీ నిద్రిస్తున్నాయి. కానీ అతడు మాత్రం నిద్రించడం లేదు. ఎన్నడూ అతని యందు జ్ఞానం

లోపించలేదు. ద్రష్ట, దృశ్యం - ఈ రెండింటికీ అనుసంధానం కలగజేసేది కార్య కారణరూపమైన మాయతోనే ఈ జగన్నిర్మాణం చేస్తూంటాడు. కాలశక్తి ద్వారా త్రిగుణాత్మకమైన మాయ సంక్షోభింపబడిననాడు ఇంద్రియాతీతుడైన పరమాత్మ నిజాంశ యగు పురుష స్వరూపంతో దానియందు చిదాభాస బీజాన్ని స్థాపించాడు. అప్పుడే కాల ప్రేరితమైన అవ్యక్తం నుండి జనింంచిన మహత్తత్వం అజ్ఞానహేతువయింది. అందులకే అది విజ్ఞానరూపమైన స్వాత్మయందే ఈ విశ్వాన్ని వ్యక్తం చేసింది. తరువాత చిదాభాస కాలాధీనమైన మహత్తత్వంపై భగవద్దృష్టి ప్రసరించడంతో మహత్తత్వ వికృతావస్థయైన అహంకారం ద్వారా ఆవిర్భవించింది. అహంకారం - కార్య కారణ కర్తృత్వరూపమైనది కావడంవల్ల భూతేంద్రియ మన సాదులకు హేతువయింది. అహంకారం-సాత్త్విక, రాజస, తామస నామాలతో త్రివిధాలుగా ఉంటుంది. అహం తత్త్వంలో వికారం కలియగానే వైకారికాహంకారం నుండి - విషయజ్ఞాన సాధకమైన మనస్సూ, ఇంద్రియాధిష్ఠాన దేవతలూ ప్రభవించారు తైజసాహంకారం ద్వారా దశేంద్రియాలూ పుట్టాయి. తామసాహంకారం ద్వారా శబ్ద తన్మాత్ర. తద్ద్వారా దృష్టాంతంగా ఆత్మ బోధార్థమూ ఆకాశమూ ఏర్పడ్డాయి. దైవదృష్టి ఆకాశంమీద నిలబడడంతో కాల, మాయ, చిదాభాసల సంయోగం వల్ల స్పర్శ తన్మాత్ర, తద్ద్వారా వాయువూ జనించాయి. మహత్తర శక్తి సంపన్నమైన వాయువు ఆకాశంతో కలసి రూపతన్మాత్రను సృష్టించింది. తద్ద్వారా సమస్త జగత్తులనూ ప్రకాశింప జేయునట్టి తేజస్సు పుట్టింది. పరమాత్మ దృష్టి పడడంతో తేజస్సు వాయుసంయుతమై కాల, మాయ, చిదంశల సంపర్కం ద్వారా రసతన్మాత్రనూ, తద్ద్వారా కార్యరూప జలాలను ప్రభవింపజేసింది. అనంతరం తేజోయుతమైన జలం భగవద్దృష్టి ప్రసార మాత్రంచే కాల, మాయ, చిదంశలతో కలసి పృథ్విని ప్రభవింపజేసింది. అలా ఏర్పడిన భూతాలలో తమకు ముందున్న భూతగుణాలన్నీ వాటికి కూడ ఉన్నట్లు గ్రహించాలి. అంటే ఆకాశమందు శబ్ద స్పర్శ గుణాలున్నాయి. తేజస్సులో శబ్ద స్పర్శ రూపాలూ జలాల్లో శబ్ద స్పర్శ, రూప, రసాలూ, పృథ్విలో శబ్ద స్పర్శరూప రస గంధాలూ ఉన్నాయని గ్రహించాలి. ఈ మహత్తత్వాభిమాన దేవతలందరూ పరమాత్మయొక్క అంశలే. అయినా వేరు వేరుగా ఉండడం వల్ల విశ్వసృష్టి సామర్థ్యం లేక అంజలి బద్ధులై పరమాత్మతో ఇలా అంటున్నారు.

'దేవాధి దేవా? పరంధామా? నీచరణ కమలాలకు మా వందనాలు. నిన్ను శరణువేడిన జీవుల తాపాదులను దూరం చేయడంలో నువ్వు ఛత్ర సముడవు. నిన్నాశ్రయించిన యతుల దుఃఖాలను దూరం చేస్తావు. లోకనాథా! సంసారంలో తాపత్రయ పడే వారికి ఏ నాటికీ సుఖశాంతులుండవు. అందులకే నీ చరణాలను శరణు వేడుతున్నాము. ఏకాంత స్థానంలో ఉంటూ మహర్షి బృందం— వేద

మంత్ర రూప విహంగాల ద్వారా వేటిని అనుసంధానం చేస్తుంటారో? పాపాల రూపు మాపునట్టి గంగకు జన్మస్థానమైనది ఏదియో? అట్టి నీ చరణ కమలాలను ఆశ్రయిస్తున్నాము. విశుద్ధాంతరంగులై శ్రవణ, మనన కీర్తనాదుల ద్వారా నన్ను ధ్యావించునట్టి వీతరాగులే ధీరులవుతున్నారు. పరమాత్మా! సృష్టిస్థితి సంహారార్థం నువ్వు వివిధ రూపాలలో అవతరిస్తూ ఉంటావు. కనుకనే భవదీయ పాదారవిందాలను ఆశ్రయిస్తున్నాము. దేహ గేహాదులయందు అహంకార, మమకారాలు కల వారికి నువ్వు బహుదూర మవుతావు. విషయాసక్త చిత్తులైన మూఢుల మనస్సులు బాహ్యంలోనే సంచరించడం వల్ల విలాసయుతమైన భవదీయ పాద విన్యాస రహస్యజ్ఞులైన భక్తులను దర్శించ జాలరు. అట్టివారు కూడ నీ చరణ కమల సేవా దూరులై ఉంటారు. నీ కథామృత పాన ప్రమత్తులయినవారు భక్తివల్ల విశుద్ధాంతరంగులై వైరాగ్య సారమైన తత్త్వ జ్ఞానాన్ని పొంది వైకుంఠాన్ని చేర గలుగుతారు. సమాధి బలం ద్వారా ధీరులు నీ మాయను జయించి నీలోనే లీనమవుతారు. అట్టి వారు మాత్రం ఈ సాధనలో విశేష శ్రమను పొందుతారు. భక్తి రూపమైన భవదీయ సేవలో ఎట్టి శ్రమా ఉండదు. సృజనేచ్ఛతో మమ్మల్ని త్రిగుణమయులనుగా సృజించినావు. మేము విభిన్న స్వభావాలతో ఉండడంచేత మేము పరస్పరం కలియ లేక పోతున్నాము. తత్కారణంగానే మీ క్రీడారంగమైన బ్రహ్మాండ సృష్టిచేసి మీకు అర్పించజాలకున్నాము. మేము దేని ద్వారా బ్రహ్మాండ సృష్టిచేసి నీకు సమర్పించ గలమో? ఎక్కడ ఉండి మాయా శక్త్యానుసారం అన్నాదులను స్వీకరించ గలుగుతున్నామో? ఎట్టి విఘ్న బాధలూ లేకుండా జీవులన్నీ నీకూ, మాకూ, భోగాలర్పిస్తూ వారి వారి ఆహారాదులను స్వీకరించ గలరో? అట్టి మహత్తరోపాయాన్ని చెప్పు దేవా? అన్య కార్య వర్గంతో కలిసి వికార శూన్యుడవైన నువ్వే సర్వాధికారణుడ వయ్యావు-జనన శూన్యుడవైన నువ్వే సత్త్వ గుణాదుల కర్మ జన్మాదుల కారణభూతమైన మాయా శక్తిలో చిదా భాసా రూప వీర్యాన్ని సంస్థాపించావు. పరమాత్మా! ఎందులకు మహత్తత్త్వాది రూపులమైన అమర గణాన్ని సృజించినావు? మేము చేయవలసినదేమి? మాయందు కరుణించి బ్రహ్మాండ రచనా రూపమైన క్రియాశక్తి సమేతంగా జ్ఞాపకశక్తిని కూడ మాకు ప్రసాదించు" అని ప్రార్థించారు.

# విరాట్ శరీరోత్పత్తి.

పరమాత్మ సర్వశక్తి సంపన్నుడు. అతడు మహ తత్త్వాదులు సృజన శక్తిలో సామర్ధ్యంలేని వైనా యని గ్రహించి తక్షణం కాల శక్తిని గ్రహించి మహదహంకార, పంచతన్మాత్ర, పంచ మహా భూత, మనస్సు, సర్వేంద్రియ - వీటన్నిటియందు తాను ప్రవేశించి నిద్రాణమై ఉన్న జీవుల అదృష్టాన్ని మేలుకొలిపి భిన్నంగా ఉన్న తత్త్వ సమూహాన్ని క్రియా శక్తితో కలిపాడు. అలా పరమాత్మ అదృష్టాన్ని కార్య రూపంలో పరిణ మింపజేసిన క్షణంలో 23 తత్వాలతో కూడిన సమూహం భగవత్ప్రేరణంతో అంశల ద్వారా విరాట్పురుషుని సృజించింది. భగవంతుడు నిజాంశతో తన శరీరంలో - ప్రవేశించగానే - సృష్టికి కారణ భూతాలైన మహత్తత్త్వాదులు పరస్పరం కలిసి పరిణామం పొందాయి. ఈ తత్త్వ పరిణామం గానే విరాట్పురుష దవతరించాడు. చరాచర జగత్తు అంతా ఈతనియందే ఉంది. సర్వ జీవా శ్రయ రూపమైన అండం జలాంతర్భాగంలో ఉంది. దానియందే విరాట్పురుషుడు సర్వజీవ సమేతంగా సహస్ర దివ్య వత్సరాలు ఉండిపోయాడు. విశ్వ సృష్టి హేతు భూతాలైన తత్త్వాలకు అతడు గర్భ రూపమైనవాడు, తత్త్వాలు కారణాలు కాగా విరాట్పురుషుడు కార్యరూపుడన్నమాట. జ్ఞాన క్రియా శక్తులే కాక ఆత్మశక్తి కూడ అతనియందే ఉంది. వీటితో యితడు ఏక, దశ, త్రిభాగాలుగా చేసాడు. హృదయ రూప విభాగమే ఒకటి - ప్రాణాపాన, వ్యానోదాన సమానాలూ, దేవదత్త, నాగ, కూర్మ, కృకల, ధనంజయాలూ - ఈ వాయు విభాగమే దశ అయింది. ఆధ్యాత్మిక, అధిదైవిక, అదిభౌతిక, విభామే - మూడయింది. ఇలా విభజించి సృష్ట్యాది ప్రాణిగా పరిణమిల్లినవాడే - విరాట్పురుషుడు. సర్వ జీవాత్మ స్వరూపు డీతడే - జీవరూపుడు పరమాత్మ.

ఈ దివ్య పురుషునియందే భూత సముదాయ మంతా ప్రకాశిస్తూ ఉంటుంది. సృష్టి కారణాధి నాథుడైన పరమాత్మ మహత్తత్త్వాదుల ప్రార్థనాను సారం వీటి వృత్తులను జాగృత పరచే నిమిత్తం తన చైతన్య తేజస్సుతో విరాట్పుషుని ప్రకాశింప చేసాడు. తత్ప్రకాశం ద్వారా విరాట్పురుషుడు జాగ్రత్ స్థితిని పొందగలిగాడు. ప్రథమంలో విరాటుని నుండి ముఖమూ దాని ద్వారా లోకపాలురూ, అగ్ని, వాగింద్రియమూ, జన్మించాయి. మానవులు వాగింద్రియం ద్వారానే భాషిస్తూంటారు. ఆ తరువాత అతనికి తాలు భాగం ఏర్పడగా - దానియందు వరుణ, తదంశమైన రసనేంద్రియమూ ఏర్పడ్డాయి. తరువాత దీని ద్వారానే నాసిక, అశ్వనీ దేవతలూ, ఘ్రాణేంద్రియమూ పుట్టాయి. గంధ గ్రహణ

సామర్థ్యం ప్రాణికోటికి నాసిక ద్వారానే ఏర్పడింది. క్రమంగా నేత్రాలూ, సూర్యుడూ, నేత్రేంద్రియమూ తద్వారా రూపగ్రహణ సామర్ధ్యమూ. త్వగింద్రియమూ, వాయువూ జన్మించడం ద్వారా స్పర్శ జ్ఞానం కలిగింది. శ్రవణ రంధ్రాలూ, శ్రవణేంద్రియమూ, దిశలూ ప్రవేశించడం ద్వారా శబ్ద జ్ఞానం కలిగింది. చర్మ, రోమ, ఓషధులూ జన్మించాయి. ప్రాణులు దీనిద్వారా కండూతిని గ్రహించ గలుగుతాయి. ఆ తరువాత లింగమూ, తదధిష్ఠానదేవత ప్రజాపతీ అతని అంశరూపమైన వీర్యమూ పుట్టాయి. దీనిద్వారా ప్రాణులు ఆనందానుభూతి పొందుతాయి. గుదము, మిత్రుడు, పాయ్వింద్రియమూ ఏర్పడడంతో మలవిసర్జన కార్యం జరుగుతూ ఉంటుంది. అనంతరం హస్తాలూ గ్రహణ త్యాగరూపమైన శక్తితో ఇంద్రుడూ అధిష్ఠానంగా ప్రవేశించడంతో జీవుడు జీవయాత్రను కొనసాగించ గలుగుతున్నాడు. తరువాత చరణాలూ, వాటి అధిష్ఠాన దైవంగా విష్ణువు గతి శక్తితో ప్రవేశించడంతో గమనశక్తీ ఏర్పడ్డాయి. ఆ తరువాత బుద్ధీ, బుద్ధి శక్తితో కూడ వాక్పతి అయిన బ్రహ్మదేవుడూ ప్రవేశించడంతో ధీశక్తి ద్వారా జీవులు జ్ఞాత విషయాలను గ్రహిస్తున్నారు. తరువాత హృదయమూ, మనశ్శక్తితో కూడిన చంద్రుడూ జన్మించగా - ఆ మనస్సునందు సంకల్ప వికల్ప రూపమైన వికారాలు ఏర్పడ్డాయి. ఆ మీదటనే విరాట్పుషునితో అహంకారమూ, తదభిమాన దేవతయైన రుద్రుడూ, క్రియాశక్తీ ఏర్పడి - కర్తవ్య నిర్దేశం చేసాయి. చిత్తత్త్వ సహితమైన బ్రహ్మ జీవికి చైతన్యాన్ని ప్రసాదించారు.

విరాట్పురుషుని మస్తకం నుండి స్వర్గమూ, నాభి నుండి అంతరిక్షమూ, పాదాలనుండి భూతలమూ, ప్రాదుర్భవించాయి. సత్త్వ రజస్తమోగుణ పరిణామ రూపులైన సురలూ, నరాదులూ ప్రభవించారు. సత్వగుణ ప్రధానులయిన అమరులు స్వర్గలోకాన్ని ఆక్రమించారు రజోగుణ ప్రధానులయిన నరులు భూతలాన్ని ఆశ్రయించారు. తమోగుణ ప్రధానములయిన భూత ప్రేతాదులు రుద్రపార్షదులై, భూ స్వర్గలోకాలమధ్య అంతరిక్షంలో నివశిస్తున్నారు. పరమాత్మ వదనం నుండి బ్రాహ్మణులు ప్రభవించడం వల్ల వారు శ్రేష్ఠులయ్యారు, గురు స్థానీయులయ్యారు. బాహువులనుండి క్షత్రియులు ప్రభవించడం వల్ల - చోర, దురాత్ముల నుండి ఎవరికీ క్లేశాలు కలుగకుండ సంరక్షిస్తూంటారు. ఆ దివ్య పురుషుని ఊరు భాగం నుండి జన్మించిన వైశ్యులు సర్వ జీవ పోషకులై ఉంటారు. పరమేశ్వరుని చరణారవిందాల నుండి ప్రభవించిన శూద్రులు జన్మించి - సర్వ ధర్మాలూ సిద్ధించడానికి మూలమైన సేవా ధర్మాన్ని అనుష్ఠిస్తూంటారు. భగవంతుడు ప్రసన్నుడయ్యేది కూడ సేవా ధర్మం ద్వారానే ఈ చతుర్వర్ణాల జనులూ తమ తమ వృత్తులనూ, ధర్మాదులనూ పాటిస్తూ చిత్తశుద్ధితో భగవంతుణ్ణి సేవిస్తూంటారు. విరాటుని కాలకర్మ స్వభావ యుక్తమైన ఈ సర్వస్వం భగవంతుని యోగమాయా ప్రభావం

వల్లనే ఏర్పడుతూంటాయి. సంపూర్ణంగా దీనిని వర్ణించడానికి ఎవరూ సాహసించరు.

వాక్కును పవిత్రం చేసుకునే నిమిత్తం గురు ముఖతః విన్నదానిలో తెలుసుకున్నంతవరకూ హరి గుణాను కీర్తనం చేసాను. మానవ మాత్రుని వాక్కుకు ఫలం భగవద్గుణాను కీర్తనమే. హరికథ లను ఆలకించడమే శ్రవణేంద్రియాలున్నందుకు ఫలం. భగవన్మహిమను తెలిసికోవాలని చతుర్ముఖ బ్రహ్మ సహస్ర వర్షాలు యోచించి కూడ విఫలు డయ్యాడు. భగవంతుని మాయ — మహా మాయా ఫలం సహితం మోహసాగరంలో ముంచి వేస్తుంది. మాయా శక్తి — భగవంతుని సయితం మోహితుని చేసివేస్తూండగా సామాన్యుల విషయం వేరే వర్ణించాలా? భగవంతుని గ్రహించలేక, మనస్స మేతమైన వాక్కు ఏపరమాత్మను గ్రహించ లేక వెనుకంజ వేసిందో? రుద్ర, ఇంద్రాది దేవతా ప్రముఖులు కూడ మాయను అధిగమించి, భగవన్మహిమను గుర్తించలేక పోయారో? అట్టి శ్రీహరి దేవుని చరణారవిందాలకు వందనాలు.

—0—

స్కంధ-3, అధ్యాయం-7

## విదురుని ప్రశ్న:

విదురుడు మైత్రేయ మహర్షి దివ్యవాణిని ఆలకించి, ప్రణమిల్లి ప్రశ్నిస్తున్నాడు. "మునీంద్రా! నిర్గుణుడు, శుద్ధ బోధ స్వరూపుడూ అయిన భగవంతునితో లీలామాత్రంగానైనా గుణ క్రియాదుల తోటి సంబంధం ఎలా కలుగుతుంది? తోటి వారితో ఆడాలనే వాంఛతో బాలుడు ఆడుతూంటాడు. శ్రీహరి నిత్య తృప్తుడే. అయినా క్రీడార్థం ఈ సంకల్పం ఎందుకు చేసాడు? నిజ మాయా శక్తితోనే పరమాత్మ, సృష్టి స్థితి సంహారాలు చేస్తూంటాడు. దేశ కాలావస్థలచే తనంత తానై అన్య నిమిత్త కారణాలచే కూడ లోపరహిత పరిపూర్ణుడు. మాయతో కలిసాడు. ఏక మాత్రుడైన పరమేశ్వరుడే క్షేత్రా లన్నింటిలోనూ సాక్షీ మాత్రుడై ఉండగా, ఈ జీవులకు దౌర్భాగ్య, క్లేశాదులు ఎలా కలుగుతాయి? ఈ నా సంశయాన్ని దూరం చెయ్యి."

మైత్రేయ మహర్షి బదులు పలుకుతూ చిరు నవ్వుతో అన్నాడు. "సర్వ జీవులకూ ఆత్మ స్వా ముక్త రూపమై ఉంది. అట్టి దశలో బంధన దీన త్వాన్ను దానియందారోపించడం అజ్ఞాన లక్షణం కాక మరేమిటి? ముక్తికి విరుద్ధం కాని ఇదియే దైవ మాయ. కలలో కలగన్న వానికి తన శిరస్సు ఖండించినట్లు, అది అసత్యమే అయినా ఆ స్థితిలో వానికి అది సత్యంగానే గోచరమవుతున్నట్లు బంధన రహితుడే అయినా అజ్ఞానం వశం చేత

జీవుడు బద్ధుడై యున్నట్లు భావిస్తాడు. నీటి కదలిక వల్ల - చంద్రుడు కదలిక కానివాడే అయినా - కదులుతూన్నట్లు కనబడినట్లే శరీరాభిమాని అయిన జీవునియందుమిధ్యారధర్మ ప్రతీతి కలుగుతూంటుంది. ఆకాశంలో ఉన్న చంద్రునిలో చలనరూపమైన ఆభాస సయితం లేనట్లే - భగవంతునియందు మిధ్యా ప్రతీతి కలుగదు. కామనా రహితంగా ధర్మాచరణ చేయునట్టి వారికి మెల్ల మెల్లగా భగవదనుగ్రహం ప్రాప్తించి తద్ద్వారా ప్రాప్తమైన భక్తి యోగం ద్వారా అజ్ఞాన రూపమయిన ఈ ప్రతీతి నివృత్త మవుతుంది. విషయ విముక్తులయిన మానవుని ఇంద్రియాలు మనస్సమేతంగా నిశ్చలంగా సర్వేశ్వరునియందు సంలగ్న మవుతాయి. తత్సమయంలో జీవుడు గాఢ నిద్రావస్థలో ఉన్నట్లు రాగద్వేష విముక్తుడై ఆనందం పొందగలడు. శ్రీకృష్ణ భగవద్గుణాను కీర్తనం సమస్త దుఃఖాలనూ నాశనం చేస్తున్నదంటే మన మనస్సులలో శ్రీకృష్ణ పాదరజాన్ని సేవించాలనే భక్తి రూపమైన ప్రేమ ప్రాదుర్భవిస్తే వర్ణించేదేమున్నది ?

అంత విదురుడానందించి "మహాత్మా ! యుక్తియుక్తమైన భవదీయ వచనరూప కరవాలంచే నా సంశయం విచ్ఛిన్నమయింది. కానీ జీవునియందుండునట్టి స్వాతంత్ర్య పారతంత్ర్యాలను గురించి తెలుసుకోవాలని ఉంది. జీవునియందు క్లేశాదులు ప్రతీతమవుతాయనీ, దానికి ఆలంబనం భగవన్మాయయే - అని అంతకన్న భిన్నమైన కారణ మేదీ లేదనీ మీరు చెప్పారు కదా ! ఈ క్లేశం కూడ మూల రహితమైనదనీ, మిథ్యయనీ వ్యక్తం చేసారు. ఇదీ సమంజసంగానే ఉంది. ఈ లోకంలో రెండు తరగతులకు చెందినవారు మాత్రమే సుఖంగా ఉన్నారు. అందులో జ్ఞాన దృష్ట్యా పరమాత్మను పొందినవారు ప్రథమ శ్రేణికి చెందగా - రెండవ వారు మూర్ఖులయ్యారు. ఆ రెండవ స్థలకూ చెందనివారు సందేహాలతో దుఃఖిస్తూ ఉంటారు. భవదీయానుగ్రహం వల్ల నేనీ నిశ్చయానికి వచ్చాను. అనాత్మ వస్తువన్నది అసలు లేనే లేదనీ కేవలం ప్రతీతి మాత్రమే కలుగుతూన్నదనీ గ్రహించ గలుగుతూన్నాను. భవచ్చరణ సేవా ప్రభావం కారణంగా తత్ ప్రీతిని కూడ త్రోసివేయ గలుగుతాను. పరమాత్మయందు తీవ్రమైన ప్రేమ - ఆనందాన్ని వర్ధింజేసి సంసార రూపక్లేశాన్ని దూరం చేస్తుంది. దైవప్రాప్తికి తమవంటి మహాత్ములు మాత్రమే మార్గదర్శకులు కాగలుగుతూన్నారు. మహనీయుల సన్నిధానంలో భగవద్గుణాను కీర్తనమే కొనసాగుతూ ఉంటుంది అల్ప పుణ్యులకు మహాత్ముల సేవాభాగ్యం దుర్లభమే. అంతేకాదు. వారి దర్శనం కూడ కష్టమే అవుతుంది. మహర్షి శ్రేష్ఠా ! సృష్ట్యాదిలో మహత్తత్వాదులనూ వాటికి సంబంధించిన వికారాదులనూ సృష్టించి తదంశల ద్వారా విరాట్పురుష సృష్టిచేసి భగవానుడు స్వయంగా ఆ విరాటునిలో ప్రవేశించి సహస్ర సంఖ్యలో శిరోపాద హస్త నేత్ర నాసికాదులతో ఉన్నాడనీ, అతడే

ఆద్యుడనీ వేదం వర్ణిస్తూ ఉన్నది. అతని యందే లోక సర్వస్వమూ, ఇంద్రియ, విషయ, ఇంద్రియాభిమాన దేవతాదులూ, దశ ప్రాణాలూ, మనస్సేంద్రియ బలాలూ శారీరిక శక్త్యాదులూ సమస్త విషయాదులూ ఉన్నాయని చెప్పారు. ఇప్పుడు అయ్యాది విరాట్పురుషునియొక్కయు, తద్విభూతి స్వరూపులయిన బ్రహ్మాదుల. వారి వారి పుత్ర. పౌత్ర. సంతతుల ఉత్పత్తినీ విశదీకరించండి. బ్రహ్మాదులకు సైతం ప్రభువైన విరాట్పురుషుడు, ఏ యే ప్రజా పతులను సృజించాడు ? సర్గానుసర్గ మన్వంతరాధిపతులైన మనువులను ఏ క్రమంలో సృజించాడు. మనువుల, తద్వంశ ధరులైన చక్రవర్తుల, పృథ్వికి ఊర్ధ్వాధో భాగాలలో ఉండే లోక విస్తారస్థితీ – తిర్యఙ్మనుష్య, సుర, సరీసృప, ఖగ, జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజాది ప్రాణి సమూహమూ సృజించబడిన విధాన మెట్టిది ? బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపాలలో భగవానుడు సృష్ట్యారంభంలో అవతరించిన ప్రదర్శించిన లీలలను కూడ విశదీకరించండి. వేష. భాష, స్వభావ ఆచరణాదుల ననుసరించి వర్ణాశ్రమ విభాగాన్నీ మహర్షుల జన్మ కర్మాదులనూ, వేద విభాగ, యాగ విస్తార, యోగ జ్ఞాన మార్గాలనూ, వాటిని సాధించ గలుగునట్టి విధినీ, సాంఖ్య నారద పాంచరాత్ర తంత్ర శాస్త్రాదుల వివరణనూ, పాఖండ మతాలూ వాటివల్ల కలిగే ప్రమాదాలూ, ఉన్నత వంశీయురాలైన స్త్రీకి నీచవర్ణుని ద్వారా కలిగిన సంతాన గుణాలనూ, కర్మల ననుసరించి మానవులకు కలిగే గతులనూ, వర్ణించండి. అంతే కాదు – ధర్మార్థ కామ మోక్షాలు పొందడానికి పరస్పర విరుద్ధంకాని సాధనాలైన దండ నీతి, వాణిజ్య శాస్త్ర శ్రవణాదులను విధి సహితంగానూ, శ్రాద్ధ విధీ. పితృగణ సంబంధమైన సృజన క్రమమూ_ కాలచక్రంలో గ్రహ నక్షత్ర తారాగణాదుల స్థితి గతులూ వివరంగా వర్ణించండి. తపో దాన, ఇష్టాపూర్తాది కర్మలూ, వాటి వల్ల కలిగే ఫలాలూ, వివరించండి. ప్రవాస, ఆపత్కాలాలలో మానవునకు ధర్మాలుగా ఏవి పరిగణనకు వస్తాయి. ధర్మముల కారణుడైన జనార్దన భగవానుడు ప్రసన్నుడు కావడానికి సాధన లేమిటి? మహత్తత్వాదుల ప్రళయం ఎన్ని తరగతులుగా ఉంది. యోగ నిద్రా పరవశుడై పరమాత్మ ఉన్న వేళలో అతనిని సేవించే తత్త్వా లెన్ని? భగవంతునిలో తత్ప్రయంలో లీనమయ్యే తత్త్వా లెన్ని ? జీవ తత్త్వ. పరమేశ్వర, స్వరూప. ఉపనిషత్ ప్రతిపాదితమైన జ్ఞాన, గురు శిష్యుల పరస్పర ప్రయోజనాదు లేమిటి ? స్వతః సిద్ధంగా భక్తి జ్ఞాన వైరాగ్యాలు లభించవు కదా ! దేనివల్ల అజ్ఞానం వస్తుంది? సాంగోపాంగంగా వేదాధ్యయనం చేసినా, తపస్సు కొనసాగించినా విశేష దానాలు చేసినా ? పొందజాలని మహా పుణ్యం జ్ఞానదానం చెయ్యడం ద్వారా లభిస్తుంది. కనుక జనన మరణ నాశకమగునట్టి జ్ఞానాన్ని బోధించెదరు గాక." అని అర్థించాడు.

బదులుగా మైత్రేయ మహర్షి చెప్పసాగాడు_ లోక పాలురకు సయితం ధర్మాన్ని శాసించగల

సమవర్తివీ, భక్త శ్రేష్ఠుడవూ అయిన విదురా? నువ్వు జగత్కల్యాణ సందాయకమైన మహత్తర ప్రశ్నలు వేసావు. దుఃఖాలను దూరంచేసి, మోక్షాన్ని ప్రసాదించగల మహా భాగవతాన్ని సంకర్షణ భగవానుడు సనకాది మహర్షులకు విని పించాడు. దానినే నీకు నేను చెబుతాను. సావధాను డవై ఆలకించు.

అఖండ జ్ఞాన సంపన్నుడైన సంకర్షణుడు పాతా ళంలో భాసిల్లుతున్నాడు. అయ్యాది శేష భగవా నుని సందర్శించి సనత్కుమారాదులు విజయం చేసిన వేళకు అతడు తనకు ఆశ్రయ భూతుడైన పరమాత్మను ధ్యానిస్తున్నాడు. కమల కోశ సన్నిభ మైన అతని నేత్రాలు బంధింపబడి ఉన్నాయి. అంత అతనికి వినపడేలా సనత్కుమారాదులు పురుషోత్తమ తత్వాన్ని తమకు విశదీకరించమని అర్థించారు. తత్సమయంలో ఆదిశేషుడు అర్ధ నిమీలిత నేత్రాలతో సనకాదుల ఆనందాన్ని తిల కించాడు. ఆ సమయంలో అభీష్ట సిద్ధ్యర్థం నాగ కన్యలు ఆ దివ్యుని పాదాలు అర్చిస్తున్నారు. సనక, సనందనాదులు పదే పదే ఆ సంకర్షణ భగవానునికి సాష్టాంగ ప్రణామాలు అందజేసారు. మహాత్మ సహస్ర ఫణి ఫణా మండలుడైన సంకర్ష ణుని లీలా రహస్యాదుల నెరిగిన సనత్కుమారా దులు అనేక విధాల స్తుతించారు. వారి స్తోత్ర పాఠాలకు పరమ ప్రసన్నుడైన ఆదిశేషువు సహస్ర కిరీటాలతో అసంఖ్యాక మణి ప్రభలతో కనులు మిరుమిట్లు గొలిపే వేయి పడగలను విస్తరిల జేసాడు. ప్రసన్నుడై సనకాదుల ప్రశ్నాను సారం అనుగ్రహ దృష్ట్యా భాగవతాన్ని వినిపిం చాడు. నివృత్తి పరాయణులైన సనకాదులు దీనిని సాంఖ్యాయన, పరాశర, బృహస్పతులకు విని పించగా కాలాంతరంలో పులస్త్య మహర్షి ఆదే శాను సారం పరాశర మహర్షి నాకు చెప్పిని దానినే నీకు వినిపిస్తాను. సృష్టికి పూర్వంలో ఈ జగత్తు అంతా జలగర్భంలో ఉంది. తత్సమయంలో శేష తల్పం పై నారాయణుడు మాత్రమే శయనించి ఉన్నాడు. అతడు నిజ జ్ఞానశక్తిని అంతర్లీనం చేసుకుని బంధిత నేత్రుడై యోగ నిద్రా పర వశుడై - సృష్టి కార్యంలో విశ్రాంతి తీసుకుంటూ ఆత్మానందంలో ఉన్నాడు. అతనికర్మలేవీ మేలుకొని లేవు. దాహకాది నిజశక్తులతో అగ్ని కాష్ఠమందు దాగియున్నట్లే పరమాత్మ సర్వజీవుల సూక్ష్మ దేహాలనూ తనలో లయం చేసుకుని యోగనిద్రలో ఉన్నాడు. సృష్టికాలం సమీపించగానే కాలశక్తిని జాగృత పర్చడం జరుగుతుంది. యోగ నిద్రలో సహస్ర మహా యుగాలు ఉండి కాల శక్తిని ప్రేరే పించడంతో తచ్ఛక్తి - జీవులకు కర్మ ప్రవృత్తికై ప్రేరణను ప్రసాదిస్తుంది. అప్పుడే భగవంతుడు తన దివ్య దేహంలో లయమై ఉన్న అనంత విశ్వాదులను తిలకించాడు. తనయందున్న లింగ శరీరాది సూక్ష్మ తత్త్వాలపై భగవద్దృష్టి పడగానే కాలాశ్రితమైన రజోగుణం సంక్షుభితమై సృష్టి రచనార్థం అతని నాభి ప్రదేశం నుండి బహిర్గత

వవుతుంది. కర్మ శక్తి ద్వారా ప్రేరేపింపబడిన కాల శక్తితో శ్రీహరి నాభి నుండి ప్రభవించిన సూక్ష్మ తత్త్వం - పద్మకోశ రూపాన బయల్వెడలి భాస్కర సమతేజంతో జలరాసులను ప్రకాశింప జేసింది. గుణాలను అన్నిటినీ తేజరిల్లజేసి సర్వ లోకమయమైన ఆ దివ్య పద్మకోశంలో అంత ర్యామి రూపంలో శ్రీహరి ప్రవేశించాడు. శీఘ్రంగా వేదమూర్తి అయిన చతుర్ముఖ బ్రహ్మ దానిలో సాక్షాత్కరించాడు. స్వయంభూ నామ విఖ్యాతు డితడే. ఆ పద్మ కర్ణికలో ఆసీనుడై ఉన్న అతని కివేమీ కానలేరాదు. కళ్ళు తెరచి చతుర్దిశలూ పరి కించేసరికి అతనికి చతుర్ముఖా లేర్పడ్డాయి. తత్స మయాన ప్రళయ కాలావిర్భూత వాయు ప్రేరిత ఉత్తుంగ తరంగాలు కారణంగా బ్రహ్మకు తన యొక్కగానీ రహస్యం అవగాహన కాలేదు. ఎట్టి ఆలంబం లేకుండా ఉన్న ఈ కమల కర్ణికలో ఆసీను డనై ఉన్న నే నెవరిని? ఈ పద్మం ఎక్కడనుండి ఆవిర్భవించింది ఈ క్రింది భాగంలో దీనికి ఆధారం ఉండి తీరాలి. తత్ కమలానికి ఆధారాన్ని తెలుసు కోవాలని పద్మనాళం యొక్క సూక్ష్మ రంధ్రంలో ప్రవేశించి శ్రీహరి యొక్క నాభి స్థానం వరకూ వెళ్ళి కమలానికి గల ఆలంబనాన్ని తెలిసికోలేక పోయాడు. అయ్యపారాంధకారంలో బ్రహ్మ దేవుడు తన పుట్టుకకు గల స్థాన కారణాలను అన్వేషిస్తూ దీర్ఘ కాలం సంచరించాడు. తత్కాలమే భగవంతుని చక్రం కాల చక్రమే ప్రాణుల ఆయు ర్దాయాన్ని హరించివేస్తుంది. విఫల మనోరథుడైన బ్రహ్మ తిరిగి వెళ్ళి పద్మ కర్ణికా పీఠంపై కూర్చుని ప్రాణ వాయువును బంధించి సంకల్ప శూన్యుడై శత దివ్య సంవత్సరాలు సమాధిలో ఉండిపోయాడు. తత్సమాధి స్థితిలో - గతంలో తాను ఎంతగా వెదికినా గ్రహించలేని తనకు ఆధార మైన ఆది రూపాన్ని సందర్శించ గలిగాడు. సహస్ర ఫణాఫణి మండలుడైన ఆదిశేషశయ్యపై ఏకాకిగా పరుండియున్న జగత్కారణుడైన ఆది నారాయణుని గ్రహించ గలిగాడు. శేషుని మస్త కోపరి భాగాన రాజిల్లే కిరీట స్థగిత మణి కాంతులు దశదిశలనూ భాసిల జేస్తున్నాయి. పీతాంబర ధారియై, శ్యామసుందరుడై శోభిల్లే శ్రీహరిని సందర్శిస్తూంటే మరకతమణి సంభరిత పర్వత సన్నిధిలో భాసిల్లే సంధ్యారాగ సమంగా మహానందం కలుగుతూన్నది జగత్త్రయాన్ని అతిక్రమించి అతని దివ్య దేహ ప్రమాణ ముంది. ఆ దేవదేవునివల్ల వస్త్రాభూషణాది సర్వాలంకారా లకూ శోభ కలుగుతూన్న సువర్ణ కిరీట హార కేయూర పీతాంబరాదులను అతడు ధరించియే యున్నాడు. అనేక పంథాలలో సేవించే వారి అభీ ష్టాలను నెరవేర్చడానికి ఆ దేవ దేవుడు దర్శన మిస్తూ ఉంటాడు. కౌస్తుభ మణిని ధరించిన ఆ వనమాలిని పరివేష్టించి చక్రాద్యాయుధాలు తిరుగు తూన్నాయి. తత్సమయంలో బ్రహ్మ - శ్రీహరి నాభి దేశాన్నుండి జన్మించి ప్రభవించిన కమల

జల వాయు రాకాశాలనూ తన దేహాన్నీ కూడ చూడగలిగాడు. మరియే ఏ ఇతరమూ లేదు. సృష్టి చెయ్యాలన్న మహా దివ్య సంకల్పంతో శ్రీహరి దేవుణ్ణి యిలా సంస్తుతించ నారంభించాడు.

—0—

స్కంధం-3 — అధ్యాయం-8

# బ్రహ్మోత్పత్తి

"దేవా! వాసుదేవా! నిన్ను ఇంత కాలానికి దర్శించ గలిగాను. శరీర ధారులు నిన్ను సందర్శించక పోవడం కంటె దురదృష్టం మరే ముంటుంది? మాయచే కల్పితమైన ఈ సంసారంలో నీకన్న భిన్నమైనది ఏదీ లేదు. మాయలో నువ్వే అసంఖ్యాక రూపాలతో భాసిల్లుతూంటావు. చిచ్ఛక్తి నీలోనే ప్రకాశించడం ద్వారా నీలో లేశ మాత్ర అజ్ఞానానికి కూడ సావకాశం లేదు. నా జన్మకు హేతుభూతమైన నాభీ సరోవరం కల నువ్వే అసంఖ్యాకమైన అవతారాలకు మూల కారణాలివి. సజ్జనులను కరుణించే సంకల్పంతో ఆదిలో ఈ దివ్య స్వరూపాన్ని సాక్షాత్కరింప జేసావు. భేదశూన్యమై ఆనందమయమైన అఖండ తేజోమయమై నీ రూపాన్ని ఈ రూపంకంటే నేను అన్యంగా భావించడం లేదు. నేను విశ్వాలను సృష్టించే సమర్థుడనై యుండే నిన్నే శరణు కోరుతూన్నాను. నీ యొక్క అద్వితీయ స్వరూపమే సమస్త భూత ఇంద్రియాలకు అధిష్ఠానమై ఉంది. పాపులకు దుర్లభమైన అట్టి నీ దివ్య స్వరూపానికి ప్రణమిల్లుతూన్నాను. జగత్కల్యాణ ప్రదాయకా, నీ ఉపాసకుడనైన నా హితాన్ని కోరి నువ్వు నాకీ రూపంలో దర్శన మిచ్చావు. వేద వాయువుచే తీసుకురాబడిన నీ పాదపద్మ గంధాన్ని కర్ణ పుటాల ద్వారా గ్రహిస్తూంటారు. అట్టి భక్తుల మానసాలలో నువ్వు సర్వదా ప్రకాశిస్తూంటావు. నీయందు భక్తిలేనివాడు దారా పుత్ర ధనాదుల కోసం తాపత్రయం పడుతూ ఆశా పిశాచ పీడితుడై అహంకార - మమకార

పుడ..........పురుషోత్తమా? క్షుత్పిపాసలూ, వాత, పిత్త శ్లేష్మ, శీతోష్ణాదులూ, కామ క్రోధాదులూ బాధిస్తూంటే - తద్వారా బాధలు పొందే వారిని చూస్తుంటే నాకు మహా దుఃఖం కలుగుతూన్నది. మానవుడు తన్ను తాను గుర్తించి విషయ వాసనాది ముఖుడై న ఆత్మ జ్ఞానాన్ని గ్రహించే వరకూ దుఃఖాలు పొందక తప్పదు. అట్టివాడు జనన మరణ రూప మహాకాల చక్రంలో పడి పరిభ్రమించవలసినదే. నీ దివ్య గాథా ప్రసంగాలు లేని మునులు కూడ మహా మాయా మోహితులై పరిభ్రమించారు.

అనేక వ్యాపారాలతో పగలూ నిద్రతో రాత్రీ వ్యర్థంగా ఖర్చు అయిపోతూన్నాయి. మనోభీష్ట పరిపూర్తికై చేసే కృషిలో నిద్ర కూడా సరిగా

పట్టదు. విధి వశంతో సర్వ కార్యాలూ విఫలమై తాయి. ఏక మాత్రుడవైన నువ్వు మాత్రమే అంతరాత్మవై ఉండగా వివిధ సామగ్రులతో అనేకావతారమూర్తుడుగా భాసిల్లే నిన్నే ఆరాధిస్తున్నారు. భక్త సులభుడవైన నీ దయార్ద్ర దృష్టి భూత దయ కలవారందరిపై ప్రసరించును గాక! కర్మ ఫలాన్ని నీకు సమర్పించి నిన్ను సేవించేవాడు అక్షయ ఫలాలతో ఆనందిస్తాడు. జ్ఞానధారా? నీకివే నా ప్రణామాలు. మాయను ఆశ్రయించి సృజనార్థం బ్రహ్మ విష్ణు మహేశ్వర, శ్రీరామ, శ్రీకృష్ణాద్యవతారాదులలో నువ్వే ప్రాదుర్భవిస్తుంటావు. మానవ మాత్రుల పరమధర్మం. నిన్ను ఆరాధించడమే. స్వధర్మ పరాయణులను సంరక్షించడం నీ విశేష పరమ ధర్మమే కదా!

స్వధర్మాన్ని పరిత్యజించి వృధాగా పశు పక్ష్యాదులవలె సంచరించే వాని కాలుడు కబళించి వేస్తాడు. అట్టి కాలం కూడ నీ స్వరూపమే అయి ఉంది - అన్నాడు. పరమేశ్వరా! అట్టి నీకు వందనాలు, ద్విపరార్థ కాల పర్యంతం సత్యలోక ప్రభువనై సర్వ లోకాలచే నమస్కరింపబడుతూన్న నేను కూడ నీ కాల స్వరూపాన్ని దర్శించి భీతి చెందుతూంటాను. ఆ కాలాన్నుండి సంరక్షితుడనై ఉండడానికే తపస్సు చిరకాల పర్యంతం చేసాను. అది యజ్ఞరూపంలో నా తపస్సుకు సాక్షివి కూడ నువ్వే. పూర్ణ కాముడవై ఉండి కూడ నువ్వు పశు పక్షి సుర, నరాది రూపాలలో అవతరించి ధర్మ సంరక్షణ చేస్తూంటావు. అవిద్య, అస్మిత, రాగ ద్వేష, అభి నివేశాదులైనదింటిలో నువ్వు దేనికీ వశుడవు కావు. ఇప్పుడు చరాచర విశ్వమంతా నీ కుక్షిలో ఉంది. భయంకర ప్రళయకాల తరంగ మాలా విక్షుబ్ధ జలాలపై శేష పాన్పుపై నువ్వు పవళించి ఉన్నావు. గతించిన కల్పాలలోని జీవరాసికి విశ్రాంతిని ప్రసాదించే మహా సంకల్పంతోనే నువ్విలా ఉన్నావు. నీ నాభీ పద్మం నుండి నేను ఆవిర్భవించినాను. నీ కరుణ వల్లనే జగత్త్రయ సృష్టి రచనలో నిమగ్నుడనవుతూన్నాను. నీ నేత్ర కమలాలు యోగనిద్రను త్యజించడం వల్ల వికసించి ఉన్నాయి. నేను నీ నుండియే ప్రభవించడం కారణంగా నీ విజ్ఞాన శక్తిని కావడం కారణంగా సృష్టి సమయంలో వేదవాణి లుప్త కాకుండే టట్లు అనుగ్రహించు. ఎట్టి అహంకారమూ ఆవరించకుండ ఉండునట్లు రక్షించు. భవదీయ మందస్మిత వదనారవిందాన్ని పైకి ఎత్తి నేత్రాలను విప్పి - సృష్టి రచనలో గల నా విషాదాదులనూ మధురమై అమృతమయమైన నీ వచనాల ద్వారా దూరం చేసెదవు గాక!" అంటూ ప్రార్థించాడు.

శ్రీహరి బ్రహ్మస్థితి గ్రహించాడు. ప్రళయ పయోధిలో భయకంపితుడై ఉన్న చతుర్ముఖుని తిలకించి "వత్సా! వేదగర్భా! విషాదంతో ఇక ఎంతమాత్రం ఆలశ్యం చెయ్యకు. ఆదిలోనే నీ సర్వాభీష్టాలనూ నీకు ప్రసాదించి ఉన్నాను. మరో పర్యాయం నువ్వు తపస్సు చెయ్యి. భాగవత

జ్ఞానాన్ని అనుష్టించు. తద్వారా లోకాలన్నీ నీ అంతరంగంలోనే గోచరమవుతాయి. లోకాలన్నీ నా రూపంలో నీ యందు వ్యాప్తమై ఉన్నట్లూ, స్వయంగా చూడగలుగుతావు. కాష్ఠంలో సర్వత్రా వ్యాపించిన అగ్నిలా సర్వభూత వ్యాప్తమైయున్న నన్ను గ్రహించ గలుగువాడు అజ్ఞానాన్ని పోగొట్టుగో గలుగుతాడు. భూతేంద్రియ, గుణాంతఃకరణ సహిత మైనవాడుగా తన్ను తానుగా గ్రహించు కుంటాడు. నాకంటె భిన్నమైనవాడు తెలుసుకో గల మోక్షాన్ని పొంద గలుగుతాడు. వివిధ కర్మ సంస్కార యుక్తులైన నానావిధ జీవులనూ సృష్టించాలన్న వాంఛ కలిగినప్పుడు కూడ మదీయానుగ్రహంచేతనే నువ్వు మాయా మోహితుడవు కాకుందువు గాక! నువ్వు సర్వాది మంత్ర ద్రష్టవు. సృష్టి కాలంలో కూడ నీ మనస్సు నాయందే సంలగ్న మగును గాక! పాప భూయిష్టమైన రజోగుణం నిన్ను బంధించ కుండును గాక! నన్ను భూతేంద్రియ గుణాంతః కరణ రహితుడనుగా గుర్తించ గలిగావు. ఇది పరు లెవరూ గ్రహించలేనిది. నాకు ఆలంబనల మేది? అంటూ జలాలలో మూలాన్ని వెతకడం ప్రారంభించావు. అప్పుడు నేను అనుగ్రహ పూర్వకంగా నీకు దర్శనమిచ్చాను. నువ్వు నన్ను స్తుతించడమే కాక తపోనిష్ఠలో కూడ ఉన్నావు. ఇదంతా నా కృప వల్లనే చెయ్య గలిగావు. లోకరచనేచ్ఛతో సగుణుడవై కూడ నిర్గుణ రూపంలో నన్ను స్తోత్రం చేసావు కనుకనే నేను ప్రసన్నుడ నయ్యాను. సర్వాభీష్టాలనూ నెరవేర్చ సమర్థుడనైన-నన్ను గురించి నువ్వు చేసిన ఈ స్తోత్రాన్ని - నిత్యం పఠించు వారు నా కరుణకు పాత్రు లవుతారు. తపోదాన యాగ యోగాదుల ఫలం - నా అనుగ్రహమేనని జ్ఞానులు వ్యక్తం చేస్తుంటారు. ఆత్మలకు ఆత్మ స్వరూపుడనైన నేను దారాపుత్రాదుల కన్న అధిక ప్రియమైనవాడను. శరీరాదులు కూడ నా కోసమే ప్రియ మవుతాయి. కనుక సదా నన్నే భజించాలి. పూర్వ కల్పంలో వలెనే నా ద్వారా ఉత్పన్నమైన జీవులను-సర్వ వేదమయ స్వరూపుడవైన నువ్వు-సృష్టించు" అని ఉపదేశించి శ్రీహరి అంతర్ధానమై పోయాడు.

—0—

స్కంధ-3, అధ్యాయం-9

## శ్రీహరిని బ్రహ్మస్తుతించుట

మైత్రేయ మహర్షీ! శ్రీహరి అంతర్ధానమైన తరువాత బ్రహ్మ - తన మనశ్శరీరాలతో ఎన్ని విధాల సృష్టిచేసాడు? దీనికి సమాధానమిస్తూ గత మందు నేను ప్రశ్నించిన వాటన్నిటికీ కూడ సమాధానం చెప్పు" అన్నాడు.

అంత మైత్రేయుడు ఇదులు పలుకుతూన్నాడు. విదురా! శ్రీహరిదేవుని ఆదేశానుసారం బ్రహ్మ

దేవుడు ఏకాగ్ర చిత్తంతో నారాయణ ధ్యాన పరాయణుడై శత దివ్య సంవత్సరాలు తపస్సు చేసాడు. దానివల్ల స్వయంగా బ్రహ్మదేవుడూ కమల జలాదులూ కూడ కంపించ సాగాయి. తపస్సు ద్వారా కలిగిన ఆత్మబలం, విజ్ఞాన బలాదుల వర్ధిల్లగా పితామహుడు ప్రళయ పయోధి జలాలను వాయువుతో సహా పానం చేసివేసాడు. ఆకాశావృత్తమైతనకాశ్రయమైన తత్కమలాన్నుంచే గత కల్పమందు లయమైపోయిన సృష్టి కార్య క్రమాన్ని కొనసాగించాలని సంకల్పించాడు శీఘ్రమే అతడు కమలకోశం ప్రవేశించి భూర్భువ స్వర్లోకాల విభాగం చేసుకున్నాడు. తత్కమలం పదునాలుగు లోకాలనూ, అనంతకోటి జీవరాసినీ సృష్టించడానికి యోగ్యంగా మహా విశాలంగా ఉంది. జీవులు భోగానుభవం పొందడానికి ఈ లోకాలు మూడూ శాస్త్ర ప్రతిపాదితాలై ఉన్నాయి నిష్కామ కర్మ స్థాన పరాయణులు మహర్లోక, తపోలోక జన లోక సత్యలోకరూపాలైన బ్రహ్మలోకాన్ని పొందుతారు అని పలుకగా విదురుడు "మహాత్మా! అద్భుత కర్మలైన విశ్వరూపుని కాలనామక శక్తిని గురించి వివరీకరించండి. "అని అర్థించగా మైత్రేయుడు ఆ సద్విషయాన్ని వివరిస్తున్నాడు." విదురా! విషయరూపాంతరమే కాలాకారం, అది నిర్విశేషమై, అనాదియై అనంతమైనది. అట్టి కాలాన్ని నిమిత్త మాత్రంగా ఉంచి పరమాత్మయే సృష్టి రూపంలో పరిణామం చెందుతూ ఉంటాడు. భగవన్మాయంలో ఈ విశ్వమంతా లీనమై ఉంది. దానినే కాలం ద్వారా పునః వేరుచేసాడు. ఇప్పుడున్నట్లే ఈ విశ్వం గతమందూ ఉంది. నవవిధ ప్రకారాలుగా ఉన్న ఈ సృష్టి - ప్రాకృత వైకృత భేద తో దశవిధా లవుతున్నది. కాల ద్రవ్య గుణ విభాగంతో త్రివిధంగా ఉన్నది. దీని ప్రళయం కూడ అవుతూ ఉంటుంది. భగవత్ ప్రేరణ ద్వారా సత్వాది గుణాలలో కల వైషమ్యమే మహాతత్త్వం. ఇదియే ప్రథమ సృష్టి. పంచ మహాభూతాలకూ, దశేంద్రియాలకూ, ఉత్పత్తి స్థానమైన అహంకారమే ద్వితీయ సృష్టి తృతీయమైన భూత సర్గమందే మహా భూతాలకు ఉత్పత్తి కారణాలైన తన్మాత్రలుంటాయి. నాల్గవది జ్ఞాన క్రియాశక్తి సంపన్నమైన ఇంద్రియ సృష్టి. సాత్వికాహారం ద్వారా జనిమించిన ఇంద్రియాధిష్ఠాన దేవతలూ - మనస్సూ పంచమ సృష్టి అనబడుతున్నది. అవిద్యా సృష్టి షష్ఠ స్థానంలో ఉంది. దీనిలో తామిస్ర, అంధతామిస్ర, తమ, మోహ, మహా మోహాలనే పంచ బంధా లుంటాయి. జీవుల - బుద్ధులకు ఇది ఆవరణ విక్షేపాదులను కలుగజేస్తూ ఉంటుంది. ఇవి ప్రాకృత సృష్టులనబడతాయి. తనను ధ్యానించునట్టి వారిని అనుగ్రహించునట్టి లీలావినోదమే ఈ సృజన క్రమమవుతున్నది. ఆ పరాత్పరుడే రజోగుణాన్ని గ్రహించి సృష్టిచేస్తుంటాడు. షడ్విధ ప్రాకృత సృష్టులు కొనసాగించిన తరువాత అతడు వైకృత సృష్టి ఆరంభిస్తాడు.

వైకృత సృష్టిలో స్థావరాలైన వృక్షాది సృష్టియే సప్తమ సృష్టి. ఇది వనస్పతి, ఓషధి,

లత, త్వక్సార, వీరుధ, తరు విభాగాలతో కొనసాగుతుంది. పుష్ప రహితంగా ఫలించేవే వనస్పతులు, ఫలించాక నాశనమయ్యేవి ఓషధులు. ఒకదానిని ఆశ్రయించి వర్ధిల్లేవి లతలు. చర్మం కఠినంగా ఉండేవి, త్వక్సారాలు. పృథ్వి మీదనే విస్తరిల్లుతూ ఎత్తుగా వర్ధిల్లనివి వీరుధాలు. పుష్పించి, ఫలించునట్టివి వృక్షాలు, మూలం నుండి ఇవి ఊర్ధ్వంగా వర్ధిల్లుతాయి. వీటి యందు సామాన్యంగా జ్ఞానశక్తి ఉండదు. లోపల స్పర్శశక్తితో ఉంటూ ఇవన్నీ ప్రత్యేక గుణాలు కలవియై ఉంటాయి. అష్టమ సృష్టియైన 28 తరగతులకు చెంది ఉంటుంది. పశుపక్ష్యాది తిర్యక్ సృష్టి-వీటికి కాలజ్ఞానం ఉండదు. తమోగుణం విశేషంగా ఉండడంవల్ల వీటికి ఆహార నిద్రా మైథునాలే ఉంటాయి. వాసన చూసినంత మాత్రానికే అవి వస్తువులను గ్రహిస్తాయి. దూరదృష్టి కానీ, విచార శక్తి కానీ వీటి కుండవు. తిర్యక్ జంతువులలో గోమేష మహిష కృష్ణమృగ, వరాహ, గవయ, రురు ఉష్ట్రి - ఇవి ద్విశఫలాలనబడతాయి. అనగా రెండు గిట్టలు కలవి. గార్దభ, అశ్వ, గౌరమృగ, శరభ, చమరీమృగ ఇవి ఒకే గిట్ట గలవి. శ్వాన, శృగాల, గోమాయువు, వ్యాఘ్ర, మార్జాల శశ, సింహ, వానర, గజ, కచ్ఛపాలూ, ఉడుములూ మొదలు గాగల పశువులూ. డేగ, గ్రద్ధ, రాబందు, పావురం, నెమలి, హంస, సారస చక్రవాక, గుడ్లగూబాది పక్షులూ, భల్లూకాది పశువులూ పంచనఖాలు కలవి. నవమసృష్టి, నరసృష్టి. రజోగుణ, ప్రధానులయిన మానవులు. కర్మపరాయణులై, విషయ లోలురై, దుఃఖ రూప విషయ వాసనలయందే సుఖాన్వేషణ చేయునట్టి వారవుతున్నారు. ముఖాన్నుండి అధోభాగానికి వీరికి ఆహార ప్రవాహం ప్రవహిస్తూంటుంది. స్థావర, పశుపక్ష్యాది మానవరూపమైన త్రివిధ సృష్టీ చెప్పబోవునట్టి దైవీ సృష్టి ఈ 4 వైకారిక సంబంధమైనవే. సనత్కుమారా కౌమార సృష్టీ ప్రాకృత, వైకృత భేదంచే ద్వివిధంగా ఉంటుంది. దేవ, పితర, రాక్షస, గంధర్వ, అప్సర, యక్ష, సిద్ధ, చారణ, విద్యాధర, భూతప్రేత పిశాచ కిన్నర కింపురుషాది భేదాలతో దైవ సృష్టి అష్ట విధాలుగా ఉంటుంది. ఇక మన్వంతర విషయవర్ణన చేసాను - ఆలకించు.

—0—

స్కంధం-3 — అధ్యాయం-10

## దశవిధ సృష్టి వర్ణన

'విదురా! పృథివ్యాదిగా గల కార్యవర్గ సూక్ష్మాంశలు విభాగించ నవకాశం లేనివి. అవి.

కార్యరూపాన్ని పొందజాలనప్పుడు అన్య పరమాణు వుల సంయోగం కాని కాలంలో - ఆసూక్ష్మాంశలకు పరమాణువులని పేరు. మానవులకు అనేకానేక పరమాణువుల సంయోగం వల్లనే సముదాయ రూపమైన ఓ అవయవ ప్రతీతి కలుగుతూ ఉన్నది. పృథివ్యాది కార్యముల ఏకత్వమే మహాన్ - అని వ్యవహరింపబడుతూన్నది. తత్ స్థితిలో దాని యందు ప్రళయాది అవస్థా భేదస్ఫూర్తి ఉండదు. ఘటఘటాది ప్రాచీన-నూతనకాలభేదలక్షణం ఉండదు. పదార్థ భేదస్ఫూర్తి కూడ ఉండదు. ఈ రీతిగా సూక్ష్మతమ మహత్తర స్వరూప విచారణ చేయ బడింది. ఈసాదృశ్యం ద్వారానే పరమాణు వాదిగా సర్వ వస్తు వ్యాప్తమై ఉన్న - వ్యక్త పదార్థాలను అనుభవించునట్టివాడూ, సృష్టి రచనాదులయందు సర్వ సమర్థుడూ వ్యక్తా వ్యక్త రూపుడూ అయిన పరమాత్మ - కాలం యొక్క స్థూల సూక్ష్మ భావా లను కూడ అనుమానించ గలుగుతూన్నాడు. విశ్వం యొక్క పరమాణు రూప సూక్ష్మవస్థలో వ్యాపించి యుండునట్టి కాలం అత్యంత సూక్ష్మతి సూక్ష్మమై ఉంటుంది. సృష్ట్యాది ప్రళయ పర్యంతం సర్వావస్థలయందూ భోగించునట్టిది మహాన్ - అంటూ సువ్యక్తం చేయబడింది.

పరమాణువులు రెండు కలియగా ఓ అణువు ఏర్పడుతున్నది. మూడు అణువులు ఓ త్రసరేణువు అవుతుంది. గవాక్షం ద్వారా సూర్య కిరణం వెలు వడునప్పుడు దానిలో ఎగురుతూన్నట్లు కనిపించు నట్టివే త్రసరేణువులు. మూడు త్రసరేణువులను - సూర్య కిరణాలు దాటడానికి పట్టే కాలమే తృటి. నూరు తృటులు కలిస్తే వేధ అవుతుంది. మూడు వేధలను కలిపితే లవమవుతుంది. మూడు లవలు నిమేష మవుతూన్నాయి. మూడు నిమేషాలు కలి యగా క్షణ మవుతుంది. ఐదు క్షణాలను కలిపితే కాష్ఠ మవగా పదిహేను కాష్ఠాలు లఘువవుతాయి. పదిహేను లఘువులు నాడిక కాగా రెండు నాడికలు ముహూర్త మవుతాయి. షట్ లేక సప్త నాడికలు ఓ ప్రహరమవుతుంది. దీనికి యామమని కూడ పేరున్నది. అహోరాత్ర భాగాలలో ఏదయినా - అందులో నాల్గవ భాగమే యామ మవుతుంది. ఆరు పలాల రాగితో ఓ ప్రస్థం నీరుపట్టే పాత్రను చేయించి నాలుగు మాసాల ప్రమాణం కల సువ ర్ణంతో నాలుగంగుళాల పొడవు గల శలాకచేత ఆ పాత్రకు రంధ్రం చేయించి అది జలాల ఉంచి ఆ పాత్ర జలంతో నిండి మునిగే కాలమే 'నాడిక' అనబడుతుంది. నాలుగు యామాలు పగలు,నాలుగు యామాలు రాత్రి అవుతుంది మానవ మానంచే యిది ఓ రోజు అనబడుతుంది. పదిహేను దినాలు ఓ పక్షం కాగా ఈ పక్షాలు శుక్ల కృష్ణ నామంతో రెండు తరగతులుగా ఉన్నాయి. రెండు పక్షాలు కలిస్తే మాస మవుతుంది. రెండు మాసాలు కలిస్తే ఋతువు ఏర్పడుతుంది. ఆరుమాసాలు కలిస్తే ఒక అయన మవుతుంది. ఉత్తరాయనమనీ, దక్షి ణాయనమనీ అయనాలు రెండు. ఈ అయనాలు రెండు కలిస్తే దేవతలకు ఓరోజు అవుతుంది. మానవులకు ఓ సంవత్సర మవుతుంది. మానవా

యుర్దాయం శత సంవత్సరాలు. చంద్రాది గ్రహాలకూ ఆశ్విన్యాది తారలకూ, అధిష్ఠాత - కాల స్వరూపుడైన సూర్య భగవానుడు. పరమాణువాదిగా వత్సర పర్యంతంగా గల ద్వాదశ రాసి రూప భువన కోశంలో సూర్యుడు ప్రదక్షిణ చేస్తూంటాడు. సౌర, బార్హస్పత్య, సాయన, చాంద్ర, నాక్షత్ర, భేదాలతో ఈ సంవత్సరమే - సంవత్సర, పరివత్సర, ఇడా వత్సర అనువత్సర, వత్సర నామాలతో వ్యవహరింపబడుతూన్నది.

పంచవిధ వర్ష ప్రవృత్తికి కారణ భూతుడైన సూర్యభగవానుణ్ణి ఆరాధించు. పంచ మహా భూతాలలో సూర్య భగవానుడు తేజః స్వరూపుడు. నిజ కాలశక్తి ద్వారా వస్తువులనుండి బీజాంకురాలను పుట్టించి వివిధ పద్ధతుల ద్వారా కార్యోన్ముఖం చేస్తూంటాడు. మోహ నివృత్యర్థం మానవుల ఆయుర్దాయాన్ని క్షీణింపజేస్తూ అంబర వీధిలో పరిభ్రమిస్తూ ఉంటాడు. యాగాది కర్మల ద్వారా లభించునట్టి స్వర్గలోకాది మంగళమయ ఫలాలను సంప్రాప్తింప జేస్తూంటాడు."

విదురుడు మధ్యలో అందుకుని "మహర్షీ! దేవ, పితర, మానవాదుల పరమాయుర్దాయాన్ని వివరించారు. కల్పాంతర పర్యంతం ఉండునట్టి సనకాదుల ఆయుర్దాయ వివరాలు విశదీకరించండి. యోగశక్తి సంపన్నులయిన తమకు కాలజ్ఞానం తెలిసినదే." అని అర్థించాడు. అందుకు మైత్రేయుడు సమాధానం చెబుతూన్నాడు. "యుగాలు - కృత, త్రేత, ద్వాపర, కలి నామాలతో నాలుగున్నాయి. యుగ సంధ్యా కాలాలు, సంధ్యాంశలూ కలిసి పన్నెండు వేల దివ్య సంవత్సరాలు. ఇందులో కృతయుగం 4 వేలూ, త్రేతాయుగం 3 వేలూ, ద్వాపరయుగం 2 వేలూ, కలియుగం వేయి దివ్య సంవత్సరాల ప్రమాణాలతో ఉంటాయి. సంధ్యా, సంధ్యాంశ కాల ప్రమాణం - యుగప్రమాణానికి వేయిసంవత్సరాలకు 200 సంవత్సరాల వంతున పరిగణించాలి. అంటే కృతయుగ ప్రమాణం 4 వేల దివ్య సంవత్సరాలు అవుతుంది. త్రేతాయుగ ప్రమాణం 3,600 దివ్య సంవత్సరాలవుతుంది.

మనుష్య మానం ద్వారా కలియుగ ప్రమాణం 4,3200 సంవత్సరాలు. దేవ మానంచే 1200 అవుతుంది. అదేరీతిగా ఇతరయుగ పరిగణన కూడ చెయ్యాలి. యుగాదిలోను, సంధ్యా యుగాంతంలోనూ - సంధ్యాంశ మంటారు. నూర్ల సంఖ్యలో ఈ కాల ప్రమాణం వర్ణించబడింది దీనికి గల మధ్య కాలాన్నే యుగ మన్నారు. యుగభేదం వల్ల ధర్మంలో కూడ విశేష లక్షణాలు ఏర్పడుతూంటాయి. కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతోనూ, త్రేతాయుగంలో ధర్మం మూడు పాదాలతోనూ, ద్వాపరయుగంలో రెండు పాదాలతోను, కలియుగంలో ఏకమాత్ర పాదంతోను ధర్మం ఉంటుంది.

జగత్త్రయానికి పైనున్న మహర్లోక మాదిగా సత్యలోక పర్యంతం ఉన్న లోకాలలో నాలుగువేల

యుగాలు ఓ రోజుగా పరిగణనకు వస్తుంది. అనగా మానవలోకంలో 4యుగాలుకలియగా ఓమహాయుగ మవుతుంది. వేయి మహాయుగాలు బ్రహ్మదేవు నకు ఓపగలవుతుంది. అలానే వేయి మహా యుగాల కాలం రాత్రి కాగా అది బ్రహ్మకు నిదురించే కాలం అవుతుంది. అట్టి రాత్రి గడపడంతో కల్పా రంభ మవుతుంది. బ్రహ్మదేవుని పగటి కాలమంతా ఆ పగలు నడుస్తూ ఉంటుంది.

ఒక్కొక్క కల్పానికి పధ్నాలుగురు మనువుల వంతున ఉంటారు. ఒక్కొక్క మనువు డెబ్బై యొక్క మహా యుగాల కాలం పరిపాలిస్తూంటాడు. ప్రతీ మన్వంతరంలోనూ ఆ మనువుయొక్క వంశ, రాజ, సప్తర్షి, దేవగణ, ఇంద్రాదులూ. వారి అను చరులైన గంధర్వాదులూ తమ తమ అధికారాలను అనుభవిస్తూంటారు. ఇది బ్రహ్మదేవుని దైనందిన సృష్టి. జగత్రయానికి సంబంధించిన సృష్టి దీని యందే జరుగుతూ ఉంటుంది జగత్రయంలో దేవ, పితర, మానవ, పశుపక్ష్యాది దేహాలతో కర్మాను సారం జీవులు జన్మించి, సుఖ దుఃఖాలను పొందుతూ ఉంటాయి. ఈ మన్వంతరాలలోనే సత్వగుణమూర్తి అయిన పరమాత్మ మనువాదిగా గల రూపాలలో అవతరించి ఈ విశ్వాన్ని పాలిస్తూ ఉంటాడు. బ్రహ్మదేవునకు పగలు గతించగానే పరమాత్మ తమోగుణాన్ని ఆశ్ర ఈ విశ్వాన్ని లయం చేస్తాడు. తత్సమయంలో చరాచర విశ్వం పరమాత్మ యందు లీనమై ఉంటుంది. సూర్య చంద్ర తారాది శూన్యమైన ప్రళయ రాత్రిలో భూర్భువాది లోకాలన్నీ కూడ భగవంతుని యందే లయమై ఉంటాయి. తత్సమ యాన ఆదిశేషుని వదన గహ్వరం నుండి వెలు వన అగ్ని ద్వారా జగత్రయం దగ్ధమై పోతుం డగా చూసి భృగువు ఆదిగా గల మహర్షి శ్రేష్ఠులు వ్యాకులురై మహర్లోకాన్ని విడనాడి జన లోకా నికి వెడతారు. అంతలోనే ప్రళయ వాయు సంక్షు భితమై సప్తసాగరాలూ లోకత్రయాన్ని ఆక్రమించి ఏకార్ణవంగా మారిపోతాయి. తత్సమయాన పర మాత్మ ఆ ప్రళయ జలాలలో శేషపాన్పుపై శయనించి ఉంటాడు. అప్పుడే జనలోక వాసులైన మహర్షులు పరంధాముని స్తుతిస్తారు.

ఈ రీతిగా కాలగతిని పరిగణించగా గతించ పోవునట్టి చతుర్యుగ సహస్ర పరిమితమైన దివా రాత్రుల పరిగణనలో బ్రహ్మకు శత దివ్య వత్స రాల ఆయుర్దాయం ఉంటుంది. అతని ఆయుః పరిమితి కూడ గతించి పోతున్నట్లే స్పష్టమయింది కదా! అతని ఆయుర్దాయంలో అర్ధ భాగానికే పరార్ధ మని పేరుంది. ఇప్పటికే ఓ పరార్ధం గతించి పోయింది. ద్వితీయ పరార్ధం నడుస్తూన్నది. ప్రథమ పరార్ధంలో ఆది బ్రహ్మకల్పం. ఆ కల్పం లోనే బ్రహ్మావిర్భావం జరిగింది. మనీషులు అతనినే శబ్ద బ్రహ్మ మన్నారు. పద్మ కల్పం రెండవది కాగా - శ్రీహరి దేవుని నాభి నుండి సర్వలోక మయమైన పద్మం ప్రభవించింది.

ప్రస్తుతం కొనసాగుతూన్న కల్పం ద్వితీయ పరార్ధంగా అరంభంగా తెలియవస్తూన్నది. దీని

ఆరంభంలో భగవానుడు వరాహావతారు డయ్యాడు. అందులకే దీనికి శ్వేతవరాహ కల్పమని పేరు. ద్విపరార్ధ కాలం శ్రీమన్నారాయణ భగవానునకు నిమేష మాత్ర కాలమవుతుంది. పరమాణు వాదిగా ద్విపరార్థం పర్యంతంగా వ్యాప్తమై ఉన్న కాలం సర్వ సమర్థమైనదే అయినా సర్వేశ్వరునియందు ఏవిధంగానూ తన ప్రభావాన్ని చూపించ లేదు. దేహాభిమానులయందే దీని ప్రభావం పని చేస్తూ ఉంటుంది. ప్రకృతి, మహత్తత్త్వ, అహంకార పంచతన్మాత్రలు-అని అష్ట ప్రకృతులుగా వ్యవహరింపబడుతున్నాయి. దశేంద్రియాలూ, మనస్సూ, పంచ మహాభూతాలూ కలిసి షోడశ వికారాలనబడతాయి. ఈ చతుర్వింశతి తత్త్వాల కలయిక ద్వారా నిర్మింపబడ్డ బ్రహ్మాండం యొక్క ప్రత్యేక భాగం 50 కోట్ల యోజనాలు ఉన్నాయి. దీనికి ఊర్ధ్వభాగంలో దీనికన్న మిన్న అయిన పెద్దవిగా ఉన్న సప్తావరణ ఉన్నాయి. ఇవి ఒక దానిని మించి వేరొకటి పదేసి రెట్లు పెద్దవిగా ఉంటాయి. ఇలాంటి బ్రహ్మాండాలు కోటానుకోట్లు ఎవనియందు అణు స్వరూపాలుగా ఉన్నాయో। అతడే అక్షరుడూ, అవ్యయుడూ అయి తేజరిల్లుతూంటాడు. సర్వ కారణ కారణుడూ పురాణ పురుషుడూ పరబ్రహ్మ అయిన అతడే సర్వశ్రేష్ఠుడైన శ్రీకృష్ణ భగవానుడు.

—0—

స్కంధ-3, అధ్యాయం-11

## కాల విభాగము

విదురా! ఇంతవరకూ కాల మహిమనుగురించి వివరించాను. చతుర్ముఖుడు విశ్వసృష్టి చేసిన విధానాన్ని వివరిస్తాను. ఆలకించు. ప్రారంభంలో అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశాలను ఐదింటినీ సృజించాడు. పాపమైన ఆ సృష్టివల్ల అతనికి ఆనందం కలుగలేదు. వెంటనే పరమాత్మను ధ్యానించి చేసిన రెండవ తరగతికి చెందిన సృష్టిలో సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులనూ నివృత్తి మార్గ నిరతులనుగా సృజించాడు. ఊర్ధ్వరేతస్కులూ, మునులూ అయిన సనకాదులను చూసి వారిని - సృష్టి క్రమంలో ప్రవేశించుడని బ్రహ్మ శాసించినా - వారు నివృత్తి పరాయణులు కావడంవల్ల సృష్టి రచనయందు వారి మనస్సు సంలగ్నం కాలేదు. అప్పుడు కలిగిన క్రోధంవల్ల అతని భ్రూమధ్యం నుండి నీల లోహితుడు అవతరించాడు. 'బ్రహ్మదేవా! నా నామ స్థానా లేమిటి?' అని బాల రూపంలో అతడు రోదిస్తూ ప్రశ్నించగా "నీ అభీష్టాన్ని నెరవేరుస్తాను. రోదిస్తూ జనిమించిన నిన్ను రుద్రుడంటారు. నీకు నివాస స్థానాలుగా ఆదియందే హృదయ, ఇంద్రియ, ప్రాణ, ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథ్వి, సూర్య, చంద్ర తపస్సులను

ఏర్పాటు చేసాను. మన్యు, మను, మహినస, మహిక, శివ, ఋతధ్వజ, ఉగ్రరేత, భవ, కాల, వామదేవ, ధృతవ్రత, నామాలు కూడనీ మేధీ, వృత్తి, ఉశన, ఉమ, నియుత్, సర్పి, ఇళ, అంబిక, ఐరావతి, సుధ, దీక్ష నామాలతో రుద్రాణీ శక్తులు పదకొండుగురూ నీకు భార్యలవుతారు. ఉపర్యుక్త నామ, స్థాన, భార్యలను స్వీకరించి అసంఖ్యాక తెగలకు చెందిన ప్రజలను సృష్టించు ప్రజాపతివైన నీ మీదనే ఈ కార్య భారమంతా ఉంటుంది." అని పలికిన బ్రహ్మదేవుని పలుకులు ఆలించి నీలలోహితుడు తనతో సమాన బల, స్వభావ, ఆకారాదులు కలవారిని ప్రభవింప జెయ్య సాగాడు. అది రౌద్రీ సృష్టి కావడంచే అసంఖ్యాకులయిన రుద్ర రూపులు ప్రభవించి విశ్వాన్నే భక్షించ సాగారు. అది గ్రహించి బ్రహ్మ దేవుడు రుద్రుని తిలకించి - రుద్రదేవా నీ సృష్టి లోకాలనే నాశనం చేస్తున్నది. కనుక దీనిని ఆపి జగత్కళ్యాణార్థం తపస్సు కొనసాగించు. తపశ్శక్తి సంపన్నుడవైన మీదట మరల సృష్టిం చెదవుగాక. జ్యోతిర్మయుడు, సర్వాంతర్యామి అయిన శ్రీహరిని తపస్సు చేతనే సందర్శించ గలుగుతారు." అన్న బ్రహ్మ వచనా లాలకించి రుద్రుడు అతనికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి తపస్సార్థం వనాలకు వెళ్ళిపోయాడు.

అనంతరం దైవశక్తి సంపన్నుడైన బ్రహ్మ దేవుడు సృష్టి సంకల్పంతో - మరీచి, అత్రి, అంగిరస, పులహ, పులస్య, క్రతు, భృగు, వశిష్ఠ, దక్ష, నారదాదులను పదిమందినీ సృష్టించాడు. ఇందులో క్రమంగా అంక, అంగుష్ఠ, పాదత్వక్, కర, నాభి, శ్రవణ, వదన, నేత్ర, మనస్సాదుల నుండి, నారద, దక్ష, వశిష్ఠ, భృగు క్రతు, పులహ, పులస్త్య, అంగిరస, అత్రి, మరీచీ ప్రభవించారు. బ్రహ్మదేవుని దక్షిణ స్తనం నుండి ధర్మవూ జనించగా - అతని ధర్మపత్నినుండి స్వయంగా - నారాయణు డవతరించాడు. పద్మ సంభవుని పృష్ఠభాగం నుండి అధర్మం ఆవిర్భవించగా దాని ద్వారా లోకాలకు భయాన్ని కలిగించు నట్టి మృత్యువు పుట్టింది. అటులనే బ్రహ్మ హృదయం నుండి కామమూ, భ్రూమధ్యం నుండి క్రోధమూ, క్రింది పెదవి ద్వారా లోభమూ, వదనం నుండి వాగ్దేవి అయిన సరస్వతీ లింగం నుండి సముద్రమూ. గుద భాగం నుండి నిర్ఋతి ఛాయ ద్వారా కర్దమ ప్రజాపతీ ప్రాదుర్భవించారు. ఈ విశ్వమంతా బ్రహ్మదేవుని నుండి పుట్టినదే.

సౌందర్య రాశీ, సుకుమారీ, మనోహరీ పుత్రి అయిన సరస్వతిని తిలకించి ఒకానొక సమయంలో బ్రహ్మదేవుడు పరవశు డయ్యాడు. కామవాసన కానిది, అధర్మరూపమైన బ్రహ్మదేవుని భావాన్ని గ్రహించిన మరీచ్యాదులు అతణ్ణి సమీపించి "భగవన్ ! సర్వ సమర్థుడవై కూడ మీరు పుత్రీగమన రూపమైన కామేచ్ఛను నివారించక పాపానికి సిద్ధ మవుతున్నారు గతంలో, ఆవిర్భవించిన బ్రహ్మ లెవ్వరూ యీ పాపకార్యాన్ని ఆలోచరిచినట్లు ఆధారాలు లేవు. భవిష్యద్బ్రహ్మలు కూడ

చెయ్యరు. మహా ధర్మాన్ని చూపవలసిన త్వాదృశ శక్తి సంపన్నులు ఇట్టి పాప కార్యాలు ఆచరించ రాదు. మీ మార్గం లోకానికి ఆదర్శమైపోతుంది. ఉత్తమ ధర్మాన్ని ఆదరించిననాడే అది లోకానికిని ఆదర్శమవుతుంది. సర్వ కారణాలకు కారణభూతు డైన శ్రీహరి ధర్మాన్ని సంరక్షించును గాక." అని వారు పలకడంతో బ్రహ్మ సిగ్గుతో తత్ శరీ రాన్ని పరిత్యజించి వేసాడు. బ్రహ్మ త్యాగంచేసిన తత్ శరీరం భయంకరంగా ఉంది. దానిని దిశలు గ్రహించగా అది పొగమంచులా వ్యాపించింది. దానినే అంధకార మన్నారు.

ఒకానొకప్పుడు బ్రహ్మదేవుడు యోచించ సాగాడు. ఆదిలోవలె నేను సువ్యస్థితమైన సృష్టిని ఎలా చెయ్యగలను ? తత్సమయంలోనే అతని చతుర్ముఖాల నుండీ, చతుర్వేదాలూ బహిర్గత మయ్యాయి. వాటితోపాటు ఉపవేదాలూ. న్యాయ శాస్త్రమూ, అధ్వర్యువూ బ్రహ్మ. తహో, ఉద్గాత లనే - చతుర్విధ ఋత్విగ్గణం కూడ బహిర్గత మయ్యారు. యాగకర్మ విస్తారమూ, ధర్మ సంబంధమైన పాద చతుష్టయమూ, చతురాశ్ర మాలూ, వాటి వృత్తులూ అన్నిటికన్నీ అతని వదనం నుండియే ప్రభవించాయి" అంటూ ముందుకు చెప్పకు పోతూన్న మహర్షిని తిలకించి విదురుడు ప్రశ్నించాడు. "మైత్రేయ మునీంద్రా! బ్రహ్మదేవుకు ఎప్పుడు తన ముఖం నుండి వేదా లను సృజించాడు ? ఏ వదనం నుండి ఏ పదార్థాన్ని ప్రభవింపజేసాడు ? విశదీకరించండి. దానికి సమా ధానంగా మైత్రేయుడు పలికాడు : "విదురా! తూర్పు ముఖం నుండి ఋగ్వేదాన్ని. పశ్చిమ ముఖాన్నుండి అథర్వణ వేదాన్ని సృజించాడు. హోత. అధ్వర్యువు ఉద్గాత. బ్రహ్మ కర్మలు సృజించాడు. ఉపవేదాలుగా ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వ, స్థాపత్య వేదాలను సృజించాడు. సర్వ దర్శియైన పరమాత్మ-చతుర్వదనాలనుండీ షోడశి, ఉక్థ్య. చయన. అగ్నిష్టోమ. ఆప్తోర్యామ. అతి రాత్ర, వాజపేయ, గోసకాదులను ఒక్కొక్క ముఖ నుండి సృష్టిచేసి పంచమ వేదంగా పురాణేతి హాసాలను సృజించాడు. విద్య తపోదానాదులూ, సత్యమూ - ఈ నాలుగూ ధర్మానికి నాలుగు పాదాలు. ఆ చతురాశ్రమాలను వృత్తులతో సృష్టిం చాడు. సావిత్రి, ప్రాజాపత్య, బ్రహ్మ, బృహత్ అనే వృత్తులు నాలుగూ బ్రహ్మచారికీ, వార్తా సంచయ, శాలీన, శిలోంఛ ఈ నాలుగు వృత్తులూ గృహస్థుకూ నిర్ణయించాడు. వైఖానస, వాలఖిల్య ఔదుంబర, ఫేనప, భేదాలతో వానప్రస్థాశ్రమ విధులూ, కుటీచక, బహూదక, హంస, పరమ హంస, అనే చతుర్విధ, సన్యాసాశ్రమాలూ, ఆన్వీక్షకీ, వార్తా, దండనీతి విద్యలూ, నాలుగు వ్యాహృతులూ, బ్రహ్మదేవుని చతుర్వదనాలనుండీ వెలువడ్డాయి, అతని హృదయనుండి ఓంకారం ప్రకటింపబడింది. ఉపనయన సంస్కారం అయిన తరువాత అహోరాత్రి త్రయం వరకూ నిర్దేశింప బడిన గాయత్రి అధ్యయనానికే 'సావిత్రి బ్రహ్మ చర్య' మని పేరు. వత్సరకాల నియమంతో కొన సాగించునట్టి బ్రహ్మచర్య వ్రతానికి ప్రాజాపత్య

బ్రహ్మచర్య వ్రతమని పేరు. వేదాధ్యయనం పూర్తి అయ్యే వరకూ కొనసాగించే వ్రతానికే బ్రాహ్మ బ్రహ్మచర్య వ్రతమని పేరు. జీవన పర్యంతం కొనసాగించగల బ్రహ్మచర్యానికి బృహద్బ్రహ్మచర్య వ్రతమని పేరు. అర్హత, అధికార, శక్తుల ననుసరించి పైన పేర్కొన బడిన వాటిని బ్రహ్మచారి పాటించాలి. వార్త అంటే – కృషివాణిజ్య. శాస్త్రవిహిత మైన వృత్తులు యాగాదుల నాచరింప జేసి ధనాన్ని సముపార్జించడమే సంచయమంటే, యాచించకుండ లభించినదానితో తృప్తి చెంద డమే శాలీనవృత్తి అవుతుంది పంటచేలు కోసి రైతు ధాన్యాదులను పూర్తిగా తీసుకొనివెళ్ళిన తర్వాత అక్కడ రాలిన గింజలను సేకరించి జీవించునట్టి వృత్తికే శిలోంఛమని పేరు. ఈ నాలుగూ గృహస్థులైన వానికి ధర్మాలు. ఇదే రీతిగా దున్నకుండ, విత్తనాలు చల్లకుండా ఫలించిన పదార్థాలను స్వీకరించి జీవించడం వైఖానసవృత్తి అవుతుంది. నూతన వస్తువు లభించగానే నిలవలో ఉన్న వస్తువులను పంచి పెట్టి వెయ్యడాన్ని వాలఖిల్య మంటారు. ప్రాతః కాలంలో లేవగానే ముఖం ఏదిశగా ఉంటే ఆ దిశగా వెళ్ళి ఫలాదులను గ్రహించి తెచ్చికోవడాన్ని ఔదుంబర మంటారు. తమంత తాముగా ఫలించి నేలరాలిన ఫలాదులను స్వీక రించడానికి ఫేనప వ్రతమని పేరు. ఇవి వాన ప్రస్థాశ్రమ నియమాలు.

పర్ణశాలను నిర్మించుకుని నిజాశ్రమ ధర్మాలను పాటించే వ్యక్తి కుటీచక సన్యాసి అనబడతాడు. జ్ఞానాన్ని ప్రధానంగా చూస్తూ కర్మయందు గౌణదృష్టి కలవాడు బహూదక సన్యాసి అనబడతాడు. నిరంతర జ్ఞానాభ్యాసి 'హంస' అనబడతాడు. ఆత్మవిద్యను గ్రహించి సదా ఆత్మానుభూతిని పొందేవాడే పరమ 'హంస. సన్యాసులకు విధింపబడిన ఈ నాలుగూ ఆశ్రమ భేదాలు, మోక్షాన్ని ప్రాప్తింప జేసే విద్యకే ఆన్వీక్షికీ అంటారు. స్వర్గాది భోగప్రాప్తికి సహకరించే విద్యకే త్రయీవిద్య అని పేరు కృషి వాణిజ్యాదులకు సంబంధించిన దానిని 'వార్త' అం టారు. రాజనీతికే దండనీతి అని పేరుంది. ఈ నాల్గింటికీ 'విద్య' లని పేరు. భూః భువః స్వః, ఈ మూడూ కలిసి కానీ, మహఃతో కానీ ఈ నాలుగూ వ్యాహృతులనబడతాయి.

వేదాలందూ, ఆశ్వలాయన గృహ్య సూత్రాలందూ, వ్యాహృతులను గురించి విశ దీకరింపబడి ఉంది. ఈ రీతిగా ఈ సర్వమూ చతుర్ముఖుని నుండి ప్రాదుర్భవించాయి. బ్రహ్మ దేవుని రోమాల నుండి ఉష్ణిక్కూ, త్వక్కు ద్వారా గాయత్రీ మాంసం ద్వారా త్రిష్టుప్, స్నాయువులనుండి అనుష్టుప్, అస్థులద్వారా జగతీ, మజ్జా ధాతువు నుండి పంక్తి, ప్రాణాల ద్వారా బృహతీ,–అనే ఛందస్సులు ఆవిర్భ వించాయి. ఈ రీతిగానే బ్రహ్మదేవుని జీవం కకారాది పంచవర్ణ సమూహంగానూ, శరీరం అకారాది సర్వవర్ణ రూపంలోనూ, ఇంద్రి యాలు శషసహా అనే ఊష్మవర్ణాలుగా య,ర,ల,వ లనే అంతస్థ వర్ణాలుగా అంటే అకారాదుల యిన అక్షర సమామ్నాయమే జీవదేహేం ద్రియ బలాలుగా వర్ణించబడ్డాయి. బ్రహ్మ దేవుని క్రీడద్వారానే నిషాద, ఋషభ గాంధార, షడ్జమ, మధ్యమ, దైవత పంచమా లనే సప్తస్వరాలూ జన్మించాయి. అతడే

బ్రహ్మ స్వరూపుడూ, బ్రహ్మశబ్ద వాచ్యుడూ అతడే. అవ్యక్తంగా ప్రణవ రూపంలోనూ, వ్యక్తంగా వైఖరీరూపంలోనూ అతడే ఉంటాడు. అతనికి పరమైన వాడే పరబ్రహ్మ. ఇంద్రాద్యనేక స్వరూపాలలో ప్రకాశించేవాడు ఆ పర బ్రహ్మయే. బ్రహ్మదేవుడు ఆదిలో దేహాన్ని త్యజించి మరోదేహాన్ని ధరించినట్లు విన్నావు కదా! ద్వితీయ దేహాన్ని ధరించి జగత్తు విస్తరించాలని చూడగా — మరీచ్యాదుల ద్వారా విశ్వ విస్తారం కాలేదు. ఆయన మనస్సులో విచారం ఏర్పడింది. ఎన్ని పర్యాయాలు నేను ప్రయత్నించినా ప్రజావృద్ధి కలగడం లేదు. ఇందులో దైవికమైన విఘ్నాలు కలుగుతున్నాయి.'' అంటూ అతడు భగవంతుణ్ణి గురించి యోచించడంతో, తత్సమయంలో అతని దేహం రెండు భాగాలయింది. బ్రహ్మకు అసలు పేరైన 'క' నుండి విభాగం కావడంవల్ల 'కాయ' మయింది. ఆ విభాగద్వయం నుండి స్త్రీ పురుష మిథునం ఏర్పడడంతో అందులో పురుషుడు ఆదిసామ్రాట్ - అంటే సార్వభౌముడయ్యాడు. ఆది మనువును స్వాయంభువుడన్నారు. ఆది స్త్రీ శతరూపా సతి. తదాదిగా స్త్రీ పురుష సంపర్క రూపమిథున సృష్టి ఆరంభమయింది.

శతరూపా స్వాయంభువ మను దంపతుల శృంగార ఫలంగా ప్రియవ్రత, ఉత్తానపాదా నామాలతో కుమారు లిద్దరూ, ఆకూతీ, దేవహూతీ, ప్రసూతీ నామాలతో కన్యలు, ముగ్గురూ జన్మించారు. దేవహూతిని కర్దమునికీ, ఆకూతిని రుచి ప్రజాపతికీ, ప్రసూతిని దక్షప్రజాపతికీ యిచ్చి స్వాయంభువ మనువు వివాహం చేసాడు. వీరి సంతతి క్రమంగా విశ్వమంతా వ్యాపించి వర్ధిల్లింది.

స్కంధం-3 — అధ్యాయం-12

## సృష్టి విస్తారము

శుక మహర్షి - పరీక్షిన్నరేంద్రా! మైత్రేయ మహర్షి ద్వారా విదురుడు ఈ పావన గాథలను ఆలకించి "మహాత్మా! మైత్రేయా! బ్రహ్మ దేవనందనుడైన స్వాయంభువమనువు శతరూపను అర్ధాంగిగా స్వీకరించి చేసినదేమిటో వర్ణించండి. ''శరణాగత వత్సలుడైన హరి కథామృతాన్ని పానం చెయ్యాలని ఉంది.'' అని విశేషాసక్తితో అర్థించగా మైత్రేయ మహర్షి చెబుతున్నాడు. ''శతరూపాసతీ సమేతంగా బ్రహ్మనుండి ప్రభవించిన స్వాయంభువమనువు - అంజలి బద్ధుడై 'జనకా! జీవ సమేతంగా లోక సర్వస్వాన్నీ పాలించి పోషించి లయం చెయ్యగల సర్వ సమర్థుడవు నువ్వు మాత్రమే, మేము నీ సంతానంలోనివారము. నీ సేవ మాకు పరమ ధర్మం. మా కర్తవ్య సేవ ఏమిటో ఆదేశించు,' అని ప్రార్థించగా బ్రహ్మ దేవుడిలా అన్నాడు.

''వత్సా! పృథ్వీనాథా! వినయ విధేయతలతో నన్ను ఆజ్ఞాపించండి.'' అని నువ్వు

కోరడంతో నేను నీయందు పరమ ప్రసన్నుడ నయ్యాను. పరుల యందెట్టి అసూయా భావాలు లేకుండ పితృ ఆజ్ఞను పాలించడమే పుత్రులైన వారికి పరమ ధర్మము. నువ్వు సతీసమేతంగా ఉత్తమ సంతానాన్ని కని యాగాల ద్వారా శ్రీ మన్నారాయణ భగవానుణ్ణి ఆరాధించు నాలుగు పాదాలతో ధర్మాన్ని నడిచేలా చేయడమే ప్రజాపాలన కొనసాగించడమే నన్ను సేవించడ మవుతుంది. ప్రజాపాలన సక్రమంగా చెయ్యడం ద్వారా భగవదనుగ్రహం లభ్యమవుతుంది. భగవ దనుగ్రహాన్ని పొందనివాని జన్మ వృథాయే అవుతుంది.) ఆత్మద్రోహి అంటే వాడే అవుతాడు' అని బ్రహ్మదేవుడు పలుకగా స్వాయంభువమనువు "పితృ పూజ్యా! మీ ఆదేశాన్ని శిరోధార్యంచేసి పాలిస్తాను. సంతానానికీ నాకూ నివాసస్థానాన్ని చూపించండి. ప్రళయ వారాశిలో మునిగి పోయిన పృధ్విని ఉద్ధరించి జీవరాశి కంతకూ ఆశ్రయాన్ని ప్రసాదించండి! అంటూ ప్రార్థించాడు.

అపార అగాధ జలరాశిలో మునిగిపోయిన భూమిని ఉద్ధరించడం ఎలాగ? అని బ్రహ్మదేవుడు చాలా సేపు యోచించి "సృష్టి రచనా దృష్టిలో నేనుండగా పృధ్వీరసాతలానికి పోయింది. ఈ స్థితిలో నా కర్తవ్యం ఏమిటి? అని అతడు యోచిస్తూ సమస్త కారణాలకూ కారణుడూ సర్వ శక్తిమంతుడూ అయిన శ్రీహరిని స్తుతించాలన్న నిశ్చయంతో ఉండగానే అతని నాసారంధ్రాల నుండి అంగుష్ఠ మాత్ర ప్రమాణంలో ఓ వరాహాకారం ప్రాదుర్భవించి - ఆకాశంలో ఏనుగంతగా అది పెరిగిపోయింది. దానిని తిలకిస్తూన్న సనక సనందనాదులూ మరీచ్యాది ప్రజాపతులూ శతరూపామను సమేతంగా బ్రహ్మదేవుడూ ఆశ్చర్య పోయాడు. ఏమిటీ వరాహరూపం. నాసికా రంధ్రాల నుండి అవతరించి ఏనుగంత అయిపోయి ఇప్పుడు పర్వత సదృశాకారంలో ఉంది. ఇది సామాన్యమైనది కాదు. యజ్ఞ స్వరూపుడైన శ్రీహరియే ఈ రూపంలో ప్రాదుర్భవించాడని వారు భావిస్తూండగానే శ్రీహరి - వరాహ రూపంలో గర్జించ సాగాడు. ఆ భయంకర ధ్వనులు దశదిశలా ప్రతిధ్వనించాయి. ఆ ధ్వనులు బ్రహ్మాదులందరకూ అభయాన్ని ప్రసాదిస్తూన్న ట్లుంది.

ఆదివరాహం యొక్క ఆ భయంకర గర్జనలు విన్న జన, తప, సత్యలోక వాసులయిన మహర్షులందరూ ఋగ్యజుస్సామ మంత్రాలతో యజ్ఞ వరాహ మూర్తిని స్తోత్రం చేయ సాగారు. వేదాలు పరమాత్మ స్వరూపాన్నే విశేషంగా వర్ణించాయి. వేదోక్తంగా మహర్షులు కావించిన ఆస్తుతులకు ఆది వరాహ మూర్తి పరమప్రసన్నుడై పదేపదే గర్జిస్తూ ఆ మహా ప్రళయ జలాలలో ప్రవేశించి వాలాన్ని పైకెత్తి మహావేగంతో ఆకాశంలో గంతులు వేసాడు. పాదా ఘాతాలతో, గళమండలి కఠినమైన రోమాలతో మేఘజాలాన్ని చెల్లా చెదురు చేసి వేసాడు. ఆ వరాహదేహం, రోమాలతో సహా మహా కఠినంగా ఉంది. ధవళ కాంతులలో కోరలూ సూర్య సదృశ తేజస్సంపన్నాలైన నయనాలూ, అపూర్వ మహా శోభను కలగ జేస్తున్నాయి. స్వతః

యజ్ఞమూర్తి అయిన శ్రీహరి వరాహ స్వరూపాన్ని దాల్చడంతో నాసికతో - గంధగుణ ప్రధానమైన భూమి జాడను తెలిసికోవాలని ఆఘ్రాణిస్తున్నాడు. కరాళ దంష్ట్రలతో విశాలాకారంలో ఉండడం వల్ల ఆ వరాహం క్రూర భయంకరంగా ఉంది. అలా ఉన్న ఆ వరాహ భగవానుడు తనను స్తుతిస్తున్న మరీచ్యాదులందరినీ అనుగ్రహ దృష్టితో చూస్తూనే జల రాశిలో ప్రవేశించాడు. ఆతని వజ్ర సమ కఠోర స్పర్శతో సాగరగర్భం విచ్ఛిన్నమై మేఘాలు ఉరిమినట్లు ఘోరనాదాలు ప్రతిధ్వనించాయి. తత్సమయంలో సాగరుడు ఉత్తుంగ తరంగ రూప విశాల భుజాలతో నమస్కరించి- యజ్ఞ వరాహ స్వరూపా! పాహిమాం పాహిమాం' అని ఘోషిస్తున్నాడా? అన్నట్లుంది. అంత ఆ దేవదేవుడు జలాంతర్భాగం ద్వారా రసాతలం చేరి పృథ్విని ఓ చిన్న బంతినివలె ఒకే కోరపై లేవనెత్తి పైకి వస్తూండగా హిరణ్యాక్షుడు గదా ధారియై అడ్డం వచ్చి గదా ప్రహారం ఆరంభించాడు. దానివల్ల వరాహ భగవానుడు తీవ్ర క్రోధంతో సింహం గజమును సంహరించిన విధంగా దంతాయుధంతోనే హిరణ్యాక్షుని చీల్చివేసి రక్తమయ వదనంతో వస్తూండగా గజేంద్రుడు రక్తవర్ణంగల భూమిని దంతాలతో భిన్నం చేసినట్లు స్ఫురించసాగింది. గజరాజు దంతాగ్రాలపై కమల పుష్పాన్ని ధరించి వస్తున్న రీతిగా వరాహస్వామి పద్మకోశాకారంలో ఉన్న పృథ్విని దంష్ట్రాగ్ర భాగంలో ధరించి జలాలపైకి రావడం చూస్తూనే మరీచ్యాదులతోసహా చతుర్ముఖుడు అంజలి బద్ధుడై స్తుతించ సాగాడు.

"యజ్ఞ వరాహస్వామీ! ఓ అజితా! నీకు జయమగును గాక! యజ్ఞపతేపీ! వేదత్రయ స్వరూపంలో భాసిల్లేనీ నీవరాహరూపానికి వందనాలు. యాగాలన్నీ నీ రోమకూపాలలో లీనమై ఉన్నాయి. భూమిని ఉద్ధరించే దివ్య సంకల్పంతో నువ్వు వరాహ స్వరూపాన్ని దాల్చినావు. నీకు ప్రణామాలు, దురాచారులయిన వారికి నీ ఈ యజ్ఞ వరాహ స్వరూప దర్శనం కాదు. నీ యీ మూర్తియొక్క త్వక్కులో గాయత్రి ఆదిగాగల ఛందస్సులు, రోమాలలో దర్భలూ, నేత్రాలలో ఘృతమూ. పాద చతుష్టయంలో హోత, అధ్వర్యుడు ఉద్గాత, బ్రహ్మ-వారిద్వారా కొనసాగించబడు కర్మలలా ఉంటాయి. నీ ముఖం యొక్క అగ్ర భాగంలో స్రుక్కు, నాసా ఛిద్రాలలో స్రువమూ ఉదరంలో యజ్ఞీయమైన భక్షణ పాత్ర అయిన ఇడా, శ్రవణాలలో చమసమూ, వదనంలో బ్రహ్మభాగపాత్ర అయిన ప్రాశిత్రమూ, కంఠరంధ్రంలో సోమపాత్ర అయిన గ్రహమూ తేజరిల్లుతూన్నాయి. నువ్వు నమలడమే అగ్నిహోత్రం కాగా పదే పదే అవతరించడమే దాక్షిణీయేష్టి అవుతూన్నది. నీ గళసీమయే ఉపసదము. నీ దంష్ట్రలే ప్రాయణీయము అనగా దీక్షానంతరం కొనసాగించే ఇష్టి, ఉదన యేష్టి- అంటే యాగాంత వేళలోచేసే యిష్టి నీజిహ్వ ప్రవర్గం అంటే ప్రతీ ఉపసర వానికి ముందు చేసే మహావీర కర్మ నీ మస్తకమే సభ్య, ఆవసద్యాలు, హోమ రహితమైన అగ్నిని సభ్యమనీ, ఔపస నాగ్నిని ఆవ పద్యమనీ అంటారు. నీ ప్రాణాలే చితి - అంటే ఇష్టకా చయనము. నువ్వు ఆసీనుడవు కావడమే ప్రాతర్మాధ్యం

దినసాయం సవనాలు అవుతాయి. నీ సప్తధాతు వులే అగ్నిష్టోమ. అత్యగ్నిష్టోమ ఉక్థ్య, షోడశి వాజపేయ, అతి రాత్రి, ఆప్తోర్యామాది గాగల సప్త సంస్థ లవుతూన్నాయి. నీ దేహ సంధులే సత్రయాగాలన్నీ కాగా - సంపూర్ణ సోమ సహిత, సోమరహిత యాగక్రతు స్వరూపుడవు నీవై భాసిల్లుతూన్నావు. యాగానుష్ఠాన రూపాలైన ఇష్టులే నీ అవయవాలు. సర్వం కలిసి మాంసపేశీలు. సర్వదేవతలూ, మంత్ర ద్రవ్య యాగ కర్మలన్నీ నీ స్వరూపాలే. సర్వవేదమయ యాగమయ స్వరూపా! నీకివే మా ప్రణామాలు.

అరణ్య ప్రదేశం నుండి బయటకు వస్తూన్న గజరాజు యొక్క దంతాగ్రభాగం మీద ఉన్న పత్రయుక్త పద్మంలా పర్వతసమేతమైన ఈ భూమండలం నీ దంష్ట్రాగ్ర భాగంలో తేజరిల్లుతూన్నది. చరాచర ప్రాణుల సుఖ శాంతుల కోసం నువ్వు నీ పత్నీ స్వరూపిణి అయిన భూదేవిని ఉద్ధరించావు. జలాల మీదనే ఈ జగద్ధాత్రిని సంస్థాపించు దేవా! ఓజగజ్జనకా! అగ్నిని అరణిలో స్థాపించినట్లు భవదీయధారణా శక్తిరూపమైన మహా తేజాన్ని ఈ భూమిలో స్థాపించు. నీకూ భూదేవికీ మేము ప్రణమిల్లుతూన్నాము. రసాతలం నుండి భూమిని ఉద్ధరించగల శక్తి సామర్థ్యాలు నీకు వినా మరెవరికీ ఉన్నాయి. ఇందులో వింత ఏమీలేదు. దేవా! నువ్వు నీ దేహాన్ని విదలిస్తూండగా నీ గళసీమ యందలి రోమాలపై గల జలబిందువులు మాపై పడుతూన్నాయి. తద్వారా సత్య, జన, తపోలోక వాసులమైన మేమంతా పవిత్రులమైనాము. "అంటూ స్తోత్రం చేసే బ్రహ్మాదుల యందు ప్రసన్నుడై జలాలను స్తంభింప జేసి పృథ్విని జలాలపై నిలిపి ఆ వరాహస్వామి అంతర్ధానమై పోయాడు. విదురా! పరమ పవిత్రమై కీర్తనీయమై, లీలామయమై వసుంధరోద్ధరణ కారణ భూతమైన ఆది వరాహావతార గాథను పఠించినా, ఆలకించినా మనుష్య మాత్రుడు సర్వ పాప దూరుడై ఐహిక పారలౌకిక సుఖ శాంతులను అనుభవించి అవసాన దశలో మోక్షాన్ని పొందుతాడు. ఇది త్రికాలాబాధ్య మానమైన పరమ సత్య విషయము." అంటూ మైత్రేయ మహర్షి చెప్పాడని శుక మహర్షి పరీక్షిత్తుకు వినిపించాడు.

స్కంధం-3 — అధ్యాయం-13

# వరాహావతార వర్ణన

శుకమహర్షి పలుకుతూన్నాడు :- పరీక్ష్మహారాజా! మైత్రేయ మహాత్ముని ద్వారా విశేషంగా శ్రీహరి లీలను ఆలకించిన విదురుడు తృప్తి చెందక ఆ మహర్షికి ప్రణమిల్లి- "మునీంద్రా! శ్రీహరి వరాహావతారమెత్తి భూమిని ఉద్ధరిస్తూన్న వేళలో ఆది దైత్యుడైన హిరణ్యాక్షరాక్షసుణ్ణి అంతం చేసినట్లు చెప్పారు కదా! ఎవరా హిరణ్యాక్షుడు? ఎట్టి పుణ్య కార్యా చరణవల్ల ఆతడు హరి చేతులలో అంతమయ్యాడు. వివరంగా చెప్పండి" అని కోరగా

మైత్రేయ మహర్షి బదులు చెబుతూన్నాడు. "విదురా! ఉత్తమమైన ప్రశ్న వేసావు. మృత్యు పాశం నుండి సంరక్షించగలది భగవచ్ఛరిత్ర మాత్రమే.

నారద దేవర్షి ఉపదేశం ద్వారా ఉత్తాన పాద నందనుడైన ధృవుడు శ్రీహరి అనుగ్రహంతో మృత్యువును జయించాడు. పురాతన కాలంలో వరాహ - హిరణ్యాక్షుల యుద్ధాన్ని గురించి దేవతలు ప్రశ్నించగా ఆ ఘట్టాన్ని బ్రహ్మదేవుడు వారికి వినిపించాడు. పరంపరాగతమైన ఆ గాథను నేను విన్న దానిని నీకు చెబుతాను-ఆలకించు.

ఒకానొకప్పుడు దక్షపుత్రి అయిన దితి భర్త అయిన కశ్యప ప్రజాపతిని చేరి ప్రణమిల్లి పుత్రప్రాప్తికై కామాతురయై సంధ్యా సమయంలో అర్థించింది. తత్సమయంలో కశ్యపుడు పాయసంతో అగ్నికి ఆహుతులిచ్చి అగ్నిజిహ్వుడైన యజ్ఞపతిని ఆరాధిస్తూ ధ్యానమగ్నుడై ఉన్నాడు. అప్పుడు దితి "నాథా! మదపుటేనుగు కదలీ తరువును మర్దించి వేసినట్లు మదనుడు నన్ను వేధించి వేస్తున్నాడు. నేను సంతానవతిని కాకపోవడమూ,నాసవతులందరూసంతానవతులు కావడమూ చూసి నేను వేదన చెందుతూన్నాను. అనుగ్రహించి నాకు పుత్రసంతానాన్ని ప్రసాదించండి. తన నుండి భర్త పుత్ర రూపంలో జన్మించినప్పుడే ఆ స్త్రీ భర్తచే గౌరవింప బడినట్లవుతుంది. నాడే యీామె యశస్సు దశదిశలా వ్యాపిస్తుంది. మా జనకుడైన దక్ష ప్రజాపతి కుమార్తెలమైన మమ్మల్ని అందరినీ ప్రేమగా చూసేవాడు. ఓ నాడాయన మమల్ని అందరినీ వేర్వేరుగా పిలచి మీకెలాంటి భర్త కావాలని అడిగితే మామా అభిమతాలు చెప్పాము. మా అక్కచెల్లెండ్రకు అభిమతమైన పురుషునిచ్చి మాకు వివాహాలు చేయించాడు. అందులో పదముగ్గురమైన మేము మరీచినందనులైన కశ్యప ప్రజాపతిని వరించామనగా ఆయన మీకు మమ్మల్ని యిచ్చి పెళ్ళి చేయించాడు. మీ అనుగ్రహానికి పాత్రులమై మేము సంచరిస్తూన్నము.

నా సవతు లందరికీ బిడ్డలు కలిగారు. నాకే కలుగలేదు. నన్ను అనుగ్రహించి ఇప్పుడు నాకు సంతానాన్ని ప్రసాదించండి." అని ఈ ప్రకారంగా కామ పరవశురాలై దితి - కశ్యప మహర్షికి ధ్యానం లగ్నం కాకుండా పుత్రప్రాప్తికై అనేక విధాల అర్థిస్తుంటే కశ్యపుడు "దితీ! నీ యిచ్ఛాను సారమే చేస్తాను. ధర్మార్థ కామ ధనమైన భార్య వాంఛను నెరవేర్చని వాడెవడుంటాడు? నౌకను ఆధారంగా చేసుకుని మానవుడు సాగరాన్ని దాటినట్లే గృహస్థాశ్రమవాసి బ్రహ్మచర్యాది ఆశ్రమాలకు ఆశ్రయం యిస్తూ తాను స్వయంగా దుఃఖ సాగరానికి దాటగలుగుతాడు. పురుషార్థత్రయు కాముడైన వానికి స్త్రీ అర్ధంగా నిర్వచింపబడింది. ఆమె యందే కుటుంబ భారమంతా ఉంచి యజమాని నిశ్చింతగా తిరుగ గలుగుతాడు. ఇంద్రియ రూపాలైన శత్రువులూ, బ్రహ్మచర్యాది ఆశ్రమ వాసులకు జయించ

రానివి. దుర్గాధికారియైన ప్రభువు చోరులను సుగమంగా స్వాధీనం చేసుకోగలిగినట్లు గృహస్థు అర్ధాంగిని ఆశ్రయించి ఇంద్రియ రూప వైరులను సునాయాసంగా జయించ గలుగుతాడు. గృహేశ్వరి అయిన అర్ధాంగి చేసిన ఉపకారానికి పురుషుడు జన్మ జన్మాంతరాలలో ప్రత్యుపకారం చెయ్యలేడు. యథాశక్తి నీ మనోరథాన్ని నెరవేరుస్తాను ఓ ముహూర్తకాలం ఆగు. ఇది రాక్షస కాలం నింద్యా సమయం, చూడడానికే మహాభయంగా ఉంటుంది. భూతనాథుని భూత ప్రేత పిశాచాలు పరిభ్రమిస్తూంటాయి. మహేశ్వరుడు కూడ ఈ సమయంలో శ్మశానం నుండి మరలి రావడం వల్ల ఆ చితాభస్మం జటాజూటం మీద పడి సువర్ణ దేహుడైన భవుడు భస్మోద్ధూళిత విగ్రహుడై పరిభ్రమిస్తూ ఉంటాడు. సూర్యచంద్రాగ్ని రూప నేత్ర త్రయంతో చూస్తుండే అతనికి స్వపర భేదం ఉండదు. ఆ దేవ దేవుని మాయను గ్రహించాలని మనం తపోదాన వ్రతాదులు ఆచరిస్తూంటాము. కుక్కలకు ఆహారమైపోయే ఈ దేహాన్ని విశ్వసించి మూఢులు పరమ శివుని వేషాలంకారాదులను చూసి పరిహసిస్తూంటారు. మహాదేవుని ధర్మ మర్యాదలను బ్రహ్మాదులే ఉల్లంఘించ లేక పోతూంటే మన మనగా ఎంతవారము ? కనుక గణసమేతంగా భూతనాథుడు సంచారం చేసే ఈ సమయం ఘోర మయినది. యోగ్యమయినది ఎంత మాత్రం కాదు.'' అని కశ్యప మహర్షి ఎన్ని విధాల చెప్పినా కామాంధురాలైన దితి వివశయై కశ్యపుని బలవంతం చేయగా అతడు భగవంతునికి ప్రణమిల్లి ఆమెకు కలిసాడు. తరువాత స్నానమాచరించి ప్రాణాయామం ద్వారా వాగ్బంధనం చేసి ధ్యాన యోగంలో ఆసీనుడయ్యాడు. ఆ నిందితకర్మకు దితి సయితం సిగ్గుపడి పోయింది. అవనత వదనయై కశ్యప బ్రహ్మర్షితో 'స్వామీ ! భూత పతిఅయిన రుద్రభగవానునికి నేను అపరాధం చేసాను. అయినా ఆ కరుణామయుడు నా గర్భాన్ని విచ్ఛిన్నం చేయకుండును గాక ! దుష్ట శిక్షకుడూ, శిష్ట జన సంరక్షకుడూ మంగళ మూర్తి అయిన రుద్రదేవునికి నేను వందనం చేస్తున్నాను. అబలలయందు కిరాతకులకు కూడ దయ కలుగుతుంది. సతీ పతీ, నాకు మరదీ, కరుణా సాగరుడైన శంకర భగవానుడు. నన్ను అనుగ్రహించును గాక !'' అని ప్రార్థించ సాగింది.

అంతలో కశ్యప మహర్షి సాయం సంధ్యా వందనాలు పూర్తి చేసుకుని కనులు తెరచి చూసే సరికి వణకి పోతూ నిజసంతానం యొక్క ఐహిక పారలౌకిక ఔన్నత్యార్థం మహాదేవుణ్ణి ప్రార్థిస్తున్న - అర్ధాంగియైన దితిని చూసాడు. "దితీ! కామ వాసనతో దుష్టమైన చిత్తంతో, అసమయంలో నా మాటలను ధిక్కరించి నువ్వు అమరులను అవమానించావు. ఫలితంగా - నీగర్భం నుండి అమంగళమయులూ, అధమ లక్షణులూ అయిన కుమారులిద్దరు జన్మిస్తారు. పదే పదే లోక పాలురను పీడిస్తూ అబలలపై వారు అత్యాచారాలు కొనసాగి

స్తూంటే నిరపరాధులైన సాధువులను వేధిస్తూంటే - అమరులూ - సజ్జనులూ వీరి బాధలను భరించలేక పోతూ ధర్మ రక్షకుడైన శ్రీమన్నారాయణ దేవుని ప్రార్ధించగా ఆ దేవదేవుడు అవతరించి క్రుద్ధుడై వీరిని సంహరిస్తాడు.' అన్న భర్త వచనాలను ఆలకించిన దితి 'స్వామీ అదే నేను వాంఛించేది కూడ. నాపుత్రులు బ్రాహ్మణ శాపదగ్ధులు కాకుండ నారాయణుని హస్తాలలో అంతమైతే అదేచాలు. సర్వ జీవులకూ భయాన్ని కలుగ జేస్తూ విప్రశాపదగ్ధులలో మృతి చెందితే నరక లోకానుభవం కల జీవులు కూడ వారిని మన్నించరు. నా పుత్రులు హరి కరకమలాలలో అంతం కావడమే సర్వోత్కృష్ట విషయం' అంది.

"దేవీ! కామాంధురాలవై నువ్వు చెయ్యరాని పనికి సిద్ధపడినా స్వాపరాధాన్ని గ్రహించి పశ్చాత్తాపం చెందావు. కావున శంకర బ్రహ్మాది దేవతలూ నిన్నూ నన్నూ అనుగ్రహించెదరు గాక! నీ పుత్రులు నలుగురిలో ఒకనికి కలిగిన కుమారుడు భక్తశిఖామణియై అమరులచేత కూడ గౌరవింప బడతాడు. హరి కథా సంకీర్తనం వల్ల అతని యశస్సు వర్ధిల్లుతుంది. పుటాలు పెట్టే కొలదీ బంగారం శుద్ధమయే ట్లు భగవతాన్నిధ్యం చేరేటందులకు సజ్జనులు వైరాదులకు దూరులై నిజాంతఃకరణాలను పరిశుద్ధం చేసుకుంటూ ఉంటారు. దితీ! నీ పౌత్రుడు భగవద్భక్తుడై, సదాచార సంపన్నుడై, మహాప్రభావ శాలియై, ఉదారుడై ప్రౌఢ భక్తి ద్వారా విశుద్ధాంత రంగుడై శరీరాభిమానాన్ని పరిత్యజించి విషయాల యందు ఆసక్తి లేనివాడై పరుల సుఖాన్ని స్వసుఖంగా భావించి అజాత శత్రువై, సర్వ సంగ పరిత్యాగియై శ్రీమన్నారాయణ దేవుని సాక్షాత్కరింప జేసు కుంటాడు.

పై విధంగా చెప్పిన భర్త వచనాలను ఆలకించి హరి హస్తాలలో తన పుత్రులకు అంతమూ, మనుమడు మాత్రం భక్తి శిఖామణియై శ్రీహరి సందర్శన భాగ్యాన్ని పొందుతాడనీ గ్రహించి దితి అమితానందం పొందింది." అని మైత్రేయ మహర్షి విదురునకు వినిపించిన విధంగా శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు వినిపించాడు.

స్కంధం-3 అధ్యాయం-14

## దితిగర్భం ధరించుట.

అమరుల తేజాన్ని హరించాలన్న సంకల్పంతో దితి కశ్యప వీర్యాని దీర్ఘకాల పర్యంతం స్వగర్భంలో ధరించి ఉంచింది. ఆ గర్భస్థమైన కశ్యప తేజస్సు సూర్యాదుల తేజస్సును అణచి వేసింది. మహేంద్రాది అష్ట దిక్పతులూ కూడ ప్రకాశశూన్యులై పోయారు. వారు బ్రహ్మదేవుని సమీపించి "దేవా! విశ్వమంతా అంధకారమయమై పోవడానికి గల హేతు

వును గ్రహించ లేకున్నాము. కాలజ్ఞుడవైన నీకు తెలియనిదేమీ లేదు. ఈ ఘోరాంధకార కారణం ఏమిటి ? దీనికి మేమందరం భీతి చెందుతూన్నాము. జ్ఞానశక్తి సంపన్నుడవైన నువ్వు మాయాశ్రితుడవై చతుర్ముఖ స్వరూపాన్ని ధారణచేసి రజోగుణ ప్రాధాన్యంతో సృష్టి రచన చేస్తున్నావు. నీ అవతార కారణం ఎవరికీ తెలియదు. నీకు మేము ప్రణమిల్లుతూన్నాము. కార్య కారణరూపమైన విశ్వమంతా నీలోనే ఉంది. విశ్వాతీతుడవు నువ్వు. మనో ప్రాణబుద్ధీంద్రియాలను జయించి నిన్నే ధ్యానిస్తూ పరమ యోగులైన వారు నిరతిశయానందాన్ని పొందుతూన్నారు. రజ్జు బంధితమైన వృషభం యజమాని సూచనాను సారం చేయునట్లు - మహాత్ములు వేద వచన బద్ధులై సత్కర్మానుష్ఠానాల ద్వారా నిన్నే సేవిస్తూంటారు. ముఖ్య ప్రాణ స్వరూపుడవూ, సర్వనియంతవూ కూడ నువ్వే. అట్టి నీకు వందనాలు. ఘోరాంధకారం వల్ల దివారాత్ర భేదం గోచరించడం లేదు. జగత్తులో కర్మలన్నీ ఆగిపోయాయి. తత్కారణంగా జీవులన్నింటికీ దుఃఖమే కలుగుతూన్నది. లోకానుగ్రహ దృష్ట్యా నువ్వు శరణాగతులను రక్షించెదవు గాక ! ఇంధనంలో అగ్ని వర్ధిల్లుతూన్నట్లు కశ్యపవీర్యం దితి గర్భంలో వృద్ధి చెందుతూ ఉండడం వల్ల ఈ మహాంధకారం వృద్ధి చెందుతూన్నదని - దీనులై వారు ప్రార్థిస్తూండగా - బ్రహ్మదేవుడు మందస్మితం చేసి - "అమరులారా ! నా పుత్రులూ, మీకు పూర్వజులూ అయిన సనక సనందనాదులు అంబరవీధిలో సంచారం చేస్తూ శుద్ధ సత్త్వమయ వైకుంఠలోకానికి వెళ్ళారు. అక్కడ అందరి కందరూ చతుర్భుజ రూపాలు ధరించి విష్ణు సదృశంగానే ఉంటారు, సర్వాన్నీ త్యజించి శ్రీమన్నారాయణ భగవానుని దివ్యచరణారవిందాలనే అర్చిస్తూ వారుంటారు. వేద వేదాంత ప్రతిపాద్యుడై శుద్ధ సత్త్వమయుడైన శ్రీహరి భక్తులను అనుగ్రహించే శుద్ధ సత్త్వమయ రూపంతో ప్రకాశిస్తూ ఉంటాడు.

ఆ వైకుంఠ లోకంలో నిశ్శ్రేయస నామకమైన కైవల్యమే రూపం ధరించి ప్రకాశిస్తూన్నదా ? అన్నట్లుంది. అది సర్వాభీష్టాలనూ నెరవేర్చునట్టి సుందర వృక్షాలతో నిండి శోభిల్లుతూ ఉంటుంది. సమస్త ఋతుధర్మాలూ ఆ వనంలో సర్వకాలాలలోనూ గోచరమవుతాయి, విమానాధిరూఢులై తమ కాంతలతో కలిసి గంధర్వులు పాపాలన్నింటిన్నీ భస్మం చేయునట్టి శ్రీహరి లీలలను గానం చేస్తూంటారు. ఆ వనాంతర్గత సరోవర తీరాలలో మాధవీ, వాసంతికాది లతలు వికసిత పుష్పాలంకృతాలై మధు సుగంధాన్ని వ్యాపింపజేస్తూ వారి మనస్సులను విశేషంగా ఆకర్షిస్తున్నా వారి దృష్టి మాత్రం చలించదు. హరి ధరించిన తులసీ మాల నుండి వెలువడే సుగంధం సమస్త పుష్ప గంధాన్ని అణచి వేస్తూంటుంది. తులసిని తిలకించి - కుంద మందార, కురవక పున్నాగ, ఉత్పల, వకుళాదులన్నీ తమలో తామిలా

అనుకుంటూనాన్నాయి. మన తపస్సు కంటె తులసి తపస్సే శ్రేష్ఠమైనది.

వజ్ర, వైడూర్య, మరకత మాణిక్యాలతో, వైకుంఠం నిండి ఉంది. అనేకమంది హరి భక్తులు హరి రూపులై ఆ విమానాలలో గోచరమవుతూన్నారు. వారి మనస్సులను మహా సౌందర్య రాసులయిన అమరకాంతలు కూడ ఆకర్షించక లేకపోతున్నారు. సౌందర్యమూర్తి అయిన శ్రీమహాలక్ష్మీదేవి సయితం సహజ సిద్ధమైన తన చంచలత్వాన్ని కూడ విడనాడి శ్రీమన్నారాయణ భగవానుని నిరంతరం సేవిస్తూ ఉంటుంది. పాదార విందాలలోని అందెలు ఘల్లు ఘల్లు మని ధ్వనిస్తూండగా ఆమె వచ్చి క్రీడా కాననంలో తులసి పత్రాలతో శ్రీహరి చరణ కమలాలను అర్చిస్తూ ఉంటుంది. పాప నాశన కారణాలైన భగవానుని శ్రీ చరణాలనూ, హరిలీలలనూ, విస్మరించి అజ్ఞానులు అర్థకామాలలో చిక్కుకొని సర్వనాశనమై పోతూన్నారు. అట్టి అభాగ్యులు ఆ దివ్య లోకాలను ఎలా సందర్శించగలుగుతారు. వారికి కనిపించేది నరకం మాత్రమే. భగవంతుని పొందడానికి కావలసిన తత్త్వజ్ఞానమూ, ధర్మ కర్మలూ లభించేది ఈ మానవ లోకంలో మాత్రమే. మరే లోకంలోనూ అవి ప్రాప్తించవు. కనుకనే దేవతలమైన మనం కూడ మనుష్య లోకంలో జన్మించాలని కోరుతూంటాము. అట్టి మహోత్తను మర్త్య లోకంలో జన్మించి కూడ - కాంతా కనక వ్యామోహంలో చిక్కుకున్నారంటే అట్టివారు మహామాయా మోహితులైన దౌర్భాగ్యులనియే అనాలి. శ్రీహరిగాథల కీర్తనంతో, హరిలీలాభూయిష్టమైన దివ్యగాథలను పఠిస్తూ, ఆలకిస్తూ, శరీరం పులకరించగా ఆనందాశ్రువులు రాల్చగలవాడే ధన్యుడు కాగలుగుతాడు. అట్టివాడే వైకుంఠదర్శన భాగ్యాన్ని పొందగలుగుతాడు.

ఏవం విధ విశిష్ఠ గుణసంపన్నులయిన సనక, సనందన సనత్కుమార, సనత్సుజాతాదులు నివృత్తి మార్గరతులు కావడం వల్లనే వైకుంఠధామగమనం చెయ్య గలిగారు. యోగబలంతో తృటికాలంలో వైకుంఠం చేరిన సనక సనందనాదులు కక్ష్యాంతరాలు ఆరు దాటిన తరువాత సప్తమ కక్ష్యలో ప్రవేశించగా ఆ ద్వారానికి ఇరువైపులా గదాపాణులై వనమాలా ధారులై చతుర్భుజ రూపంతో శ్యామవర్ణులై హరిసమ స్వరూపాలతో ద్వారపాలు రిద్దరు నిలబడి ఉన్నారు. సంపూర్ణ తత్త్వవేత్తలూ సర్వుల కన్న వయసులో పెద్ద వారే అయినా పంచవర్ష ప్రాయంలో ఉంటే ఆ మహాత్ములు ద్వారాన్ని సమీపించి లోపలకు వెడుతూండగా దిగంబర రూపంలో ఉన్న వారి శక్తిని గ్రహించజాలని ద్వారపాలకులు వారిని నిరోధించారు.

అంతే ! వారి భృకుటి ముడిపడింది. శ్రీహరి సందర్శనానికి ఆటంకాన్ని కలుగజేస్తూన్న వారివైపు కోపంగా చూస్తూ "ద్వార

పాలకులారా! భగవత్సేవకులై వైకుంఠాన్ని పొందినవారు భగవత్సములై సమదర్శులు కాగలిగారు. అట్టి స్థాయిలో ఉండవలసిన వారి భేద భావానికి ఎలాగురి అయ్యారు? శ్రీహరి శాంతస్వభావుడు. పరులను శంకించరాదు, కపటులైన మీరు పరులను కూడ శంకితదృష్టితో చూస్తున్నారు. పరమాత్మ హృదయంలోనే బ్రహ్మాండాలన్నీ ఉన్నాయి. ఇక్కడ వారు తమకూ, పరమాత్మకూ భేదం లేదన్న భావంతో ఉంటారు. మహదాకాశాంతర్గతమై ఘటాకాశ సదృశంగా - భగవంతుణ్ణి అంతర్భావంతో దర్శిస్తూంటారు. దివ్యులై ఉండికూడ మీరు భగవంతునకు కూడ భేదభావ రూపమైన భయాన్ని కల్పిస్తున్నారు. హరిపార్షదులై యుండికూడ మీరు మందబుద్ధులుగా ఉంటున్నారంటే ఆశ్చర్యంగా ఉంది. దైవ లీలలు అనూహ్యాలు, మీకు శుభాలను చేకూర్చే నిమిత్తమే వ్యాపరాధా కి యోగ్యమైన దండనను మీకు విధిస్తున్నాము. భేద భావం కారణంగా మీరు వైకుంఠ పదభ్రష్టులై కామక్రోధ లోభాదులకు నిలయమైన పాపాత్ములై జన్మించెదరు గాక!'' అని శపించేసారు.

విప్రశాపం అమోఘమని గుర్తించిన జయ, విజయ, నామధేయులైన ఆ ద్వారపాలురు-శ్రీహరి కూడ విప్రశాపానికి భీతిల్లి మాట్లాడ డని గ్రహించిన వారై సనక సనంద నాదుల చరణాలపై పడి మహాత్ములారా! మన్నించండి. రక్షించండి. మమ్మల్ని మీరు శిక్షించడం న్యాయ సమ్మతమే. భగవానుని అభిమతాన్ని ఎరిగినవారమై ఉండికూడ అధికార మదోన్మత్తులమై శ్రీహరి ఆదేశాన్ని ఉల్లంఘించాము. మీ శాపంతో మాగర్వం అంతమయింది. భూతలలో పాతక జన్మంనెత్తినా మాకు భగవానునియందు విస్మృతి కలిగించునట్టి మోహం ఆవేశించకుండ ఉండేటట్లు మాత్రం కరుణించండి.'' అని ప్రార్థించారు.

సర్వజ్ఞమూర్తియైన శ్రీహరి జయ విజయులను సనకాదులు శపించిన విషయాన్ని గ్రహించినవాడై మహాలక్ష్మీ సమేతంగా అక్కడకు విజయం చేసాడు. హరిని సనకాదులు సందర్శించారు. ధవళచ్ఛత్రి చ్ఛాయలలో పార్షదులు వింజామరలతో విసరుచుండగా సకల సద్గుణాశ్రయుడూ, కరుణా సాగరుడూ, లక్ష్మీ వక్షఃస్థలాలయుడూ, పీతవస్త్రధారీ, కౌస్తుభాలంకృతుడూ, మకరకుండలధారీ అయిన శ్రీమన్నారాయణ దేవునకు సనకాదులు సాష్టాంగ ప్రణామం చేసారు. ఆ మహనీయులు నిరంతర బ్రహ్మానందమగ్నులై ఉన్నవారే అయినా హరిసందర్శన భాగ్యంతో విశేషానందాన్ని పొందారు. అత్యానంద పారవశ్యంతో వారు భగవంతుణ్ణి యిలా స్తుతించారు. దేవాధిదేవా! సర్వాంతర్యామి రూపుడవైన నువ్వు దుష్టుల అంతరంగాలలో ఉంటావు. అయినా వారు మాత్రం నిన్ను సందర్శించ జాలరు. నువ్వే మాకు అవ్యాజ కరుణవల్ల నీ సందర్శన భాగ్యాన్ని ప్రసాదించావు. నీ నుండి ప్రభవించిన మా జనకుడైన బ్రహ్మదేవుని ద్వారా ఆదిలోనే మేము భవదీయ దివ్య రహస్యమయ లీలలనూ, సగుణ, నిర్గుణ రూపాదులనూ

గ్రహించి ఉన్నాము. ఆ క్షణం నుండీ నిన్నే ధ్యానిస్తున్నాము. సర్వజ్ఞుడవైన నీకు తెలియని దేముంది? దేవా! నీ మాయ మమ్మలను మోహసాగరంలో ముంచకుండును గాక. నీ దివ్య మంగళమూర్తికి అనేక సహస్ర ప్రణామాలు అందజేస్తున్నాము." అని సనకాదులు ప్రార్థించగా శ్రీహరి వారిని ప్రస్తుతిస్తున్నాడు.

---

స్కంధం-3 — అధ్యాయం-15

## సనకాదులు జయ విజయులను శపించుట

'మహర్షులారా! నా పార్షదు లయిన యీ జయ విజయులు మహాపరాధమే చేసారు. వీరూ నా భక్తులే. మీరు వీరిని శిక్షించడం నా కిష్టమైనదే. భూసురోత్తములు నాకు పరమారాధ్యులు. కాగా అట్టి మిమ్మల్ని నా సేవకులు అవమానించారు. అది స్వాపరాధం గానే నేను భావిస్తున్నాను. అందుకే ప్రసన్నులు కావలసినదిగా మిమ్మల్ని అర్థిస్తున్నాను. సేవకులు చేసే అపరాధానికి -యజమానినే బాధ్యునిగా లోకం వ్యక్తం చేస్తుంది. చర్మవ్యాధి త్వక్కును పీడించినట్లు సేవకుల పొరబాట్లు యజమానికే అపకీర్తిని తెస్తాయి. మదీయ లీలా సంభరిత గాథల పఠన, శ్రవణ, సంకీర్తనాదులు కొనసాగించేవాడు చండాలుడే అయినా పరమ పవిత్రుడవుతాడు. కనుకనే 'వికుంఠుడు' అని నన్నంటారు. మీ వల్లనే నాకు పవిత్రమైన ఈ కీర్తి లభించింది. మీవిషయం ఎవరో కాదుస్వయంగా నా భుజాలే అపరాధం చేస్తే కూడ - వాటిని ఖండించ వలసినదే. త్వాగృస శజన సంసేవన వల్లనే మదీయ చరణరజం సర్వ పాపహారకం కాగలిగింది. శాంత స్వభావం కూడ అలవడింది. ఉదాసీన భావంతో ఉన్నా లక్ష్మి క్షణం కూడ నన్ను విడనాడకుండ ఉంటుంది. బ్రహ్మాదులు మహాలక్ష్మి అను గ్రహార్థమే విశేషంగా అనేక నియమ, వ్రతాదులను అనుష్ఠిస్తారు. సంపూర్ణ కర్మ ఫలాన్ని నాకు సమర్పించు నట్టి బ్రాహ్మణోత్తములు ప్రతి ముద్దతో తృప్తి పడుతూ ఘృత యుక్త పక్వాన్నాలను భుజించే వేళ నాకు కలిగే సంతృప్తి యజ్ఞ యాగాదులలో హవిర్భాగాలు యిచ్చేటప్పుడు కూడ కలగదు. అది యోగమాయను, గంగను, చంద్రశేఖ రాదులనూ, సర్వలోకాలనూ కూడ పావనం చేస్తుంది అట్టిదేవాధి దేవుడనై ఉండి కూడ నేను భూసురోత్తముల చరణరజాన్ని శిరస్సుపై దాలుస్తాను. విప్రులూ, క్షీరాల నిచ్చునట్టి గోవులూ, అనాథ జీవులూ నా శరీరం - మూర్ఖత్వం చే భూసురోత్తములను నాకన్న భిన్నంగా భావించి అనమాన పరచునట్టి వారు యమకింకరుల భయంకర హింసలకు గురి అవుతారు. కఠోర వచనాలతో భూసురులు నన్ను తిరస్కరిస్తున్నా మందస్మితంతో వారిని నేను ఆదరిస్తాను. వారికీ నాకూ తండ్రీ కొడుకుల న్యాయం ఉంది. మిమ్మల్ని నే నలాగే భావిస్తున్నాను. మీరు నా సేవకులను అనుగ్రహించి వారి అపరాధాలను అనుసరించి అధమగతిని పొంది అచిర కాలంలో నన్ను పొందేలా కరుణించండి," అని ప్రార్థించిన

హరి వచనాలకు సనకాదులు కోపంతో ఉన్నా మంత్ర ముగ్ధులై పోయారు. సారయుతమై, గంభీరమై అర్థపూర్ణమై స్వల్పాక్షర యుతమైన హరి పలుకులను ఆలకించినా సనకాదులకు భగవదభిప్రాయం అర్థం కాలేదు. అంతటి మహౌదార్యం చూపిన భగవంతుణ్ణి తిలకించిన సనకాదుల సర్వాంగాలూ గగుర్పొడిచాయి. యోగమాయా ప్రభావం ద్వారా నిజ మహైశ్వర్యాన్ని ప్రకటించునట్టి శ్రీమన్నారాయణునికి వందనంచేసి వారు పలకసాగారు. "నారాయణా! సర్వశక్తి సంపన్నుడవై ఉండి కూడ నువ్వు మాయందలి విశేషానుగ్రహం వల్లనే యిలాపలికావు. కానీ నీఅభి మతం నాకు తెలియ లేదు. నువ్వు విప్రశ్రేష్ఠులకు హితాన్ని చేకూర్చు నట్టివాడవు. కనుకనే విశ్వానికి ఆదర్శంగా నాకు బ్రాహ్మణులు ఆరాధ్యులని పలికావు. వాస్తవం యోచిస్తే విప్రులూ, దేవతలూ, కూడ నిన్నే ఆరాధిస్తూంటారు. నీ వల్లనే సనాతన ధర్మం అవతరించింది. వివిధ సమాయాలలో అసంఖ్యాకమైన అవతారాలు ధరించి నువ్వే సనాతన ధర్మ రక్షణ చేస్తూంటావు. గహనాతి గహనమైన ధర్మ స్వరూపుడవూ, నిర్వికారుడవూ అయిన నీ దివ్యానుగ్రహం వల్లనే నివృత్తి పరాయణులైన పరమయోగులు మృత్యురూప సంసార సాగరాన్నుండి తరిస్తారు. అట్టిదశలో నీయందు దయ చూపగల వారెవరు? ఏతల్లి చరణ రజాన్ని అర్థార్థులైన వారు శిరస్సుపై ధరిస్తారో? అట్టి మహాలక్ష్మీదేవి సదా నిన్ను సేవిస్తూంటుంది. నీ కథా శ్రవణంలో నీ సేవ చేయునట్టి మహా లక్ష్మి కంటె కూడ నువ్వు నీ భక్తులనే అధికంగా ప్రేమిస్తావు. సద్గుణ నిలయుడవైన నిన్ను బ్రాహ్మణ పాదరజస్సు పావనం చేస్తుందా? పరంధామా! నువ్వు సాక్షాత్తూ ధర్మమూర్తివి. కృత, త్రేత, ద్వాపర వేళల్లో ప్రత్యక్షంగా నువ్వు దర్శన మిస్తావు. భవదీయ తపోదయ సత్యాలనేత్రి పాదలతోను – చరాచర విశ్వాన్ని సంరక్షిస్తూంటావు. సత్య స్వరూపంతో నువ్వు ధర్మానికి విరోధంగా ఉన్న రజస్తమోగుణాలను నాశనం చెయ్యి. నీ వల్లనే విప్రజాతి సంరక్షింప బడుతూన్నది. నువ్వు ధర్మస్వరూపుడవై కూడ ఆరాధనాదుల ద్వారా ఈ జాతిని రక్షిస్తున్నావు. ఇలా చేయకుంటే నీచే నిర్ణయింపబడిన కళ్యాణ పథమే నాశనమై పోతుంది. ఆదర్శవంతుల ద్వారా ఆచరింపబడే కర్మలే సాధారణులకు మార్గదర్శకాలవుతాయి. శక్తి స్వరూపులైన రాజు – ఆదిగాగల రూపాలలో అవతరించి ధర్మాన్ని రక్షించి నువ్వే లోక మర్యాదను కాపాడు తూంటావు. నీ అభిమతానుసారం వేదమార్గం నాశనం కారాదు. దానిని ఉల్లంఘించే వారు తాత్కాలింగా ఔన్నత్యాన్ని పొందినా నీ అనుగ్రహం లేకపోవడంచే శీఘ్రంగా నాశనమవుతారు. జగత్పతివై కూడ విప్రుల విషయంలో ఇంత వినమ్రంగా ఉన్న నీకు హాని ఎంత మాత్రం లేదు. ఇది నీ లీల మాత్రమే. సర్వేశ్వరా! నీ ద్వారపాలురైన జయ విజయులకు తగిన శిక్షను నువ్వే విధించు. లేదా అనుగ్రహించు. లేదా వీరిని శపించిన మమ్ము దండించు. నీకు సంతోషాన్ని కలగించే దానిని నువ్వు చెయ్యి."

అంటూ సనకాదులు హరిని ప్రార్థించి నతమస్తకులయ్యారు.

వారి వచనాల నాలకించి శ్రీహరి "మునీంద్రులారా? వీరిని మీరు శపించడంలో కూడ నా సంకల్పం ఉంది. వీరు శీఘ్రమే రాక్షసులై పుట్టి - నా యందు వైర భావం కలిగి నాయందే ఆయత్తమైన చిత్తాలు కల వారై పునః అచిరకాలంలోనే నన్ను పొంద గలుగుతారు." అంటూ తమపై అనుగ్రహ దృక్ప్రసారం చేసిన హరికి ప్రణమిల్లి సనక సనందనాది మునీంద్రులు ఆ దేవదేవుని ఆదే శానుసారం భగవత్సంకీర్తనం చేసుకుంటూ మరలిపోయారు. అంత శ్రీహరి జయవిజయు లను తిలకించి- ఇక మీరు వెళ్ళండి. ఈష న్మాత్రం భీతిచెందక మదీయ శాసనాను సారం చరించండి. సర్వసమర్థుడనై ఉండి కూడ నేను బ్రహ్మతేజస్సును మాత్రం నిరోధించను. బహు పురాతనకాలంలో 'యోగనిద్రా పర వశుడనై నేనున్నవేళలో లక్ష్మిని కూడ మీరు నిరోధించగా నాడే ఆమె మిమ్మల్ని శపించింది. కనుక మీరు భూతలంలో దైత్యులై పుట్టి నాయందు బద్ధశత్రువులై వ్యవహరించడం వల్ల మీకు నాయందే కాగ్రత ఏర్పడుతుంది. తద్వారా విప్ర తిరస్కారరూప పాపాన్నుండి మీరు అచిరకాలంలోనే నన్ను చేరగలుగుతారు." అంటూ భగవానుడు లోపలకు వెళ్ళిపోయాడు.

అసురశ్రేష్ఠులే అయినా జయవిజయులు విప్రశాపం వల్ల వైకుంఠమందే తేజోహీనులై పోయారు. ఆ ద్వారపాలురు జారిపడిపోతూంటే హాహారవాలు బయలుదేరాయి. కశ్యప వీర్యమే ఈ దితి గర్భంలో ఉన్న ఉగ్రతేజస్సు దానివల్లనే మీరంతా తేజోవిహీనులై పోతూ న్నారు. సర్వం ఈశ్వరేచ్ఛయే. సృష్టిస్థితి సంహారకారుడై యోగిజన దుర్లభుడైన శ్రీహరియే మనలను అనుగ్రహించాలి." అంటూ చతుర్ముఖుడు అమరులకు చెప్పిన దానినే విదురునికి మైత్రేయుడు వినిపించాడని శుక మహర్షి పరీక్షిన్నరేంద్రునికి వినిపించాడు.

## స్కంధం-3 — అధ్యాయం-16

## జయ విజయుల పతనం

బ్రహ్మదేవుని ద్వారా అంధకార కార ణాన్ని తెలుసుకున్న అమరులు స్వర్గానికి వెళ్లి పోయారు. శతసంవత్సరాల దీర్ఘకాల పర్యంతం గర్భాన్ని ధరించిన దితి - తనకు కలుగ బోయే కుమారుల వల్ల ఉపద్రవాలు కలుగు తాయని గ్రహించి ఒకానొక సమయంలో కుమారు లిద్దరిని ప్రసవించింది. తత్సమయంలో పృథివ్యంతరిక్ష స్వర్గాలలో భయంకరో త్పాతాలు బయలుదేరాయి. పృథ్వి కంపిం చింది. దగ్ధమైపోతూన్నట్లు దిశలు గోచర మయ్యాయి. ప్రచండవాయువులు పదే పదే బయల్వెడలి మహావృక్షాలను నేలపాలు చేస్తు న్నాయి. ఆ వాయు స్పర్శ సహించరానిదై భయావహంగా ఉంది. దుమ్ము లేచి భూమ్యా

కాశాలను ఏకంచేసి వేస్తూన్నది. భయంకరంగా మెరుపులు మెరిసి పోతూన్నాయి. సూర్యచంద్ర నక్షత్రాదులు కనపడడం లేదు. ఉత్తాలతరంగ ఘోషతో సాగరం రోదిస్తూన్నట్లుంది. నదుల స్థితి కూడ అలానే ఉంది. జలజంతువులు భీతితో యిటూ నటూ తిరిగేస్తున్నాయి. సూర్యచంద్రులు పదే పదే గ్రహించబడుతూన్నారు. వారిని అమంగళమండలాలు పరివేష్టించి ఉంటున్నాయి. రథనేమి ధ్వనులు పర్వతగుహలలో బయల్వెడలుతూన్నాయి. గ్రద్దలు, రాబందులు, నక్కలు కూడ తమ నోళ్ళనుండి అగ్నిజ్వాలలను వెడలగ్రక్కుతూ గ్రామాలలో భయంకరంగా రోదిస్తున్నాయి. శిరస్సులు పైకెత్తి శునకాలు ఏడుస్తూన్నాయి. తమ గిట్టలతో భూమిని త్రవ్వుతూ గార్ధభాలు భయంకరనాదాలతో ఇటూ అటూ పరుగులెడుతూన్నాయి. తచ్ఛబ్దాలకు భీతిచెంది విహంగాలు దశదిశలా ఎగిరి పోతూన్నాయి. వృషభ, సముదాయం భయకంపితాలై మలమూత్రాలు విసర్జిస్తున్నాయి. పాలు పితుకుతూంటే గోవులనుండి రక్తధారలే వస్తున్నాయి. మేఘాలు మలమూత్రాలను వర్షిస్తున్నాయి. నక్షత్రాలను అధిగమించి గ్రహాలు తమ తమ గమనంలో వక్రగతులలో సంచరించడమూ, పరస్పర కలహాలనూ చూస్తుంటే దేవతలు కూడ అకాల ప్రళయ శంకతో భయపడి పోతున్నారు. దితి గర్భసంజాతులైన ఆ రాక్షసులు లోహసమకఠినశరీరాలతో అతిశీఘ్రంగా వర్ధిల్లిపోతూన్నారు. వారి కాంచన మకుటాలు అమరలోకాన్ని స్పృశిస్తూన్నాయి. దిశలను ఆక్రమించి వారి దేహాలున్నాయి. వారి భుజాలలోని అంగదాలు మెరుపుతీగెలవలె భాసిల్లుతూన్నాయి. వారు అడుగుతీసి అడుగువేస్తుంటే పృథ్వి దద్దరిల్లి పోతూన్నది. వారిద్దరూ కవల పిల్లలు. కశ్యపమహర్షి హిరణ్యాక్షుడనీ, హిరణ్యకశిపుడనీ వారికి నామకరణం చేసాడు. ఘోరమైన తపస్సు చేసి ఆ రాక్షసులిద్దరూ బ్రహ్మదేవుని ప్రసన్నుని చేసుకుని అమోఘ వరాలు పొంది వర మద బలగర్వితులై సర్వలోకపాల సమేతంగా జగత్త్రయాన్ని స్వాధీనం చేసుకున్నారు సోదరుడైన హిరణ్యాక్షుణ్ణి హిరణ్యకశిపుడు విశేషంగా ప్రేమిస్తున్నాడు. అన్నగారి అడుగుజాడలలో హిరణ్యాక్షుడు సంచరిస్తూన్నాడు.

హిరణ్యాక్షుడు ఓ నాడు యుద్ధేచ్ఛతో స్వర్గం చేరాడు. శారీరిక, మానసిక వర బలాలు వానిలో సంపూర్ణంగా నిండి ఉండగా ఆ మదోన్మత్తుడు చేసే భయంకర గర్జనలకు అమరులు హడలిపోయి దాక్కున్నారు. అదిగ్రహించి ఆ ఘోర రాక్షసుడు అన్నీ తిరిగి తిరిగి ప్రతి పక్ష వీరులను పొందజాలక సాగర గర్భంలో ప్రవేశించి, మదగజేంద్ర సదృశంగా విహరిస్తూ జల జంతువులను భీతిల చెయ్యసాగాడు. ఆ తరువాత వరుణలోకం చేరి దాని రాజధాని అయిన విభావరీ నాయక నగరంలో ప్రవేశించి వికటాట్టహాసం చేస్తూ ఆ ప్రభువుకు ప్రణమిల్లి - రాజా నాకు యుద్ధ భిక్షను ప్రసాదించండి. మీరు మహా పరాక్రమ శాలురను జయించి రాజసూయం చేసినవారు." అంటూ హేళన చేస్తూ గర్వంతో

భాషిస్తున్న ఆ క్రూర దానవుణ్ణి తిలకించి తీవ్రతర క్రోధం కలిగినా దానిని అణచి పెట్టి వరుణుడు–"సోదరా ! కశ్యపపుత్రా నీతో తలపడే ధైర్యసాహస శక్తులు నాలో లేవు. అందుకు సమర్థుడు శ్రీమన్నారాయణుడు మాత్రమే. నీ మనోరథం నెరవేరాలంటే శ్రీహరితోనే నువ్వు యుద్ధం చెయ్యాలి. నాడే శునక, శృగాల పరివేష్టితమై నీ కళేబరం పృథ్విపై దీర్ఘ నిద్రను పొందుతుంది. సజ్జనులను అనుగ్రహించడానికే అవతారాలను స్వీకరించు నట్టి శ్రీహరి వినా అన్యులెవ్వరూ నీతో పోరజాలరు. నువ్వు అతనితోనే యుద్ధం చెయ్యి." అన్నాడు.

స్కంధం-3 అధ్యాయం-17

## హిరణ్యాక్ష యజ్ఞవరాహస్వాముల యుద్ధము

శ్రీహరిని జయించాలన్న మహోత్సాహంతో హిరణ్యాక్షుడు వరుణుని పలుకులలోని ఆంతర్యమైన హరిహస్తాలలో నువ్వు అంతమవుతావన్న విషయాన్ని అవగాహన చేసుకోలేక పోయారు. శీఘ్రమే వాడు దేవర్షి నారదుని ద్వారా శ్రీహరి ఉనికిని గ్రహించి రసాతలానికిపోయి భూమిని ఉద్ధరించి తెస్తున్న వరాహమూర్తిని తిలకించి - వికటాట్టహాసం చేస్తూ "ఈఅడవి జంతువు యిక్కడ కెందుకు వచ్చింది? అంటూ వరాహస్వామిని సంబోధించి - అరే ! మూఢా ! బ్రహ్మ ఈ భూతలాన్ని రసాతల వాసులకై సృజించి సమర్పించగా నువ్వెక్కడకు దీనిని తీసుకుపోతున్నావు ? ఇక్కడే దీనిని వదలు లేదా నేటితో నీ ఆ యుర్దాయం మూడినట్లే. మాయను ఆలంబనంగా చేసుకుని నువ్వు మాదైత్యులను అంతం చేస్తుంటావు. నీలో మాయాబలమే కానీ పౌరుషం లేదు. నిన్ను అంతం చేస్తే నీ ఆశ్రయంలో ఉన్న అసురులూ ఋషులూ, నిరాశ్రయులై పోతారు. అప్పుడే మా దైత్యులు నిష్కంటకంగా సుఖపడతారు." అని కఠోరంగా పలుకుతున్నాడు. ఆ భయంకర రాక్షసుని కఠోర వచనాలు క్రోధాన్ని కలుగజేస్తున్నా భయకంపితయగు పృథ్విని ఓ కోరపై నిలిపి ఆ రాక్షసుడికి బదులు చెప్పకుండ జలాల పై భాగంలో దానిని ఓ సురక్షిత స్థానంలో జలం మీద భూమిని ఉంచాడు. జలాంతర్ప్రదేశం నుండి మొసలిచే గాయపడ్డ గజరాజులా వరాహస్వామీ, ఆ గజరాజును వెన్నంటి వచ్చే మొసలిలా హిరణ్యాక్షుడూ గోచరమవుతున్నారు. బదులు పలుకకుండా వచ్చేస్తున్న వరాహస్వామిని తిలకించి ఆ దానవుడు "నారాయణా! జగత్రయ వాసులచే మహావీరుడవని ఖ్యాతి గాంచిన నువ్వు నా ప్రశ్నకు బదులు చెప్పకుండ ఇలా పలాయనం చిత్తగించడంలో నీకు సిగ్గు కలగడం లేదా ! నీకు సిగ్గేమిటి! నీ వంటి ఆ సత్పురుషులకు అభిమాన మన్నది

ఎలా ఉంటుందిలే''- అని వాగుతూన్న ఆ రాక్షసుని పలుకులను లెక్క పెట్టకుండా సర్వ విశ్వాధారమైన జగద్ధాత్రీ శక్తిని జలోపరిభాగంలో నిలిపి ఆ తరువాత హిరణ్యాక్షుని చూస్తూ భీకరమైన గదను సారిస్తూ దిశలన్నీ దద్దరిల్లేటట్లు గర్జన చేస్తూ ఆ శ్వేతవరాహస్వామి పలికాడు-

"రాక్షసాధమా! నిజంగా అరణ్య మృగాలమే అయిన మేము నీ వంటి గ్రామ సింహాలకై అన్వేషిస్తూంటాము. ఆత్మస్తుతి చేసుకునే మృత్యుపాశబద్ధులైన నీ వంటి నీచుల వాక్యాలను ధీ ధీరసంపన్నులైన వారు లెక్క చెయ్యరు. నిజమే. రసాతల వాసుల సొత్తైన పృథ్విని దొంగిలించి లజ్జారహితంగా నీకు భయపడి యిలా వచ్చాను. నీవంటి మహాబల శాలితో మా వంటివారం పోరాడగలమా? నిన్నెదిరించి ఎక్కడికీ పోజాలము. పదాతి సైన్య దళాధిపతివి; కనుక నువ్వు వృథాగా కాల యాపనచెయ్యక - నాతోటి ద్వంద్వ యుద్ధానికిరా. ఇకవ్యర్థంగా నిలబడకు'' అని వ్యంగ్యంగా హరి సెలవిచ్చరించడంతో క్రోధోద్దీపిత నేత్రుడై హిరణ్యాక్షుడు వరాహస్వామిపై గదా ప్రహారం చేసాడు. వరాహమూర్తి ఆ దెబ్బ నుండి తప్పించుకొని తానుకూడ గిర గిర మని గదను త్రిప్పుతూ ఆ రాక్షసుని మీద పడ్డాడు. పరస్పర విజయాభిలాషతో వారిద్దరూ పోరు సాగిస్తున్నారు. ఇరువురి శరీరాంగాలు గదా ప్రహారాలతో గాయపడ్డాయి. గోవు కోసం వృషభద్వయంభయంకరంగాయుద్ధంచేస్తున్నది. అట్లువారి యుద్ధం పృథ్వీదేవికొరకై యజ్ఞ వరాహమూర్తి, హిరణ్యాక్షుడూ సాగించే భయంకరరణాన్ని తిలకించాలని అమర సమూహ సమేతుడై వచ్చి బ్రహ్మ దేవుడుఅయ్యాది వరాహ స్వామికి ప్రణమిల్లి "దేవాధిదేవా! యజ్ఞ వరాహ స్వరూపా! మత్ప్రసాదిత వరబల మద గర్వితుడై ఈ రాక్షసాధముడు అమరులనూ, మహర్షులనూ వేదించడమే కాకుండ యుద్ధాభిలాషతో లోకాలన్నీ తిరిగి తిరిగి నీతో తలపడ్డాడు. ఈ క్రూరుని బలం సంధ్యా కాలం సమీపించే కొద్దీ వృద్ధి చెందుతుంది. మాయావి అయిన వీణ్ణి రాత్రి కాలంలో జయించడం మహాకష్ట విషయం. కాలసర్పంతో ఆడే పిల్ల వానిలా వీనితో క్రీడించక నువ్వు వీణ్ణి అంతంచెయ్యి. ఈ అభిజిల్లగ్నం అమరులకు అత్యంత ప్రియమయినది. వీణ్ణి ఈ ముహూర్తం లోనే అంతం చెయ్యాలి. నీచేతుల్లోనే వీనికి మరణం వ్రాసి ఉంది. మృత్యువును అన్వేషించుకుంటూ వాడే నీ దగ్గరకు వచ్చాడు - కనుక శీఘ్రంగా వీణ్ణి అంతం చెయ్యి.'' అని ప్రార్థించాడు'

చతుర్ముఖుని వచనాలను ఆలకించి శ్రీహరి మందస్మితంచేసి కరుణారస దృష్టులతో ఆతని వినతిని స్వీకరించి గదా ప్రహారాలతో హిరణ్యాక్షుణ్ణి తీవ్రంగా వేధింప సాగాడు. తత్సమయంలో ఆ ఘోరరాక్షసుడు కూడ గదాయుద్ధం కొనసాగిస్తూండగా వరాహ స్వామి హస్తమందలి గద జారి పడిపోయింది. నిరాయుధుడైన వరాహస్వామిని తిలకించి ఆ

రాక్షసుడు యుద్ధం ఆపేసాడు. దానితో మహోగ్రుడైన వరాహమూర్తి సుదర్శనాన్ని స్మరించడంతో అది అతని హస్తంలో మహాప్రకాశంతో తిరగ సాగింది. కానీ పరమాత్మ ఆ రక్కసునితో క్రీడిస్తున్నాడే కానీ సుదర్శన చక్రాన్ని ప్రయోగించడం లేదు. అది చూసి దేవతలు "దేవాధి దేవా! ఇక వీనితో క్రీడించక వెంటనే సంహరించు" అంటూ మొరలు పెట్టుకోగా - నిజ నిశిత దృక్ప్రసారాలతో హిరణ్యాక్షుడు వరాహ స్వామిని దగ్ధం చేస్తున్నాడా? అన్నట్లు చూస్తున్నాడు. అంతతో ఊరుకోక - గదను గిరగిర తిప్పుతూ వరాహమూర్తిపై విసరగా భగవాను డాగదను లీలగా తన వామపాదంతో తన్ని వేశాడు. తన ప్రయత్నం విఫలం కావడంతో ఆ రాక్షసుని తేజోహంకారాలు నాశనం కాసాగాయి. బ్రాహ్మణోత్తమునిపై చేసిన క్షుద్ర ప్రయోగ తంత్రం వలె వాని ప్రయత్నం నాశనమయింది. దానితో ఆ రాక్షసుడు శూలాన్ని ప్రయోగించగా వరాహమూర్తి దానిని తన చక్రం చేత ఖండించి వేసాడు. అంత ఆ రాక్షసుడు తన రాక్షస మాయను ప్రయోగించాడు. దాని వల్ల రాళ్ళవాన కురియసాగింది. రక్త, కేశ అస్థులూ, మలమూత్రాలూ కురుస్తూంటే సూర్య చంద్రుల ప్రకాశం ఆచ్ఛాదితమై చెలరేగిన ప్రచండ వాయువుల వల్ల దుమ్ము విపరీతంగా చెలరేగి పృథివ్యాకాశాలు గాఢాంధకార బంధురమై అకాలంలో ప్రళయం వస్తుందా? "అన్న సందేహం కలగ సాగింది. అంతలో రాక్షస మాయ ద్వారా అపూర్వమైన గిరులూ రథ గజతురగ పదాతి సైన్యాల- కొట్టు — నరుకు — చంపు - అన్న ధ్వనులు, సమస్త దిశలలోనూ వ్యాపించాయి. భీకరాకారాలు ధరించి స్త్రీ పురుషులు ఆయుధ పాణులై పరుగులు తీస్తున్నట్లు కనిపించసాగింది. ఆ మాయను నాశనం చేయు వరాహ స్వామి సుదర్శనాన్ని ప్రయోగించగా హిరణ్యాక్షుడు వినా అసురీమాయ అంతా నాశనమయింది. క్రుద్ధుడై యజ్ఞ వరాహ స్వామి ఆ రక్కసుని కర్ణమూల ప్రదేశంలో ముష్టి ప్రహారం చేసాడు. వజ్ర ప్రహార సదృశమైన ఆ దెబ్బకు హిరణ్యాక్షుడు గిరగిర తిరిగి గుడ్లు తేల వేసి, శిరోజాలు చెల్లా చెదరు కాగా కాళ్ళూ చేతులూ విల విలా తన్నుకుంటూ ప్రాణాలను పోగొట్టుకున్నాడు. అయినా వాని వదనం మాత్రం తేజో విహీనం కాలేదు.

బ్రహ్మేంద్రాది దేవతా శ్రేష్ఠులు ఆ హిరణ్యాక్షుని కీర్తించారు. "అలభ్యమైన మృత్యువును పొందిన వీడెంత ధన్యుడు? యోగి జన దుర్లభుడైన యజ్ఞ వరాహస్వామి యొక్క దివ్యమంగళ స్వరూపాన్ని సందర్శిస్తూ దేహాన్ని త్యజించిన ఈత డెంతటి పుణ్యాత్ముడో కదా! శాపం కారణంగా క్రూర జన్మనెత్తినా శ్రీహరి లోకాన్ని పొందగలడు" అంటూ అతని చరిత్రను స్మరించి వారు యజ్ఞ వరాహ స్వామి వైపు చూస్తూ పలికారు

"దేవాధి దేవా! సమస్త యాగాలనూ విస్తరిల్ల జేసే నువ్వే శుద్ధ సత్త్వమయ స్వరూపంతో విశ్వాన్ని సంరక్షిస్తూంటావు. కనుక నే ఈ ఘోర రాక్షసుణ్ణి అంతం చేసి జగత్తులకు

శుభసుఖశాంతులనుప్రసాదించావు అట్టినీకు సహస్రాధిక వందనాలు అంద జేసుకుంటూన్నాము.' తరువాత వారు తిలకిస్తూండగానే యజ్ఞవరాహస్వామి అంతర్ధానమైపోగా వారు కూడ తమతమ స్థానాలకు మరలి పోయారు. ఈ యజ్ఞ వరాహావతార గాథను గురు ముఖతః విన్న దానిని విన్నట్లుగా నీకు వినిపించాను-అని మైత్రేయుడు చెప్పిన విధంగా శుకమునీంద్రుడు పరీక్షిన్నరేంద్రునికి వినిపించాడని సూత మహర్షి 'శౌనకాది మహర్షులారా ! పృథ్వీ ఉద్ధార రూపమైన ఈ వరాహావతార పవిత్ర గాథను పఠించినా, ఆలకించినా పాపదూరుడై ఐహిక పారలౌకిక సుఖ శాంతులను పొంది అంతమందు మానవుడు మోక్షాన్ని పొందుతాడు.

---

స్కంధం-3 — అధ్యాయం-18

## హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు పుట్టుట వారి దిగ్విజయ యాత్ర

శౌనక మహర్షి ప్రశ్నిస్తూ "సూత మునీంద్రా ! పృథ్విని ఆలంబనంగా చేసుకుని స్వాయంభువ మనువుఎలా సృష్టిని వర్ధిల జేసాడు? విదురుడు మైత్రేయుని ఇంకా ఏయే ప్రశ్నలు వేశాడు? సర్వ పాపహారకమై భగవద్గుణాను కీర్తన రూపమైన విదుర, మైత్రేయ సంవాదాన్ని వివరంగా వినిపించు"- అని అడిగిన దానికి సూతమహర్షి ప్రసన్నుడై - మహర్షులారా ! వరాహావతారగాథను ఆలకించి మహానందం పొందిన విదురుడు మైత్రేయ మహర్షిని చూస్తూ " మునీంద్రా ! మైత్రేయా ! పరోక్షజ్ఞాన సంపన్నులయిన వారు మీరు, మరీచ్యాదులూ, స్వాయంభువ మనువూ కలసి ఈ సృష్టిని వర్ధిల్లజేసారా? లేక వేరు వేరుగా వారి పత్నులతో కలిసి దీనిని వర్ధిలజేసారా? వివరించండి, అని అర్థించగా మైత్రేయుడు చెబుతూన్నాడు." విదురా! జీవుల ప్రారబ్ధం అర్థం చేసుకోవడానికి వీలుకానిది. అట్టి ప్రారబ్ధం ప్రకృతి శాసకుడైన పురుషుడు, కాలమూ - ఈ మూడు హేతువుల వల్లా భగవత్సన్నిధానం వల్ల త్రిగుణాత్మిక ప్రకృతియందు సంక్షోభం కలుగగా మహత్తత్త్వం ఉత్పన్నమవుతుంది. విధి వశంవల్ల రజోగుణ ప్రధానమైన మహత్తత్త్వం ద్వారా సాత్త్విక, రాజస, తామసాహంకారాలు ప్రభవించాయి. అయ్యహంకార త్రయం నుండి పంచతన్మాత్రలూ, ఇంద్రియాధిష్ఠాన దేవతలూ జన్మించారు. వేర్వేరుగా ఇవన్నీ ఉన్నంత కాలం బ్రహ్మాండ రచన కొనసాగ లేదు. కనుకనే దైవశక్తి ద్వారా ఇవన్నీ సంఘటితమై సువర్ణ వర్ణంకల అండాన్ని సృజించాయి. కారణార్ణవంలో అయ్యండం సహస్రవత్సర కాల పర్యంతం పడి ఉంది. భగవంతుడు దానిని అధిష్ఠించాడు. ఆ దేవదేవుని నాభి ద్వారా అనంత సూర్యప్రభా భాసమానమైన పద్మం ప్రాదుర్భవించింది. సర్వ జీవులకు ఆ పద్మమే ఆశ్రయ మయింది. ఆ పద్మంనుండి చతుర్ముఖ బ్రహ్మ ప్రభవించాడు. బ్రహ్మాండగర్భ రూపజలాల యందు శయ

నించిన శ్రీమన్నారాయణుడు బ్రహ్మదేవుని అంతరంగంలో ప్రవేశించగానే అతడు పూర్వ కల్ప తనద్వారా నిశ్చయింపబడిన నామ స్వరూప వ్యవస్థితమైన విశ్వాలను సృజించ సాగాడు. సర్వాధికంగా తన ఛాయవల్ల తమస్ర, అంధతామిస్రతమ, మోహ, మహా మోహరూపమైన అయిదు విధాలైన అజ్ఞానాన్ని సృష్టించాడు. తమోమయమైన ఆశరీరంనచ్చక చతుర్ముఖుడు దానిని పరిత్యజించాడు. దానినుండి క్షుత్పిపాసలు బయలుదేరాయి. బ్రహ్మపరిత్యక్తమైన రాత్రిరూపమైన ఆ దేహాన్ని యక్షరాక్షసులు స్వీకరించారు. క్షుత్పిపాసాపీడితులై వారు బ్రహ్మపై పేతిరిగి - కిణ్ణి భక్షించండని కొందరూ, వద్దని కొందరూ అంటూంటే అతడు భీతిచెంది - మీరు నా సంతానం 'నన్ను రక్షించండి' అని అతడు పలుకుతూంటే వారిలో అతణ్ణి భక్షించుమన్నవారు రాక్షసులు కాగా రక్షించుడన్న వాళ్ళు యక్షులయ్యారు.

స్కంధము-3 అధ్యాయము-20

## వివిధ సృష్టి వర్ణన

అనంతరం సాత్త్విక తేజస్సుతో భాసిల్లే బ్రహదేవుడు దేవతాప్రముఖులను సృజించాడు. తత్సమయంలో అతడు విడనాడిన దేహాన్ని అమరులు స్వీకరించారు. ఆ తరువాత సృష్టికర్త తన జఘన దేశంనుండి కామాసక్తులయిన అసుర సమూహాలను సృజించగా వారు కామాసక్తులై బ్రహ్మ మీదకే వెళ్లసాగారు. అదిగ్రహించిన బ్రహ్మనవ్వుతూ - వారు లజ్జారహితంగా తనవైపుకు రావడం చూసి భయంతో క్రోధంతో పరుగెత్తి భక్తజనాశ్రితుడైన శ్రీహరినిచేరి "పరంధామా! నీ ఆదేశానుసారం నేను సృజన కార్యాన్ని కొనసాగిస్తూంటే కామాసక్తులై వీరు నన్నే బాధించనున్నారు. నాక్లేశాన్ని దూరంచెయ్యి. నువ్వు వినా సమర్థులులేరు. నన్ను రక్షించు దేవా!" అంటూ ప్రార్థించగా శ్రీహరి వత్సా! కామాసక్తమైన ఈ దేహాన్ని వదలు మనగా - చతురాననుడు ఆ దేహాన్ని త్యజించగా సౌందర్యరాశిరూపంలో సంధ్యాదేవి ప్రాదుర్భవించింది. నడుస్తూంటే ఆమె పాదాలకున్న గజ్జెలు ఘల్లు ఘల్లుమంటున్నాయి. సింహసమమైన నడుముతో సౌందర్యమూర్తి అయిన ఆ లావణ్యలహరి అసురులపై దృక్ప్రసారం చేయగా ఆమె సౌందర్యమోహితులై అసురులు పరస్పరం ఆమెగురించి తర్కవితర్కాలు సాగించి ఆమెకుదగ్గరగావచ్చి - "తన్వంగీ: నువ్వెవరి పుత్రివి? ఇలా ఎందుకువచ్చావు? నీమోహినీరూపంతో మమ్మల్ని వేధిస్తున్నావు? నీ వెవ్వరిదానవైతే మాత్రం మాకేం కావాలి? కందుకక్రీడా సదృశమైన నీ క్రీగంటి ప్రసారం ద్వారా నువ్వు మమ్మల్ని స్వాధీనం చేసుకుంటున్నావు. నీ కాలిప్పుడు ఓ స్థానంలో నిలవడం లేదు. స్తనభారంతో నీ కటి దేశం శ్రమపడుతూన్నట్లుంది. ప్రకాశమానమైన నీ దృష్టి కూడ నీ శ్రమను

సువ్యక్తం చేస్తున్నది. నీ కేశపాశం ఎంత మనోహరంగా ఉంది.'' అని వారు మైమరచి పేలుతూన్నారు. వారందరినీ సౌందర్య రాశి అయిన ఆ సంధ్యాదేవి వ్యామోహంలో ముంచి వేసింది. తదనంతరం బ్రహ్మ గంభీరుడై మంద స్మితం చేస్తూ - నిజ ప్రకాశమయ మూర్తి ద్వారా గంధర్వాప్సరసలను సృజించగా వెన్నెల రూపమైన ఆ దేహాన్ని వదలగా దానిని గంధర్వులు మహానందంగా స్వీకరించారు.

తదనంతరం సృష్టికర్త తంద్రి ద్వారా భూత, పిశాచాదులను సృజించగా అవి దిగంబరంగా జుట్టు విరబోసుకుని భయంకరాకారంతో గోచరిండంతో అతడు కళ్ళు మూసుకున్నాడు. శీఘ్రంగా జృంభణ(ఆవులింత) నామకమైన ఆదేహాన్ని భూత పిశాచాలు గ్రహించాయి. దీని నేన్ద్ర అని కూడ అంటారు. జీవుల ఇంద్రియాలలో శైథిల్యం దీని ద్వారానే జరుగుతుంది. ఉచ్ఛిష్టముఖాలతో నిద్రపోయే వారిని ఈ భూత పిశాచాలు ఆవహిస్తాయి. అదే ఉన్మాద రూపాన్ని యిస్తుంది. ఇదే ఆప వారిలో అపస్మార వ్యాధిగా చెప్పబడింది. సక్రమంగా శౌచాచారాన్ని పాటించక, నిరంతరం పరుండియే ఉండడం సహాన శక్తిని కోలుపోవడం, కలిసి మెలసి నలుగురితో ఉంప లేకపోవడమూ, చాపల్యమూ, అనుష్ఠాన, భయ, క్రోధలో భావులు, గౌరవ నీయుల యందు అవిశ్వాసమూ - ఇవన్నీ పైశాచిక లక్షణాలే అన్నారు.

"నేను ప్రకాశ స్వరూపుడ నయ్యెదను గాక ! అని బ్రహ్మదేవుడు భావన చెయ్యగానే పితృ సాధ్యగణాలు ఆవిర్భవించాయి. నిజోత్పత్తి స్థానమైన అయ్యాదృశ్య దేహాన్నే పితరులూ, సాధ్యులూ గ్రహించారు. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకుని శ్రేష్ఠ పండితులు పితరులకు పిండాలనూ సాధ్యులకు కవ్యాలనూ సమర్పిస్తూంటారు. తన తిరోధాన శక్తి ద్వారా బ్రహ్మదేవుడు విద్యాధర సిద్ధగణాలను పుట్టించి అంతర్ధాన రూపమైన ఆ దేహాన్ని వారికి ప్రసాదించాడు. మరొక పర్యాయం అతడు సౌందర్య రూపమైన స్వప్రతి బింబం దారా విద్యాధర కిన్నరులను సృజించి ఆ ప్రతి బింబ దేహాన్ని వారికి అనుగ్రహించాడు. ఈ విద్యాధరకిన్నరులు నిత్యం ఉషః కాలంలో తమ పత్నులతో కలసి బ్రహ్మదేవుని గుణగానం చేస్తూంటారు. సృష్టి ఇంకా వర్ధిల్లడం లేదని స్వయంభుభావుడు ఓ నాడు కాళ్ళూ చేతులూ జాపుకుని నెల్లకిలా పరున్నాడు. కుపితుడై భోగమయ దేహాన్ని విసర్జించడంతో కేశాల నుండి నాగ జాతి ప్రాదుర్భవించింది. కాళ్ళూ చేతులు ముడుచుకుని నడవడం వల్ల విష సంభరితమైన పడగలు గల క్రోధ ప్రధానాలైన సర్పాలు ప్రభవించాయి.

అంత తాను సఫలీకృతుడైనట్టు భావించిన బ్రహ్మదేవుడు మనస్సు ద్వారా మనువులను సృజించాడు. వీరంతా ప్రజాభి వృద్ధిని కలిగించే వారే అయినారు. బ్రహ్మవారి కోసం తన పురుషాకారమైన దేహాన్ని పరిత్యజించగా వారు దానిని స్వీకరించారు. మనువులను దర్శించి వారి కన్నముందుగా అవతరించిన అమరులు బ్రహ్మదేవుని స్తుతిస్తూ "సృష్టికర్తా! మను

రూపమైన నీ ఈ సృష్టి బహు సుందరంగా ఉంది. వీరిలో అగ్నిహోత్రాది కర్మలు ప్రతిష్ఠితమై ఉన్నాయి. మేము కూడ వీరి ద్వారా హవిర్భాగాలు స్వీకరిస్తాము" అన్నారు. అనంతరం సృష్టికర్త తపో విద్యాయోగ సమాధి ఇంద్రియ జయాది లక్షణాలతో కూడిన మహర్షులను పుట్టించి వారందరి కందరకూ సమాధి, ఐశ్వర్య, తపోయోగ విద్యా వైరాగ్యాలతో కూడిన ఉత్తమ దేహాలు ప్రసాదించాడు.

స్కంధం-3 — అధ్యాయం-21

## కర్దముని తపస్సు.

విదురుడు పునః ప్రశ్నిస్తున్నాడు. మైత్రేయ మహర్షీ! స్వాయంభువమను వంశం అత్యంతా దరణీయమైనది. ఆ వంశం మైథున ధర్మ ప్రధానంగానే వర్ధిల్లినది. స్వాయంభువ మను నందనులు ప్రియ వ్రత, ఉత్తాన పాదులు సప్త ద్వీప భూమండలాన్ని ఏకచ్ఛత్రాధి పత్యం క్రింద పరిపాలించారు.

తన పుత్రి అయిన దేవహూతిని కర్దము ప్రజాపతికి యిచ్చి వివాహం చేసాడు. యోగ శాస్త్ర సంప్రదాయాన్ని దేవహూతి అనుభవ పూర్వకంగా గుర్తించింది. కర్దముడు మహా యోగి, వీరి రువురి వల్లా ఎంత మంది సంతానం జన్మించారు. ఇదే రీతిగా బ్రహ్మానందనులైన దక్ష ప్రజాపతీ, రుచిప్రజాపతీ కూడ మను కుమార్తెలనే పరిణయ మాడారు వారి రువురికీ ప్రభవించిన సంతాన సంఖ్యను విశదంగా వివరించండి." అంటూ కోరిన విదురునికి మైత్రేయ మహర్షి బదులు పలికాడు. "విదురా! ప్రజా వృద్ధిని కలిగించు చున్న సృష్టికర్త ఆ దేశాను సారం కర్దముడు సరస్వతీ నదీ తీరంలో ఏకాగ్ర చిత్తంతో దీర్ఘకాలం హరిని గూర్చి తపస్సు చేసాడు. సత్యయుగాదిలో శ్రీహరి కర్దమ ప్రజా పతికి దర్శన మిచ్చాడు. సూర్య సమ ప్రకాశంతో శ్వేత పద్మాలతో నీల వర్ణమైన అలకావళి ముఖకమలంపై ప్రకాశిస్తుండగా నిర్మల వస్త్రాలను ధరించి సువర్ణ మయ దేహంతో రత్న మకుటంతో పద్మ పాణియై లక్ష్మీ వక్షః స్థలాలయుడై మకర కుండల ధారీ అయిన

హరి గరుడ వాహనారూఢుడై కర్దమ ప్రజా పతికి దర్శన మిచ్చాడు. ఆ దివ్యమంగళ మూర్తిని సందర్శించి నంత మాత్రాన గద్గద కంఠుడై ఆనందాశ్రువులు రాలగా శ్రీమన్నారాయణుని యిలా స్తుతించ సాగాడు. — 'పరంధామా! సత్యా ధారా! పరమ యోగులు సయితం జన్మ జన్మాంతరాలలో నిన్ను సేవించి నీ సందర్శన భాగ్యాన్ని అభిలషిస్తారు నా భాగ్య వశం వల్ల నేడు నేను నీ దర్శన భాగ్యాన్ని పొందగలిగాను. కనులున్నందుకు నాకు తత్ఫలం సంపూర్ణంగా లభించింది. సంసార మహాసము ద్రాన్ని దాటడానికి నీ దర్శన భాగ్యం చాలు.

క్షణిక సుఖాలు నిచ్చే విషయ వాంఛలతో అమూల్య కాలాన్ని వర్థం చేస్తూ మాయా మోహితుడైన వాడు చివరకు నరకాల పాలవుతాడు. విషయ సుఖాలను అనుభవించినా – నీ శ్రీ చరణాలను ఆశ్రయించిన వాడు మోక్షాన్ని పొందగలుగుతాడు. కామ కలుషితమైన హృదయంతో నేను అనుకూలవతి అయిన భార్యార్థం నిన్ను గూర్చి తపస్సు చేసాను.

సంసార సాగరాన పయనించే వానికి అర్ధాంగి చుక్కాని లాంటిది. ఆ చుక్కాని సక్రమంగా లేకుంటే దారి తప్పుతుంది. ఫలితంగా నరక ప్రాప్తియే గాక – ఇహం కూడ నరక సమ మవుతుంది. సర్వ లోకాధి పతివైన నీ వాణి ద్వారా ఈ లోకాలన్నీ బంధించబడి ఉన్నాయి ధర్మ మూలమైన వేదాను సారమే నేను నిన్ను భజిస్తున్నాను. ఈ కాల మహా చక్రం అత్యంత శక్తి వంతమైన బ్రహ్మ లేక - అధిక మాస యుక్తమైన త్రయోదశ మాసాలూ దీని పత్రాలు షడ్రుతువులూ నేమి. అనంతమైన క్షణ ఫలాదులే ఈచక్రంలోని పత్ర ధాగలు. మూడు వందల అరవై రోజులే ఈ చక్రం యొక్క సమ్మేళనము. చాతుర్మా స్యాత్రయమే శీత వర్ష గ్రీష్మ కాలాలే ఈ చక్రానికి ఆలంబన కారణమైన నాభిస్థానము. తీవ్ర మహా వేగంతో పరిభ్రమించే సంవత్సర రూపమైన ఈకాల చక్రం చరా చర విశ్వం యొక్క ఆయుర్దాయాన్ని క్షీణింప జేస్తూ ఉంటుంది. కానీ భక్తులైన వారి ఆయుర్దాయాన్ని మాత్రం తగ్గించ జాలదు. సాలె పురుగు తన నుండి తంతువులను ఉత్పన్నం చేసి దానితో గూడును నిర్మించుకుని అందే క్రీడించి పునః అందే లయమై పోయేటట్లు ఏక మాత్రుడవైన నువ్వు కూడ ఈ చరాచర జగత్తును సృష్టించి పునః నీయందే లయం చేసుకుంటూంటావు. మాయా వృతుడవై సగుణ రూపంలో దర్శన మిస్తున్నావు. మనో వాగతీతుడైనా – భక్తానుగ్రహ దృష్ట్యా నువ్వు సగుణ స్వరూపాన్ని ధరిస్తూంటావు. క్రియా రహితుడవై కూడ నువ్వు సృష్టి రచనార్థం కర్మాచరణ కలవాని వలె గోచర మవుతావు. అట్టి భవదీయ దివ్య చరణా రవిందాలకు వందనాలు.

కర్దమ ప్రజాపతి స్తుతులకు శ్రీహరి పరమ ప్రసన్నుడై 'కర్దమా! నాకై నీ వొనరించిన తపోకారణం నాకు తెలుసు. నీ తపస్సు వృథాకాదు. అనంత ఫలాలను ప్రసాదిస్తుంది. విశేష యశస్సం పన్నుడైన స్వాయంభువ మనువు – బ్రహ్మావర్తంలో సప్త ద్వీప యుక్తమైన పృథ్వీ మండలాన్ని శాసిస్తున్నాడు. అతనికి రూపయోవన గుణశీల సంపన్న అయిన దేవహూతి అనే పేరుగల కన్య ఉంది. ఆమె వివాహ యోగ్యురా లయింది. శతరూపా సతీ సమేతుడై స్వాయంభువ మనువు రెండురోజులలో నీ దగ్గరకు వచ్చి త్రిజగన్మోహినియైన దేవహూతి నిచ్చి నీకు పెళ్ళి చేస్తాడు. నీ మనోభీష్టాను రూపవతియే దేవహూతి. ఆమె ద్వారా నీకు నవకన్యలు ప్రాదుర్భ విస్తారు. మరీ చ్యాది మహర్షులు వారిని పరిణయ మాడి వారి ద్వారా

సంతనాన్ని వర్ధిల జేస్తారు. మదీ యాజ్ఞాను బద్ధుడవై నువ్వు కూడా విశుద్ధాంత రంగంతో సత్కర్మలు ఆచరిస్తూ తత్కర్మ ఫలాన్ని నాకు సమర్పిస్తావు. ఆత్మజ్ఞానివై విశ్వాన్ని నాయందూ, నన్ను నీలోనూ దర్శిస్తూ బ్రహ్మా నందాను భూతిని పొందగలుగుతావు నీ వీర్యం ద్వారా నేను దేవహూతి గర్భం నుండి కళావతార మూర్తిగా అవతరించి సాంఖ్యశాస్త్రాన్ని విస్తరింప జేస్తాను. "అంటూ కర్దమ ఋషికి వరాల నిచ్చి శ్రీహరి - సరస్వతీ నదిచే ఆవృతమైన బిందు సరస్సు నుండి అంతర్ధానమై పోయాడు.

ఆ క్షణం నుండీ కర్దముడు - స్వాయంభువ మనువు యొక్క ఆగమనానికై నిరీక్షిస్తూ నిజాశ్రమంలోనే ఉండి పోయాడు. కర్దముని యందలి కరుణచే ద్రవించిన హృదయం కల శ్రీహరి నేత్ర పద్మాల నుండి రాలిన బాష్ప బిందువుల ద్వారా పవిత్రమైన కారణం వల్ల దానికి బిందు సరమని నామం ఏర్పడింది. అందలి జలాలు పరమ పావనమైనవి కావడం వల్ల అసంఖ్యాకులైన మహర్షులు ఆ సరోవర తటాన ఆశ్రమాలు నిర్మించుకుని తపస్సాధనా సంలగ్నులవుతూంటారు.

వివిధ లతా తరుసరి వేష్టితమై ఆ బిందు సరోవరం తేజరిల్లుతూ ఉంటుంది. నానా జాతులకు చెందిన పక్షిసంతతులూ, మృగాలూ అక్కడ మనోహర నాదాలు చేస్తుంటాయి. పురులు విప్పి మయూరాలు నాట్యం చేస్తున్నాయి. చంప అశోక కుందమందార, కదంబ, కుటజ, ఆమ్రాదిగాగల తరు సంతతులు విశేషంగా పుష్పించి సుగంధాలను వ్యాపింప జేస్తున్నాయి. చక్రవాక, కారండవ, హంస, బక, జలకుక్కుటాది పక్షులు కలరవాలు చేస్తున్నాయి. ఆ ప్రదేశం గో, వృషభ, హరిణ, గజ, సింహాది మృగ సంసేవితమై ఉంది. ఆయాశ్రమంలో కర్దము ఋషి అగ్నిని ఉపాసించి ఆసీనుడై ఉన్నాడు. పుత్రియైన దేవ హూతిని వెంటబెట్టుకుని శత రూపా స్వాయంభువ దంపతులు అక్కడకు వచ్చారు. చిరకాలం తప మాచరించినా హరికృప వల్ల కర్దముని దేహం క్షీణించ లేదు. సరికదా తేజోమయంగా ఉంది. కమలదళ సమ విశాలములై అతని నేత్రాలు భాసిల్లు తూన్నాయి. జటామకుట ధారి అయిన అతడు బ్రహ్మ తేజస్సుతో భాసిల్లి పోతూన్నాడు. ఆ మహర్షిని సమీపించి స్వాయంభువుడు ఆయనకు ప్రణ మిల్లగా కర్దముడు అతనికి సముచిత సత్కారాలు చేసి ఉత్తమాసనాన్ని యిచ్చాడు. అతని సత్కారాలకు ప్రసన్నుడైన మనువు సుఖాసీనుడైన పిమ్మట కర్దము మహర్షి అందుకుని 'ప్రభూ! మీరు విష్ణు దేవుని పాలనా శక్తి స్వరూపులు - సజ్జన సంరక్షణార్థమే మీరు సంచారం చేస్తూంటారు. సాక్షాన్నా రాయణ స్వరూపులైన తమరు విభిన్న కార్యార్థం - ఇంద్రాగ్నియమ వరుణ వాయు కుబేరేశాన స్వరూపాలనూ, సూర్య చంద్ర రూపాలనూ ధరిస్తూ ఉంటారు. వణి మయకాంచన స్యందనా రూఢులై, ధనుర్బాణ ధరులైన మీరు దుష్టులను శిక్షిస్తూంటారు. భాస్కర సమంగా విహరించగల మీరు సక్రమంగా పాలన చెయ్యక పోతే విశ్వంలో

వర్ణాశ్రమ వ్యవస్థ సర్వనాశనమై పోతుంది. చోరత్వ జారత్వాలు వర్ధిల్లి పోతాయి. దుష్టులు, శిష్టులను వేధిస్తారు. అందులకే దుర్మార్గ నాశనార్థం దశదిశలా మీరు భ్రమణం చేస్తూంటారు. అయితే భవదీయాగమనానికి గల విశేష హేతువును వివరిస్తే నిష్కపటంగా మీ ఆదేశాన్ని పాలిస్తాను" అన్నాడు.

---

## స్కంధం-3 — అధ్యాయం-22

## దేవహూతీ కర్దముల కళ్యాణము

తన గుణగణాభి వర్ణన చేసి కర్దమ మహర్షి తన ఆదేశాను సారం చేస్తాననడంతో మనువు మహానందం చెంది- "కర్దమ మహర్షీ! నిజ వేదమయ విగ్రహ సంరక్షణార్థం బ్రహ్మదేవుడు - తపో విద్యా యోగ బల సంపన్నులైన త్వాదృశ శ్రేష్ఠ బ్రాహ్మణులను తన వదనం నుండి ప్రభవింపజేసాడు. ఆ చతుర్ముఖుడు వేదమయుడు కాగా బ్రాహ్మణులు అతని హృదయమయ్యారు. శరీరం క్షత్రియులు. వీరి రువురూ ఏక స్వరూపులు కాగా పరస్పర రక్షణలో ఉన్న వీరిని శ్రీహరి సంరక్షిస్తూంటాడు. కార్య కారణ స్వరూపుడై కూడ అతడు నిర్వికారుడే మీ సందర్శన భాగ్యం వల్ల నేడు నా సందేహాలన్నీ దూరమయ్యాయి. నేను ధన్యుడనయ్యాను. పావనమైన మీ వాణిని ఆలకించే మహద్భాగ్యం మాకు లభించింది. మహాత్మా! ఈ దేవహూతి నా పుత్రి, ప్రియవ్రత ఉత్తానపాదులకు సోదరి. వయోరూప గుణ శీలాదులచే తనకు యోగ్యుడైన భర్తను కోరింది. నారద దేవర్షి వల్ల మీ సమస్త సద్గుణాలనూ విన్నప్పటినుండీ ఈమె మనసా మిమ్మే భర్తగా వరించింది. భక్తి శ్రద్ధలతో ఈమెను మీకు సమర్పిస్తున్నాను. స్వీకరించండి. గృహస్థోచితమైన ధర్మాలన్నింటినీ ఈమె పాటిస్తుంది.

ఆశించకుండ స్వతః సిద్ధంగా లభ్యమైన భోగాలను నిరాదరణ చెయ్యరాదు. తద్వారా కాలాంతరంలో పరులను యాచిస్తే వారు అవమానిస్తారు. అందువల్ల గతమందున్న యశస్సు నాశనమవుతుంది. అభిమానం భంగమవుతుంది. నేను మీరు పెళ్ళిళ్ళు చేసుకుంటారని విని వచ్చాను. మీరు నైష్ఠిక బ్రహ్మచారులు కాదు కాలపరితమైనది మీ బ్రహ్మచర్య వ్రతము. కనుక నేను మీకు సమర్పించే నా యీ కన్య గ్రహించ గోరుతున్నాను," అన్నాడు.

అందుకు ప్రసన్నుడైన కర్దముడు "ప్రభూ! మీ వచనాలు పరమ సత్యాలు. నేను వివాహేచ్ఛతోనే ఉన్నాను. మీ కన్యను యింత వరకూ ఎవరికీ వాగ్దత్తం కాలేదు. కనుక మా యిరువురికీ బ్రాహ్మ వివాహం కావడం సముచితంగా ఉంటుంది. కామ ప్రవృత్తీ, సంతానోత్పాదన రూపమైన ఇచ్ఛ నెరవేరేటందులకే కదా వివాహం. నా కోరిక నీ యీ పుత్రి ద్వారా అవశ్యం నెరవేరుతుంది. నిజాంగ

కాంతులచే ఆభరణాదులకే శోభను కలిగించే ఈ కన్యను కాదన గల వాడెవడు?

బ్రహ్మావర్తంలో ఒకానొక నాడు ఈమె కందుక క్రీడలో ఉండగా - కాళ్ళ గజ్జెలు, హస్త కంకణాలూ మనోహరంగా నినదిస్తూండగా చపల నేత్రాలతో హరిణివలె ఈమె బంతితో యిటూ అటూ విహరిస్తూండగా ఈమెను చూసి విశ్వావసు నామక గంధర్వుడు విమానంలోనే మూర్ఛ పడిపోయాడు. అట్టి కన్య స్వయంగా వచ్చి నన్ను అభిలషిస్తూంటే కాదన గలనా? సాక్షాత్తూ తమపుత్రీ ప్రియవ్రతోత్తాన పాదులకు సోదరీ, రమణీరత్నమూ అయిన ఈమె లక్ష్మీదేవి చరణ కమలాలను సేవించని వానికి దర్శనమే ఈయదు. అలాంటి కన్యా రత్నమైన ఈమెను అవశ్యంస్వీకరిస్తాను. అయితే ఓనియమం మాత్రం ఉంది. అందుకు పుత్రీ సమేతంగా మీరు అంగీకరించాలి. వినండి సంతానం కలిగే వరకూ గృహస్థాశ్రమంలో ఉంటాను. ఆ తరువాత మాత్రం సర్వసంగ పరిత్యాగినై సర్వ కారణ కారణుడైన పరంధాముని ఆరాధించి ఆత్మ సాక్షాత్కారం పొందుతాను. దీనికి తమ రంగీకరిస్తే ఈమెను యిప్పుడే పరిణయ మాడుతాను." అంటూ కర్దమ మహర్షి శ్రీహరి ధ్యానంలో నిమగ్నమై మౌనముద్ర దాల్చాడు.

తమ సంవాదాన్ని ఆలకిస్తూన్న పత్నీ పుత్రికల వైపు మను మహారాజు చూసి వారి అంగీకార భావాన్ని గ్రహించి విధ్యనుసారం దేవహూతీ కర్దముల వివాహాన్ని పూర్తిచేసాడు. తరువాత నవ వధూవరులకు అమూల్య వస్త్రాభరణాలను యిచ్చి, గృహోప కరణ యోగ్యాలైన పాత్ర సామగ్రిని సారె రూపంగా యిచ్చి స్వగృహానికి మరలిపోతూ పుత్రిని దగ్గరగా తీసుకుని "అమ్మా! దేవహూతీ!" అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు. తరువాత పుత్రీ శిరసు నాఘ్రాణించి ఆమెకు చెప్పవలసిన మాటలు చెప్పి కర్దముని దగ్గర సెలవు తీసుకుని, రథారూఢుడై సరస్వతీ తీరస్థ ఆశ్రమాదులను సందర్శిస్తూ రాజధానికి వెళ్ళి పోయాడు. బ్రహ్మావర్త దేశ వాసులకు తమ ప్రభువైన స్వాయంభువ చక్రవర్తి ఆగమన వార్త తెలియగానే మంగళ వాద్యాలతో ప్రజలందరూ ఎదురై వచ్చి స్వాగతం పలికారు. ఆ మనుమహారాజు వారందరినీ ఆదరించి నిజ రాజధాని అయిన బర్హిష్మతీనగరంలో ప్రవేశించాడు.

భూమిని ఉద్ధరించి ఆది వరాహమూర్తి దేహాన్ని విదళించి నప్పుడు రాలిన రోమాలే కుశకాశాదుల రూపంలో వర్ధిల్లాయి. యజ్ఞమూర్తి దేహం నుండి పుట్టినవి కావడం వల్లనే అవి పవిత్రములై రాక్షసులను తిరస్కరించి ఆటంకాలు కలగకుండ మహర్షుల యాగకార్యాలకు ఉపకరిస్తూన్నాయి. ఆ బర్హిస్సు (దర్భలు) ద్వారా పృథ్విని ఆచ్ఛాదితం చేసి యాగం చేసి రాజ్యాన్ని స్వీకరించిన ప్రదేశం అదే కావడం వల్ల దానికి బర్హిష్మతీ నగరమని పేరు వచ్చింది స్వాయంభువ మనువు తాపాన్ని దూరం చేయునట్టి నిజ భవనంలో ప్రవేశించి దారాపుత్రాదు

లతో భోగ భాగ్యాలనుభవిస్తూ ధర్మార్థ కామ మోక్షాలకు భంగం కలుగకుండ వ్యవహరిస్తున్నాడు. విషయ వాసనాలోలుడు కాకుండా మనసా శ్రీహరిని ధ్యానిస్తూ కాలం గడుపుతూ తమ తమ నారీ జనసమేతంగా గంధర్వ గణం ఆ స్వాయంభువ మనువు యొక్క గుణగానం చేస్తూన్నది. ఇచ్ఛాను సారం సమస్త భోగాలను అనుభవించగల శక్తి ఉన్నా అతడు భగవత్ పరాయణుడు కావడంవల్ల భోగా సక్తుడు కావడం లేదు. మన్వంతర పరిమితమైన కాలం క్షణం కూడ వ్యర్థం కాకుండ శ్రీహరి లీలా గుణ గాన శ్రవణాదులతో వ్యయమవుతూన్నది. అతడు సర్వమానవ కళ్యాణ దాయకమైన మనుస్మృతిని రచించి మహాదీర్ఘ కాలం 71 వ మహాయుగ పర్యంతం సర్వ జీవుల యందూ దయకలిగి ఆదర్శ పురుషుడయ్యాడు భగవంతుని ఆశ్రయించిన వానికి దైహిక, దైవిక, మానసిక, మానుషిక, భౌతికాది ఎట్టి దుఃఖాలూ కలుగవు, స్వాయంభువ మనువే ఈ విశ్వంలో సర్వ ప్రథమ సామ్రాట్‌గా ఖ్యాతి గాంచాడు. ఆ మహనీయుని చరిత్ర స్వీకరించ దగినది.

స్కంధము-3 అధ్యాయము-23

## దేవహూతీ కర్దముల విరహాము

ఇక దేవహూతి గాథను చెబుతాను. సావధానంగా ఆలకించు, అంటూ మైత్రేయుడు విదురునికి చెబుతూన్నాడు. పార్వతీదేవి పరమేశ్వరుని సేవించినట్లు దేవహూతి కర్దమ మహర్షిని సేవించ సాగింది. ఆమె కామ క్రోధలోభ, దంభ ద్వేష పాప మదాదులను జించి వినయంగా శ్రద్ధగా పతిసేవ చేస్తూ విశ్వాస, పవిత్రత, గౌరవ, శుశ్రూష, ప్రియ భాషణలు కర్దముని సంతుష్ట పరచసాగింది. విశేష మహాభిలాషలను మనసులో ఉంచుకుని ఆమె వ్రతపరాయణురాలై కఠిన నియమాలతో - శుష్క శరీరంతో తనను సేవిస్తూన్న ప్రియసతిని చూసి కర్దముడై, కరుణా రసార్ద్రుడు ప్రేమ గద్గద వాణితో పలికాడు.

మను కుమారీ! జగత్తులో సర్వులకూ తమ దేహం సర్వాధిక ప్రియమైనది. అట్టి స్వ శరీరాన్ని కూడ లెక్క చెయ్యక - దానిని శుష్కింప జేసుకుని సమస్త సుఖాలనూ విడనాడి నన్ను సేవిస్తూన్నావు. నీపై నాకు విశేష దయ కలిగింది. నా కర్మానుష్ఠానానికి నువ్వు ఎట్టి ఆటంకాన్నీ కలిగించకుండ సేవించడం ద్వారా ఉపాసనా తపస్సమాధుల ద్వారా నేను సంపాదించిన మోక్షఫలం మీద కూడ నువ్వు అధికారం సంపాదించ కలిగావు. నీకు నేను దివ్య దృష్టిని ప్రసాదిస్తున్నాను. చూడు భోగాలన్నీ భగవంతుని భృకుటీ విన్యాసమాత్రంచే నశించి పోతాయి. దైవానుగ్రహం ముందు భోగాలన్నీ పరిగణనకు రావు. నాకు సర్వ భోగాలూ

ఉన్నాయి - అన్న అహంకారం కల వ్యక్తులకు మాత్రం ఈ దివ్య భోగాలు లభించవు. నా సేవ మాత్రం ద్వారా నువ్వు పతివ్రతా ధర్మాన్ని నిర్వహించ గలిగావు. నీకు భోగాలన్నీ లభిస్తాయి "అని ప్రసన్న వదనంతో పలికిన పతి పలుకులకు దేవహూతి - తన స్వామి సర్వ విద్యా కుశలు డనీ యోగమాయా ప్రభావం కలవాడనీ గ్రహించి మందస్మితంతో సిగ్గుతో శిరసు వంచి "స్వామీ! యోగా మాయా శక్తి ద్వారా తమరు సాధించిన మహైశ్వర్యం నిష్ఫలమైనది కాదని నే నెరుగుదును. కళ్యాణ వేళలో మీరు సంతానం కలిగే వరకూ గార్హస్త్యధర్మం లో ఉంటానని ప్రతిజ్ఞ చేసారు. ఆ ధర్మాను సారం మీరు నాకు ఆనందాన్ని ప్రసాదించండి. ఉత్తముడైన భర్త ద్వారా సత్సంతానాన్ని పొందడమే కులాంగనకు అభీష్టమూ, ధర్మమూ కూడ. శాస్త్రాను కూలమైన సామగ్రిని మన సమాగమార్థం సమ కూర్చండి. సుగంధ మాలలూ, ఆహార పానీయాలూ ఏర్పాటు చెయ్యండి. సృష్టికి ప్రతి సృష్టి చెయ్యగల మీకు అది కష్టం కాదు.అంగసంగ యోగ్యంగా ఉండేలా నా దేహానికి బల పుష్ట్యాదులను అను గ్రహించండి. భోగాను భవయోగ్యమైన సుందర భవన నిర్మాణం చెయ్యండి-అని ప్రార్థిం చింది.

ప్రియపత్ని మనోభీష్ట యోగ్యమై ఇచ్ఛానుకూల గమనం కల దివ్య విమా నాన్ని సృజించాడు కర్దమఋషి. నవరత్న మయమై సమస్తాలంకార సుశోభితమై-ఇచ్ఛాను కూలమైన భోగసామగ్రిని ఆ దివ్య విమానం ప్రసాదిస్తుంది. తోరణపతాక సుశోభితమైన ఆ దివ్య విమానం సమస్త ఋతువుల యందూ సుఖాలనే ప్రసాదిస్తూంటుంది. వివిధతల్పాలతో తలగడలతో పంకాలతో, దివ్యాసనాలతో నిండిన గదులతో ఆ విమానం సర్వభోగా లకూ నిలయమై భాసిల్లిపోతూన్నది. కాంచన కలశాలు ఇంద్ర నీలమణి స్తంభాలపై భాసిల్లు తూన్నాయి. మణిమయ స్థంభాలతో విద్రుమ మణిమయాలయిన గడపలూ. వజ్రఖచితమైన వాటాలతో అపూర్వంగా భాసిల్లుతూన్నాయి. సుందర ఉద్యానవనాలతో మణిఖచిత వేదిక లతో కృత్రిమాలైన హంసపారావత, శుకాది పక్షి సంతతుల చిత్రాలు ఆ విమానంలోనే చెక్క బడినాయి. ఆ కృత్రిమ విహంగాలను తిలకించి వాటి దగ్గరగా వచ్చి కిలకిలారావాలు చేస్తూ న్నాయి. అందులో అనేకం క్రీడాస్థలాలూ, శయనమందిరాలూ, బహువిచిత్రంగా నిర్మింప బడ్డాయి ఆ దివ్య విమానం కర్దమఋషినే ఆశ్చర్యంలో ముంచివేసింది. కానీ దానిని తిలకించి కూడ ఆనందించని దేవహూతిని చూసి కర్దమ ప్రజాపతి ఆమె అంతర్యాన్ని అవ గాహన చేసుకుని "దేవీ! ఈబిందు సరోవరంలో స్నానంచేసిరా" అనగా ఆమె వెంటనే ఆబిందు సరోవర సలిలాలలో స్నానార్థం మునగగా ఆ జలాలలో ఆమెకు ఓసుందర భవనం కనిపించింది. అందలి అసంఖ్యాక నారీజనం ఆ మెను పరివేష్టించి "అమ్మా! మేము మీసేవి కలము." అంటూనే సుగంధ ద్రవ్యాలతో ఆమె శరీరమంతా నలుగుపెట్టి స్నానమాడించి దివ్య వస్త్రాభరణాలతో ఆమెను అలంకరించి

స్వాధిష్టాలైన ఆహార, పానీయాలను సిద్ధం చేసారు. అద్దంలో దేవహూతి తన ప్రతిబింబాన్ని చూసుకుని తన అపూర్వ సౌందర్యానికితోడు- దివ్యసుందర వస్త్రాభరణ భూషితురాలై పరిపుష్టాంగాలతో ఉన్నతన సౌందర్య, లావణ్యాలు తనకే ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఆమె భర్తను స్మరించగా అసంఖ్యాక సఖీజన పరివేష్టితమై తానే పతిదేవుని సమీపంలో ఉంది. ఈ సర్వం తన భర్తయొక్క యోగ శక్తి ప్రభావమని గుర్తించి సిగ్గుతో తలవంచు కున్నదై కర్దముని ప్రక్కనే నిలబడింది. పెళ్ళినాటి ఉన్న రూపురేఖలతోనే సర్వాలంకార సుశోభిత గాత్రియై మనోహరంగా ఉన్న ప్రియసతిని తిలకించి కర్దమమహర్షి ఆమెను దివ్యవిమానమెక్కించాడు. కామ కేళియందు తత్పరుడైనా ప్రియపత్ని యందను రక్తుడైనా అతని ప్రభావం మాత్రం తగ్గలేదు. ఆ ప్రజాపతి - దేవహూతీ సమేతుడై అష్టలోకపాలురు విహరించే మేరుసాను ప్రదేశాలలో శీతలమంద సుగంధ పవనాలు వీస్తూండగా ఆయా స్థానాలలోనూ, గంగానదీ తీర ప్రదేశాలలోనూ విహారం చేస్తూ వైశ్రంభక సురసన, నందన పుష్పభద్ర చైత్రరథ ఆదిగాగల అనేక దేవోద్యానవనాలలో విహరించాడు. భగవదనుగ్రహం గలవాడు పొందజాలని భోగ భాగ్యాలు ఏముంటాయి?

ఆ రీతిగా కర్దమ ప్రజాపతి నదనదీద్వీప పరివేష్టితమైన వసుంధరా వలయాన్ని అంతటినీ ంప చేస్తూ - భార్యకు మహానందాన్ని ప్రసాదిస్తూ స్వాశ్రమం చేరి నవవిధరతుల యందాసక్తురాలై ఉన్న దేవహూతికి ఆనందాన్ని కలిగిస్తున్నాడు. అలా అనేక సంవత్సరాలు గడచి పోయాయి. కానీ అంతకాలమూ ముహూర్త మాత్రంగా గడిచిపోయింది. కామాసక్తులై ఆ దంపతులు చిరకాలం గడిపారు. కర్దముడు ఆత్మజ్ఞాని కావడం వల్ల భార్యకు కలిగిన సంతానవాంఛను గుర్తించి దైవాదేశం కూడ అదే కావడం వల్ల నవరూపాలలోఉన్న కర్దముడు భార్య గర్భంలో తేజోమయమైన ఇంద్రియాన్ని స్థాపించాడు. దానితో దేవహూతి ఏకకాలంలో నవకన్యలను ప్రసవించింది. వారు తొమ్మండుగురూ సర్వాంగ సుందరులై దినదినాభివృద్ధి చెందుతూన్నారు. తత్సమయంలో తనభర్త సన్యాసం స్వీకరిస్తాడని గ్రహించి దేవహూతి భర్త సన్నిధి చేరి విలపిస్తూ "స్వామీ! మీరు సత్య ప్రతిజ్ఞులు కానీ మీరు నాకు అభయ దానం చెయ్యాలి. ఈ పుత్రికలకు యోగ్యులయిన వరులను అన్వేషించి పెళ్ళి చెయ్యాలి. మీరు సన్యాసం స్వీకరించి అరణ్యాలకు వెళ్ళినా జనన మరణ రూపమైన దుఃఖం నన్ను అంటకుండా ఉండేటట్లు చెయ్యాలి. ఇంతవరకూ విషయ వాసనలలో మునిగి అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చేసాను. భగవధ్యానం జరుగ లేదు. అయినా నా అభీష్టం నెరవేర లేదు. అమోఘమైన మీ మహిమను గ్రహించజాలక ఇంద్రియ సుఖాభిలాషతో మీ అమూల్య కాలాన్ని కూడ వ్యర్థం చేసాను. ఇది కూడ

నాకు సంసారం నుండి ముక్తిని ప్రసాదించునది అగును గాక! మూఢ చిత్తంతో అసత్పురుష సాంగత్యం చేస్తే అది బంధన కారణ మవుతుంది. మోక్షకామి అయినవాడు సజ్జన సాంగత్యంచేసి తీరాలి. కామా సక్తురాలనైనా, మాయా మోహితురాలనైనా మీ వంటి మహాశక్తి సంపన్నులు భర్తగా లభించడం కారణంగానే కాబోలు మోక్షాభిలాష కలుగుతూన్నది. నన్ను అనుగ్రహించండి అని అర్థించింది.

## స్కంధం-3 — అధ్యాయం-24

# కపిలావతార ప్రాదుర్భావము

సద్గుణసంపన్నురాలైన భార్య పలుకు లాలకించి కర్దముఋషి 'ప్రియురాలా! ఈ విషయమై నువ్వు దుఃఖించకు. నీ ఉదరంలో సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడు తేజరిల్లుతూన్నాడు. తపోదానవ్రత నియమాదులతో సదా నువ్వు శ్రీహరిని ఆరాధిస్తూ ఉండు. భగవానుడే నా యశస్సును వర్ధిలజేసే స్థాయిలో నీ పుత్రుడై అవతరించ నున్నాడు. అతడే నీకు దివ్య జ్ఞానోపదేశం చేస్తాడు. తద్ద్వారా భవదీయ హృదయ గతమైన అహంకార రూప గ్రంథిని ఖండించి వేస్తాడు.''అని కర్దము మహర్షి ఆదేశించగా దేవహూతి-పురుషోత్తముడూ,నిర్వికారుడూ, జగదాచార్యుడూ అయిన శ్రీమన్నారాయణ భగవానుని ఆరాధిస్తూ కాలం గడుపుతూన్నది. ఆ దేవహూతి గర్భం నుండి-కాష్ఠం నుండి అగ్ని ప్రాదుర్భవించిన రీతిగా శ్రీహరియే అవతరించాడు. తత్సమయంలో పువ్వులవాన కురిసింది. అప్సరసలు ఆడగా గంధర్వులు పాడారు. కిన్నరులు కీర్తించగా మహర్షులు స్తోత్రాలు చేసారు. దేవదుందుభులు మోగాయి. దిశలన్నీ పరమ ప్రసన్నాలయ్యాయి. బ్రహ్మదేవుడు మరీచ్యాది మహర్షి పరివేష్టితుడై అక్కడకు వచ్చాడు. ఆ నవజాత శిశువును తిలకిస్తూనే ఆదిమధ్యాంత రహితుడైన శ్రీమన్నారాయణుడే - జగత్తులో సాంఖ్య శాస్త్రోపదేశం చేసే నిమిత్తం - అలా అవతరించాడని బ్రహ్మదేవుడు గ్రహించి ''వత్సా! కర్దమా! పితాజ్ఞను పాలించడమే కుమారుని కర్తవ్యము. పుత్రధర్మాన్ని నువ్వు సక్రమంగా పాలించావు. ఇందుకు నేను విశేష ప్రసన్నుడనయ్యాను. నువ్విప్పుడు మరీచ్యాదులకు వారి వారి అభీష్టాలను అనుసరించి నీ కన్యల నిచ్చి పరిణయం చెయ్యి. తద్ద్వారా అనేక విధాల ఈ సృష్టి విస్తరిల్లుతుంది. నీ యశస్సు కూడ దశదిశలా వ్యాపిస్తుంది. ఆదినారాయణ భగవానుడే కపిలనామంతో నీ పుత్రుడుగా అవతరించాడు.'' అని కర్దమునితో పలికి దేవహూతిని సంబోధించి - ''అమ్మా! శ్రీహరియే నీ కుమారుడుగా అవతరించాడు. జ్ఞానవిజ్ఞానాల ద్వారా ఈతడే కర్మవాసనలను సమూ

లంగా నిర్మూలిస్తాడు. అవిద్యా రూపమోహ గ్రంధిని ఖండించి వేస్తాడు. సిద్ధగణ సేవితుడైన సాంఖ్యాచార్యుని చేత కూడ ఈ బాలుడు పూజింపబడతాడు. కపిలనామంతో ప్రసిద్ధుడై నీ కీర్తిని దశదిశలా వ్యాపింపజేస్తాడు." అని పలికి చతుర్ముఖుడు నారదాది మహర్షి గణపరివేష్టితుడై నిజావాసానికి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత కర్దమప్రజాః బ్రహ్మదేవుని ఆదేశానుసారం - కళను మరీచికీ, అనసూయను అత్రికీ, శ్రద్ధను అంగిరసునికీ, హవిర్భూను పులస్త్యునకు, గతిని పులహానకును, క్రియను క్రతువునకును, అరుంధతిని వసిష్ఠునకును, శాంతిని అథర్వునకునూ, యిచ్చి శాస్త్రానుసారం పరిణయాలు చేసి వారందరినీ సముచితంగా సన్మానించాడు. అనంతరం నవవధువులను తీసుకుని కర్దముని జామాతలందరూ తమతమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు. తదనంతరం కర్దమఋషి బాలుని రూపంలో ఉన్న శ్రీహరిని సమీపించి పాపాత్ములైన మానవ మాత్రులకు సామాన్య దేవతలు కూడ చిరకాలం సేవిస్తేనే కానీ ప్రసన్నులు కారు. అట్టిదశలో దేవా! నువ్వు అనేక జన్మలలో సర్వసంగ పరిత్యాగులైన యోగులు సయితం-ఎంతగానో తపించినా దర్శనమీయని వాడవు. మాయామోహితులమై సంచరించే మాయందు విశేషానుగ్రహం చూపించి మమ్మల్ని ధన్యులను జేసావు. సాంఖ్యయోగాన్ని ఉపదేశించాలన్న మహాసంకల్పంతో అవ్యాజకరుణతో మా గృహంలో అవతరించావు. అప్రాకృతమైన భవదీయ చతుర్భుజాది రూపాలే నీకు యోగ్యమైనవి. ఐశ్వర్య జ్ఞాన, వైరాగ్య, యశ, వీర్య, శ్రీ - అనే షడైశ్వర్య సంపన్నుడవైన నిన్ను మేము శరణువేడుతూన్నాము. పరబ్రహ్మమూర్తీ! సర్వశక్తులూ నీ అధీనంలోనే ఉంటాయి. ప్రకృతి, పురుష, మహాతత్వ కాల అహంకారాదులూ, సర్వ లోకాలూ, లోకపాలురు ఆదిగాగల సర్వమూ నీ రూపమే, సర్వజ్ఞా! యావద్విశ్వాన్నీ చైతన్యశక్తి ద్వారా నీలోనే లయం చేసుకుంటావు. సర్వాతీతుడవునీవే ఋణత్రయంనుండి నేను నీ అనుగ్రహంచే విముక్తుడనయ్యాను. కపిలావతారమూర్తీ! నేను నిన్ను శరణు వేడుతూన్నాను. నా మనోభీష్టాలన్నీ నెరవేరాయి. సన్యాసాశ్రమాన్ని స్వీకరించి నేను నీ ధ్యానం ద్వారా నిత్యానందానుభూతిని పొందాలని నీ అనుమతిని అర్థిస్తున్నాను. కరుణించు దేవా!" అంటూ శ్రీహరిని కపిలమూర్తిగా ప్రార్థించాడు.

కర్దమ ఋషిపై కరుణారసపదృష్టులను ప్రసరింపజేస్తూ శ్రీహరి "మహర్షీ! నాకై పురాతన కాలంలో నువ్వు తపస్సు చేయగా నీ గృహంలో అవతరిస్తానని నాడు నేను నీకు మాట యిచ్చాను. సత్య ప్రతిజ్ఞుడనైన నేను ఇలా అవతరించాను. లింగ శరీరం నుండి ముక్తిని కాంక్షించే మునిగణానికి ఆత్మజ్ఞానోపదేశం చెయ్యడానికే నేను అవతరించాను. బహుకాలం నుండి ఆత్మజ్ఞాన రూపమైన సూక్ష్మ

మార్గం లోపించింది. పునః సాంఖ్యశాస్త్ర ప్రచారార్థమే నేను అవతరించాను. స్వేచ్ఛగా నువ్వు గృహాన్ని త్యజించి సన్యాసివై – ఆత్మ స్వరూపుడనైన నన్ను ధ్యానించు. తద్వారా నీకు ముక్తి కలుగుతుంది. నా మాతృ మూర్తికి జ్ఞానోపదేశం చేసి మోక్షాన్ని ప్రసాదిస్తాను.”

అన్న కపిల భగవానుని వచనాలు ఆలకించి కర్దమ ఋషి భగవానునికి ప్రదక్షిణ ప్రణామాలు అర్పించి వనాలకు వెళ్ళి పోయాడు. ఆ మహాత్ముడు సన్యాస ధర్మాన్ని అవలంబించి ఆశ్రమాన్నీ, అగ్నులనూ త్యజించి – నిర్గుణ బ్రహ్మోపాసకుడై ద్వంద్వాతీతుడై పరమ పదాన్ని పొందగలిగాడు.

స్కంధం-3 — అధ్యాయం-25

## కపిలదేవహూతీ సంవాదము

కర్దముడు అరణ్యాలకు వెళ్ళిన తరువాత కొంతకాలం గడిచింది. ఆ తరువాత దేవహూతి ఓనాటి ప్రాతః కాల సమయంలో కపిలుడు నిత్య కృత్యాలు నిర్వర్తించుకుని ప్రశాంత మనస్కుడై సుఖాసీనుడై యుండగా దేవహూతి కపిల రూపంలో తేజరిల్లుతూన్న హరిని తిలకించి – ప్రభూ ! విషయ వాసనా లోలత్వంచే నేను అజ్ఞానాంధకారంలో మునిగి పోయాను. నీ అనుగ్రహం వల్ల జనన మరణ రూపమైన క్లేశం దూరమయింది అజ్ఞానాంధకారాన్ని దూరం చేయడానికి జ్ఞాన భాస్కరునిలా నీ దర్శనం అయింది. దేహమందూ, గేహమందూ కూడ అహంకారాన్నీ, మమకారాన్నీ కలుగ జేసేది నువ్వే. కనుక తన్మోహాన్ని దూరం చేసి అనుగ్రహించు దేవా ! ప్రకృతి పురుష తత్త్వాన్ని గ్రహించాలని ఉంది. నిన్ను శరణు వేడినాను. భాగవత ధర్మం తెలిసిన నువ్వు దానిని నాకు ఉపదేశించు.'' అని అర్థించగా కపిల భగవానుడు ఆమెకు మహోత్తమమైన మోక్షమార్గాన్ని ఉపదేశించ సాగాడు.

'అమ్మా ! సుఖ దుఃఖాలను పోగొట్టునట్టి అధ్యాత్మ యోగమే గొప్పదని నా అభిమతం. ఆదిలో సర్వాంగ సంపన్నమైనదానిని నారదాదులకు బోధించాను. అదే నీకు చెబుతాను. ఆలకించు. బంధనానికీ, మోక్షానికీ మనస్సే కారణం. మనస్సు విషయాల యందు లగ్నమైతే మోక్ష కారణమవుతుంది. అహంకార, మమ కారాలు కారణంగా కామ క్రోధ లోభాది అరిషడ్వర్గాలు వేధిస్తాయి అట్టి అహంకార, మమ కారాదులను విడనాడ గలిగితే సుఖ దుఃఖాతీతమైన సమానావస్థ ఏర్పడుతుంది. తత్సమయంలో జీవుడు జ్ఞాన, వైరాగ్య, భక్తి ముక్తుడై సజాతీయ, విజాతీయ స్వగత భేద శూన్యమై, స్వయం ప్రకాశమై, సూక్ష్మమై అఖండమై, సుఖదుఃఖ రహితమై ప్రకృతి కంటె పరమైన ఆత్మను హృదయంతో చూడగలుగుతాడు. భగవత్ ప్రాప్తిని ప్రసాదించునట్టి హరి భక్తి కంటె మరో మార్గం యోగులైన వారికి లేదు. ఆ సక్తినీ, సంగాన్నీ కూడ యోగులు బంధన కారణాలుగా భావిస్తారు. కానీ అదే

సత్సాంగత్యమైతే పరమాత్మ యందు ఆసక్తి కలిగితే మోక్షం సంప్రాప్తమవుతుంది. సహనంతో, కరుణ కలిగి సర్వజీవులయందూ హిత భావం కలవారై ఎవ్వరినీ ద్వేషించకుండ, శాంతమైన, సరళమైన సత్స్వభావంతో సజ్జనసేవా తత్పరులై ఉండే వారూ, సర్వసంగత్యాగులై ఏకాగ్రచిత్తంతో నన్ను సుదృఢ భక్తితో ధ్యానిస్తూ సర్వకర్మ ఫలాలనూ నాకే సమర్పిస్తూ మత్సంబంధమైన లీలాగాథలనుఆలకిస్తుండే వారు తాపత్రయ దూరులు కాగలుగుతారు. సర్వ సంగాలనూ త్యజించగల వారే త్యాగశీలురుగా కీర్తించబడతారు సజ్జన సాంగత్యం ద్వారా విషయ వాసనలు నశించి దోషాలన్నీ పరిహరించబడతాయి. శ్రవణ, హృదయాలకు ఆహ్లాద శ్రేయస్సులను ప్రసాదించునట్టి సద్గాథలు వినే అవకాశం కూడ సజ్జన సేవ ద్వారానే లభిస్తుంది. అట్టి వారికి యిక్కడ ఎట్టి దుఃఖాలూ కలుగవు. మోక్ష మార్గంలో వారికి భక్తి శ్రద్ధలు క్రమక్రమంగా వర్ధిల్లుతాయి. భక్తి ద్వారా పారలౌకిక సుఖాసక్తి నాశనమవుతుంది. ఆ పై వైరాగ్యయుతుడైనవాడు సావధానుడై యోగ సంబంధితమైన భక్తి ప్రాధాన్యం కల సరళోపాయాలచే మనో నిగ్రహార్థం ప్రయత్నాలు కొనసాగిస్తాడు. ఈ రీతిగా ప్రకృతి గుణ జన్యమై శబ్ద స్పర్శాది విషయత్యాగం ద్వారా వైరాగ్య సంయుత జ్ఞానం ద్వారాను, యోగం వల్లనూ నా యందలి అచంచల భక్తి భావం చేతనూ పరమాత్మనైన నన్ను ఈ శరీరంతోనే పొంద గలుగుతాడు.'' అని పలకగా దేవహూతి తన సందేహాన్ని వ్యక్తం చేస్తూ ప్రశ్నించింది. ప్రభూ! నీ భక్తి స్వరూపం ఎలాంటిది? నా లాంటి అబలలకు ఎలాంటి భక్తి యోగ్యమయింది? స్వభావ సిద్ధంగా నేను పొందగలుగునట్టి నిర్వాణ పదం ఎట్టిది? తత్త్వజ్ఞానం నాకు ఏ మార్గం ద్వారా లభిస్తుంది. లక్ష్యాన్ని భేదించగల శరం వలె పరమాత్మను ప్రాప్తింప చేయగల యోగ మార్గం ఎలా ఉంటుంది? దానికి గల అంగాలెన్ని? నా వంటి అజ్ఞానురాలికి కూడ బోధపడే విధంగా సరళంగా ప్రబోధించు.'' అని ప్రార్థించిన దేవహూతికి కపిల భగవానుడు సమాధానమిస్తున్నాడు.

మాతా! భగవంతుని యందు లగ్నమైన చిత్తం కలవానికి మనస్సు వేద విహిత కర్మల యందు సంలగ్నమై - సత్వ గుణమూర్తి అయిన శ్రీహరియందు కలిగిన అహైతుక భావమే భక్తి అనబడుతుంది. అట్టి వాడే భక్తుడనబడతాడు. తిన్న ఆహారాన్ని జఠరాగ్ని జీర్ణం చేసి వేయునట్లు కర్మ సంస్కారాలకు నిలయమైన లింగ దేహాన్ని భక్తి భస్మం చేస్తుంది. కనుకనే మోక్షం కంటె కూడ భక్తి గొప్పదన్నారు మనీషులు. నా పాదారవిందార్చన యందే తత్పరులై మదీయానందార్థమే సర్వ కర్మలనూ అభివర్ణిస్తూ వారు నా సాయుజ్యాన్ని కూడ వాంఛించరుఅరుణారుణ నేత్రాలతో, మందస్మిత వదనారవిందంతో, భాసిల్లేనా దివ్య మంగళ సుందర విగ్రహ సందర్శనాభిలాషతో వారు నా లీలలను అభినయిస్తూ లీలా గృహీతమైన నా స్వరూపంతోనే వారు ప్రకాశిస్తారు. అట్టి మహాభక్తులకు

వాంఛించకుండానే నా పరమపదం లభిస్తుంది. అలాంటి భక్తి ద్వారా నీ స్మృతిభావం కలగగానే మాయాపతినైన - మదీయ సత్యాది లోకాలలోని భోగాలూ, భక్తి ప్రపత్తుల ద్వారా ప్రాప్తించునట్టి అష్టసిద్ధులూ, వైకుంఠాదిగా గల దివ్య లోక భోగవైభవాలనూ వారు అభిలషించరు. కాలాంతరంలో నా పరమ ధామాన్ని చేరిన తరువాత వారికి పరమైశ్వర్యాలన్నీ ప్రాప్తిస్తాయి. ఆత్మలో నిజపుత్ర మిత్ర కళత్ర గురు, ఇష్టదైవ స్వరూపాదులలో నాకన్న భిన్నమైన అన్యవస్తువు ఏదీ కాదని సర్వత్రా నన్నే సందర్శిస్తూ నన్నే భావన చేసి, నన్నే ఆశ్రయించునట్టి వారు శాంతిమయమైన భక్తులు వైకుంఠాన్ని పొంది సర్వభోగాలు అనుభవించ గలరు. వారి విషయంలో అలభ్య భోగాలన్నవి ఉండవు. వారిని కాలచక్రం ఏమీ చెయ్యజాలదు. అమ్మా! ఇహపరాలను ప్రసాదించేది లింగ శరీరం - దాని స్థూల శరీర సంబంధం కల ధన, పశు, పక్షి పుత్రాలయందూ అనేకాలైన వస్తు సంతతియందూ గల వాంఛను విడనాడి అనన్య భక్తితో నన్నే సేవించునట్టి వారికి మృత్యు రూప సంసారాన్నుండి విముక్తిని ప్రసాదిస్తాను. ప్రకృతికీ, పురుషునికీ కూడ నేనే స్వామిని. ప్రాణులన్నింటికీ ఆత్మ స్వరూపుడను నేనే. నన్ను తప్ప చరాచర విశ్వంలో ఎవరి నాశ్రయించినా సంసార సంగం నుండి విముక్తిని పొంద లేరు. ఇంద్రుడు నాకు భయపడి వర్షాన్ని కురిపిస్తాడు. వాయువు నాకు భయపడియే చలిస్తూంటాడు. అగ్ని దహించడమూ, సూర్యుడు తపించడమూ నాకు భయపడియే. మృత్యువు సక్రమంగా తన విధిని నిర్వర్తిస్తుంది. జ్ఞాన వైరాగ్యయుతమైన భక్తి ద్వారా పరమ యోగులు నన్నే ఆరాధిస్తారు. స్థిరమైనచిత్తంతో నన్ను భజించడం కంటె అన్యమైన మోక్ష మార్గం లేదు.

స్కంధం-3 — అధ్యాయం-26

## పిండోత్పత్తి వర్ణన ప్రకృతి పురుష వివేక వివరణ

అమ్మా! ప్రకృత్యాదిగా గల వారి తత్వాలనూ, వాటి ప్రత్యేక లక్షణాదులనూ వివరిస్తాను. ఆలకించు, మానవ మాత్రునకు ఆత్మ దర్శనమే మోక్ష కారణమవుతుంది. అహంకార రూపమైన హృదయ గ్రంథిని విచ్ఛిన్నం చెయ్య గలదికూడ అదే అని మనుష్యులు వ్యక్త పరుస్తూన్నారు. దానినే ఇప్పుడు నీ దగ్గర వర్ణిస్తూన్నాను. దీని వల్ల ఏ చరాచర విశ్వం నిండి నిబిడీకృతమై ఉన్నదో అయ్యాత్మయే పురుషుడై ఉన్నాడు. అనాదియై నిర్గుణుడైన ఆ పురుషుడు ప్రకృత్యతీతుడై భాసిల్లుతూంటాడు. అంతరంగంలో తేజరిల్లే స్వప్రకాశ స్వరూపుడై సర్వవ్యాపకుడైన ఆ పురుషుడు నిజ సన్నిధానానికి వచ్చిన అవ్యక్తమై త్రిగుణాత్మికమైన మాయను స్వేచ్ఛగా స్వీకరించాడు. నిజ సత్త్వాది గుణాల ద్వారా లీలా పరాయణమైన ప్రకృతి తద్గుణాను

రూపమైన సృష్టి చేసింది. దానిని తిలకించిన పురుషుడు జ్ఞానశక్తిని ఆచ్ఛాదించునట్టి దాని ఆవరణ శక్తితో మోహితుడై పురుషుడు స్వరూపాన్ని మరచి పోయాడు. ఇలా తన కన్న భిన్నమైన ప్రకృతినే స్వస్వరూపంగా భావించడం కారణంగా ప్రకృతి గుణాల ద్వారా కొనసాగబడే కర్మలన్నింటి యందూ - తనలోనే కర్తృత్వాన్ని ఆపాదించుకుంటూ ఉన్నాడు. ఈ కర్తృత్వాభిమానం కారణంగానే స్వాధీన సాక్షి అయినవాడూ, ఆనందమూర్తీ, అకర్తా అయిన పురుషుడు జనన మరణ రూప బంధనంతో పారతంత్ర్యాన్ని అనుభవిస్తూన్నాడు. కార్యరూపమైన దేహమూ, కారణ రూపాలైన ఇంద్రియాధిష్ఠాన దేవతలూ అనే వాటితో ఆత్మభావాన్ని ఆరోపణ చేసుకుంటూన్నారు. ఈ విషయంలో ప్రకృతినే కారణంగా చెబుతూన్నారు - మనుష్యుడు, యదార్థానికి తాను ప్రకృతి కంటె భిన్నుడై ఉండీ ప్రకృతిలో ఆత్మభావాన్ని ఆరోపించుకొనునట్టి పురుషుడు సుఖ దుఃఖానుభవ యోగ్యుడవుతూన్నాడు." అని కపిల భగవానుడు చెప్పగా దేవహూతి "పురుషోత్తమా ! ఈ జగత్సంబంధమైన స్థూల సూక్ష్మ కారణాలు ఎవరి స్వరూపమో? జగత్కారణులైనట్టి వారెవరో? అట్టి ప్రకృతి పురుషుల లక్షణాలను కూడ నాకు వివరించి చెప్పు." అని అర్థించగా కపిలరూపంలో తేజరిల్లుతూన్న శ్రీహరి పలుకుతూన్నాడు.

"మాతా ! త్రిగుణాత్మికమై, అవ్యక్తమై, నిత్యమై కార్యకారణ రూపమై ఉంది స్వయంగా నిర్విశేషమై ఉండీ ఏదైతే ఉంటూ విశేష ధర్మాలకు ఆశ్రయ స్థానమై ఉంటుందో ఆ ప్రధాన తత్త్వాన్నే ప్రకృతి అంటారు. భూత పంచకమూ తన్మాత్రలైదూ, అంతః కరణ చతుష్టయమూ దశేంద్రియాలూ - ఈ 24 తత్త్వాల సమూహాన్నే ప్రకృతి కార్యమనీ విద్వాంసులంటారు. (1) పంచ భూతాలు - పృధివ్యాపస్తేజోవాయ్వాకాశాలు (2) పంచతన్మాత్రలు - శబ్ద, స్పర్శరస గంధాలు (3) దశేంద్రియాలు, త్వక్చక్షుశ్శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణ, వాక్పాణి పాదపాయూపస్థలు అహంకార చతుష్టయం; మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ఏక మాత్రంగా ఉన్న అంతః కరణ సంకల్ప, నిశ్చయ, చింత, అభిమానాలనే వృత్తి భేదం ద్వారా చతుర్విధాలూగా గోచరమవుతుంది. ఈ రీతిగా సగుణ బ్రహ్మము సన్నివేశ స్థానంగా తత్త్వవేత్తలు చతుర్వింశతి స్థానంగా ఇరవై నాలుగుగా తత్త్వ సంఖ్యను వ్యక్తం చేసారు.

కాలశక్తిని కొందరు పురుషుని కన్న అన్యంగా భావించక భగవత్సంబంధితమైన సంహారిణీ శక్తిగా వ్యక్తం చేసారు. మహా ప్రభావ సంపన్నమైన ఆ కాలశక్తియే మానవ మాత్రులకు మరణరూపభయాన్ని కలగజేస్తుంది. గుణాలయందు సామ్యావస్థారూపమైన నిర్విశేష ప్రకృతిలో గత ఉత్పన్న మవడానికి ప్రేరకుడైన పురుష నామ వ్యవహృతుడైన పరమాత్మయే 'కాల' నామంతో పిలువబడుతూన్నాడు. ఈ రీతిగా నిజ మాయ ద్వారా సర్వ ప్రాణులలో అంతరంగంలో జీవరూపంతోనూ,

బాహ్యమందు కాలరూపంలోను వ్యాపించునట్టి పరమాత్మయై పంచవింశతి (25 వ) తత్త్వమవుతూన్నాడు. జీవుల భాగ్యవశం వల్ల క్షోభించే సర్వజీవులకూ ఉత్పత్తి స్థానమైన నిజ మాయలో చిచ్ఛక్తి రూపమైన స్వవీర్యాన్ని స్థాపించిన క్షణ మందే అది మహా తేజోమయ మహత్తత్త్వంగా ప్రభవిస్తుంది. లయవిక్షేప రహితమై జగదంకురరూపమైన మహత్తత్త్వం తనలోని విశ్వాన్ని ప్రకటించడానికి తనను ఆవరించి ఉన్న చీకటిని తన తేజస్సుతో నాశనం చేసి వేస్తుంది. నిర్మలమై, సత్త్వమయమై, భగవదుపలబ్ధిస్థాన రూపమైన చిత్తాన్నే మహత్తత్త్వం అంటారు. దానినే వాసుదేవ నామంతో వ్యవహరిస్తారు. అధ్యాత్మంలో చిత్తంగా పిలవబడేదే అధిభూతంలో మహత్తత్త్వంగా వ్యవహరింపబడుతూన్నది. చిత్తంలో అధిష్ఠాతృ రూపంలో ఉండే మహతత్త్వాన్నే క్షేత్రజ్ఞుడై ఉపాస్యమాన వాసుదేవ భగవానునిగా అంగీకరించాలి. అలాగే అహం కారంలో అధిష్ఠాతగా, రుద్రభగవానునీ, ఉపాస్యమాన దైవంగా సంకర్షణ భగవానునీ, బుద్ధ్యధిష్ఠానంగ బ్రహ్మదేవుణ్ణీ. ఉపాసనీయ దైవంగా ప్రద్యుమ్న భగవానునీ, మనస్సుకు అధిష్ఠాన దైవంగా చంద్రుణ్ణీ, ఉపాస్య దేవతగా అనిరుద్ధ భగవానునీ సాధకుడు భావన చెయ్యాలి. చతుర్వ్యూహమని దీనినే మనీషులు వ్యవహరిస్తారు. పృథివ్యాదులకు పూర్వమందు ఫేన రహితంగా జలాలు స్వచ్ఛంగా నిర్మలంగా వికార శూన్యంగాశాంతంగా ఉన్నట్లే స్వాభావికావస్థా దృష్టియందు స్వచ్ఛమై, వికార శూన్యమై శాంత వృత్తులతో కూడినదే చిత్త లక్షణంగా పేర్కొంటున్నారు.

తదనంతరం - భగవంతుని వీర్య స్వరూప చిచ్ఛక్తి ద్వారా ఉత్పన్నమైన మహత్తత్త్వం వికృతిని పొందగా క్రియాశక్తి ప్రధానమైన అహంకారం ప్రాదుర్భవించింది. సాత్త్విక, రాజస, తామస భేదాలతో అయ్యహం కారం త్రిధా విభాజితమయింది. వీటిలోని సాత్త్వికాహంకారం ద్వారా మనస్సూ రాజసాహంకారం ద్వారా ఇంద్రియాలూ తామసాహం ద్వారా భూత పంచకమూ ప్రాదుర్భవించింది. భూతేంద్రియ మనోయుక్తమైన అహంకారాన్నే మనీషులు సంకర్షణ నామకమై, సహస్ర శీర్షాలు కల అనంతుడని కీర్తించారు. అహంకారానికి దైవరూపంలో కర్తృత్వమూ, ఇంద్రియ రూపమందు కరణత్వమూ పంచభూత రూప మందు కార్యత్వమూ లక్షణాలై ఉన్నాయి. అట్లే సత్త్వ గుణం ద్వారా శాంతత్వమూ, రజోగుణం ద్వారా ఘోరత్వమూ, తమోగుణం నుండి మూఢత్వమూ అహంకార లక్షణాలుగా చెప్ప బడ్డాయి. ఉపర్యుక్త అహంకారాలు మూడింటిలో సాత్త్వికాహంకారం నుండి పరిణామం చెందడం వల్లనే సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు ప్రాదుర్భవించింది. ఈ మనస్సు ద్వారానే అనంతమైన వాంఛలు పుడుతూంటాయి. ఇంద్రియాధిష్ఠానమైన 'అనిరుద్ధుడే' ఈ మనస్తత్త్వ మవుతూన్నది. నీల కమల సమ శ్యామలుడైన ఈ అనిరుద్ధ భగవానునే యోగులైన వారు క్రమేణా స్వాధీనం చేసుకుని ఉపాసిస్తూంటారు. జననీ! తైజసాహం కారంలో ఏర్పడిన పరిణామమే బుద్ధి తత్త్వమైనది. పదార్థ స్ఫురణ, రూపజ్ఞాన ఇంద్రియ వ్యాపారాదు

సత్సాంగత్యమైతే పరమాత్మ యందు ఆసక్తి కలిగితే మోక్షం సంప్రాప్తమవుతుంది. సహనంతో, కరుణ కలిగి సర్వజీవులయందూ హిత భావం కలవారై ఎవ్వరినీ ద్వేషించకుండ, శాంతమైన, సరళమైన సత్స్వభావంతో సజ్జనసేవా తత్పరులై ఉండే వారూ, సర్వసంగత్యాగులై ఏకాగ్రచిత్తంతో నన్ను సుదృఢ భక్తితో ధ్యానిస్తూ సర్వకర్మ ఫలాలనూ నాకే సమర్పిస్తూ మత్సంబంధమైన లీలాగాధలనుఆలకిస్తూండే వారు తాపత్రయ దూరులు కాగలుగుతారు. సర్వసంగాలనూ త్యజించ గల వారే త్యాగశీలురుగా కీర్తించబడతారు సజ్జన సాంగత్యం ద్వారా విషయ వాసనలు నశించి దోషాలన్నీ పరిహరించబడతాయి. శ్రవణ, హృదయాలకు ఆహ్లాద శ్రేయస్సులను ప్రసాదించునట్టి మద్గాథలు వినే అవకాశం కూడ సజ్జన సేవ ద్వారానే లభిస్తుంది. అట్టి వారికి యిక్కడ ఎట్టి దుఃఖాలూ కలుగవు. మోక్ష మార్గంలో వారికి భ శ్రద్ధలు క్రమ క్రమంగా వర్ధిల్లుతాయి. భక్తి ద్వారా పారలౌకిక సుఖాసక్తి నాశన మవుతుంది. ఆపై వైరాగ్యయుతుడై నవాడు సావధానుడై యోగ సంబంధితమైన భక్తి ప్రాధాన్యం కల సరళోపాయాలచే మనో నిగ్రహార్థం ప్రయత్నాలు కొనసాగిస్తాడు. ఈ రీతిగా ప్రకృతి గుణ జన్యమై శబ్ద స్పర్శాది విషయత్యాగం ద్వారా వైరాగ్య సంయుత జ్ఞానం ద్వారానూ, యోగం వల్లనూ నా యందలి అచంచల భక్తి భావం చేతనూ పరమాత్మనైన నన్ను ఈ శరీరంతోనే పొందగలుగుతాడు.'' అని పలకగా దేవహూతి తన సందేహాన్ని వ్యక్తం చేస్తూ ప్రశ్నించింది. ప్రభూ! నీ భక్తి స్వరూపం ఎలాంటిది? నా లాంటి అబలలకు ఎలాంటి భక్తి యోగ్యమయింది? స్వభావ సిద్ధంగా నేను పొందగలుగునట్టి నిర్వాణ పదం ఎట్టిది? తత్త్వజ్ఞానం నాకు ఏ మార్గం ద్వారా లభిస్తుంది. లక్ష్యాన్ని భేదించగల శరం వలె పరమాత్మను ప్రాప్తింప చేయగల యోగ మార్గం ఎలా ఉంటుంది? దానికి గల అంగాలెన్ని? నా వంటి అజ్ఞానురాలికి కూడ బోధపడే విధంగా సరళంగా ప్రబోధించు.'' అని ప్రార్థించిన దేవహూతికి కపిల భగవానుడు సమాధాన మిస్తున్నాడు.

మాతా! భగవంతుని యందు లగ్నమైన చిత్తం కలవానికి మనస్సు వేద విహిత కర్మల యందు సంలగ్నమై - సత్త్వ గుణమూర్తి అయిన శ్రీహరియందు కలిగిన అహైతుక భావమే భక్తి అనబడుతుంది. అట్టి వాడే భక్తుడనబడతాడు. తిన్న ఆహారాన్ని జఠరాగ్ని జీర్ణం చేసి వేయునట్లు కర్మ సంస్కారాలకు నిలయమైన లింగ దేహాన్ని భక్తి భస్మం చేస్తుంది. కనుకనే మోక్షం కంటె కూడ భక్తి గొప్పదన్నారు మనీషులు. నా పాదారవిందార్చన యందే తత్పరులై మదీయానందార్థమే సర్వ కర్మలనూ అభివర్ణిస్తూ వారు నా సాయుజ్యాన్ని కూడ వాంఛించరుఅరుణారుణ నేత్రాలతో, మందస్మిత వదనారవిందంతో, భాసిల్లేనా దివ్య మంగళ సుందర విగ్రహ సందర్శనాభిలాషతో వారు నా లీలలను అభినయిస్తూ లీలా గృహీతమైన నా స్వరూపంతోనే వారు ప్రకాశిస్తారు. అట్టి మహాభక్తులకు

వాంఛించకుండానే నా పరమపదం లభిస్తుంది. అలాంటి భక్తి ద్వారా నీ స్మృతిభావం కలగగానే మాయాపతినైన - మదీయ సత్యాది లోకాలలోని భోగాలూ, భక్తి ప్రపత్తుల ద్వారా ప్రాప్తించునట్టి అష్టసిద్ధులూ, వైకుంఠాదిగా గల దివ్య లోక భోగవైభవాలనూ వారు అభిలషించరు. కాలాంతరంలో నా పరమ ధామాన్ని చేరిన తరువాత వారికి పరమైశ్వర్యా లన్నీ ప్రాప్తిస్తాయి. ఆత్మలో నిజపుత్ర మిత్ర కళత్ర గురు, ఇష్టదైవ స్వరూపాదులలో నాకన్న భిన్నమైన అన్యవస్తువు ఏదీ కాదని సర్వత్రా నన్నే సందర్శిస్తూ నన్నే భావన చేసి, నన్నే ఆశ్రయించునట్టి వారు శాంతిమయమైన భక్తులు వైకుంఠాన్ని పొంది సర్వభోగాలు అనుభవించగలరు. వారి విషయంలో అలభ్య భోగాలన్నవి ఉండవు. వారిని కాలచక్రం ఏమీ చెయ్యజాలదు. అమ్మా! ఇహాపరాలను ప్రసాదించేది లింగ శరీరం - దాని స్థూల శరీర సంబంధం కల ధన, పశు, పత్నీ పుత్రాలయందూ అనేకాలైన వస్తు సంతతియందూ గల వాంఛను విడనాడి అనన్య భక్తితో నన్నే సేవించునట్టి వారికి మృత్యు రూప సంసారాన్నుండి విముక్తిని ప్రసాదిస్తాను. ప్రకృతికీ, పురుషునికీ కూడ నేనే స్వామిని. ప్రాణులన్నింటికీ ఆత్మ స్వరూపుడను నేనే. నన్ను తప్ప చరాచర విశ్వంలో ఎవరి నాశ్రయించినా సంసార సంగం నుండి విముక్తిని పొందలేరు. ఇంద్రుడు నాకు భయపడి వర్షాన్ని కురిపిస్తాడు. వాయువు నాకు భయపడియే చలిస్తూంటాడు. అగ్ని దహించడమూ, సూర్యుడు తపించడమూ నాకు భయపడియే. మృత్యువు సక్రమంగా తన విధిని నిర్వర్తిస్తుంది. జ్ఞాన వైరాగ్యయుతమైన భక్తి ద్వారా పరమ యోగులు నన్నే ఆరాధిస్తారు. స్థిరమైనచిత్తంతో నన్ను భజించడం కంటె అన్యమైన మోక్ష మార్గం లేదు.

### స్కంధం-3 — అధ్యాయం-26

## పిండోత్పత్తి వర్ణన ప్రకృతి పురుష వివేక వివరణ·

అమ్మా! ప్రకృత్యాదిగా గల వారి తత్వాలనూ, వాటి ప్రత్యేక లక్షణాదులనూ వివరిస్తాను. ఆలకించు, మానవ మాత్రునకు ఆత్మ దర్శనమే మోక్ష కారణమవుతుంది. అహంకార రూపమైన హృదయ గ్రంథిని విచ్ఛిన్నం చెయ్యగలదికూడ అదే అని మనుష్యులు వ్యక్త పరుస్తూ న్నారు. దానినే ఇప్పుడు నీ దగ్గర వర్ణిస్తూన్నాను. దీని వల్ల ఏ చరాచర విశ్వం నిండి నిబిడీ కృతమై ఉన్నదో అధ్యాత్మయే పురుషుడై ఉన్నాడు. అనాదియై నిర్గుణుడైన ఆ పురుషుడు ప్రకృత్యతీతుడై భాసిల్లుతూంటాడు. అంతరంగంలో తేజరిల్లే స్వప్రకాశ స్వరూపుడై సర్వవ్యాపకుడైన ఆ పురుషుడు నిజ సన్నిధానానికి వచ్చిన అవ్యక్తమై త్రిగుణాత్మికమైన మాయను స్వేచ్ఛగా స్వీకరించాడు. నిజ సత్త్వాది గుణాల ద్వారా లీలా పరాయణమైన ప్రకృతి తద్గుణాను

రూపమైన సృష్టి చేసింది. దానిని తిలకించిన పురుషుడు జ్ఞానశక్తిని ఆచ్ఛాదించునట్టి దాని ఆవరణ శక్తితో మోహితుడై పురుషుడు స్వరూపాన్ని మరచిపోయాడు. ఇలా తన కన్న భిన్నమైన ప్రకృతినే స్వస్వరూపంగా భావించడం కారణంగా ప్రకృతి గుణాల ద్వారా కొనసాగబడే కర్మలన్నింటి యందూ – తనలోనే కర్తృత్వాన్ని ఆపాదించుకుంటూ ఉన్నాడు. ఈ కర్తృత్వాభిమానం కారణంగానే స్వాధీన సాక్షి అయినవాడూ, ఆనందమూర్తీ, అకర్తా అయిన పురుషుడు జనన మరణ రూప బంధనంతో పారతంత్ర్యాన్ని అనుభవిస్తూన్నాడు. కార్యరూపమైన దేహమూ, కారణ రూపాలైన ఇంద్రియాధిష్ఠాన దేవతలూ అనే వాటితో ఆత్మ భావాన్ని ఆరోపణ చేసుకుంటూన్నారు. ఈ విషయంలో ప్రకృతినే కారణంగా చెబుతూన్నారు – మనుష్యుడు, యదార్థానికి తాను ప్రకృతి కంటె భిన్నుడై ఉండీ ప్రకృతిలో ఆత్మ భావాన్ని ఆరోపించుకొనునట్టి పురుషుడు సుఖ దుఃఖానుభవ యోగ్యుడవుతూన్నాడు.'' అని కపిల భగవానుడు చెప్పగా దేవహూతి "పురుషోత్తమా! ఈ జగత్సంబంధమైన స్థూల సూక్ష్మ కారణాలు ఎవరి స్వరూపమో? జగత్కారణులైనట్టి వారెవరో? అట్టి ప్రకృతి పురుషుల లక్షణాలను కూడ నాకు వివరించి చెప్పు.'' అని అర్థించగా కపిలరూపంలో తేజరిల్లుతూన్న శ్రీహరి పలుకుతూన్నాడు.

"మాతా! త్రిగుణాత్మికమై, అవ్యక్తమై, నిత్యమై కార్యకారణ రూపమై ఉంది స్వయంగా నిర్విశేషమై ఉండీ ఏదైతే ఉంటూ విశేష ధర్మాలకు ఆశ్రయ స్థానమై ఉంటుందో ఆ ప్రధాన తత్త్వాన్నే ప్రకృతి అంటారు. భూత పంచకమూ తన్మాత్రలైదూ, అంతః కరణ చతుష్టయమూ దశేంద్రియాలూ – ఈ 24 తత్త్వాల సమూహాన్నే ప్రకృతి కార్యమనీ విద్వాంసులంటారు.(1) పంచ భూతాలు – పృథివ్యాపస్తేజోవాయురాకాశాలు (2) పంచతన్మాత్రలు – శబ్ద, స్పర్శ, రస గంధాలు (3) దశేంద్రియాలు, త్వక్చక్షుశ్శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, వాక్పాణి పాదపయూపస్థలు అహంకార చతుష్టయం; మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ఏక మాత్రంగా ఉన్న అంతః కరణ సంకల్ప, నిశ్చయ, చింత, అభిమానాలనే వృత్తి భేదం ద్వారా చతుర్విధాలూగా గోచరమవుతుంది. ఈ రీతిగా సగుణ బ్రహ్మకు సన్నివేశ స్థానంగా తత్త్వవేత్తలు చతుర్వింశతి స్థానంగా ఇరవై నాలుగుగా తత్త్వ సంఖ్యను వ్యక్తం చేసారు.

కాలశక్తిని కొందరు పురుషుని కన్న అన్యంగా భావించక భగవత్సం బంధితమైన సంహారిణీ శక్తిగా వ్యక్తం చేసారు. మహా ప్రభావ సంపన్నమైన ఆ కాలశక్తియే మానవ మాత్రులకు మరణరూపభయాన్ని కలగజేస్తుంది గుణాలయందు సామ్యావస్థారూపమైన నిర్విశేష ప్రకృతిలో గతి ఉత్పన్నమవడానికి ప్రేరకుడైన పురుష నామ వ్యవహృతుడైన పరమాత్మయే 'కాల' నామంతో పిలువబడుతూన్నాడు. ఈ రీతిగా నిజ మాయ ద్వారా సర్వ ప్రాణులలో అంతరంగంలో జీవరూపంతోనూ,

బాహ్యమందు కాలరూపంలోను వ్యాపించునట్టి పరమాత్మయై పంచవింశతి (25 వ) తత్త్వమవుతూన్నాడు. జీవుల భాగ్యవశం వల్ల క్షోభించే సర్వజీవులకూ ఉత్పత్తి స్థానమైన నిజ మాయలో చిచ్ఛక్తి రూపమైన స్వవీర్యాన్ని స్థాపించిన క్షణమందే అది మహా తేజోమయ మహత్తత్త్వంగా ప్రభవిస్తుంది. లయవిక్షేప రహితమై జగదంకురరూపమైన మహత్తత్త్వం తన లోని విశ్వాసాన్ని ప్రకటించడానికి తనను ఆవరించి ఉన్న చీకటిని తన తేజస్సుతో నాశనం చేసి వేస్తుంది. నిర్మలమై, సత్త్వమయమై, భగవదుపలబ్ధిస్థాన రూపమైన చిత్తాన్నే మహత్తత్త్వం అంటారు. దానినే వాసుదేవ నామంతో వ్యవహరిస్తారు. అధ్యాత్మంలో చిత్తంగా పిలవబడేదే అధిభూతంలో మహత్తత్త్వంగా వ్యవహరింపబడుతూన్నది. చిత్తంలో అధిష్ఠాతృ రూపంలో ఉండే మహతత్త్వాన్నే క్షేత్రజ్ఞుడై ఉపాస్యమాన వాసుదేవ భగవానునిగా అంగీకరించాలి. అలాగే అహంకారంలో అధిష్ఠాతగా, రుద్రభగవానునీ, ఉపాస్యమాన దైవంగా సంకర్షణ భగవానునీ, బుద్ధ్యధిష్టానంగ బ్రహ్మదేవుణ్ణీ, ఉపాసనీయ దైవంగా ప్రద్యుమ్న భగవానునీ, మనస్సుకు అధిష్టాన దైవంగా చంద్రుణ్ణీ, ఉపాస్య దేవతగా అనిరుద్ధ భగవానునీ సాధకుడు భావన చెయ్యాలి. చతుర్వ్యూహమని దీనినే మనీషులు వ్యవహరిస్తారు. పృథివ్యాదులకు పూర్వమందు ఫేన రహితంగా జలాలు స్వచ్ఛంగా నిర్మలంగా వికార శూన్యంగా శాంతంగా ఉన్నట్లే స్వాభావికావస్థా దృష్టియందు స్వచ్ఛమై, వికార శూన్యమై శాంత వృత్తులతో కూడినదే చిత్త లక్షణంగా పేర్కొంటున్నారు.

తదనంతరం - భగవంతుని వీర్య స్వరూప చిచ్ఛక్తి ద్వారా ఉత్పన్నమైన మహత్తత్త్వం వికృతిని పొందగా క్రియాశక్తి ప్రధానమైన అహంకారం ప్రాదుర్భవించింది. సాత్త్విక, రాజస, తామస భేదాలతో అయ్యహంకారం త్రిధా విభాజితమయింది. వీటిలోని సాత్త్వికాహంకారం ద్వారా మనస్సూ రాజసాహంకారం ద్వారా ఇంద్రియాలూ తామసాహం ద్వారా భూత పంచకమూ ప్రాదుర్భవించింది. భూతేంద్రియ మనోయుక్తమైన అహంకారాన్నే మనీషులు సంకర్షణ నామకమై, సహస్ర శీర్షాలు కల అనంతుడని కీర్తించారు. అహంకారానికి దైవరూపంలో కర్తృత్వమూ, ఇంద్రియ రూపమందు కరణత్వమూ పంచ భూత రూపమందు కార్యత్వమూ లక్షణాలై ఉన్నాయి. అట్లే సత్త్వ గుణం ద్వారా శాంతత్వమూ, రజోగుణం ద్వారా ఘోరత్వమూ, తమోగుణం నుండి మూఢత్వమూ అహంకార లక్షణాలుగా చెప్ప బడ్డాయి. ఉపర్యుక్త అహంకారాలు మూడింటిలో సాత్త్వికాహంకారం నుండి పరిణామం చెందడం వల్లనే సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు ప్రాదుర్భవించింది. ఈ మనస్సు ద్వారానే అనంతమైన వాంఛలు పుడుతూంటాయి. ఇంద్రియాధిష్ఠానమైన 'అనిరుద్ధుడే' ఈ మనస్తత్త్వ మవుతూన్నది. నీల కమల సమ శ్యాములుడైన ఈ అనిరుద్ధ భగవానునే యోగులైన వారు క్రమేణా స్వాధీనం చేసుకుని ఉపాసిస్తూంటారు. జననీ! తైజసాహంకారంలో ఏర్పడిన పరిణామమే బుద్ధి తత్త్వమైనది. పదార్థ స్ఫురణ, రూపజ్ఞాన ఇంద్రియ వ్యాపారాదు

లలో సహకరించడమూ, ప్రదార్థాల విశేష జ్ఞానాన్ని కలుగ జేయడమూ, అనే గుణాలు బుద్ధికి సంబంధించిన కార్యక్రమాలు సంశయ, విపరీతజ్ఞాన నిశ్చయ, స్మృతి, నిద్రాదులు కూడ ఈ బుద్ధికి సంబంధించిన లక్షణాలే బుద్ధి తత్త్వాన్నే ప్రద్యుమ్నుడని వ్యవహరించారు. ఇంద్రియాలు కూడ తైజసాహం కార సంబంధమైన కార్యాలనే ఆచరిస్తాయి. కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ విభాగం-కర్మ జ్ఞాన విభాగం వల్లనే ఏర్పడు తూన్నది. ఇందులో కర్మ ప్రధాన మయింది కాగా ప్రాణ శక్తి జ్ఞాన ప్రధానమైన దవు తూన్నది. బుద్ధి శక్తి పరమాత్మ యొక్క చైతన్య శక్తి వల్ల ప్రేరే పింపబడగా తామ సాహంకారం ద్వారా శబ్ద తన్మాత్ర ఉత్పన్న మైనది. శబ్ద తన్మాత్ర ద్వారా ఆకాశమూ, శబ్దజ్ఞానాన్ని ప్రసాదించగల శ్రోత్రేంద్రియమూ ప్రాదుర్భ వించాయి. అర్థాన్ని ప్రకాశింప జేయడమూ రహస్యంగా ఉన్న వక్త యొక్క జ్ఞానాన్ని సయితం ప్రదర్శించడమూ ఆకాశ, సూక్ష్మరూప తన్మాత్రతమై ఉంది. ఇవన్నీ శబ్ద లక్షణాలని విద్వాంసుల అభి ప్రాయము. సమస్తభూతాలకు అవకాశాన్ని కల్పించడమూ, బహిరంతరాలలో, వ్యాప్తి చెందించడమూ మనో ప్రాణేంద్రియాలకు ఆశ్ర యంగా ఉండడం - ఇవన్నీ ఆకాశానికి కార్య రూపమైన లక్షణాలన్నారు. శబ్ద తన్మాత్రా కార్యమైన ఆకాశంలో కాల గమనం వల్ల వికా రం కలిగినప్పుడే-స్పర్శ తన్మాత్రయు దాని వల్ల వాయువు, స్పర్శ గ్రహణకు ఆధారమైన త్వగింద్రియమూ ప్రభవించినాయి. కోమలత్వ, కఠోరత్వ, శీతలత్వ, ఉష్ణత్వ, వాయు సంబంధిత సూక్ష్మత్వాదులన్నీ స్పర్శకు సంబంధించిన లక్షణాలే, తరు శాఖలను కంపింప జేయడం, తృణాదులను ఏకం చెయ్యడం సర్వత్రా రాక పోకలు సాగించ గలగడం గంధాదులను ఘ్రాణేం ద్రియం దగ్గరకూ, శ్రోత్రేంద్రియం దగ్గరకు శబ్దాదులను తీసుకు రావడమూ, సర్వేంద్రియా లకూ కార్య శక్తులను ప్రసాదించడమూ - వాయువుకు సంబంధించిన వృత్తి లక్షణాలై ఉన్నాయి. స్పర్శ మాత్రావశిష్టంగా ఉన్న వాయువు యొక్క వికారం వల్లనే రూప తన్మా త్ర, తద్వారా తేజస్సూ, రూపగ్రహణ యోగ్యమైన నేత్రేంద్రియమూ ఉత్పన్న మయ్యాయి. వస్త్వాకార బోధ ద్రవ్యాదులకు అంగరూపంగా గోచర మవడమూ, ద్రవ్యా కారలక్షణాదులలో ఉపలక్షిత మవడమూ, తేజ స్సుకు స్వరూప భూతం కావడమూ ఇవన్నీ రూపతన్మాత్రకు లక్షణాలే. భాసించడం, జీర్ణం చెయ్యడం, చలిని దూరం చెయ్యడం, క్షుత్పి పాసలను కలిగించడం - భుజింప జేయడం, త్రాగించడం - ఇవన్నీ తేజస్సుకు సంబంధించిన వృత్తులే, భగవత్ప్రేరణగా రూప తన్మాత్రామ యమైన తేజో వికారం వల్ల రసతన్మాత్ర తద్వారా రసగ్రహణ సమర్థమైన రసనేంద్రియ మూ ప్రాదుర్భ వించాయి. నిజశుద్ధ స్వరూ పంలో రసం ఏకమైనదే కానీ అన్యభౌతిక వస్తు సంయోగం ద్వారా కటు, తిక్త, మధుర, కషాయ, ఆమ్ల, లవణాది భేదాలతో షడ్రసాలై నాయి. తడపడం, పిండాకృతిగా చేయడం, జీవింప జెయ్యడం, తృప్తి కలిగించడం, దాహాన్ని తీర్చడం వస్తువులలో మార్దవాన్ని

కలిగించడం, తాపాన్ని దూరం చెయ్యడం నీటిని గ్రహిస్తూన్నా కూపాదుల ద్వారా పునః వర్ధిల్లుతూండడం ఇవన్నీ జలానికి సంబంధించిన లక్షణాలే. రసస్వరూపమైన జలాల్లో వికృతిని చెందడం ద్వారా గంధ తన్మాత్ర దాని వల్ల పృథ్వి గంధ గ్రహణ సమర్థమైన ఘ్రాణేంద్రియమూ ఉత్పన్న మయ్యాయి. గంధం ఏకమాత్రమైనదే అయినా వివిధ పదార్థ సంయోగ కారణంగా సుగంధ, మిశ్రమ గంధ, తీవ్ర గంధాది నామాలతో అనేక విధాలుగా వృద్ధి చెందింది.

బ్రహ్మ యొక్క సాకార భావానికి ప్రతిమాది రూపాలకు ఆశ్రయం కావడమూ, జలాది కారణాలకు భిన్నంగా ఎట్టి ఆశ్రయమూ అవసరం లేకుండా ఉండుట, జలాదుల ధరించుట ఘటాకాశ, పటాకాశాది భేదాలను ఏర్పర్చడం పరిణామ విశేషం ద్వారా ప్రాణుల స్త్రీత్వ, పురుషత్వాది గుణాలను వ్యక్తం చెయ్యడం ఇవన్నీ పృథ్వీ కార్య లక్షణాలవుతూన్నాయి. శబ్దం ఆకాశానికి విశేష గుణం కాగా - అట్టి శబ్దమే శ్రోత్రేంద్రియ విషయమవుతూన్నది స్పర్శ వాయువుకు విశేషగుణం కాగా తత్ స్పర్శ త్వగింద్రియ విషయంగా వ్యక్తం చెయ్యబడింది. రూపం తేజస్సు యొక్క విశేషగుణం కాగా తద్రూపం విశేషంగా గలది నేత్రేంద్రియం అవుతూన్నది. రసం జలానికి విశేష గుణం కాగా తద్రసం రసనేంద్రియ విషయ మవుతూన్నది. గంధం పృథ్వికి విశేష గుణం కాగా తద్గంధం ఘ్రాణేంద్రియ విషయంగా వ్యక్తమయింది. వాయువాదిగా గల తత్త్వాలలో ఆకాశాది కారణ తత్త్వాలు ఉండడం వల్ల వాటి గుణాలు అనుగతంగా దర్శించ బడుతూన్నాయి. అందుకే సర్వ భూత గుణాలైన శబ్ద స్పర్శరూప రస గంధాలు పృథ్విలోనే గోచరమవుతూన్నాయి. మహత్తత్త్వ, అహంకార, పంచ భూతాలు పరస్పరం సంయోగం చెందకుండ భిన్న భిన్నంగా ఉన్నప్పుడే జగత్కారణుడైన శ్రీమన్నారాయణుడు కాల అదృష్ట, సత్త్వాది గుణాలతో ప్రవేశిస్తాడు. తమలో పరమాత్మ ప్రవేశించగానే అవి సంక్షోభాన్ని చెంది పరస్పరం కలిసి తత్త్త్వాల జడరూపమైన ఓ అండం ప్రాదుర్భవించి తదండం ద్వారా విరాట్పురుషుడు వ్యక్త మవుతాడు. తదండానికే విశేష నామం ఉంది. ఈ మహాండ మందే నారాయణ దేవుని స్వరూప భూతాలైన చతుర్దశ భువనాలు భాసిల్లుతూన్నాయి. చతుర్దిశలనుండీ ఇది 10 రెట్లు అధికమై ఉండి సప్తావరణలతో ఉంటుంది. జలావరణ, దానికి పదింతలు అగ్ని, దానికి పదిరెట్లు వాయువూ, ఈ క్రమంలోనే ఆకాశ, అహంకార, మహతత్త్వాలూ - వీటన్నింటికీ ఉపరి భాగంలో ప్రకృతీ, కారణ జలాలలో శయనించి తదండం నుండి లేచి మరల తదండ మందే విరాట్పురుషుడు ప్రవేశించాడు. అతడే అయ్యాండంలో కొన్ని ఛిద్రాలు కలిగించాడు. సర్వప్రథమంగా ముఖమూ, దాని ద్వారా వాగింద్రియమూ, తదధిష్ఠాన దేవత అయిన అగ్ని ప్రాదుర్భవించారు. తరువాత నాసి కారంధ్రాలూ, తద్వారా ప్రాణ యుక్తమైన ఘ్రాణేంద్రియమూ, తదింద్రియాధిష్ఠానమైన వాయువూ

ప్రభవించాయి. తదనంతరం నేత్రగోళాలూ, తద్వారా చక్షురింద్రియమూ, దానికధిష్ఠాత అయిన సూర్యనారాయణుడూ ప్రభవించారు. ఆ పై కర్ణరంధ్రాలూ, వాటినుండి శ్రోత్రేంద్రియంతో తదధిష్ఠాన దేవత లయిన దిగ్దేవతలూ ప్రాదుర్భవించగా విరాట్పురుషుని చర్మమూ, దాని నుండి కేశ, శ్మశ్రు రోమాదులూ ప్రకటింప బడ్డాయి. తదభిమాన దేవతలుగా ఓషధులు పుట్టాయి. ఆ తరువాత లింగమూ, దాని ద్వారా వీర్యమూ, లింగాభి మాన దేవతగా ఆపో దేవత ప్రాదుర్భవించారు. అదే క్రమంలో గుదా, అపాన వాయువూ, తదధిష్ఠానంగా లోకభీకరంగా మృత్యువూ, హస్తబలాదులూ, హస్తేంద్రియాధిష్ఠానంగా మహేంద్రుడూ, గమనక్రియా, పాదేంద్రియాభి మానదేవతగా శ్రీమన్నారాయణుడూ ప్రాదుర్భవించారు. అదే రీతిగా విరాట్పురుషుని నుండి నాడులూ, రుధిరమూ, నదులూ పుట్టాయి. ఉదరమూ, దాని వల్ల క్షుత్పిపాసలూ, ఉదరాభిమాన దేవత సాగరమూ జన్మించాయి. ఆ మీదట మనో హృదయాలూ, మనోభిమాన దేవతగా చంద్రుడూ అవతరించారు. తత్ హృదయం నుండి బుద్ధీ తదభిమాన దేవత అయిన బ్రహ్మ అహంకారమూ, అహంకారాభిమాన దేవతగా రుద్రుడూ, చిత్తాభిమాన దేవతగా క్షేత్రజ్ఞుడూ క్రమంగా అవతరించారు. క్షేత్రజ్ఞుని కన్న భిన్నంగా పుట్టిన దేవత లెవరు ? విరాట్పురుషుని జాగృతికై వారందరి కందరూ తమ తమ ఉత్పత్తి స్థానాలలో ప్రవేశించ నారంభించారు. వారందరితో కలిసి అగ్ని ముఖంలో ప్రవేశించినా విరాటుడు లేవ లేదు. ఘ్రాణేంద్రియంతో వాయువు నాసికలోను చక్షురింద్రియంతో దిశలు కర్ణాలలోనూ రోమ సమేతంగా ఓషధులు, తక్కులోనూ, జల వీర్య సమేతంగా మృత్యువు గుదమందూ బల సమేతంగా ఇంద్రుడు, హస్తాలలోనూ గతిసమేతంగా హరి చరణాలలోను రుధిరసమేతంగా నదులు నాడుల యందూ, క్షుత్పిపాసలతో సాగరుడు ఉదరమందూ మనస్సమేతంగా చంద్రుడు హృదయంలోనూ, అహంకారంతో రుద్రుడు హృదయమందు ప్రవేశించినా విరాట్పురుషుడు లేవ లేదు.

చిత్తానికి అధిష్ఠాన దేవతయైన క్షేత్రజ్ఞుడు విరాట్పురుషునిలో ప్రవేశించడంతో ఉత్తరక్షణంలో విరాట్పురుషుడు లేచి నిలచాడు. ప్రాణేంద్రియ మనో బుద్ధ్యాదులు క్షేత్రజ్ఞుడైన పరమాత్మ సహకారం లేనిదే విరాట్పురుషుని లేవదీయలేవు. కనుక భక్తి వైరాగ్యాల సహకారంతో ఏకాగ్రత ద్వారా ప్రాప్తించిన జ్ఞానంతో అంతరాత్మ రూపుడైన క్షేత్రజ్ఞుని స్వశరీరంలోనే ఉన్న వాణ్ణిగా స్వీకరించి ధ్యానం చెయ్యాలి.

స్కంధం-3 — అధ్యాయం-27

# మోక్ష ప్రాప్తి వర్ణన

జననీ! జలప్రతిబింబితుడైన సూర్యునికి జలాల్లోఉండే చంచలత్వాది గుణసంబంధం లేనట్లే ప్రకృతి కార్యమైన దేహంలో ఉన్నా ఆత్మ యదార్థానికి దేహసంబంధ సుఖ దుఃఖాది ధర్మాలతో సంబంధం లేనిది గానే ఉంటుంది. కారణం? సహజ నిర్వికారమూ, నిర్గుణమూ కర్తృత్వరహితమూ అయిన ఆత్మ ప్రకృతిగుణాలతో సంబంధం కల్పించుకొని అహంకార మోహితమై నేను కర్తనన్న అభిమానంతో ఉంటుంది. తదభిమానం వల్లనే దేహ సంసర్గంద్వారా కొనసాగించబడిన పాప పుణ్య కర్మలకు అధీనమై నిజస్వాతంత్ర్య శాంతులను కోలుపోతుంది. అంతేకాదు. ఉత్తమాధమ మధ్యమ యోనులలో ప్రభవిస్తూ సంసార చక్రంలోపడి తిరుగులాడుతూ ఉంటుంది. స్వప్న సమయంలో భయశోకాదుల సంబంధం లేకపోయినా స్వప్న వస్తువుల యందుండే ఆసక్తి కారణంగా స్వప్నమందు సయితం సుఖదుఃఖాదులను పొందుతున్నట్లే భయ, శోక, అహంకార మమకారాదులతో ఉండడం వల్ల జననమరణ రూప సంసార సత్తా లేక పోయినా విషయసుఖచింతనవల్ల జీవుడు సంసార చక్రంనుండి ముక్తిని పొందలేక పోతున్నాడు, అందుకే ధీశాలిఅయినవాడు విషయాలలో చిక్కుకుని చిత్తాన్ని తీవ్రమైన భక్తి వైరాగ్యయోగ సాధనల సహకారంతో వశం చేసుకోవాలి. యమనియమాది యోగ మార్గం ద్వారా శ్రద్ధతో కూడిన అభ్యాసం ద్వారా చిత్తానికి పదే పదే ఏకాగ్రతను సిద్ధింపజేస్తూ నాయందు సత్స్వభావం కలిగి మెలగాలి. మత్కథలను ఆకర్ణించడం సమస్త జీవుల యందూ సమదృష్టి కలిగి మెలగడమూ పరుల నెవరినీ ద్వేషించకుండా ఉండడమూ, దేనియందూ ఆసక్తి లేకుండా ఉండడం, బ్రహ్మచర్యమూ, మౌనం, ప్రారబ్ధానుసారం ప్రాప్తమైన వస్తువులతో సంతుష్టుడు కావడమూ, తన సర్వస్వాన్నీ భగవంతునకు అర్పణచెయ్యడమూ, పరిమితాహారాన్ని స్వీకరించడమూ, సదా ఏకాంత వాసంచేయడమూ, శాంతసరళ స్వభావం కలిగి వ్యవహరించడమూ, సర్వులయందూ మైత్రికలిగి ఉండడమూ, కరుణ, ధైర్యాలతో ఉంటూ ప్రకృతి పురుషుల యదార్థజ్ఞానం కలిగి వ్యవహరించడమూ, స్త్రీ పుత్రధనాదుల యందు, దేహాలయందు అహంకార మమకారాలు లేకుండా ఉండడమూ, జాగ్రదాది అవస్థలలో కూడ విశ్వసంబంధదూరుడై బుద్ధిని ఆత్మయందే లయంజేసి స్థిరచిత్తుడై ఉండగలగడం - ఆత్మదర్శిఅయిన జ్ఞాని తన కనుల ద్వారా సూర్యదేవుణ్ణి చూడగలిగినట్లు విశుద్ధాంతఃకరణలో భగవత్సాక్షాత్కారం పొందగల్గడం తద్వారా అద్వితీయ బ్రహ్మపదాన్ని పొందడం జరుగుతుంది. శరీరాది సర్వోపాధుల కన్న అతిరిక్తమైనదీ అహంకారం మొదలుగా సమాప్తమైన అసద్పదార్థాలయందు సత్య

రూపంతో ప్రకాశించేదీ, జగత్కారణ భూత మైనప్రకృతి అధిష్ఠానంగా ఉండేదీ, కార్య కారణాలను అన్నింటినీ వర్ధిలజేస్తూ మహ దాదులను తేజరిల్లజేయునట్టిదీ కార్యకారణ వర్గమందు వ్యాపించి ఉండేదీ పరమాత్మ స్వరూపం మాత్రమేనని తెలుసుకోవాలి.

జననీ! జలాల్లో ప్రతిబింబించే భాస్కర బింబం స్థలాలలో కూడ ప్రతిఫలిస్తుంది. ఆభాస సంబంధంవల్ల జలప్రతిబింబాన్ని అను సరించి ఆకాశంలో సూర్యునియొక్క జ్ఞానం కలిగినట్లే వైకారికాది భేదాలవల్ల త్రివిధా లైన అహంకారదేహం మనోగతమైన తన ప్రతిబింబంచేత నే లక్షితమవుతూన్నది. స్వరూప పరమాత్మజ్ఞానం కూడ కలుగుతుంది. సుషుప్తిలో నిద్రానస్థవల్ల శబ్ద, భూత, సూక్ష్మ, ఇంద్రియ మనోబుద్ధ్యాదులు అవ్యాకృతంలో విలీనమవుతూన్నాయి. తత్సమయంలో తాను మాత్రమే జాగ్రదవస్థయందుంటాడు. పైగా అయ్యవస్థలో అహంకారశూన్యుడుగా కూడ ఉంటాడు. జాగ్రదవస్థ యందీ ఆత్మభూత సూక్ష్మాది దృశ్యవర్గం ద్రష్టరూపంలో స్పష్టంగా అనుభవానికి వస్తుంది. సుషుప్తి వేళలో ఉపాధి భూతాహంకారం కూడ నాశ నమై పోవడంవల్ల అతడు భ్రమవశుడై తాను కూడ నాశనమై పోయినట్లు భావిస్తాడు. ధనం నాశనమై పోయిన వాడు తానే నాశనమై పోయినట్లు భావించిన తీరుగా అహంకార నాశ నంతో తాను నాశనమై పోయినట్లు భావన చేస్తాడు. మాతా! ఈ విషయాలన్నింటినీ యోచించి మననం చేసి వివేకి అయిన వాడు సర్వాధిష్ఠానమైన ఆత్మానుభవం పొంది నిరతి శయానందాన్ని పొందగలుగుతాడు'' అని కపిల భగవానుడు పలుకగా దేవహూతి ప్రశ్ని స్తూన్నది.

''భగవన్ పరస్పరాశ్రితులై ఉండే ప్రకృతి పురుషులు ఒకరి నొకరు విడనాడి ఉండ జాలరు. పృథ్వీగంధాలకూ, ఆపోరసాలకూ, అవినాభావ సంబంధమున్నట్లుగానే ప్రకృతి పురుషులు కూడ అవినాభావ సంబంధం కల వారై పరస్పరం విడనాడు కోవడానికి వీలు లేనిది. అట్టి స్థితిలో కర్త కాని పురుషునకు ఈ కర్మ బంధం ఎలా ప్రాప్తమయింది? ప్రకృతి గుణాలు ఉన్న వానికి కైవల్యం ఎలా లభిస్తుంది? తత్త్వ విచారణ ద్వారా సంసార బంధ రూప మైన భయం నివృత్తి కావచ్చును. అయినా తన్నిమిత్త భూతమైన ప్రకృతి గుణాలు అభా వం కాక పోవడం వల్ల ఆ భయం పునః కలగ డానికి అవకాశం గోచర మవుతూన్నది. కనుక నా యీ సందేహాన్ని దూరం చేసెదవు గాక!''

దేవహూతి సందేహాలకు కపిల భగ వానుడు బదులు పలుకుతూన్నాడు. ''జననీ! తనవల్ల ఏర్పడిన అగ్ని వల్ల అరణి చేతనే భస్మ మైనరీతిగా నిష్కామంగా కొనసాగించు నట్టి ధర్మ పాలన ద్వారాను చిరకాలం భగవత్కథా శ్రవణం వల్లనూ, పరిశుద్ధమై తీవ్రమైన భక్తి వల్లనూ, తత్త్వ సాక్షాత్కార యోగ్యమైన జ్ఞానం ద్వారాను, దృఢమై, వైరాగ్యయుక్త మైన వ్రత నియమాదులతో కూడిన ధ్యానం

ద్వారానూ చిత్త సంబంధమైన దృఢమైన ఏకాగ్రత ద్వారాను పురుషుని అజ్ఞానం అహోరాత్రాలూ క్షీణించి లయమై పోతుంది. విషయ భోగాలందు దోషాలను గుర్తించి వాటిని త్యజించినట్టి వాడు - స్వతంత్రుడై ఆత్మాను భూతి పొంద గలుగుతాడు. అట్టి వానిని ప్రకృతి బంధించ జాలదు. స్వప్నావస్థలో ఉన్న వానికి అనేక దృశ్యాలు కనిపించి సుఖ దుఃఖాలను కలిగించినా జాగ్రదవస్థను పొందగానే స్వప్నానుభవాల నుండి - ఎట్టి మోహమూ కలగని విధంగా తత్త్వ జ్ఞానం కలవాడు నాయందే మనస్సును లగ్నంచేసి ధ్యానిస్తూంటాడు. అట్టి ఆత్మారాముడైన మునిని ప్రకృతి ఏ విధంగానూ మోహింప జెయ్యలేదు. మానవ మాత్రుడు అనేక జన్మలలో ఇలా ఆత్మ చింతన చెయ్యగా, చెయ్యగా చివరకు బ్రహ్మలోక పర్యంతం ఉండే భోగాలన్నిటి యందూ విరాగం కలవాడవుతాడు. ధీశాలి అయిన నా భక్తుడు నా మహత్తర కృప ద్వారా తత్త్వ జ్ఞానియై ఆత్మానుభవం ద్వారా సంశయాలన్నింటి నుండి ముక్తిని పొంది లింగదేహం నాశనం కాగా అద్వితీయుడైన నాలో ఐక్యతను పొంది పునరావృత్తి లేనట్టి మోక్షాన్ని పొంద గలుగుతాడు. అది శాశ్వతమైనది. అట్టి పరమ పదం పొందినవాడు ప్రకృతి కంటె పరమైన పరమాత్మ స్వరూపుడని తెలిసికో.

స్కంధం-3 అధ్యాయం-28

## అష్టాంగ యోగ వర్ణన.

జననీ! సబీజమైన యోగాన్ని గురించి నీకు వివరిస్తాను. సావధానంగా ఆలకించు. దీని వల్ల చిత్తం పరిశుద్ధం కాగా ప్రసన్నమైన చిత్తంతో మానవుడు సన్మార్గరతుడు కాగలుగుతాడు. శక్తి వంచన లేకుండా, శాస్త్రానుకూలమైన ధర్మానుష్ఠానం చెయ్యడం, శాస్త్ర విరుద్ధాచారాలను త్యజించడం ప్రారబ్ధాను సారం ప్రాప్తమైన వాటితో సంతృప్తి చెందడం ఆత్మజ్ఞానుల చరణసేవ, విషయ వాసనలను వర్ధిల జేసేకర్మలకు దూరంగా ఉండడమూ సంసార దుఃఖాల నుండి విముక్తిని కలిగించే కర్మలను ప్రేమించడమూ, పవిత్రాహారాన్ని పరిమితంగా స్వీకరించడమూ, ఏకాంతంగా నిర్భయంగా ఉండే స్థానంలో ఆవాసమేర్పరచుకోవడమూ, మనోవాక్శరీరాలతో అవసరానికి మించి అధికంగా వస్తువులను సంపాదించక పోవడమూ, ఏప్రాణినీ హింసించకుండా సత్యమే పలుకుతూ చోర జారత్వాలకు దూరంగా ఉంటూ, బ్రహ్మచర్యపాలనతో, బాహ్యాభ్యంతర శుద్ధితో, శాస్త్రాధ్యయనం చేస్తూ భగవదారాధనతో, మౌనంతో, పద్మాది ఆసనాభ్యాసంతో స్థిరంగా ఆసీనుడై - క్రమక్రమంగా ప్రాణాయామ సాధన ద్వారా - శ్వాసను జయించి - ఇంద్రియాలను విషయాల నుండి

వేరు చేసి హృదయంలో చేర్చాలి. అంటే ఇంద్రియ వృత్తులను అంతర్ముఖం చెయ్యాలి. మూలాధారాది కేంద్రాలలో క్రమంగా ప్రాణాలను స్థిరం చేస్తూ సమాహితమైన చిత్తంతో భగవల్లీలను ధ్యానిస్తూండడం వల్లనూ, వ్రతదానాది యితర సాధనల వల్లనూ, సావధానంగా ప్రాణాలను జయించి దుర్మార్గంలో సంచరించే నిజచిత్తాన్ని బుద్ధి యొక్క సహకారంతో క్రమ క్రమంగా ఏకాగ్రం చేసి పరమాత్మను ధ్యానించాలి. ప్రప్రథమంగా ఆసన జయం కలవాడై ప్రాణాయామాభ్యాసార్థం కుశాసన, మృగచర్మ, చిత్రాసనాలను క్రమంగా ఒకదానిపై ఒకటుంచి ఋజు శరీరుడై ఆసీనుడై చలన రహితంగా అభ్యాసం చెయ్యాలి. పూరక కుంభక, రేచక క్రమంలో కానీ లేక రేచక, కుంభక పూరక క్రమంలో కానీ ప్రాణ మార్గాన్ని శోధిస్తే చిత్తం నిశ్చలంగా ఉంటుంది. అగ్నివాయు తప్తమైన సువర్ణం మలాన్ని విడనాడిన విధంగా - ప్రాణ వాయువును జయించిన యోగి కూడ - మలరహితుడై పరి శుద్ధుడవుతాడు. కనుకనే యోగి అయిన వాడు ప్రాణాయామం ద్వారా వాతపిత్తాది దోషాలనూ, ధారణ ద్వారా పాపాలనూ, ప్రత్యాహారం ద్వారా విషయ సంబంధమైన రాగాది దోషాలనూ జయించాలి. యోగాభ్యాసం చేస్తుండగా చిత్తం నిర్మలమై ఏకాగ్రత సిద్ధించగానే దృష్టిని నాసికాగ్రంలో నిలిపి భగవద్ధ్యానం చెయ్యాలి. మందస్మిత ముఖార విందం కలిగి, కమల సమ నేత్రాలతో, శంఖ చక్ర గదాధ్యాయుధాలతో కూడిన హస్తాలు కలిగి, పీతాంబర ధారియై వక్షఃస్థలంలో వత్సలాంఛనం శోభిల్లుచుండ, కౌస్తుభ మణీ, వనమాలా ధరించి కిరీట హారకటక కేయూరాది అమూల్యాభరణ ధారియై శోభిస్తూ భక్త జనుల హృదయారవిందాన్నే నివాస స్థానంగా దర్శనీయమై మనోహరమైన ఆ శాంత స్వరూపుడూ, నయనాభిరాముడూ చతుర్భుజుడూ అయిన శ్రీహరిని ధ్యానించాలి. ఆ శ్రీహరి సర్వదా కిశోరావస్థలోనే ఉంటూ భక్త సమూహాన్ని అనుగ్రహించడానికై ఆతురత కలిగి ఉంటాడు. దర్శనీయ స్వరూపుడై, సర్వలోక వందితుడైన ఆతని పవిత్ర కీర్తి సర్వలోక వ్యాప్తమై ఉంది. బలి ఆదిగాగల యశస్సంపన్నుల యశస్సును వర్ధిల జేసే శ్రీమన్నారాయణ భగవానుణ్ణి ధ్యానించాలి. భగవల్లీలలు దర్శనీయాలు. నిజాభిరుచిని పురస్కరించుకుని ఆదేవ దేవుడు నిలబడినట్లు, ఆసీనుడై యున్నట్టు, నడుస్తూన్నట్లు శయనించియున్నట్లు, అంతర్యామిగా హృదయ పీఠంలో భాసిల్లు తూన్నట్లు చింతన చెయ్యాలి. ఉపర్యుక్త రూపాల్లో ఏరూపమైనాసరేచింత్తలో సంలగ్నమైననాడు సర్వాంగ సుందరమైన శ్రీహరి సర్వాంగాలపై లగ్నమైన చిత్తాన్ని విశేషంగా ఒక్కొక్క అంగమందే నిలపాలి. ఈ రీతిగా భగవత్ పాదార విందాలను ధ్యానించాలి.

వజ్ర, అంకుశ, ధ్వజ, కమల చిహ్నాంకితమై రక్త వర్ణం కల నఖచంద్రికలే భక్తుని అజ్ఞానాంధ దారాన్ని నిర్మూలనం చేసే విగా భావన చెయ్యాలి. శ్రీహరి పాద ప్రక్షాళన

మాత్రంచే నదులలో సర్వ శ్రేష్ఠమైన గంగ ప్రాదుర్భవించింది. ఆ మంగళమయ గంగను శిరస్సుపై ధరించి పరమ శివుడు మంగళ ప్రద డయ్యాడు. ఇంద్ర ప్రయోగిత వజ్రాయుధం ద్వారా పర్వత పక్షాలు నరకబడిన రీతిగా భగవచ్చరణ ధ్యాన మాత్రంచే మనుష్య మాత్రుని పాపరాశులు నాశనమై పోతాయి. తరువాత అతసీ కుసుమ విరాజితమైన జాను ద్వయాన్ని ధ్యానించాలి. పరంధాముని జానుద్వయాన్ని శ్రీ మహాలక్ష్మీదేవి తన తొడలపై ఉంచుకుని పాదసేవ చేస్తూ ఉంటుంది. బ్రహ్మ జననీ, అమర వందిత అయిన శ్రీమహాలక్ష్మీ దేవిచే సేవించ బడు నట్టి జాను ద్వయాన్ని ధ్యానించాలి. ఆపై భగవంతుని జంఘు భాగాన్ని ధ్యానం చెయ్యాలి. శక్తికి నిధివంటి ఆ జంఘులు గరుడుని భుజపీఠాన్ని అలంకరించి నట్టివి. ఆ తరువాత పీతాంబరావృతమై, కాంచనాభరణా లంకృతమైన నితంబ భాగాన్ని ధ్యానించాలి. సమస్త జగదాధార భూతమైనదీ, ఉదర ప్రదేశంలో ఉన్నదీ, చతుర్ముఖ బ్రహ్మకు ఆలంబమైనదీ, సర్వ జగన్మయమైనదీ అయిన పద్మం ఉద్భవించిన శ్రీహరియొక్క నాభీదేశాన్ని ధ్యానించాలి. మరకత మణిసన్నిభమైన స్తనాలను ధ్యానించి మహాలక్ష్మికి ఆవాస స్థానమైనదీ, నయనా నంద ప్రదమైనదీ అయిన ఆ దేవ దేవుని వక్షఃస్థలాన్ని ధ్యానించాలి. కౌస్తుభ మణిని సయితం తేజరిల్లజేసే గళాన్నీ, సాగర మథన వేళలో మందరాద్రి ధ్వనులను సయితం అధః కరించి ధ్వనించు నట్టి కరకంకణాలను ధరించి, లోకపాలు రందరికీ అభయదానం చేయగల చతుర్భుజాలనూ ధ్యానించడం సక్రమమైన విధి. అమరులు కూడ సహించ జాలనట్టి మహాప్రకాశం కలిగినట్టిదీ, సహస్రారాలతో భాసిల్లు నట్టిదీ అయిన సుదర్శన చక్రాన్ని ధ్యానించాలి. రాజహంససమంగా కరకమలంలో ప్రకాశించే శంఖాన్నీ, పెరివీరుల రుధిర ధారలచే పంకిలమై ఉన్న కౌమోదకీ గదనూ, భ్రమర నాదాలచే ప్రతిధ్వనిస్తూన్న వనమాలనూ ఆ దేవ దేవుని గళసీమ నలంకరించి జీవుల నిర్మల తత్వమై భాసిల్లే కౌస్తుభ మణినీ కూడ విశేషంగా ధ్యానించాలి.

భక్తజనులను అనుగ్రహించేటందులకు గాను సాకారమూర్తిని ధరించిన శ్రీహరి ముఖకమలాన్ని ధ్యానించవలసిన విధాన మిది. మనోహరమైన నూవు పువును బోలిన నాసికతో, మకరకుండల ప్రభలతో తేజరిల్లే కపోలదేశంతో, తుమ్మెదరెక్కలవలె నల్లనైన అలకావళితో శోభిల్లే కమలకోశ సన్నిభ చంచలాలై విశాలాలై, కమల కోశంపై చందరిస్తూ చంచల మీనద్వయ సమనయన యుగళం కలిగి సమున్నత భ్రూలతా శోభితమైన ఉన్నట్టి పరంధాముని వదన మండలాన్ని, ధ్యానించాలి. భక్తజనుల తాపత్రయాలను రూపుమాపునట్టివీ వారి యందు విశేష దయారసాన్ని వర్షిల జేయునట్టివీ ప్రేమపూర్ణ మందస్మితంచే అనుకుణం వర్ధిల్లు నట్టివీ అయిన దేవదేవుని నయన యుగళాన్ని ధ్యానించాలి. భక్తజనుల తీవ్రాతి తీవ్ర శోక జలాలను శుష్కంపజేయునట్టి అత్యంతో

దారమైనట్టిని మదనుణ్ణి సయితం మోహింపజేయునట్టి, మందస్మితమైనట్టిదీ అయిన శ్రీహరి భ్రూయుగ్మాన్ని ధ్యానించాలి. విశేష ప్రేమార్ద్రభావంతో నిజహృదయంలో విరాజిల్లుతూ కిలకిలనవ్వునట్టి శ్రీహరిని ఈ రీతిగా ధ్యానించాలి. హాస్యరసం ద్వారా చలిస్తూన్న అధరాలమధ్యదేశం నుండి మల్లె మొగ్గల్లా భాసిల్లే దంతపంక్తినీ అరుణాధరాల సంచలనంలో మాటిమాటికీ ప్రకాశించునట్టి శ్రీహరి దేవుని మందహాసాన్ని ధ్యానిస్తూ అన్యపదార్థాలలో దేనినీ చూడనే కూడదు. మనస్సు ఆ పరంధాముని యందే సంలగ్నమై ఉండాలి. ఇలా ధ్యానాభ్యాసం ద్వారా సాధకునికి భగవంతుని పట్ల ప్రేమ కలుగుతుంది. అతని హృదయం భక్తివల్ల ద్రవిస్తుంది. ఆనందాతిరేకం వల్ల శరీరం రోమాంచిత మవుతుంది. ఆనందబాష్పధారల ద్వారా పదే పదే శరీరాన్ని స్నానమాడిస్తూంటాడు. చేపలను తన వైపుకు ఆకర్షించునట్టి గాలం వలె శ్రీహరిని క్రమక్రమంగా తనవైపుకు ఆకర్షించుకుంటూ ఉంటాడు. తైలం అయిపోగా దీపశిఖ తనకు కారణభూతమైన తేజస్తత్త్వంలో లీనమై పోయినట్లు ఆశ్రయ విషయాదులు రాగరహితం కావడంతో మనస్సు శాంతించి బ్రహ్మాకారాన్ని పొందుతుంది. అట్టిదశను పొందినవాడు గుణప్రవాహ స్వరూపాలైన శరీరాది ఉపాధులనుండి నివృత్తుడైన కారణంగా ధ్యాత, ధ్యేయ భేదరహితంగా అఖండ పరమాత్మనే సందర్శించ గలుగుతాడు. యోగాభ్యాస ప్రాప్తచిత్తం యొక్క అవిద్యా శూన్య, లయరూప నివృత్తిద్వారా సుఖదుఃఖరహిత నిజబ్రహ్మ రూపమహిమలో పరమాత్మతత్త్వ సాక్షాత్కారాన్ని పొందిన మీదట - అట్టి యోగి సుఖదుఃఖానుభవాన్ని అజ్ఞానం వల్ల తనయందే చూస్తూ వచ్చినవాడు - ఇప్పుడు దానిని అవిద్యాకృతమైన అహంకారంలో దర్శించగలుగుతాడు. సురాపానమత్తుడు శరీరం మీదబట్టఉన్నదీ, లేనిదీ తెలిసికోలేనట్లే తురీయావస్థను పొందిన సిద్ధుడు కూడ కూర్చొనుట, నిలచుట, నడచుట, శయనించుట, కూడ తెలియకుండా ఉంటాడు. అంతే పరమానందానుభూతిని పొందినట్టివాడు దేహాతీతుడు కావడం కారణంగా శరీరసంబంధ విషయాలేవీ వానిని అంటవు. విధి వశాన ఆవాగమనాలు ఎక్కడికైనా జరుగుతూన్నా ఆత్మారాముడైనట్టి వాడు వాటిని కూడ గుర్తించడు.

బ్రహ్మజ్ఞానిఅయిన వాని దేహం గత జన్మ కర్మాధీనమై ఉంటుంది. కనుక వాని దేహారంభకమైన ప్రారబ్ధశేషం ఉన్నంత వరకూ ఇంద్రియ సమేతంగా సజీవంగా ఉంటాడు. కానీ సమాధి స్థితి వరకూ యోగస్థితుడై పరమాత్మతత్త్వాన్ని తెలుసుకున్న సిద్ధపురుషుడు దారాపుత్ర సమేతమైన ఈ దేహాన్ని - స్వప్న పదార్థాలనూ జాగ్రదవస్థలో పొందనట్లే పొందడు. అహంకార మమకారదూరుడై ఉంటాడు. స్నేహాధిక్యత కారణంగా సాధారణులకు పుత్రధనాదులపై ఆత్మబుద్ధి ఉంటుంది. కానీ జ్ఞానదృష్ట్యా తిలకించి చూడ స్పష్టంగా భిన్నంగా గోచరమవుతూన్నాయి. అట్లే శరీ

రాదులను ఆత్మబుద్ధ్యా తిలకించునట్టి వాడు కూడ వివేచనతో తెలుసుకోవాలి. దేహాదులు ఆత్మకన్న ప్రజ్వరిల్లే కాష్ఠాన్నుండే, తన నుండి జనించే మిణుగురుల నుండీ, ధూమాన్నుండీ కూడ యదార్థానికి అగ్ని భిన్నంగానే ఉంటుంది. అలాగే భూత ఇంద్రియ అంతఃకరణాదుల కన్న వాటికి సాక్షి అయిన ఆత్మ భిన్నమైయుండగా, తద్భిన్నమై బ్రహ్మ తేజరిల్లుతూన్నాడు. ప్రకృతి కన్న మిన్నగా దానిని చలింపజేసే పురుషోత్తముడు భిన్నమై ఉన్నాడు. దేహదృష్ట్యా అండజ, పిండజ, ఉద్భిజ జరాయుజాది చతుర్విధప్రాణులూ పాంచభౌతిక యాత్రలలో అట్లే జీవులన్నింటి యందూ, ఆత్మనూ, ఆత్మలో సర్వజీవులనూ అనన్య భావంతో అనుగతమై ఉన్నట్లు చూసే ఆత్మజ్ఞాని వలె చూడ గలగాలి. విభిన్నాశ్రయాల నుండి భిన్న భిన్నాకృతులలో గోచరించే విధంగానే సురాసురనరాది దేహాలలో ఉండే ఏకైకాత్మ గుణభేదం కారణంగా భిన్నభిన్నరూపాలలో ప్రకాశిస్తూంది. తత్కారణంచే భగద్భక్తులు జీవస్వరూపాన్నే మరుగు పరిచే కార్యకారణరూపాలనుండి పరిణతి చెందిన పరమాత్మ యొక్క అచింత్యశక్తి మయమైన మాయను అతని కృపచేతనే జయించి నిజ వాస్తవికమైనట్టి బ్రహ్మరూపంలోనే ఉంటారు.

## స్కంధము-3 అధ్యాయము-29

# భక్తి రహస్యము

కపిల భగవానుని మహోపదేశాన్ని ఆలకిస్తూన్న దేవహూతి "ప్రభూ! కరుణించి భక్తిమార్గాన్ని సవిస్తరంగా నాకు వినిపించు - అంతే కాదు. జీవుల జననమరణ రూపమైన వివిధగతులను గురించికూడ వర్ణించండి. దేని శ్రవణ మాత్రంచే మానవులకు సర్వవస్తువుల యందూ వైరాగ్యం కలుగుతుందో అట్టి విషయ సర్వస్వాన్నీ వివరించండి. ఏ కాల స్వరూప భీతిచే మానవులు శుభకర్మలయందు రతులవుతూంటారో? బ్రహ్మాదులను సయితం శాసించగల సర్వసమర్థమైన కాలస్వరూపాన్ని గురించి కూడ వర్ణించండి. దేహాదులయందు ఆత్మభావం కలిగిన మాయామోహితులైన అజ్ఞానులు - కర్మాసక్తమైన బుద్ధి వల్ల ఘోరసంసార మహాసాగరంలో భ్రమించే జీవులను జాగృతపరచి తేజస్సును ప్రసాదించడానికి గాను యోగాన్ని ప్రసాదించునట్టి భాస్కరుడవుగా అవతరించిన నువ్వే నాకు సర్వజ్ఞత్వాన్ని ప్రసాదించునట్టి జ్ఞానాన్ని బోధించు" అని అర్థించగా కపిలభగవానుడు బదులు పలుకుతూన్నాడు.

మాతా! మానవ మాత్రులలో స్వభావ గుణ భేదం కారణంగా భిన్నత్వముండడం వల్ల సాధకుల భావానుసారంగా భక్తి అనేక ప్రకారాలుగా ఉంటుంది. భేదదృష్టి, క్రోధమూ, హింసా ప్రవృత్తీ దంభ, మాత్సర్యాది లక్ష

గాలుకలిగి నన్ను భజించేవాడు తామస భక్తుడనబడతాడు. విషయ సుఖాలూ, కీర్తీ, ఐశ్వర్యాదులనూ అభిలషించి భేదభావంతో విగ్రహాదులయందు నన్ను సేవించునట్టి వారిని రాజస భక్తులంటారు. పాప క్షయార్థం సర్వకర్మలనూ పరమాత్మయందు అర్పించడం కోసం భేదభావంతో నన్ను ఆరాధించేవాడు సాత్త్విక భక్తు డనబడతాడు. గంగా ప్రవాహం నిరాటంకంగా సాగరం వైపే తీవ్రగమనంతో పురోగమించి పోవునట్లు నా గుణ శ్రవణ మాత్రాన ఎవని మానసం తైలధారా సదృశంగా అవిచ్ఛిన్నంగా సర్వహృదయాంతర్వర్తినైన నా వైపే సంలగ్నమవడం కారణంగా పురుషోత్తముడనైన నా మీదనే అనన్యప్రేమకలిగి ఉండడాన్ని నిర్గుణభక్తిని యోగలక్షణంగా గ్రహించగలగాలి. నిష్కామభక్తుడు - సాలోక్య, సార్ష్టి, సామీప్య సారూప్య, సాయుజ్య మోక్షాలు ప్రసాదించినా - నా సేవలో అతనికి ఆటంకం కలుగుతుందని వాటిని స్వీకరించడు. భగవత్సేవకై మోక్షాన్ని సయితం త్యజింపజేయ గల ఈ భక్తియోగమే పరమపురుషార్థమై సాధ్యమైన దవుతూన్నదని మనీషులంటున్నారు. అట్టి నిష్కామ భక్తిద్వారానే సత్త్వరజస్తమోగుణత్రయాన్ని అదిగమించి అప్రాకృతమైన మదీయప్రేమ స్వరూపాన్ని పొంద గలుగుతాడు. నిష్కామభావంతో నిత్యనైమిత్తిక కర్మలాచరించడమూ, నా విగ్రహ సందర్శనమూ, సర్శ పూజాస్తుతి ప్రణామాలు కొనసాగించడమూ, సర్వప్రాణులయందూ నన్నే భావనచేస్తూ ధైర్యవైరాగ్యాలను అవలంబించడమూ, మహాపురుష సంసేవనము, దీనులపై దయకలిగి ఉండుట సమాన వ్యక్తులపై మైత్రీభావం కలిగి వ్యవహరించడమూ, యమనియమాదిపాలనా, అధ్యాత్మశాస్త్ర శ్రవణమూ, మదీయ నామాలను ఉచ్చైస్స్వరంతో గానం చేయడమూ, మానసిక సరళత్వమూ, సత్సాంగత్యమూ, అహంకార త్యాగమూ, భాగవత ధర్మానుష్ఠానమూ, అనునట్టి మార్గాలను అనుసరించి భక్తజనుల చిత్తం పరిశుద్ధమై మద్గుణశ్రవణమాత్రంచే సునాయాసంగా నాయందు లగ్నమవుతుంది. వాయుప్రేరిత సుగంధం తనకు ఆశ్రయమైనట్టి పుష్పాన్నుంచి ఘ్రాణేంద్రియం దాకా పనిచేయునట్లు - రాగద్వేషశూన్యుడై భక్తియోగ తత్పరుడైనట్టి వాని చిత్తం పరంధాముని పొందగలుగుతుంది. ఆత్మరూపంలో జీవులన్నిటియందూ నేను వ్యాపించి ఉండడం వల్ల మానవులు సర్వభూతస్థితుడనైన నన్ను అనాదరించి కేవలం విగ్రహాలయందే పూజాదులు చేయడం ఆడంబరమే అవుతుంది. సర్వభూతాత్మరూపుడనూ, పరమేశ్వరుడనూ అయిననన్ను గ్రహించజాలక మోహవశులై నా విగ్రహాలనే ఆరాధించే వారు అగ్నిని విడనాడి భస్మంలో హోమం చేసిన వాని వలె సంపూర్ణఫలాన్ని పొందజాలరు. లోకమందు భేదదృష్టికలిగి దురభిమానం కలవాడు పరులను ద్వేషిస్తాడు. అట్లే సర్వాంతర్యామి రూపంలో ఉన్న నన్ను గూర్చి ఎన్నిరకాలైన పూజలు చేసినా నేను ప్రసన్నుడను కాను. మానవుడు ధర్మానుష్ఠానమూ, విగ్రహారాధనా కొనసాగిస్తూనా - సర్వహృదయాంతర్యామి

అయిన పరమాత్మను భూతిని పొందనంతకాలం ఆత్మపరమాత్మల మధ్య ఏమాత్రం అంతరం కల్పించుకున్నా, భేదదృష్టి కల మానవునకు మృత్యురూప భీతిని కలుగ జేస్తూంటాను. అందుచే సర్వజీవుల శరీరాలలోనూ అంతర్యామి రూపంలో ఉండే పరమాత్మనైన నన్ను దాన మాన మైత్ర్యాదులద్వారా సమదృష్టితో పూజించాలి.

జననీ! అచేతనాలైన పాషాణాదులకన్న వృక్షాదిజీవులు శ్రేష్ఠమైనవి. వాటికంటె శ్రేష్ఠమైనవి శ్వాసను పీల్చేవి. వాటి కంటె శ్రేష్ఠమైనవి మనస్సుకల జీవులు. వాటిని మించినవి ఇంద్రియాలుకలవీ, వాటిలోకూడ స్పర్శజ్ఞానం కలవీ, వాటికంటె, రసగ్రహణ సామర్థ్యం కల మత్స్యాదులూ, వాటికంటె గంధగ్రహణశక్తి కల భ్రమరాదులూ, వాటి కన్న మిన్నగా శబ్దగ్రహణ సామర్థ్యం కల సర్పాదులూ,వాటినిమించిరూపగ్రహణశక్తిగలవాయసాదులూ, వాటిని అధిగమించి దంతాలు కలవీ శ్రేష్ఠమైనవిగా ఉంటాయి. పాదాలు లేని వాటికంటె పాదాలుకలవీ, అందులో బహుపాదాలు కలవాటికంటె చతుష్పాద జంతువులూ, వాటిని అధిగమించి ద్విపాదాలు కలవీ, అందులోనూ, మానవులూ వారిలో కూడ విప్రులూ, అందులో మరల వేదవేదాంగ జ్ఞాన సంపన్నులూ వేద తాత్పర్యాన్ని సంపూర్ణంగా గ్రహించిన వారూ అందులో మరల సందేహాలను దూరంచేయ్యగల వారూ, వారిలో సయితం వర్ణాశ్రమధర్మ పాలకులూ, అందులో త్యాగులూ, నిజధర్మాన్ని నిష్కామ భావంతో ఆచరించేవారూ శ్రేష్ఠులు, అందులోనూ సర్వకర్మలనూ తత్సంబంధమైన ఫలసమేతంగా స్వదేహాన్ని భగవంతుడనైన నాకు సమర్పణ చేయగలవారూ శ్రేష్ఠతములు. ఈ రీతిగానే చిత్తమూ, కర్మలూ, నాయందే అర్పించి కర్తృత్వరహితుడై సమదర్శిగా ఉండే వానికంటె మించి నన్ను ఎవడూ చూడజాలడు. కనుక విజ్ఞుడైన వాడు జీవరూపమైన నిజాంశతో సాక్షాత్తూ పరమాత్మయే సర్వప్రాణులలో ఉన్నాడని గ్రహించి ప్రాణులన్నింటినీ దైవదృష్ట్యాచూసి ప్రణమిల్లాలి. మాతా! ఈ రీతిగా నీకు భక్తియోగాన్ని గురించి వర్ణించాను. అష్టాంగయోగం కూడ వినిపించాను. వీటిలో దేనిని సాధించినా మనుష్య మాత్రుడు పరమాత్మను పొందగలుగుతాడు.

పరమేశ్వరుని అత్యద్భుత ప్రభావసంపన్నమై జగత్సంబంధమైన వస్తువుల నానావిధ చిత్రాలకూ కారణభూతమైన స్వరూప విశేషానికే 'కాలం' అన్న నామం విఖ్యాత మయింది. ప్రకృతి పురుషులిద్దరూ కాలస్వరూపులే, కాలంకన్న భిన్నమై వివిధప్రకారాలైన కర్మలకు మూలమైన అదృష్టం కూడ కాలస్వరూపమే, కాలం వల్లనే మహత్తత్త్వాభిమాన దేవతారూపాలైన భేదధర్మాలను చూసి ప్రాణులన్నీ సర్వత్రా భీతిచెందుతుంటాయి. సర్వ భూతాశ్రయుడు కావడం చేతనూ, సర్వప్రాణుల

యందూ నిండి నిబిడీకృతుడై ఉండడం వల్లనూ భూతాల ద్వారా పునః సంహరింప జేస్తూ యావద్విశ్వాశాసకుడై — బ్రహ్మాదులకు సయితం ప్రభువైన పరమాత్మయే యజ్ఞఫల ప్రదాత అయిన విష్ణుదేవుడు. కాలానికి మిత్రశత్రు భేదం లేదు. అది నిరంతరం అప్రమత్తంగా ఉంటూ నిజస్వరూపమైన భగవంతుని విస్మరించి భోగులయిన ప్రాణులను ఆక్రమించి సంహరిస్తూంటుంది. అట్టి అపారశక్తి సంపన్నమైన కాలానికి భీతి చెందియే తరు లతాదులు పుష్పించి ఫలిస్తూంటాయి. స్రవంతులు ప్రవహిస్తూంటాయి. తన హద్దులను అతిక్రమించకుండ సాగరం ఉంటుంది. అగ్ని జ్వలిస్తూంటుంది భూమండలం జలాల మునిగిపోకుండా స్థిరంగా ఉండ గలుగుతుంది. కాలభీతిచేతనే ప్రాణుల ఉచ్ఛ్వాస, నిఃశ్వాసలకు ఆకాశం అవకాశమిస్తూన్నది. అహంకార రూపమైన దేహానికి మహత్తత్త్వం సప్తావరణయుత బ్రహ్మవిష్ణు మహేశ్వరులు సృష్టిస్థితి లయాలను సక్రమంగా కొనసాగిస్తూంటారు. అనాదియైన ఈకాలం అవినాశనమైనది. పరులకు అదికర్తకూడ. స్వయంగా అది అవినాశనమై ఉంటూ అన్యులందరి అంతాని హేతువవుతూన్నది. జనకుని వల్ల పుత్రోత్పత్తినిచేస్తూ ఈకాలమే సర్వజగత్ సృష్టినీ కొనసాగిస్తూ ఉంటుంది. నిజసంహారశక్తి అయిన మృత్యువు ద్వారా యముణ్ణికూడ అంతం చేస్తూంటుంది.

స్కంధం-3 — అధ్యాయం-30

శ్రీ కృష్ణ పరమాత్మనే నమః

## కాల మహిమ

కపిల భగవానుడు మాతృమూర్తి అయిన దేవహూతికి కాలస్వరూపాన్ని వర్ణించి యింకా యిలా అంటున్నాడు—

జననీ! వాయువు వల్ల ఎగురగొట్టబడిన మేఘాలు అపారమైన వాయువు యొక్క శక్తిని గ్రహించజాలనట్లే కాలప్రేరితాలై భిన్నభిన్నావస్థలలో అనేకానేక యోనులలో తిరుగులాడే జీవులు కాలమహాప్రభావాన్ని గ్రహించజాలవు. సుఖాభిలాషియైనవాడు కష్టించి సముపార్జించిన వస్తువులను కాలభగవానుడు నాశనం చేసి వేస్తూంటాడు. నిత్యం అదిజరుగుతూండేపనియే. అయినా మానవుడు వాటిని గురించి విచారిస్తూనే ఉంటాడు. ఇందుకు ప్రధానకారణం? అనిత్యాలయిన పశుపుత్రపత్నీ ధనాదులపై మానవులకు ఉన్న నిత్యత్వభావనయే. ఈ ప్రపంచంలో జీవుడు ఏయోనిలో జన్మిస్తే ఆ దేహాన్నే సుఖసాధనంగా భావిస్తూంటాడు. కానీ, ఆ దేహి, జన్మాదులయందు వైరాగ్యాన్ని పొందడం లేదు. తనకు పిష్ఠాభోజనాలు కల నరకాదులలో పడికూడ - మాయా మోహితుడై దానిని కూడ సుఖంగానే భావిస్తాడు కానీ ఆ హేయమైన దేహాన్ని కూడ త్యజించడానికి అంగీకరించడు. ఈ మూఢ

మానవుడు స్వదేహ గేహ దార పుత్ర, ధన పశుబంధు బాంధవాదుల యందు ఆసక్తి కల వాడై వారిద్వారా అనేకానేక అభీష్టాలను నెరవేర్చుకోవాలని కోరుకుంటూ - తనను మహా భాగ్యతశాలినిగా భావించుకుంటూ ఉం టాడు. వీరందరినీ పాలించి పోషించడం కోసం వీడి దేహమంతా దహించుకుపోతూ ఉంటుంది. అయినా దుర్వాసనా దూషిత హృదయుడు కావడం వల్ల మూర్ఖుడైన వాడు దారాపుత్రా దుల కోసం పాపాలు అనేకంగా చేస్తూం టాడు.

కులటలు సంభోగావస్థలో ప్రదర్శించే కపట ప్రేమలోనూ, బిడ్డలు పలికే చిలుక పలు కులలోనూ మన సేంద్రియాలు చిక్కుకుపోవడం లో గృహస్థుడైన వాడు దుఃఖప్రద గృహస్థ సంబంధమైన కపట వ్యవహారాలలో చిక్కుకు పోతాడు. తత్సమయంలో అత్యంత సావధా నంగా సాధించే కార్య కలాపాలలో ఒకప్పుడు దుఃఖానికి ప్రతీకారం కలుగుచో దానిని మహా సుఖంగా భావిస్తాడు. మూఢుడు అనేక హింసా త్మకమైన పాపాలు చేసి తాను నరకయాతనలు అనుభవించడానికి కూడ సిద్ధపడి సంపాదించిన ధనాదుల ద్వారా పుత్రాదులను పోషిస్తూ వారు భుజించగా శేషించిన అన్నాన్నే తింటూ ఇహ పరాలు రెండింటికీ దూరమై పోతాడు. పదే పదే ప్రయత్నిస్తూ విఫలుడవుతూ ంటే చివరకు ధైర్యాన్ని పోగొట్టుకుని పరుల ధనం కోసం ప్రాకులాడు తూంటాడు. దురదృష్ట వంతుడై ఏ విధంగానూ ఆర్జించ లేక కుటుంబ పోషణ యందు అసమర్థుడై అత్యంత దీనంగా సంచరిస్తూ దుఃఖం వల్ల దీర్ఘంగా నిట్టూరుస్తూంటాడు. లోభి అయిన క్రూరస్వభావం కల రైతు పని చెయ్య లేని వృషభాన్ని అనాదరణ చేసినట్లే ధనార్జన చెయ్యజాలని వాణ్ణి భార్యాపుత్రులూ కూడ ఆదిలో వలె గౌరవించక అనాదరణ చేస్తూంటారు. ఆ స్థితిలో సయితం వాడికి వైరా గ్యం కలుగదు. అంత వరకు తానెవరినైతే పోషించాడో వారే తనను పోషించ వలసి వస్తుంది. వార్ధక్యం వల్లన దేహమంతా శిథిలమై పోతుంది. వ్యాధి గ్రస్థుడై పోవడం వల్ల జఠ రాగ్ని మందం కావడంతో పురుషార్థం కూడ మంద మవుతుంది. మరణా సన్నుడై గృహంలో పడి ఉంటాడు. భార్యా పుత్రాదులు కుక్కను చూసినట్లు చూస్తూ ఓ కబళం పడవేస్తే తింటూ జీవనాన్ని గడుపు కుంటూంటాడు. మరణ మాసన్నం కాగానే వాయువు యొక్క ఉత్క్రి మణంవల్ల అతడు కనుగుడ్లు తేలవేస్తాడు. శ్వాస ప్రశ్వాసలకు సంబంధించిన నాడులు కఫం వల్ల రుద్ధమవుతాయి. శ్వాసించడానికీ దగ్గడానికీకూడ చాల కష్టమైపోతుంది. కఫం పెరిగి పోవడంవల్ల కంఠంలో గురక బయలు దేరగా, బంధు బాంధ వులు చుట్టూ చేరి విలపిస్తూంటే మరణ పాశ బద్ధుడైనవాడు మాట్లాడ లేకుండా ఉంటాడు. మూఢుడు ఇంద్రియాలను జయించ లేక నిరంత రం కుటుంబ పోషణలోనే కాలయాపన చేస్తూండడం వల్ల జ్ఞానోదయం కాదు, పైగా బంధువు-లందరూ విలపిస్తూంటే మ్మ తోడు రోదనం కూడ వినడం వల్ల చైతన్యాన్ని కోలు పోయి మరణిస్తాడు.

తత్సమయంలో ఆ జీవుణ్ణి తీసుకు పోవడానికి భయంకరాకారులూ, క్రోధాగ్ని జాజ్వల్యమాన నేత్రాలతో యమభటులు యిద్దరు వస్తారు. అతడు వారిని చూసి మాటి మాటికీ మూత్ర పురీషాలను విసర్జిస్తూంటాడు. ఆ జీవుణ్ణి యమభటులు యాతనా శరీరంలో ప్రవేశపెట్టి - రాజదూతలు అపరాధిని తీసుకొని పోయేటట్లు పాశాలతో బంధించి బహుదూరంలో ఉన్న యమసదనానికి తీసుకు పోతారు. మార్గమధ్యంలో వాణ్ణి కసరుతూ, తర్జన భర్జనలు కొనసాగిస్తూంటే వాని గుండె పగిలిపోతూ దేహమంతా దడదడలాడి పోతూఉంటుంది. దారిలో పట్టుకుని కుక్కలు పీకుతూంటే గతంలో చేసిన పాపాలు స్మృతికి రాగా వ్యాకులత్వాన్ని పొందుతూ ఉంటాడు. క్షుత్పిపాసలతో స్మృతి హీనుడై పడిపోతూ సూర్యదావానలాదులచే తపించబడుతూ ఉంటుంది. ఆ సమయంలో విశ్రాంత స్థానం కానీ, జలాదులు కానీ దొరకక విపరీతంగా కాలిన యిసుక ప్రదేశాలలో అడుగు తీసి అడుగు వెయ్యలేక బాధపడుతూంటే - కొరడాలతో వాని వీపు మీద యమభటులు కొరడాలతో కొడుతూ అనేకమైన యాతనలకు గురి చేస్తూంటే అలాగే బాధపడుతూ పురోగమిస్తూంటాడు-ఆ జీవుడు. అక్కడక్కడ శ్రమ కారణంగా మూర్ఛపోతూ చివరకు లేస్తూ అత్యంత కష్టం మీద దుఃఖమయ మార్గంలో నడుస్తూ క్రూరంగా యమభటులచే వేధించబడుతూ యమ సదనం చేరుతారు.

మర్త్య లోకం నుండి యమలోకం 99 వేల యోజనాల దూరంలో ఉంది. అంత దూరాన్నీ యమభటులు రెండు లేక మూడు ముహూర్తాల కాలంలో తీసుకు పోతారు. అక్కడ వివిధ యాతనలకు గురి అవుతాడు. మండుతూన్న కట్టెల మధ్య అక్కడ వాని శరీరాన్ని పడవేసి తగలబెడతారు. తన దేహాన్ని తన చేతనే కానీ, పరుల చేతకానీ ఖండ ఖండాలుగా కోయించి తన చేతనే తినిపిస్తారు. శరీరంలో జీవుడు ఉండగానే ఆ లోకంలో గృధ్ర శునకాదులచే వాని ప్రేవులు లాగిస్తారు. తేళ్ళచేతా, పాములచేతా, ఇంకా కోరలుగల జీవులచేతా కరిపించీ పొడిపించీ, పీకించీ అనేక విధాల హింసిస్తారు. దేహాన్ని ఖండ ఖండాలుగా నరకడం, ఏనుగుల చేత త్రొక్కించడం, కొండ శిఖరాల మీది నుండి క్రిందకు పడతోయించడమూ, నీటిలో ముంచి వేసిపైకి తేల నివ్వకుండా ఉంచడమూ, గోతులలో పాతి పెట్టడం - ఆదిగా గల ఘట్టాలను స్మరించినంత మాత్రాన శరీరం గగుర్పొడిచే యాతనలన్నీ కలుగజేస్తారు. తత్సమయంలో తామిస్ర, అంధతామిస్ర, రౌరవ, మహారౌరవాది నరకాలెన్నో ఉన్నాయి. స్త్రీ పురుషులలో ఎవరైనా పరస్పర సాంగత్యం కారణంగా జరిగే పాపాల వల్ల నరక యాతనలను అనుభవించి తీరాలి. జననీ! స్వర్గ నరకాలు రెండూ యిక్కడే ఉన్నాయంటారు. కారణమేమంటే నరకయాతనలతో సమమైన యాతనలతో సమమైన యాతనలూ, భోగాలూ కూడ యిక్కడే ఉన్నాయన్నది వారి భావము. ఈ ప్రకారంగా అనేకానేక కష్టాలకు లోనై నిజ కుటుంబ పోషణార్థము, నిజోదర పోషణార్థమూ కాలయాపన చేసేవాడు దేహాగేహా కుటుంబా

దుల నన్నింటినీ యిక్కడే వదిలేసి మరణానంతరం పాపఫలాన్ని యమలోకంలో ఏకాకిగా అనుభవిస్తాడు. కుటుంబ పోషణార్థం తానీ లోకంలో చేసిన పాపాలు, అధర్మా-న్యాయాలు కారణంగా దుర్మార్గ ఫలితాన్ని శాసనంగా యమలోకంలో అనుభవించే వేళలో సర్వస్వాన్నీ కోలుపోయినట్లువిడుస్తాడు. ఎవడైతే పాపాలు ఆచరించి కుటుంబాన్ని పోషిస్తాడో? అట్టివాడు అంధతామిస్ర నామక నరకాన్ని పొందుతాడు. అది అధికమైన కష్టాన్నిస్తుంది. నరక యాతనలు అనుభవించి శునక శూకరాది జన్మలెత్తి చివరకు మానవ జన్మను పొందుతారు.

స్కంధం-3 — అధ్యాయం-31

## దేహ, గేహాలపై ఆసక్త కలవారి అధోగతి

తన ప్రబోధాన్ని కపిల భగవాను డింకా కొనసాగిస్తూ 'మాతా! జీవుడు మనుష్య దేహాన్ని పొందే సమయ మాసన్నం కావడంతో పూర్వజన్మ కర్మానుసారం దైవ ప్రేరణ ద్వారా దేహప్రాప్త్యర్థం పురుషుని వీర్యకణంద్వారా స్త్రీలో ప్రవేశిస్తాడు. నారీ గర్భంలో రజస్సును కలిసి ఆ వీర్యకణం ఏకరాత్రిలో కలల రూపాన్ని ధరిస్తుంది. పంచరాత్రులుకలలం బుద్బుదంగానూ, దశరాత్రులవరకూ బదరీఫలరూపంలో పరిణామం చెందుతుంది. అనంతరం అండజప్రాణులలో అండరూపంలోనూ, మాంస పేశీ రూపంలోనూ పరిణమించి ఏకమాసంలో శిరస్సు, ద్వితీయ మాసంలో కరచరణాలూ ఆదిగాగల అంగాలు విభాగమై తృతీయ మాసంలో నఖ, రోమ అస్థి చర్మాదులూ, స్త్రీపురుష చిహ్నాలూ, నవరంధ్రాలూ ఏర్పడతాయి. చతుర్థమాసంలో మాంసాది సప్తధాతువులూ, పంచమ మాసంలో క్షుత్పిపాసలూ, షష్ఠమాసంలో జరాయు పరివేష్ఠితుడై మాతృగర్భంలో పరిభ్రమిస్తూంటాడు. తదాదిగా జననివల్ల భుజింపబడ్డ ఆహారాన్ని గ్రహిస్తున్న గర్భస్థ శిశువు యొక్క ధాతువులు అభివృద్ధి చెందుతూంటాయి. క్రిమికీటకాదులకు జన్మస్థానమైన మల మూత్రాదుల మధ్య ఆ గోతిలో పడి ఆ శిశువు ఉంటుంది. అత్యంత సుకుమారంగా ఉండే గర్భస్థశిశువును క్రిమికీటకాదులచే కరువబడి పడే పడే మూర్ఛపోతూ తల్లి తిన్న కటుతిక్త ఆమ్లకషాయాది ఉగ్రరస సంస్పర్శవల్ల - యావత్ శరీరమందూ క్లేశం జనించగా బాధపడుతూంటాడు. జరాయువుచే పరివేష్టింపబడి ప్రేగులచే బంధించబడి తల, కడుపు, మెడ, నడుమూ వంగి కుండలాకారంగా ఉంటాడు. గర్భస్థశిశువు పంజరంలో బంధించబడ్డ పక్షిలా పరాధీనుడై ఏ అంగాలనూ అటూయిటూ కదపలేకుండా ఉంటాడు. తన్

మయంలో అదృష్టవశం వల్ల జీవునికి స్మరణశక్తి కలుగుతుంది. శతాధిక జన్మలలో ఆచరించిన కర్మలన్నీ జ్ఞాపకానికివచ్చి సుఖదుఃఖ ప్రాప్తి హేతు భూతాలైన తత్కర్మలవల్ల కలిగిన విషయాలన్నీ స్మృతికివచ్చి వాటిని తలచుకుంటూంటే అట్టివానికి సుఖశాంతులు ఎలా కలుగతాయి? తత్సమయంలో కూడ దుఃఖిస్తూనే ఉంటాడు. సప్తమమాసారంభంలో జ్ఞానశక్తి వికసిస్తుంది కానీ ప్రసూతి వాయువువల్ల కొట్టబడడంవల్ల స్థిరత్వాన్ని కోలుపోయి ఉదరగత మలంలో కీటకంలా యిటూ అటూ తిరుగుతూ ఉంటాడు. అంత సప్తధాతుమయస్థూల శరీరబంధితుడై దేహాత్మ భావం కల అతడు భయభీతుడై చేతులుజోడించి శ్రీహరి భగవానుణ్ణి ఈరీతిగా ప్రార్థిస్తాడు—

''దేవదేవా! అధముడనైన నాకు భగవానుడు ఈ గతిని కలిగించాడంటే ఇది నాకు తగినదే. తనను శరణన్నవారిని సంరక్షించడానికి ఆ పరమాత్మ అసంఖ్యాక రూపాలను ధరిస్తూంటాడు. ఈ లోకంలో సంచరించునట్టి శ్రీహరి చరణారవిందాలను నేను శరణు వేడుతూన్నాను. మాతృగర్భంలో దేహేంద్రియాంతఃకరణరూపమైన మాయను ఆశ్రయించి పుణ్య పాప రూపమైన కర్మల చే ఆచ్ఛాదించబడిన కారణం వల్ల బుద్ధినిలా గోచరించే నాహృదయంలో స్ఫురించునట్టి విశుద్ధ స్వరూపుడూ, వికార శూన్యుడూ, అఖండ బోధ స్వరూపుడూ అయిన పరమాత్మకు నమస్కరిస్తున్నాను. నేను దేహాదులకన్న భిన్నుడనైనా చూడడానికి పాంచభౌతిక శరీర బద్ధుడనై ఉన్నాను. కనుకనే ఇంద్రియ గుణ శబ్దాది విషయ చిదాభాసరూపుడనుగా కనపడుతున్నాను. దేహాది ఆవరణలమాత్రంచే కుంఠితం కాని మహిమ కల ప్రకృతి పురుష నియంత అయిన పురుషోత్తమునకు నమస్కరిస్తున్నాను. ఆ భగవన్మాయ చేతనే స్వస్వరూపజ్ఞానం నష్టంకావడం వల్ల జీవుడనేక ప్రకారాలైన సత్త్వాది గుణకర్మ బంధన బంధితుడై ఈ సంసారపథంలో కష్టాలను సహిస్తూ పరిభ్రమిస్తూంటాడు. అట్టివానికి పరమ పురుషుని కరుణ లేనిదే ఎట్టి యుక్తులవల్లా స్వస్వరూపజ్ఞానం కలగదు. నాకిప్పుడు కలిగిన త్రికాలజ్ఞానం ఆ దేవదేవుని విశేషానుగ్రహం వల్లనే లభించింది. కారణం? సమస్తస్థావర జంగమాత్మక ప్రాణులయందూ అంతర్యామి రూపంలో అంశా మాత్రంగా ఆ పరాత్పరుడే ఉంటాడు. కనుక కర్మజనితమై జీవరూపంలో ఈ పదవిని అనుసరిస్తూన్న నేను త్రివిధపాప నాశనార్థం ఆ పరాత్పరుణ్ణి భజిస్తూన్నాను. దేవాధిదేవా! దేహధారి అయిన ఈ జీవుడు మాతృగర్భంలో మలమూత్ర రుధిరగర్తంలో పడి ఉన్నాడు. ఆమె జఠరానల జ్వాలల్లో వీని దేహం దహించుకు పోతూన్నది. గర్భం నుండి బయటపడాలని కోరుతూన్నాడు. నెలలు లెక్కిస్తున్నాడు. ఈ దీనుణ్ణి ఎప్పుడు బయట పడవేస్తావుస్వామీ! నువ్వు అత్యంత దయా స్వభావుడవు. మహోదారుడవు. కనుకనే దశమాసాల జీవునికి ఉత్కృష్టమైన ఈ జ్ఞానబోధ చేసావు. దీనబంధో! నీవు చేసిన ఉపకారానికి చేతులు రెండూ జోడించి ప్రణమిల్లడం కంటె

నేను చేసేదేమీ లేదు. కనుక ఈపాటిదానికే నువ్వు నన్ను అనుగ్రహించెదవు గాక !

దేవదేవా! ఈ లోకంలో పశుపక్ష్యాదులు స్వమూఢబుద్ధివల్ల సుఖదుఃఖాలు అనుభవిస్తాయే కానీ జ్ఞానాన్ని సాధించలేవు. భవదీయ కృపావిశేషం వల్ల నేను శమాదిసాధన సంపన్నమైన దేహాన్ని పొందగలిగాను. అందువల్ల నీచే ప్రసాదింపబడ్డ వివేకంతో బుద్ధ్యా పురాణ పురుషుడవైన నిన్ను బహిరంతరాలలో అహంకారాశ్రయమైన ఆత్మను వలె ప్రత్యక్షంగా సందర్శించ గలుగుతూన్నాను. పరమేశ్వరా! ఈ గర్భనరకంలో అనంత దుఃఖాన్ని అనుభవిస్తూన్నా నీ కరుణవల్ల కలిగిన జ్ఞానంతో ఆగతానాగతాలు తెలియడం వల్ల నాకు జన్మించడం కూడ ఇష్టం కాలేదు. ఎందుచేతనంటే మాతృగర్భాన్నుండి పృథ్విపై ప్రభవించిన ఉత్తరక్షణంలోనే నీ మహామాయ ఆవరిస్తుంది. వెంటనే దేహాత్మ బుద్ధి కలిగి ఈ సంసార చక్రంలోనే పడవలసి వస్తుంది. అందువల్ల నేనిప్పుడు విచారాన్ని విడనాడి నాహృదయాంతర్వర్తిమైన శ్రీహరి దేవుని చరణారవిందాలనే హృదయంలో నిలుపుకుని బుద్ధిబలంతో పునః సంసారదుఃఖం లేని మార్గాన్నే అనుసరించి సంసారసాగరంనుండి తరిస్తాను. జననీ! దశమాస ప్రాయుడైన ఆ జీవుడు ఈ రీతిగా జ్ఞానం కలవాడై భగవంతుణ్ణి స్తుతిస్తాడు. తరువాత అధోముఖుడైన ఆ బాలుణ్ణి ప్రసవకాలీన వాయువు తల్లి గర్భంనుండి బహిర్గతుణ్ణి చేయడానికై గెంటుతుంది. తద్వాయువు ద్వారా తోయబడిన ఆ బాలుడధిక కష్టం మీద శ్వాస నిరోధించబడి స్మృతి నాశనం కాగా భూమిపై జన్మిస్తాడు. పృథ్వీపై జననకి సంబంధించిన రక్తమూత్రాదులలో పడి ఉన్న ఆ బాలుడు కీటకసమంగా అటూ ఇటూ కొట్టుకుంటూ గర్భవాస సంబధమైన జ్ఞానాన్ని విస్మరించి దేహాత్మభావం కలవాడై బిగ్గరగా రోదించడం ప్రారంభిస్తాడు. తరువాత వాని మనోగతభావాన్ని గుర్తించజాలని వారి వల్లనే పాలనపోషణాదులు పొందుతూ - అనుకూలస్థితిలో ఆనందించినా ప్రాతికూల్యాన్ని నిరోధించే శక్తి లేక ఉంటాడు. శైశవాస్థలో శయనించినప్పుడు మలమూత్రాదులను అక్కడే విసర్జిస్తూ స్వేదాదుల ద్వారా దేహం దూషితమైఉన్నా అట్టి మలినాదుల వల్ల ఏర్పడిన దురదనుకూడ దూరం చేసుకునే శక్తిలేక వేదనచెందుతూ ఉంటాడు. అత్యంత మృదువుగా ఉండే ఆ శిశువును, దోమలూ, చీమలూ, కుడుతూంటే లేవలేక కూర్చోలేక కదలలేక పోవడమే కాకుండ గర్భావస్థలోఉన్న జ్ఞానం కూడ నాశనం కాగా ఏడవడం కూడ తప్ప ఏమీ చెయ్యలేకుండా ఉంటాడు. ఈ రీతిగా బాల్య పౌగండావస్థలలో అనేక దుఃఖాలు అనుభవించి యౌవనావస్థను పొంది తాను వాంఛించిన భోగాలు ప్రాప్తించనప్పుడు అజ్ఞానం వల్ల క్రోధంతో శోకాన్ని అనుభవిస్తాడు. దేహాభిమానంవల్ల క్రోధం వర్ధిల్లడం కారణంగా కామాధీనుడైన వాడు తన నాశనానికి కారణభూతమైన మరో కాముకునితో శత్రుత్వం వహించి కష్టాలనే పొందుతూ ఉంటాడు. దుర్బుద్ధి అయినవాడు పంచభూతాలవల్ల

రంలోనే మిథ్యాభినివేశం కారణంగా సదా నేను నాదిఅన్న అభిమానానికి వశుడై కాలాన్ని వ్యర్థం చేస్తూ అహంకార మమకారాల వల్ల పుట్టిన అసత్కర్మలలోనే గడుపుతాడు. ఈ దేహం వార్థక్యాది అవస్థల వల్ల దుఃఖాన్ని కలిగిస్తూన్నా అవిద్యా రూపకర్మ సూత్ర బద్ధుడై అవి ఆడించినట్లల్లా ఆడుతూ కర్మలు అనేకంగా చేస్తూంటాడు. ఫలితంగా ఈ సంసార చక్రంలో పడి జనన మరణాలు పొందుతూ ఉంటాడు. సన్మార్గంలో సంచరిస్తూ కూడ దుర్జన సాంగత్యంవల్ల శిశ్నోదర పరాయణులై భోగాసక్తి కలవారితో సంచరిస్తూ వారినే అనుగమిస్తూ గతంలోవలె పునః రౌరవాది నరక గతినే పొందుతాడు. సత్యదయా శౌచసంయమాదులు, బుద్ధిసంపద, లజ్జ, కీర్తి, క్షమా, మనస్సు, ఇంద్రియ సంయమనం, ఐశ్వర్యం - ఆదిగాగలవి ఎవరిద్వారా నాశనమవుతాయో? అట్టి శోచనీయ స్త్రీలకు క్రీడా మృగమై, అశాంత, మూఢదేహాత్మ లక్షణాలుగల అసత్పురుష సాంగత్యం ఎన్నడూ చెయ్యరాదు. ఎవరి సాంగత్యం ద్వారాను కూడ కలగని మోహాదులన్నీ నారీజన సాంగత్యం వల్లనూ ఆ నారీసాంగత్యం కలవారి సాంగత్యంవల్ల కూడ కలుగుతాయి. ఒకానొక సమయంలో బ్రహ్మదేవుడే తన పుత్రిఅయిన సరస్వతీ రూపానికి మోహం చెందగా ఆమె మృగ రూపాన్ని ధరించి పారి పోతూంటే తాను కూడ అదే రూపాన్ని ధరించి ఆమెను వెన్నంటి పరుగు తీసాడు. ఆ బ్రహ్మదేవుడే మరీచ్యాది ప్రజాపతులనూ, కశ్యపాది మహా తపోధనులనూ, నరసురాదులను సృజించాడు. వీరిలో సనాతనఋషి అయిన శ్రీమన్నారాయణుడు తక్క తక్కిన వారందరూ స్త్రీస్వరూపిణి అయిన మహా మాయాశక్తికి మోహితులైన వారే.

మాతా! మదీయ స్వరూపిణి అయిన మహామాయ భృకుటీ విలాస మాత్రంచే వీరాధివీరులను సైతం తన కాళ్ళ క్రింద పడవేసి నలిపి వేస్తూ ఉంటుంది. యోగాభ్యాసం ద్వారా పరమ పదాన్ని అందు కోవాలని వాంఛించే వారు కూడ నన్ను ఆరాధించి తద్వారా ఆత్మ, అనాత్మ, వివేకం తెలుసు కోవాలన్న యిచ్ఛ కలవాడు కూడ నరక ద్వారమైన స్త్రీని పొంద కూడదు. భగవానుని ద్వారా నారీ రూపంలో ఉన్న మహామాయ మెల మెల్లగా సేవ చేసే వంకతో దగ్గరకు వస్తుంది. తత్సమయంలో ఆకులతో కప్పబడిన నేలలా కనిపిస్తూ అడుగు వేసే సరికి మరణాన్ని కలుగ జేసే దిగుడు బావి వలె అంటే మరణాన్నే చూడాలి. స్త్రీ యందే విశేషా సక్తి కలవాడై ఉండడం వల్లా అవసాన దశలో స్త్రీ యందే దృష్టి కలిగి మరణించడం వల్లనూ తరువాత జన్మలో స్త్రీ అయి పుడతాడు. ఈరీతిగా నారీ రూపంలో పుట్టిన జీవి పురుషరూపంలో గోచరించే నా మాయను చూసి ధనపుత్ర గృహాదులను యిచ్చే తన పతిగా భావించి చరిస్తూంటుంది. అట్టి నారి - వేటగాని గానాన్ని ఆలకించి పశు పక్ష్యాదులు వచ్చి వలలో చిక్కుకుని హతమై పోయిన విధంగా పతి పుత్ర ధనాది రూప జాలంలో చిక్కుకుని అంతమై పోతుంది. అనగా జ్ఞానమార్గంలో స్త్రీకి పురుషుడూ, పురుషునికి స్త్రీ కూడ మృత్యురూపంలోనే ఉంటా

రని గ్రహించాలి. జననీ! జీవునికి ఉపాధిగా ఉన్న లింగ శరీరం ద్వారా ఓ లోకాన్నుండి మరో దేహాన్ని పొందుతూ ప్రారబ్ధ వశులైన కర్మలు అనుభవిస్తూ క్రొత్తవైన కర్మలు చేస్తూంటాడు. మోక్షం లభించే వరకూ జీవునికి ఉపాధి రూపంలో ఈ లింగ శరీరం ఉంటూనే ఉంటుంది. భూతేంద్రియ, మనస్సాదులకు కార్య రూపమైన స్థూల శరీరమే దీనికి భోగాధి స్థానము. ఈ రెండూ సంఘటితమై ఏ కార్యం చెయ్యకుండా ఉండడమే మృత్యువనబడుతుంది. ఈ రెండూ పరస్పరం ప్రకటిత మవడమే జననమన బడుతుంది. పదార్థోపలబ్ధి స్థాన రూపమైన స్థూల దేహంలో గ్రహణ సామర్థ్య యోగ్యత లేక పోవడమే మరణ మనబడు తుంది. ఈ స్థూల దేహమే నేనన్న - దేహాత్మ భావం కలిగి మెలగడమే 'జన్మ' అన బడుతుంది. దోషకారణంగా వస్తువులను దర్శించ జాలని స్థితి కనులకు కలిగిన వేళలో చక్షురింద్రియం కూడ రూపాన్ని గ్రహించ జాలదు. నేత్ర, నేత్రేంద్రియాదులు రూపగ్రహణ శక్తి శూన్యాలైన నాడు జీవుడు కూడ రూపాన్ని గ్రహించ లేడు. కనుక మోక్షాసక్తి కలవాడు జనన మరణాదుల యందు భయ, దీనత్వ మోహాదులను విడనాడాలి. జీవుడు నిజ స్వరూపాన్ని గ్రహించి ధైర్యంగా నిస్సంగుడై సంచరిస్తూ ఈ మాయామయ విశ్వంలో వైరాగ్య యుక్తుడై జ్ఞానమయమైన బుద్ధితో దేహాన్ని నిక్షేపంలా ఉంచి దానిపై అనాసక్తుడై సంచరించాలి. ఇదియే మోక్ష కారణ మవుతుంది.

స్కంధం-3 — అధ్యాయం-32

## నరజన్మ పొందిన జీవుని గతి

మాతా! స్వగృహంలో సకామ భావంతో ఉంటూ గృహస్థాశ్రమోచిత ధర్మాలను పాలిస్తూ వాని ఫల స్వరూపాలైన అర్థకామోప భోగాలనే అనుభవిస్తూ ఆశ్రమ సంబంధమైన కర్మలే చేస్తూ అనేక తరగతు లయిన కోర్కెలతో వ్యామోహితుడు కావడం వల్ల భగవద్దర్శన విముఖుడై యాగాల ద్వారా దేవ, పితరాదులను ఆరాధించిన వాని బుద్ధి - దేవ పితరుల యందే శ్రద్ధతో సంలగ్నం కావడంవల్ల అతడు చంద్రలోకం చేరి అచ్చటి వారితో కలసి సోమపానం చేస్తూ పుణ్యం క్షీణించగానే పునః ఇహలోకంలో పుడతాడు. ప్రళయ వేళలో భగవంతుడు శేషశయ్యపై శయనించి యున్నప్పుడు గృహస్థులకు లభించిన చంద్రాది లోకాలన్నీ లయమై పోతాయి. వివేక వంతుడైన వాడు వేదోక్త ధర్మాచరణ చేస్తూ తద్ధర్మాలను భోగ విలాసాదులలో వినియోగించక పరమేశ్వరుని ప్రసన్నత కోసమే తద్ధర్మాలను పాలిస్తూ ఉండునట్టి-అనాసక్తుడు, ప్రశాంతుడు, శుద్ధ చిత్తుడు నివృత్తి ధర్మ పరాయణుడు, అహంకార శూన్యుడైన వాడు స్వధర్మ పాలన రూపమైన సత్త్వగుణం ద్వారా సర్వదా శుద్ధ చిత్తు డవుతాడు. అంతంలో సూర్యపథం ద్వారా పురాణ పురుషుడూ సర్వవ్యాపకుడూ అయిన

హరి దేవుణ్ణి పొంద గల్గుతాడు. కార్య కారణరూపమైన ఏజగన్నియంత విశ్వానికి ఉపాదాన కారణంగా ఉంటాడో అట్టి సృష్టిస్థితిలయ కారకుడైన భగవంతుణ్ణి పొందగలుగుతాడు. పరమాత్మ దృష్ట్యా హిరణ్య గర్భ బ్రహ్మను ఆరాధించు నట్టి వారూ, ఉపాసించు నట్టివారూ, ద్విపరార్థ పర్యంతం అనగా ప్రళయ పర్యంతం సత్యలోకంలో ఉంటారు. అమర శ్రేష్ఠుడైన బ్రహ్మ నిజాధికారాన్ని ద్విపరార్థ కాలం అనుభవించి - పంచ భూతాత్మకమై మనస్సేంద్రియ శబ్దాది విషయ, అహంకార యుక్త సంపూర్ణ విశ్వాన్ని ఉప సంహరించాలన్న అభిలాష కలగడంతో త్రిగుణాత్మకమైన ప్రకృతితో కూడిన అద్వితీయ రూపుడై నిర్విశేష పరమాత్మ యందు లయమై పోతాడు. తత్సమయం లోనే ప్రాణేంద్రియాదులను జయించి విరాగులైన యోగులు సైతం శరీరాన్ని త్యజించి బ్రహ్మలో ప్రవేశిస్తారు. అతనిలో కూడ పరమానంద స్వరూపుడైన పురుషోత్తముడగు పరబ్రహ్మలో లీనమవుతాడు. ఇంతకు ముందు మాత్రం అహంకారావేశం శేషించి ఉండడం వల్ల లయంకా జాలదు. కనుక జననీ! నీకు నేను శ్రీహరి ప్రభావం వివరించాను. సమస్త ప్రాణి కోటి యొక్క హృదయాలలో అంతర్యామిగా ఉండే ఆ శ్రీహరినే ఆరాధించు. ఆయననే శరణు వేడుము. వేదగర్భుడైన చతుర్ముఖుడూ, స్థావర జంగమాత్మకమైన సమస్త ప్రాణులకూ ఆది కారణుడై ఉండే మరీచ్యాది మహర్షులతో యోగీశ్వర, సనకాదుల, యోగ ప్రవర్తకు లయిన సిద్ధాదులందరితోను-నిష్కామ కర్మ ద్వారా సనాతనుడైన పరబ్రహ్మను పొంది కూడ కర్తృత్వాభిమాన, భేద దృష్టులు కారణంగా ఈశ్వరేచ్ఛానుసారం కాలప్రేరితుడై సృష్ట్యారంభంలో - పూర్వం వలె హిరణ్యగర్భరూపంలో ప్రకటిత మవుతూంటాడు. అదేవిధంగా గుణ సంక్షోభం కలిగినప్పుడు ఋషులు కూడ వారి కర్మార్హత ననుసరించి ఈ లోకానికి వస్తూంటారు.

ఇహలోక కర్మభోగాలయందే ఆసక్తమైన చిత్తం కలవారు, వేదోక్త కర్మలనే ఆచరిస్తూంటారు. అట్టివారు రజోగుణాధిక్యత యైన బుద్ధి కలవారై కుంఠితులేతున్నారు. ఇంద్రియాలు స్వాధీనంలో ఉండవు. శరీరాసక్తి కలవారై పితృదేవతలను అరాధిస్తూంటారు. ధర్మార్థ కామపరాయణులై సంచరిస్తారు ఆహా! అశుద్ధాన్ని స్వీకరించే శునక వరాహాదులు దానినే వాంఛించేటట్లు మానవులు భగవత్కథామృతాన్ని విడనాడి నిందిత విషయవార్తాదులనే ఆలకిస్తూ కాల యాపన చేసారు. అట్టి వారికంటె మందభాగ్యులుంటారా? షోడశ సకామకర్మలను ఆచరించే వారు దక్షిణ దిశలో ఉండే పితృయాన మార్గం ద్వారా పితృీశ్వరుడైన అర్యమ దేవుని లోకం చేరుతారు. పునః తమ వంశ సంతతిలోనే అవతరిస్తారు. పితృలోకాలలోని భోగాలు అనుభవించిన తరువాత పుణ్యాం

క్షీణించడంతో అక్కడివారు వారిని ఆలోకం నుండి గెంటివేస్తారు. తత్సమయంలో వివశులై ఈ లోకంలో వారు పడిపోతారు.

మాతా! తత్కారణంగా నువ్వు నిరంతరం భగవద్గుణగానం చెయ్యి. త్రికరణ శుద్ధ్యా పరమేశ్వరుని ఆరాధించు. భగవత్సేవ వల్ల సంసారంలో వైరాగ్యం ఏర్పడి బ్రహ్మ సాక్షాత్కార రూపజ్ఞానం కలుగుతుంది. సర్వవిషయాలూ దైవరూపంలోనే గోచరమవుతాయి. తద్వారా భక్తుడైన వాని చిత్తం ప్రియాప్రియాల యందు కూడ వైషమ్యాన్ని పొందదు. తత్సమయంలో భక్తుడైన వాడు సంగరహితుడై సర్వాలలోనూ సమస్థితిలో ఉన్న హేయోపాదేయ రహితమై, గుణదోషరహితమై, నిజమహిమా గూఢమై ఆత్మస్వరూపమైన బహ్మసాక్షాత్కారాన్ని పొందుతాడు. అదియే జ్ఞానస్వరూపము. పరబ్రహ్మ, పరమాత్మ, ఈశ్వర, పురుషాది పదాలతో చెప్పబడింది. ఏకమాత్ర భగవానుడే జీవ శరీరేంద్రియాది రూపాలలో గోచరమవుతూంటాడు. చరాచరజగత్సర్వంలో ఆసక్తి లేకుండా ఉండగలగడమే యోగ్యులైన వారికి సాధనరూపమై అభీష్టమైనట్టివరమవుతూన్నది. గుణరహితుడు, జ్ఞాన స్వరూపుడూ ఏక మాత్రుడూ అయి ఉండి కూడ బాహ్య వృత్తులు కల ఇంద్రియాల ద్వారా భ్రాంతివశుడైన కారణం వల్ల శబ్దాదిధర్మాల వల్ల విభిన్న వస్తువులలో భాసిస్తూన్నాడు. అద్వితీయ పరబ్రహ్మ - మహత్తత్త్వ, వైకారిక, రాజస, తామసాది అహంకారత్రయ, పంచమహాభూత, ఏకాదశేంద్రియాది రూపాలలో పరిణమించాడు. ఆ పరమాత్మ స్వయం ప్రకాశుడై కూడ వీటి సంయోగం వల్ల జీవుడని చెప్పబడుతూన్నాడు. అదే విధంగా ఆ జీవునియొక్క దేహరూపమైన బ్రహ్మాండ రూపం కూడ బ్రహ్మనుండియే ప్రభవించడం వల్ల బ్రహ్మకన్న భిన్నం కాదు. శ్రద్ధ, భక్తి, వైరాగ్యాలతో ఏకాగ్రచిత్తుడై యుండునట్టి వాడు సర్వాన్నీ బ్రహ్మ రూపంగా దర్శించగలడు. పూజ్యజననీ! నీకు బ్రహ్మ సాక్షాత్కారరూపమై ప్రకృతి పురుషుల యదార్ధ జ్ఞానాన్ని ప్రసాదించగల విషయాలను బోధించాను. నిర్గుణ బ్రహ్మ విషయకమైన జ్ఞానయోగమూ, ఇప్పుడు నా ద్వారా చెప్పబడిన భక్తియోగమూ రెండూ ఏకవిషయకమైనవే, రూప రస, గంధాది అనేక గుణాలకు ఆశ్రయ భూతమైన ఏకమాత్ర పదార్ధం విభిన్నేంద్రియాల ద్వారా విభిన్న రూపాలలో అనుభూత మవుతూన్న విధంగానే శాస్త్రాల విభిన్న మార్గాలను అనుసరించి ఏకమాత్ర పరమాత్మయొక్క అనుభూతి అనేక విధాలుగా అవుతూ ఉంటుంది. అనేక విధాలైన కర్మకలాపాలూ, యాగదాన తపోవేదాధ్యయనాలూ, వేదవిచారణ, మనసేంద్రియ సంయమమూ, కర్మత్యాగమూ, వివిధాంగ యుక్త యోగ, భక్తియోగ, ప్రవృత్తి నివృత్తులూ, సకామనిష్కామ కర్మలూ, ఆత్మతత్త్వజ్ఞాన వైరాగ్య - ఆదిగాగల సాధన

లన్నింటిచేతా, సగుణ నిర్గుణరూపుడూ, స్వయం ప్రకాశుడూ, అయిన భగవంతుణ్ణి పొంద గలుగుతాడు.

అమ్మా! సాత్త్విక, రాజస, తామస, నిర్గుణ భేదంతో నాలుగు విధాలుగా భక్తి చెప్పబడుతూన్నది. అజ్ఞానం కారణంగా జీవునకు అనేకమైన గతులు కలుగుతూన్నాయి. తద్గతులలో ప్రకాశించిన నాడు జీవునికి స్వరూప జ్ఞానం ఉండదు. ఇప్పుడు నేను నీకుపదేశించిన దివ్యజ్ఞానబోధ - దుష్టులూ, దుర్వినీతులూ, గర్విష్ఠులూ, దురాచారులూ, దంభాచారులూ, విషయలోలురూ, గృహాసక్తులూ, భక్తిహీనులూ, భక్తులను ద్వేషించునట్టివారూ పొందడానికి అర్హులు కాజాలరు. అలాంటి వారికి దీనిని ఉపదేశించరాదు. శ్రద్ధ, భక్తి వినయమూ, ఎవరినీ, ద్వేషించకుండడమూ, సర్వజీవులయందు ప్రేమభావం కలిగి ఉండడమూ, గురుసేవా తత్పరత, బాహ్యవిషయాలయందు ఆసక్తిలేక పోవడమూ, శాంతభావమూ, అసూయారాహిత్యమూ పవిత్ర హృదయమూ, విశేషించి నాయందు భక్తి కలవారికే దీనిని ఉపదేశించాలి. నాపై చిత్తాన్ని సంలగ్నం చేసి శ్రద్ధాభక్తులతో ఈ జ్ఞానోపదేశాన్ని చదివినా, విన్నా నాపరమ పదాన్ని పొందగలుగుతాడు.

## స్కంధము-3 అధ్యాయము-33

తత్త్వజ్ఞానాన్ని పొందిన దేవహూతికి మోక్షప్రాప్తి

ధూమ అర్చిరాది మార్గాలద్వారా పోవువారి గతి.

## భక్తియోగవర్ణన.

మైత్రేయుడు పలుకుతూన్నాడు. "విదురా! కపిల భగవానుని ప్రబోధం విన్న దేవహూతి మోహం దూరమయింది. అంతఆమె ఆ దేవదేవుని స్తుతించడం ప్రారంభించింది. "కపిలదేవా! నీ నాభికమలం నుండి చతుర్ముఖ బ్రహ్మ ఆవిర్భవించాడు. పంచభూతాలూ, ఇంద్రియాలూ, శబ్దాది విషయాలూ సత్వాదిగాగల గుణప్రవాహంతో కూడిన కార్యకారణ బీజమైన ప్రళయకాల జలాలలో శయనించి ఉన్న నీ రూపాన్నే బ్రహ్మదేవుడు ధ్యానించాడు. సత్యసంకల్పుడవూ సర్వజీవేశ్వరుడవూ, నిష్క్రియుడవూ, అనంత అచింత్యశక్తి సంపన్నుడవూ అయిన నీశక్తి గుణప్రవాహంతో బ్రహ్మాది అనంతమూర్తులలో విభజించి ఈ జగత్ సృష్ట్యాదులు కొనసాగిస్తూటావు. అనంతకోటి బ్రహ్మాండాలను ప్రళయ సమయంలో ఉదరంలో ధరించావు.

కల్పాంతంలో మాయామయ బాలముకుందరూపాన్ని ధరించి పదారవిందాన్ని కరారవిందంతో పట్టుకుని ముఖారవిందంలో

ఉంచుకుని ఏకాకివిగా వటవృక్ష శాఖాగ్రం లోని పత్రంపై శయనించేవాడవ్వూ అయినట్టి నిన్ను నేను నాఉదరంలో ధరించానంటే మహాశ్చర్యంగా ఉంది. జగన్నాధా! సజ్జన సంరక్షణార్థం, దుర్జనశిక్షణార్థం నువ్వుస్వేచ్ఛగా -మత్స్య, కూర్మ, వరాహ, నారసింహాది అవతారాలు ఎత్తినట్లే జిజ్ఞాసువులకు - మోక్ష మార్గాన్ని ఉపదేశించడానికై ఈ కపిల రూపంలో ప్రాదుర్భవించావు. నీ నామ సంకీర్తన, శ్రవణాదుల మాత్రంచే మానవులు తరిస్తారు. శ్వపచు (కుక్క మాంసం తినేవాడు) డైనా యదృచ్ఛగా నీనామాన్ని స్మరిస్తే శ్రేష్ఠుడుగా పరిగణింపబడతాడు. సాక్షాత్ పరబ్రహ్మ వగు నువ్వే పరమపురుషుడవు. చిత్తవృత్తులను అంతర్ముఖంచేసి విజ్ఞులైనవారు నిన్నే అంతఃకరణలో ధ్యానిస్తూంటారు. మాయాకార్య రూపమైన గుణప్రవాహాన్ని నువ్వు నీ తేజస్సు ద్వారా శాంతింపజేస్తూంటావు. వేదతత్వమంతా నీ ఉదరంలోనే నిండిఉంది. సాక్షాత్తూ శ్రీహరి స్వరూపుడవైన నీకు ప్రణమిల్లుతూన్నాను."

దేవహూతి స్తుతికి ప్రసన్నుడై కపిల భగవానుడు పలుకుతూన్నాడు. "జననీ! నాచే నీకు ఉపదేశించబడిన సులభమార్గాన్ని అనుసరించిడం వల్ల నువ్వు త్వరితగతిని పరమపదాన్ని పొందగలుగుతావు. ఈ మతాన్నే బ్రహ్మవాదులు అనుసరించారు. దీనివల్ల జననమరణ రహితమైన మత్స్వరూపాన్ని పొందగలుగుతావు. నా ఈమతం గ్రహించని వారు కాల చక్రంలో పడి జన్మిస్తూ, మరణిస్తూంటారు."

అంటూ పలికి కపిలభగవానుడు జననీ బ్రహ్మవాదినీ అయిన దేవహూతి దగ్గర సెలవు తీసుకొని అక్కడనుండి వెళ్ళిపోయాడు.

అంతేత దేవహూతి సరస్వతీ తటానగల నిజాశ్రమంలోనే యోగాభ్యాసం చేస్తూ సమాధిస్థితయై తపస్సు సాగిస్తూన్నది. మూడు వేళల్లోనూ స్నానం చెయ్యడం వల్ల ఆమె కేశాలు జడలు కట్టేశాయి. నారచీరలచే చుట్టబడిన ఆమెదేహం ఘోరతపస్సువల్ల అత్యంత దుర్బలమైపోయింది. తపోయోగాదుల ద్వారా కర్దమ మహర్షి సాధించిన గృహస్థోచిత సుఖ సాధనలను అన్నింటినీ పరిత్యజించింది. కోమల హంసతూలికా తల్పాలతో కూడిన గజదంత నిర్మితమైన శయ్యాలనూ, సువర్ణపాత్రలనూ, రత్నఖచిత హేమసింహాసనాలనూ, రత్న నిర్మిత రమణీయమూర్తులతో అలంకృతమైన మణిమయ దీపాలనూ, సుగంధాన్ని దశదిశలా విరజిమ్మే పుష్పలతా సంభరిత సుందరోద్యానవనాలనూ విడనాడి తపోదీక్షలో ఉండి దేవహూతి. సర్వజీవతరణీయుడైన శ్రీహరియే పుత్రుడుగా అవతరిచడం వల్ల పుత్రవియోగ దుఃఖం మాత్రం ఆమె మోములో గోచరించింది. నాధుడు అరణ్యాలకు వెళ్ళిపోయాడు. కుమారుడు కూడ తనను విడనాడి వెళ్ళాడు. బ్రహ్మజ్ఞాన సంపన్నురాలై ఉండికూడ దేవహూతి దూడను విడనాడిన గోవులా మధన పడిపోయింది

విదురా! కుమారుడైన కపిలరూపుడగు శ్రీమన్నారాయణ భగవానుని ధ్యానిస్తూ

సర్వస్వాన్నీ పరిత్యజించి ఉపరతిని పొందగలిగింది. కపిలభగవత్కథితమైన విధిననుసరించి సర్వాంగ సమగ్రమైన శ్రీహరి దేవుని దివ్య మంగళ విగ్రహాన్ని ధ్యానించడం కారణంగా ఆమె భక్తి ప్రవహరూపాన్ని దాల్చి ప్రబల వైరాగ్యం కలిగి ఆత్మసాక్షాత్కార యోగ్యంగా చిత్తం పరిశుద్ధమైన తరువాత సర్వవ్యాపకమైన ఆత్మధ్యానంలో సంలగ్నురాలై పోయింది. ఆత్మరూప ప్రకాశం ద్వారా మాయా జనితావరణను దూరం చేసుకుంది. ఈ రీతిగా జీవునకు అధిష్ఠానభూతమైన బ్రహ్మ భావాన్ని పొంది-బుద్ధి బ్రహ్మాకారాన్ని దాల్చడంతో సర్వక్లేశాలనుండి విడివడి విముక్తయై పరమానందంలో నిమగ్నురాలై పోయింది. దేహాభావం సంపూర్ణంగా దూరమైపోయింది. జాగృతిని పొందిన వానికి స్వప్నగత శరీరం లేనట్లే జ్ఞానావస్థలోనే ఆమెకు శరీరస్మృతి దూరమైపోయింది. పరుల ద్వారా శరీర పోషణ జరుగుతూన్నది. కానీ క్లేశం లేక పోవడం వల్ల ఆమె దేహం దుర్బలం కాలేదు. మలినాంబరాలు కారణంగా ధూమావృతమైన అగ్నిలా ఆమె శోభిస్తూన్నది. నిరంతరం శ్రీహరియందు సంలగ్నమైన చిత్తం కలది కావడం వల్ల ఆమెకు తపోయోగమయమైన నిజశరీరంపై ఈషణ్మాత్ర స్మరణా లేదు. కేవలం ప్రారబ్ధమే ఆ దేహాన్ని పోషిస్తున్నది. కపిలభగవానుడు ఉపదేశించిన మార్గానుసారం అనతికాలంలోనే దేవహూతి నిత్యముక్తి సాధించి పరమాత్మను పొందగలిగింది. సిద్ధపదమని ఆమె ముక్తిని సాధించిన ప్రదేశం ప్రఖ్యాతిచెందింది. యోగ సాధనలద్వారా ఆమె దేహమలాలన్నీ దూరమై ప్రవాహరూపాన్ని పొంది సిద్ధగణ సేవితమై సర్వసిద్ధి ప్రదాయకమని ఖ్యాతి వహించింది.

విదురా! మాతృమూర్తిదగ్గర అనుమతిని పొంది కపిలుడు కర్దమాశ్రమాన్ని విడనాడి ఈశాన్య దిశాభిముఖంగా పురోగమించాడు. అచ్చోట సాగరుడు కపిలదేవుని యథోచితంగా ఆరాధించి అతనికి సమాధిలో ఉండడానికి సముచిత స్థానాన్ని యిచ్చాడు. జగత్త్రయవాసులను భ్రాంతులను చేసే నిమిత్తం కపిలుడు సమాధిలోలీనమై పోయాడు.

ఏవంవిధ విశిష్టగుణవరిష్ఠుడైన కపిలదేవుని సిద్ధచారణగంధర్వముని, అప్సరసాదులూ, సాంఖ్యమార్గాచార్యులూ, అనేక విధాల స్తోత్రం చేసారు. విదురా! నువ్వుకోరిన విధంగా కపిలదేవహూతీ సంవాదాన్ని నీకు వినిపించాను. అధ్యాత్మ యోగంలోని ఈనిగూఢ రహస్యాన్ని విన్నా, వర్ణించినా శ్రీమన్నారాయణ దేవుని పదారవింద సేవాభాగ్యం అనతికాలం లోనే ప్రాప్త మవుతుంది.

తృతీయస్కంధం — సంపూర్ణం

క్లీం
కృష్ణాయ
గోవిందాయ
గోపీ జన వల్లబాయ స్వాహాః
శ్రీకృష్ణ అష్టాదశాక్షరీ మంత్రము

శ్రీకృష్ణః శరణం మమ



---

మద్రాస్ : వెంకటరమణా ఫుడ్ స్పెషాలిటీస్

శ్రీ ఇ. అహోబలరావు గారి

సంపూర్ణ సహకార, సౌజన్య, శుభాకాంక్షలతో.

"ఓం శ్రీ గణేశాయ నమః."

శ్రీకృష్ణః శరణం మమ. కృష్ణం వన్దే జగద్గురుం.

పిబత భాగవతం రసమాలయం

# శ్రీమద్భాగవత మహాపురాణము

( కేవలం వచనంలో )

**1/4 క్రౌన్ : 6 సంపుటాలు** **వ్యయం : లక్ష రూపాయలు**

క్లీం - కృష్ణాయ-గోవిన్దాయ - గోపీజన వల్లభాయ స్వాహా.

శ్రీ కృష్ణ శ్రీ కృష్ణ



శ్రీ కృష్ణ శ్రీ కృష్ణ


అనువాదకుడు, ప్రకాశకుడు :

## పురాణపండ రాధాకృష్ణమూర్తి

**భాగవత మందిరం - రాజమండ్రి.**

**PHONE : 76356**


ఏలూరు - రోడ్స్ & బిల్డింగ్స్ సూపరింటెండింగ్ ఇంజనీర్ :

**శ్రీయుత M. పెద అప్పారావుగారి సౌజన్యంతో.**

* భాగవతామృతాన్ని జీవితాంతం పానం చెయ్యండి *

లక్ష రూపాయల వ్యయంతో 6 సంపుటాలుగా విడుదల కావలసిన పురాణ తిలకమైన
శ్రీమద్భాగవత మహాపురాణ ప్రచురణ విశేష ప్రచారాలకు
ఆస్తికులైన సోదర సోదరీమణులందరూ సకాలంలో సహకరించి
ధర్మ తేజంతో దైవానుగ్రహానికి పాత్రులయ్యెదరు గాక!

# మహావకాశం

ధీ, ధీర, శ్రీ సంపన్నులారా!

పఠన శ్రవణ మననాదుల మాత్రంచే శుభ విజయ మంగళ పరంపరలనూ, మనశ్శాంతినీ ప్రసాదిస్తూ భక్తి జ్ఞాన వైరాగ్య భావాలను ప్రభవింపజేసి వర్ధిల జేయునట్టి పరమ పవిత్రమైన శ్రీమద్భాగవత మహాపురాణ ప్రచురణకు పూనుకున్నాము. అబాలగోపాలానికీ సుగమంగా బోధపడే వ్యావహారిక శైలిలో 6 సంపుటాలుగా విడుదల కావలసియున్న ఈ మహాపురాణ ప్రచురణకు సుమారు లక్ష రూపాయలు వ్యయం కానున్నవి. శ్రావణ, భాద్రపద, ఆశ్వీజ, కార్తీక, మార్గశిర పూర్ణిమా పర్వదినాలలో మా మందిరంలో శ్రీ రాజ రాజేశ్వరీ పరమేశ్వరికి కొనసాగునట్టి లక్ష కుంకు మార్చనలు అయిదింటిలోనూ, ఓ పూర్ణిమా పర్వదినంనాడు మీ గోత్ర నామాలపై సహస్ర నామార్చన చేయుటకును, శ్రీమద్భాగవత మహా పురాణం ప్రథమ సంపుటంలో మీ శుభ నామాన్ని ప్రచురించుటకును రు. 350-00 లు మాత్రం అందజేయగల శాశ్వత చందా దారులను 300 మందిని జేర్పించ వలసి యున్నది.

## * శ్రీరామరక్షా స్తోత్రమ్ *

ఈ దీక్షా కాలంలో అద్భుత ఫల ప్రదాయకమైన శ్రీరామరక్షా స్తోత్రమ్ - లక్ష ప్రతుల ప్రచురణ వితరణ కూడ కొనసాగవలసి యున్నది. ఇందు నిమిత్తం కూడ సుమారు లక్ష రూపాయలు వ్యయంకానున్నవి. శ్రీరామ భక్తులయిన శ్రీమంతులు తమ ఫొటోతో వంశ పరిచయంతో రు.1116/-లు అందజేయుచో సద్వినియోగార్థం వీరికి ద్రవ్యం అందిన 25 రోజులు దాటకుండ సిద్ధి చేసిన శ్రీరామ రక్షా పూజాయంత్ర, ధారణా యంత్రాలతో, పంచిపెట్టుకునే నిమిత్తం శ్రీరామ రక్షా స్తోత్రమ్-500 ప్రతులను అందజేసెదము.

వివరాలకు :

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

**భాగవత మందిరం - రాజమండ్రి-4.**



ఐ. ఎల్. ఎన్. శాస్త్రి, B.Com., B.L., CAIIB.,
ADVOCATE:
మెంబర్ : టి. టి. దేవస్థానం బోర్డు,
ఛైర్మన్ : ఎక్స్‌పర్ట్స్ కమిటీ
on T. T. D. Publications
HYDERABAD - 29.

Dated 25-7-89

To,

శ్రీయుతులు పురాణపండ రాధాకృష్ణమూర్తిగార్కి నమస్కారములు.

సనాతన ధర్మ ప్రచారానికి మీరు చేస్తున్న అవిరళ కృషి చాలా ప్రశంసనీయమైనది. ధార్మిక సంస్థలు చేయలేని బృహత్తర కార్యాన్ని మీరు వ్యక్తిగతంగా, సమర్థవంతంగా నిర్వహిస్తూ ప్రచురణ విభాగంలో ఒక క్రొత్త ఒరవడిని సృష్టించారు.

ప్రస్తుతం మీరు తలపెట్టిన శ్రీమద్భాగవత మహాపురాణ ప్రచురణ అన్నింటిలోను అత్యుత్తమమైనదిగా భావిస్తున్నాను. మీరు తలపెట్టిన ఈ ప్రచురణ నిర్విఘ్నంగా కొనసాగి జయప్రదం కావాలని శ్రీ పద్మావతీ సమేత వెంకటేశ్వర స్వామిని మనసా ప్రార్థిస్తూన్నాను.

భవదీయ

ఇసుకపల్లి లక్ష్మి నరసింహశాస్త్రి

---

పూనా - శ్రీమతి & శ్రీయుత కె. బాలకృష్ణ దంపతుల సౌజన్యంతో.

ఓం శ్రీరామ జయ రామ జయ జయ రామ.



వీరాంజనేయా! రావయ్యా! సర్వ భారమూ నీదేనయ్యా!

దాతల సంపూర్ణ సహకారంతో

# * సుందరకాండ *

## 10 వేల ప్రతుల ప్రచురణ వితరణోద్యమం.

2 లక్షల రూపాయల వ్యయంతో క్రమంగా వచనంలో "సుందరకాండ" 10 వేల ప్రతులూ కేవలం పారాయణ గ్రంథం 10 వేల ప్రతులూ ప్రచురించి దాతల ద్వారానే వితరణకు పూను కున్నాము. రు. 1,116-00 లు అందజేయగల దాతలను సాదరంగా రెండు వందల మందిని ఆహ్వానిస్తున్నాము.

పూజ్య జననీ జనకుల ఫొటోతో, ఆత్మీయుల సంస్మరణార్థంగా, వ్యాపార సంస్థల వార్షి కోత్సవాల సందర్భంగా, ఉపనయన, కళ్యాణ, గృహప్రవేశ, జన్మదిన శుభ సమయాలలో వితరణ నిమిత్తం శ్రీమంతులు పై గ్రంథ రత్నాలలో ఆసక్తి కల ఏ పుస్తకరత్న ప్రచురణకైనా సహకరించ వచ్చును. స్వయంగా సహకరించలేనివారు శక్తి కల ఉదారులను ప్రోత్సహించి మాట సాయం చేసెదరు గాక!

"దైవ, ధర్మకార్యాలు ఆచరించడానికి ఎన్నడూ వాయిదాలు వేయకండి"

వివరాలకు :

## పురాణపండ రాధాకృష్ణమూర్తి

**బాగవత మందిరం - రాజమండ్రి-4.**

హైద్రాబాద్-ఆంధ్రా బ్యాంక్ సెంట్రల్ ఆఫీస్-డిప్యూటీ జనరల్-మేనేజర్

**శ్రీయుత జి. మాలకొండారెడ్డి గారి సౌజన్యంతో.**